# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

VEEKSHANAM, TELUGU MONTHLY

సంపుటి : 14 సంచిక : 6 హైదరాబాద్ 179 జూన్ 2016 పేజీలు : 68 రు. 20

* ఐదు రాష్ట్రాల ఎన్నికల ఫలితాలు
* తెలంగాణ విద్యాసంస్థల వివాదం
* బ్రాండిక్స్ మహిళా కార్మికుల పోరాటం
* జెఎన్‌యు విద్యార్థి గళాలకు శిక్షలు
* ఛత్తీస్‌ఘడ్ ఆదివాసులపై హింస
* గణితశాస్త్రవేత్తగా డిడి కోసంబి
* చైనా సాంస్కృతిక విప్లవం - యాభై ఏళ్లు

# ఆర్‌ఎస్ రావు స్మారకోపన్యాసం - 2016



గత సంవత్సరం ఆర్‌ఎస్ రావు స్మారక సదస్సుతో పాటు జరగవలసిన స్మారకోపన్యాసం అనివార్య కారణాల వల్ల వాయిదా పడింది. ఈ సంవత్సరం నుంచి స్మారకోపన్యాసం, ఆర్‌ఎస్ రావు వర్ధంతి సందర్భంగా జూన్ 17న జరపాలని, స్మారక సదస్సు యథాతథంగా నవంబర్ రెండో ఆదివారం జరపాలని నిర్ణయించాం. ఈ క్రమంలో ఆర్‌ఎస్ రావు స్మారకోపన్యాసం - 2016 **జూన్ 17న సాయంత్రం 6 గంటలకు సుందరయ్య విజ్ఞాన కేంద్రం, దొడ్డి కొమరయ్య హాలులో** జరుగుతుంది.

**ఆర్‌ఎస్ రావు స్మారకోపన్యాసం - 2016 - వ్యవసాయ సమస్యపై పునరధ్యయనం**

(Revisiting Agrarian Question)

వక్త - **ప్రొ. డి. నరసింహారెడ్డి,** ప్రఖ్యాత అర్థశాస్త్రవేత్త

## అందరూ ఆహ్వానితులే

# తెలంగాణార్థం

**రెండేళ్ల తెలంగాణ పరిణామాలు**

**ఎన్. వేణుగోపాల్**




ఆర్థిక వ్యవస్థ, అభివృద్ధి పథకాలు, సంక్షేమ పథకాలు, విద్యా విధానం, పౌరహక్కులు, కార్మికులు, రైతులు, దళితులు, నిరుద్యోగం, ఉద్యోగకల్పన వంటి ఎన్నో రంగాలలో గత రెండు సంవత్సరాల తెలంగాణ పాలనా విధానాలపై ఎన్. వేణుగోపాల్ వివిధ పత్రికలలో రాసిన విమర్శా వ్యాసాల సంకలనం

పేజీలు : 288

వెల : రు. 150

**పుస్తకాల ప్రతులకు :**

**వీక్షణం, మైత్రీ రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నం. 3,**

**హిమాయత్‌నగర్, హైదరాబాద్ - 500 029.**

**ఫోన్: 040 66843495**

179

ISSN 2231-6892

# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

జూన్ 2016
సంపుటి : 14
సంచిక : 6







**‘వీక్షణం’ పేరిట రచనలు, ఎం.ఓలు, చెక్కులు,డి.డి లు పంపాల్సిన చిరునామా**

**వీక్షణం VEEKSHANAM**

మైత్రీ రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్,
హైదరాబాద్ - 500 029. ఫాక్స్, ఫోన్ : 040-66843495
Email : veekshanam2003@gmail.com
www.veekshanam.wordpress.com

ప్రింటర్స్ : **చరితా ఇంప్రెషన్స్**
ఆజామాబాద్, హైదరాబాద్. ఫోన్ : 040 - 27678411

**వీక్షణం చందా వివరాలు**

| | సంస్థలకు / లైబ్రరీలకు | వ్యక్తులకు |
|---|---|---|
| విడి ప్రతి | రు. 20 | రు. 20 |
| సంవత్సరం | రు. 240 | రు. 200 |
| మూడు సంవత్సరాలు | రు. 600 | రు. 540 |
| ఐదు సంవత్సరాలు | రు. 1000 | రు. 900 |
| పది సంవత్సరాలు | రు. 2000 | రు. 1700 |

ఆన్‌లైన్ ద్వారా డబ్బులు పంపేవారు మాత్రమే బ్యాంక్ స్లిప్‌లపై ‘**VEEKSHANAM**’ అని రాసి వీక్షణం అకౌంట్ నెంబర్ – **013911011002175** ఆంధ్రాబ్యాంక్, గగన్‌మహల్ బ్రాంచ్, హైదరాబాద్ పేరు మీద వేయాలి.
ఇతర బ్యాంకులలో వేసేవారు **ANDB 000/0139** నెంబర్ రాసి వేయవచ్చు.

**వీక్షణం చేస్తున్న కృషి పదికాలాల పాటు కొనసాగాలనే ఆకాంక్షతో మూలనిధికి 2016 మే నెలలో వచ్చిన విరాళాలు - శ్రేయోభిలాషి, గుంటూరు - రు. 25,000; శ్రేయోభిలాషి, హైదరాబాద్ - రు. 15,000; మిత్రులకు కృతజ్ఞతలు- సం.**

**బి.**ఎ. నారాయణ ఏప్రిల్ సంచికలో నా వ్యాసం మాతృభాషకి మరణశాసనం (మార్చ్, 2016) పై రాసిన ప్రతిస్పందనకి సమాధానం. అసలు పురాణాలూ పురాణ పాత్రల ఊసు ఎత్తడమే తప్పంటారా? అలాగైతే దళిత సాహిత్యమే కాదు, మావో వైరుధ్యాలు గ్రంథం కూడా ఫ్యూడలే. ఊరికే ఉత్త పదాలు వాడడం తగ్గించి విషయం అర్థం చేసుకోండి. మీ స్థాయికి అసలు సాయిబాబా పుస్తకాలే సరిపోతాయి. అవగాహన ఏమాత్రం లేకుండా మీరు విదేశీ ద్రోణుడు అనే కొత్త ప్రయోగం చేసిన దళిత కవి మద్దూరి నగేష్‌బాబుని ఫ్యూడల్ అంటున్నారు. మాతృ భాషపై ప్రేమని గ్లోబలైజేషన్ నేపథ్యంలో వ్యక్తం చేసిన మరో దళిత కవి పైడి తెరేష్ బాబు కవిత్వాన్ని ఇప్పుడు స్మరించడం అనవసరమా? రోహిత్ మరణాన్ని మాతృ భాష మరణంతో పోల్చడం ఫ్యూడలా? శ్రీకృష్ణున్ని అర్జునుడు ప్రశ్నలతో నిలదీయడం భారతీయుల ఆర్గుమెం టేటివ్ స్వభావంగా అమర్త్య సేన్ రాశారు.

**- రాణి శివశంకర శర్మ**
ఈమెయిల్‌లో వచ్చిన ఉత్తరం

**గ**త సంచికలో జెఎన్‌యు నుంచి లెనిన్‌బాబు రాసిన లేఖ చూస్తే, ఇటువంటి ఉన్నతమైన విద్యాసంస్థల్లో ఉన్నవారు కూడా ఈ స్థాయిలో ఉన్నారా అని ఆశ్చర్యం వేస్తుంది. 22 ఏళ్లనాటి రంగనాయకమ్మ 'పరిచయం'పై వచ్చిన విమర్శకు అంజిరెడ్డి అనే పాఠకుడు ఎప్పుడో జవాబు చెప్పాడు అనేది దాని సారాంశం. దీనికి ఆయనకు ఆధారం – ఇంకెవరో పాఠకుడు, ఎవరెవరి గురించో రాసిన ఉత్తరం!

సిద్ధాంత చర్చలు దేశాల మధ్య యుద్ధాల వంటివి కాదు – మావాడు మిమ్మల్ని ఎప్పుడో ఓడించాడహో అని చెప్పడానికి. ఇప్పుడు మనం నిత్యసత్యాలుగా భావించే సిద్ధాంతాల్ని ఒకప్పుడు అనేకసార్లు ఓడించారు. ఇక అయిపోయిందిలే అనుకున్నారు. కాని తర్వాత జరిగిన పునర్మూల్యాంకనాలు వాటికి వ్యతిరేకమైన ఫలితాలతో ముగిసాయి. సిద్ధాంత చర్చలు ఇటువంటి అవగాహనతో జరగాలి. ఇప్పుడు చర్చకి వచ్చిన విషయాలకి ఇప్పుడే సమాధానం చెప్పాలి. శాస్త్రీయమైన విషయాల ప్రత్యేకత అదే – అవి ఎన్నిసార్లైనా పరీక్షకూ, చర్చకూ నిలుస్తాయి. ఒకవేళ ఈ చర్చ ఇప్పటికే ముగిసిందని మీకు నిజంగా నమ్మకం ఉంటే, ఆ పాత వ్యాసాన్నే పంపి ప్రచురించమని కోరవచ్చు. లేదా దాని నుంచి ముందు మీరు నేర్చుకొని, మీ తెలివితేటల్నీ, ఆలోచనల్నీ కూడా కలిపి ప్రచురింపజేసే ప్రయత్నం చేయవచ్చు. కానీ ఇటువంటివి ఏమీ చెయ్యకుండా, ఎవరో రాసిన ఉత్తరాన్ని ఆధారం చేసుకొని, ఆయన అలా అన్నాడట, ఈయన ఇలా అన్నాడట – అనే పద్ధతిలో మాట్లాడడం సిద్ధాంత చర్చల్లో సమంజసం కాదు. వ్యక్తిగత విభేదాల నేపథ్యంలో రాసిన ఇటువంటి అప్రమాణికమైన రాతలతో సైద్ధాంతిక విషయాలని చర్చించబూనడం అంటే సైద్ధాంతిక చర్చలలో కనీస సంప్రదాయాల్ని పాటించకపోవడమే. ఇది తెలియనితనం వల్ల జరిగితే బాధ్యతారాహిత్యం, తెలిసి చేస్తుంటే గడుసుదనం.

అప్రమాణికం అనడానికి కారణం, ఇది వ్యక్తిగతమైన ఉత్తరం అవడం మాత్రమే కాదు. ఈ ఉత్తరంలో రిపోర్ట్ చేసిన విషయాల్ని యథాతథంగా నమ్మినట్లయితే, ఇందులో ఉన్న పాత్రలందరూ రంగనాయకమ్మ రాసే భాషలాంటి భాషనే మాట్లాడతారనీ, లేదా అనుకరించారనీ, లేదా తీవ్రంగా ప్రభావితమయ్యారనీ అనుకోవాల్సి వస్తుంది. భాష విషయం పక్కనబెడితే, ఇందులో లేవనెత్తిన విషయం ఏదైనా ఉంటే అది ఒక్కటే – 'సైన్స్ విషయాలలో తప్పులు అని చెప్పి మీరు ఒక్కటి కూడా చూపించలేదు' అని. బ్రహ్మచారి పుస్తకంలో ఈ విషయాల్ని, సైన్స్‌లో తప్పుల గురించి రంగనాయకమ్మ చెప్పిన మాటల్ని కోట్ చేస్తూ చర్చించారు. అక్కడ రంగనాయకమ్మ అర్థం సైన్స్ అంటే భౌతికశాస్త్రమనో, రసాయనశాస్త్రమనో కాదు. కాపిటల్‌లో చెప్పిందే ఒక సైన్స్ అని. బ్రహ్మచారి విమర్శలన్నీ ఆ సైన్స్ విషయంలోనే. చూడబోతే ఇంతచిన్న విషయం కూడా ఈ మాటలన్న శేఖర్‌కి అర్థమయినట్లు లేదు. ఆయన మాటల్ని తన ఉత్తరంలో రిపోర్ట్ చేసిన నందకుమార్‌కి అందినట్లు లేదు. ఇక ఆ రిపోర్ట్‌ని ఆధారంగా చేసుకొని మాట్లాడుతున్న లెనిన్‌బాబు సంగతి సరేసరి. ఇంతటి బాధ్యతా రాహిత్యం లోంచి, అవగాహనా రాహిత్యంలోంచీ ఏ విషయమైనా నిగ్గుతేలుతుందనుకోవడం ఇసుకలోంచి తైలం పిండాలనుకోవడమే. తన పుస్తకాలలో చిన్న చిన్న విషయాలను సైతం తానే విమర్శించుకునే రంగనాయకమ్మ, ఇన్ని విషయాలను విమర్శిస్తూ పుస్తకం వస్తే ఇంతకాలం నోరుమెదపలేదని కొంచెమన్నా ఆలోచించి ఉన్నట్లయితే లెనిన్‌బాబుకి మరింత సంయమనం సాధ్యపడేదేమో!

**- హనుమంతరావు నథాని**
ఈమెయిల్‌లో వచ్చిన ఉత్తరం

**వీ**క్షణం మే 2016 సంచికలో రంగనాయకమ్మ గారిని పొగుడుతూ, ఆమె 'కాపిటల్' పరిచయంలో మార్క్స్ చెప్పిన దానికి భిన్నంగా రాసిందని ఇ.ఎస్. బ్రహ్మచారి గారు రాసినదాన్ని విమర్శిస్తూ మూడు ఉత్తరాలు వేశారు. ఆ మూడిటిలో ఒకటి అసలు విషయాన్నే పట్టించుకున్నది కాదు. మిగిలిన రెండు అసలు విషయాన్ని వదిలి మరేవో మాట్లాడినవి. మూడు ఉత్తరాల ఉద్దేశం రంగనాయకమ్మ ఏ తప్పూ చేయలేదని అనడమే. ఇంకోరకంగా చెప్పాలంటే అవి మూడు కూడా రంగనాయకమ్మ భజన ఉత్తరాలు లాగా ఉన్నాయి. మీరు ఇలా ఎందుకు వేస్తున్నారో తెలియడం లేదు. హిజ్రాల మీద ఆమె రాసిన అమానుషమైన వ్యాసం వేసినప్పటి నుంచీ వీక్షణం ఆమె రచనలకు మితిమీరిన ప్రాధాన్యత ఇస్తున్నట్లు అనిపిస్తున్నది. వీక్షణం ఎవరికీ ప్రాధాన్యత ఇవ్వకూడదని, తప్పుడు భావాలకు అసలే ఇవ్వకూడదని పాఠకుడుగా కోరుకోవడంలో తప్పులేదనుకుంటాను.

**- భూషణం**
రాజమండ్రి

**వీ**క్షణం మే 2016 సంచికలో వచ్చిన టోల్ టాక్సుకు సంబంధించిన మరిన్ని వివరాలు. ప్రస్తుతం దేశవ్యాప్తంగా నేషనల్ హైవేల పై ఉన్న టోలు బూతులు మొత్తం : 373. టోలు రోడ్లకు ఖర్చు పెట్టిన మొత్తం: 1,73,000 కోట్లు. 2013 – 2014 ఆర్థిక సంవత్సరం వరకు వసూలైన మొత్తం : 72,300 కోట్లు. 1996 టోల్ చట్ట ప్రకారం టోలు రోడ్లపై పెట్టిన ఖర్చు మొత్తం వసూలైన తర్వాత ఫీజు రద్దు చేయాలి.

నేషనల్ హైవేపై 62 టోల్స్ పై ఖర్చు పెట్టిన మొత్తం : 13,415 కోట్లు. 62 టోల్స్‌పై ఇప్పటి వరకు వసూలైన మొత్తం: 21,897 కోట్లు. (62 టోల్స్‌లోనూ ఇంకా వసూలు చేస్తున్నారు). 373 టోల్ బూత్‌ల ద్వారా 2013–14లో వసూలైన మొత్తం: 14,170 కోట్లు. 2011–12 లో డీజిల్‌పై 2 రూపాయల సెస్ వలన 18,400 కోట్లు కేంద్రానికి జమ అయినది. ప్రస్తుతం కేంద్ర ప్రభుత్వ డీజిల్‌పై లీటరుకు 6 రూపాయల సెస్ వసూలు

(మిగతా 51వ పేజీలో)

**అసహజ మరణాల సూచి జిల్లాల కరస్పాండెంట్లు**

**తెలంగాణ :** ఆదిలాబాద్ – సి.ఎచ్. శ్రీమన్నారాయణ మూర్తి; హైదరాబాద్ – డి. విజయభాస్కర్; ఖమ్మం – సి.ఎచ్. గిరిజ; మెదక్ – ఎం. రాజేందర్‌రెడ్డి; మహబూబ్‌నగర్ – మహమ్మద్ ఇక్బాల్; నిజామాబాద్ – ఎం. నర్సయ్య; రంగారెడ్డి – వి. శంకరయ్య;
**ఆంధ్రప్రదేశ్ :** అనంతపూర్ – కె. నాగేశ్వరాచారి; చిత్తూరు – పలమనేరు బాలాజి; కడప – కొండ్రాయుడు; కర్నూలు – జి.వి. సుధాకర్ రెడ్డి; తూర్పు గోదావరి – కె.ఎస్. ప్రకాష్‌రావు; శ్రీకాకుళం – ఆర్. శ్రీలత; విశాఖపట్నం – పి.వి. రమణ
(ఈ సంచికలోని వరంగల్, నల్గొండ, కృష్ణా, గుంటూరు, ప్రకాశం, నెల్లూరు, విజయనగరం, ప. గోదావరి జిల్లాల అసహజ మరణాల వివరాలు అందిస్తున్న వారు ఎస్. వెంకటేశ్)

# రెండు సంవత్సరాల నరేంద్ర మోడీ పాలన

వర్గ సమాజంలో దోపిడీ, పీడనలు లేని పాలన ఉండే అవకాశమే లేదు. అంతరాల సమాజంలో కొన్ని వర్గాల మీద కొన్ని వర్గాల సాంఘిక, ఆర్థిక, సాంస్కృతిక, రాజకీయ ఆధిపత్యాన్ని నిలబెట్టడానికే పాలన సాగుతుంది. ఆధునిక ప్రజాస్వామిక, ప్రాతినిధ్య పార్లమెంటరీ ముసుగు వేసుకున్న పాలనలలో ఈ నగ్నమైన అంతరాలను, దోపిడీ పీడనలను దాచడానికి ఎల్లప్పుడూ ప్రయత్నం జరుగుతుంటుంది. ఆడంబరమైన, ఆకర్షణీయమైన, వర్గాతీతమైన సమసమాజ ఆదర్శాల ప్రకటనలు వెల్లువెత్తుతుంటాయి. ఇటువంటి సమాజంలో ఎన్నికల వల్ల ఒక పాలకవర్గ ముఠా చేతినుంచి మరొక పాలకవర్గ ముఠాకు అధికారం మారడమే తప్ప నిజమైన ప్రజాసమస్యలకు పరిష్కారం ఎప్పుడూ దొరకదు.

ఈ శాశ్వత సత్యపు నేపథ్యంలో కూడ, మన సమాజంలో ఎన్నికల ద్వారా అధికారానికి వచ్చి పాలన నెరపుతున్న పాలకవర్గాల పనితీరును అంచనా కట్టడానికి అవకాశం ఉంటుంది. ఎన్నికల రాజకీయాలలో పాలనకు గరిష్ఠ పరిమితి ఐదు సంవత్సరాలు గనుక, పాలన ప్రారంభమైన తర్వాత ఏడాదికి, రెండేళ్లకు, రెండున్నరేళ్లకు, మూడేళ్లకు, నాలుగేళ్లకు ఇటువంటి అంచనాలు ప్రకటించే మైలురాళ్లుంటాయి. ఆ అంచనాలకు కూడ పరిశీలకుల స్వీయ మానసిక ప్రమాణాలు కాక అందరూ అంగీకరించగలిగిన వస్తుగతమైన ప్రమాణాలు కొన్ని ఉంటాయి. ఉదాహరణకు అధికార పార్టీ ప్రకటించుకున్న సిద్ధాంతాలు, ఆదర్శాలు, పైకి ఏమి చెప్పినా అంతర్గతంగా ఆ పార్టీ విశ్వసించే అంశాలు, ఎన్నికల ప్రణాళికలు, ఎన్నికల ప్రచారంలో భాగంగా చేసిన వాగ్దానాలు వంటి గీటురాళ్ల మీద పాలనను కొలవవచ్చు. పాలనలో ఏ విధానాలు ప్రకటిస్తున్నారో, ఏ ఆచరణ అమలు చేస్తున్నారో విశ్లేషించవచ్చు. అసలు ఎన్నికల ప్రణాళికను, వాగ్దానాలను పక్కన పెట్టి అదనంగా ఏ పనులు చేస్తున్నారో, ఆ పనుల వల్ల సమాజానికి ఏ ప్రయోజనమో నిర్ధారించనూ వచ్చు.

భారతీయ జనతా పార్టీ పుట్టిన 1980 నుంచి ఇవాళ్టిదాకా "గాంధేయ సోషలిజం" నుంచి "సాంస్కృతిక జాతీయవాదం" దాకా పైకి చెప్పే సిద్ధాంతాలూ ఆదర్శాలూ ఏవైనా, దాని అసలు లక్ష్యం, అంతర్గత ధ్యేయం మనువాదాన్ని, కుల మత అంతరాలను బలోపేతం చేయడం, సమాజాన్ని మత ప్రాతిపదికమీద విభజించి హిందూ మత రాజ్యంగా మార్చడం. ఆ లక్ష్యాన్ని అమలులోకి తేవడానికి అది దశాబ్దాలుగా వేచిచూస్తున్నది. వేరువేరు సామాజిక బృందాల మధ్య సన్నాహాలు చేసుకుంటున్నది. జన సంఘ్‌గా 1977లో జనతా పార్టీ ఐక్యసంఘటనలో మొదటిసారి కేంద్ర అధికారంలో కొంతభాగాన్ని చవి చూసినా, 2014 వరకూ అతుకుల బొంతలలో ఒక ముక్కగానే తప్ప దానికి పూర్తి అధికారం ఎన్నడూ రాలేదు. 2014 ఎన్నికల్లో మాత్రమే మొదటిసారి సొంతంగా, దేశం మొత్తం మీద పోలయిన వోట్లలో మూడో వంతు కన్న తక్కువ (31 శాతం) వోట్లే వచ్చినా, 262 స్థానాలు గెలుచుకుని ఎవరి మద్దతూ లేకుండా అధికారం నెరపే శక్తి సంపాదించుకుని, నరేంద్ర మోడీ నాయకత్వంలోని ప్రభుత్వం ఏర్పడింది. తొమ్మిది దశాబ్దాలుగా రాష్ట్రీయ స్వయం సేవక్ సంఘ్ చేస్తున్న మతోన్మాద, ప్రజావ్యతిరేక, అభివృద్ధి నిరోధక ప్రయత్నాలకు అధికారిక అవకాశం దొరికింది. అందువల్ల, రాజకీయ పక్షంగా భారతీయ జనతా పార్టీ గాని, వ్యక్తిగా నరేంద్ర మోడీ గాని 2014 ఎన్నికల ప్రణాళికలో, ప్రచారంలో ఏమి వాగ్దానాలు చేసి ఉన్నప్పటికీ, వాటిని నెరవేర్చడం కన్న ఎక్కువగా ఇన్నాళ్లుగా ఎదురుచూస్తున్న అవకాశాన్ని వాడుకుని తమ లక్ష్యాల్ని నెరవేర్చుకోవడమే వారి ఏకైక కర్తవ్యం.

యుపిఎ ప్రభుత్వాన్ని తీవ్రంగా విమర్శించి, వారి విధానాలను మారుస్తామని అధికారానికి వచ్చిన మోడీ ప్రభుత్వం రెండు సంవత్సరాలలో మూడో యుపిఎగా పేరు తెచ్చుకునేంతగా ప్రపంచీకరణ విధానాలు కొనసాగిస్తున్నది. విదేశాల్లో దాచుకున్న అక్రమ సంపదను వెనక్కి తీసుకువచ్చి భారత ప్రజల ప్రతి ఒక్కరి ఖాతాలోనూ జమ చేస్తానన్న వాగ్దానం రెండేళ్లు గడిచినా అంగుళం కూడ కదలలేదు. భారత ప్రజల జీవితాల్లో అచ్ఛేదిన్ తెస్తానన్న వాగ్దానానికి దిక్కులేదు. సంక్షేమ పథకాల కోత నిర్విరామంగా జరిగిపోతున్నది. ప్రపంచీకరణ శక్తులకు, దేశదేశాల సంపన్నులకు ఇబ్బడి ముబ్బడిగా దేశ వనరులను అందించే ప్రయత్నం జరుగుతున్నది. చివరికి తమను మించి దేశభక్తులు లేరని ప్రగల్భాలు పలికే పాలకులు గత పాలకులందరి కన్న మిన్నగా దేశాన్ని, దేశ వనరులను విదేశీ శక్తులకు అప్పగిస్తున్నారు.

ఆర్థిక రంగంలో ప్రజావ్యతిరేక చర్యలు జరపడం పాత పాలకులకు కూడ ఆనవాయితీయే గాని, ఈ రెండు సంవత్సరాల పాలకులు మరొక అడుగు ముందుకువేసి సామాజిక, సాంస్కృతిక, రాజకీయ రంగాలలో కూడ దేశాన్ని అల్లకల్లోలం చేసే, సామాజిక సంక్షోభాన్ని వ్యాపింపజేసే చర్యలకు పూనుకున్నారు. భిన్నాభిప్రాయాలను సహించని తీవ్రమైన అసహనం, భిన్నాభిప్రాయాలు గల వాళ్ల మీద దాడులు, హత్యా ప్రయత్నాలు, హత్యలు, విద్యారంగంలో మార్పులు, అన్ని ప్రతిష్ఠాత్మకమైన దేశీయ సంస్థలనూ అభివృద్ధి నిరోధక భావజాలాల ప్రచారకేంద్రాలుగా మార్చడం, ఆ సంస్థల ప్రతిపత్తిని ధ్వంసం చేయడం, ఉన్నత విద్యా సంస్థల స్వతంత్ర ప్రతిపత్తిని భగ్నం చేసే చర్యలు, దళితులమీద, మత మైనారిటీల మీద దాడులు, ఘర్ వాపసీ, గోమాంసం, భారత్‌మాతా కీ జై, దేశభక్తి–దేశద్రోహం వంటి అనవసర వివాదాలు రెచ్చగొట్టి మతోన్మాదాన్ని వ్యాపింపజేసే కుటిల యత్నాలు, తమ భావజాలానికి చెందినవాళ్లయితే చాలు ఊచకోతలు కోసినవాళ్లను, హంతకులను, అవినీతిపరులను పరిరక్షించడం, రాజకీయ అవకాశవాదంలో కాంగ్రెస్‌ను మించిపోయి కప్పల తక్కెడ సంస్కృతిని ప్రోత్సహించడం, గవర్నర్ల వ్యవస్థనూ, న్యాయవ్యవస్థనూ కూడ పాలకవర్గాల దళారీ సంస్థలుగా మార్చడం, విదేశ వ్యవహారాలలో అమెరికాకు నమ్మిన బంటుగా దళారీ పాత్రను పోషించడానికి ఉవ్విళ్లూరడం ? ఒక్కమాటలో ఇది భారతీయ ప్రభుత్వమూ కాదు, జనతా ప్రభుత్వమూ కాదు, ఒకవైపు సామ్రాజ్యవాదానికి దళారీగా మరొకవైపు హిందూ బ్రాహ్మణ్య మనువాద భూస్వామ్య పరిరక్షకురాలిగా గత ప్రభుత్వాల కన్న మిన్నగా పాలకవర్గాల ప్రయోజనాలు కాపాడుతానని రెండు సంవత్సరాలు అనుక్షణం రుజువు చేసుకుంటున్న ప్రభుత్వంగా నిలిచింది. వీ

సంపాదకీయ వ్యాఖ్య - తెలంగాణ

# రెండు సంవత్సరాల చంద్రశేఖర రావు పాలన

**భా**జపా నాయకత్వంలోని కేంద్ర ప్రభుత్వం తర్వాత రెండు వారాలకు అధికారానికి వచ్చిన తెలంగాణ రాష్ట్ర సమితి పాలనకు కూడ రెండు సంవత్సరాలు నిండాయి. కేంద్ర ప్రభుత్వాన్ని అంచనా వేయడానికి ఉపయోగించిన ప్రమాణాలనే కల్వకుంట్ల చంద్రశేఖర రావు రెండు సంవత్సరాల పాలనకు కూడ ఉపయోగించాలి. తెలంగాణ ప్రజలు ఆరు దశాబ్దాలుగా ప్రకటిస్తున్న ఆకాంక్షలు, ఆ ప్రజా ఉద్యమంలోకి ఒక ఉద్యమ పార్టీగా ప్రవేశించి పద్నాలుగు సంవత్సరాల పాటు తెలంగాణ రాష్ట్ర సమితి తాను కూడ ప్రకటించిన, ఆమోదించిన ఆకాంక్షలు, చివరికి 2014 ఎన్నికల ప్రణాళికలో ప్రకటించిన లక్ష్యాలు తెరాస రెండు సంవత్సరాల పాలనను పరీక్షించడానికి అదనపు గీటురాళ్లు అవుతాయి. అంతకు ముందరి యాభై ఎనిమిది సంవత్సరాల పాలనలో అమలైన పద్ధతులు కొనసాగగూడదని తెలంగాణ ప్రజలు కోరుకున్నారు. తమ వనరుల మీద తమకే అధికారం ఉండాలని, ఆ వనరులను మరొకరు కొల్లగొట్టగూడదని, తమ భూమి, నీరు, నిధులు, ఉద్యోగాలు తమకే దక్కాలని కోరుకున్నారు. తమ భాషా సంస్కృతులకు గౌరవం దక్కి తమ ఆత్మగౌరవం నిలబడాలని కోరుకున్నారు. ఈ కోరికలన్నీ న్యాయమైనవని, అవి సాధిస్తామని తెరాస అనేకసార్లు హామీ ఇచ్చింది. రెండు సంవత్సరాల పాలనా క్రమం ఆ వాగ్దానాలను నిలబెట్టుకునే దిశలో మాత్రం జరగలేదు. ఏవో కొన్ని ఉదాహరణ ప్రాయమైన సామాజిక సాంస్కృతిక చిహ్నాలు, భావోద్వేగాలను సంతృప్తి పరిచే చర్యలు, స్వల్పమైన మార్పులు మినహా పాత ఆంధ్రప్రదేశ్ పాలనలో ఏ రంగాలకు, ఏ వ్యక్తులకు, ఏ స్వార్థ ప్రయోజనశక్తులకు ప్రాధాన్యత దొరికిందో ఈ రెండు సంవత్సరాల లోనూ వారే ప్రధాన భూమిక పోషిస్తున్నారు. ఆరు దశాబ్దాల విధ్వంసాన్ని రెండు సంవత్సరాలలో తొలగించి నిర్మాణం సాగించలేమనే మాట నిజమే కావచ్చు. కాని ఆ విధ్వంసాన్ని తొలగించే ప్రయత్నాలైనా మొదలయ్యాయా, అసలు ఆ పాలనా విధానాలు, ఆ అభివృద్ధి నమూనా ప్రజా విధ్వంసకరమైనదని 2014 జూన్ 2 వరకూ ప్రకటించినంత బలంగా ఇవాళ పాలకులు ప్రకటిస్తున్నారా అని ప్రశ్నించక తప్పదు. అవే పాలనా విధానాలు, అదే అభివృద్ధి నమూనా, అప్పుడు ప్రయోజనం పొందిన వర్గాలకే మళ్లీ ప్రయోజనాలు అనే విధంగానే ఈ రెండేళ్ల పాలన ఉన్నప్పుడు, ఉద్యమంలో పాల్గొన్న సబ్బండవర్ణాల ఆకాంక్షలకు ఏమి ఒరిగినట్టు? తమ ధనమూ, శక్తీ, సమయమూ, ప్రాణాలూ కూడ పణం పెట్టి లక్షలాది మంది పాల్గొన్న ఉద్యమం ఆధారంగా అధికారానికి వచ్చిన రాజకీయ పక్షం ఆ త్యాగాలకు ఏమీ విలువనివ్వడం లేదు. ఆ నాడు ఉద్యమం మీద తుపాకులూ కలాలూ ఎక్కుపెట్టి, ఉద్యమాన్ని అణచివేయదలచిన వాళ్లే, కోట్లాది రూపాయలు పోగుచేసి ఉద్యమాన్ని అప్రతిష్ఠపాలు చేయడానికి, ఓడించడానికి ప్రయత్నించినవాళ్లే ఇవాళ తెలంగాణ ప్రభుత్వానికి కుడిభుజాలూ మూలస్తంభాలుగా కనబడుతున్నారు. ఈ పరిస్థితిలో రెండేళ్ల పాలన వెనుకకు పోయినట్టా, ముందుకు నడిచినట్టా అని కూడ ప్రశ్నించక తప్పదు. ఐదు సంవత్సరాల కోసం వచ్చిన అధికారంలో రెండు సంవత్సరాల పనితీరు ఇలా ఉంటే, మిగిలిన కాలంలో ఈ ప్రయాణ దిశ మారుతుందనే నమ్మకం లేదు. వీ

సంపాదకీయ వ్యాఖ్య - ఆంధ్రప్రదేశ్

# రెండు సంవత్సరాల చంద్రబాబు నాయుడు పాలన

**ఇ**రవై మూడు జిల్లాల విశాల, సంయుక్త ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి స్థానం నుంచి పదమూడు జిల్లాల అవశేష ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి స్థానానికి వచ్చిన నారా చంద్రబాబు నాయుడు పాలనాకాలం కూడ రెండు సంవత్సరాలు గడిచింది. గత రెండు సంవత్సరాల ఆంధ్రప్రదేశ్ పాలన పనితీరును పరిశీలించడానికి తెలుగుదేశం పార్టీ గాని, చంద్రబాబునాయుడు గాని ప్రకటించిన ప్రత్యేక ఆదర్శాలు, లక్ష్యాలు ఏమీ లేనందువల్ల పరీక్షించే గీటురాయి లేదనిపించవచ్చు. రాష్ట్ర విభజన జరిగేవరకూ ప్రస్తుత ఆంధ్రప్రదేశ్ నాయకులందరూ విభజన జరగగూడదనీ, సమైక్య రాష్ట్రమే ఉండాలనీ వాదించారే తప్ప, విభజన జరిగిన తర్వాత రాష్ట్రాన్ని ఎలా తీర్చిదిద్దుకోవాలని ఆలోచించనూ లేదు, ప్రకటించనూ లేదు. చివరి నిమిషంలో పార్లమెంటు చర్చలో కేంద్రం నుంచి కొన్ని హామీల కోసం పట్టుబట్టడం జరిగింది గాని, అప్పుడు సరేనన్న కాంగ్రెస్ అధికారం కోల్పోయింది. అప్పుడు హామీల కోసం నిలదీసిన భాజపా అధికారానికి వచ్చి, తెలుగుదేశం ఆ మంత్రివర్గంలో భాగస్వామి కూడ అయింది. కాని తెలుగు దేశం పార్టీకి ఇప్పుడు పట్టుబట్టే శక్తి లేదు. ఈ నేపథ్యంలో రెండేళ్ల ఆంధ్రప్రదేశ్ పాలనను అంచనా కట్టడానికి ప్రజల ఆకాంక్షలు, ప్రజా అవసరాలు, తెలుగుదేశం పార్టీ ఇతరంగా చేసిన వాగ్దానాలు మాత్రమే ప్రాతిపదికలు అవుతాయి. చంద్రబాబు నాయుడుకు గతంలో అలవాటైన ప్రపంచీకరణ అనుకూల, బహుళ జాతి సంస్థల దళారీ పాలన వల్ల ఈ రెండు సంవత్సరాలు కూడ అదే యథాతథంగా కొనసాగి ప్రజా అవసరాలు, ఆకాంక్షలు పక్కకు పోయాయి. ఆంధ్రప్రదేశ్ వనరులను దేశ దేశాల సంపన్నులకు, బహుళ జాతి సంస్థలకు కట్టబెట్టే పనిలో నిండా మునిగిపోయిన పాలకులకు తాము ప్రజలకు చేసిన వాగ్దానాలు గుర్తుండే అవకాశమే లేదు. పాత రోజుల్లో లాగనే విమానాశ్రయాలు, ఓడరేవులు, రహదారులు, ఫ్లై ఓవర్లు, మెట్రోలు, చైనా, జపాన్ సహకారంతో రాజధాని, బ్రాకెట్ తవ్వకాలు వంటి ఆడంబర, ఆకర్షణీయ ప్రచారం ద్వారా పబ్బం గడుపుకోవాలని పాలకులు ప్రయత్నిస్తున్నారు. ఒక్క ఆంధ్రప్రదేశ్ మాత్రమే కాదు, రెండు రాష్ట్రాల పాలకులు కూడ తమ ప్రజల సమస్యలు పెచ్చరిల్లి, వారి అసంతృప్తి ఎదుర్కోవలసిన గడ్డు స్థితి వచ్చిందనుకున్నప్పుడల్లా విభజన సమస్యలను, భావోద్వేగాలను రెచ్చగొట్టి, ప్రజలను ఒకరి మీదికి మరొకరిని పురికొల్పి అసలు సమస్యల నుంచి తప్పించుకోవడానికి ప్రయత్నిస్తున్నారు. తుపాన్‌లు, కరవు, అతివృష్టి, అనావృష్టి, నేరాల పెరుగుదల, ప్రజా ఆందోళనలు, పర్యావరణ విధ్వంసం, రైతుల దుస్థితి, ఆత్మహత్యలు వంటి నిత్యజీవిత ప్రజాసమస్యల వైపు ప్రజల దృష్టి మళ్లకుండా ఉండడానికి ప్రయత్నిస్తున్నారు. రెండు రాష్ట్రాలలోను పౌరసమాజాన్ని, ప్రచార సాధనాలను భయపెట్టి, కొనివేసి అసలు సమస్యలు బైటపడకుండా చూసుకుంటున్నారు. నామమాత్రంగానైనా సమస్యలు లేవనెత్తే అవకాశం ఉన్న ప్రతిపక్షాలను బలహీన పరచడానికి అతి నీచమైన అవకాశవాద ఎత్తుగడలకు పాల్పడుతున్నారు. మొత్తం మీద తెలుగు ప్రజలకు ఉండిన ఒక్క ప్రజావ్యతిరేక ప్రభుత్వం స్థానంలో పెనం మీది నుంచి పొయ్యిలో పడ్డట్టు రెండు ప్రజావ్యతిరేక ప్రభుత్వాల కింద నలిగిపోయే దుస్థితి వచ్చింది. వీ

# బ్రెజిల్ అధ్యక్షురాలిపై అభిశంసన ప్రహసనం

బ్రెజిల్‌లో వర్కర్స్ పార్టీ లూలా డిసిల్వా నాయకత్వంలో 2003లో అధికారం చేపట్టింది. దేశంలో అరాచకాలు సృష్టిస్తున్న అమెరికాకు వంత పాడుతున్న నేతలను అదుపు చేయడంతో పాటు ప్రజల సంక్షేమానికి పెద్దపీటవేస్తూ పలు సంక్షేమ పథకాలు చేపట్టారు. 2010లో రౌసెఫ్ తొలిసారి అధ్యక్ష పదవిని చేపట్టింది. 2014 డిసెంబర్‌లో బ్రెజిల్ పార్లమెంట్‌కు జరిగిన ఎన్నికల్లో 51.64 శాతం ఓట్లతో వర్కర్స్ పార్టీ నేతృత్వంలోని కూటమి విజయం సాధించింది. దిల్మా రౌసెఫ్ 2015 జనవరి 1న రెండోసారి బ్రెజిల్ అధ్యక్షురాలిగా పదవి బాధ్యతలు చేపట్టింది. ఆమె అధ్యక్ష బాధ్యతలు చేపట్టే నాటికి బ్రెజిల్ ఆర్థిక రాజకీయ సంక్షోభాన్ని ఎదుర్కొంటుంది. కొన్నాళ్ళుగా బయట పడుతున్న కుంభకోణాలు ప్రజాగ్రహాన్ని పెంచాయి. అదే సమయంలో అదునుకొరకు ఎదిరిచూస్తున్న అమెరికా అందించిన ప్రోత్సాహంతో బ్రెజిల్‌లోని మితవాదశక్తులు, కులీన వర్గాలు, కార్పొరేట్ మీడియా త్రయం దిల్మా వ్యతిరేకతను పెంచి పోషించాయి. మార్చ్ 2015లో సిఎన్‌టి/ఎండిఎ మీడియా సంస్థలు జరిపిన సర్వే ఫలితాల ప్రకారం దిల్మా రౌసెఫ్‌కు ప్రజాదరణ 10.8 శాతం మాత్రమే. 59.9 శాతం ఆమెను అభిశంసించాలని డిమాండు చేశారు. అయితే ఈ సర్వే తప్పుల తడక అని దిల్మా అనుయాయుల ఆరోపణ. పది లక్షల మంది బ్రెజిలియన్స్ దిల్మా పదవి నుండి దిగిపోవాలని డిమాండ్ చేస్తూ ప్రదర్శన నిర్వహించారు. ఈ నేపథ్యంలో ఆమెను అధ్యక్ష పదవి నుండి దింపడానికి అభిశంసన ప్రక్రియ ప్రారంభం కావడంతో బ్రెజిల్‌లో రాజకీయ సంక్షోభం నెలకొంది. అనేక అవినీతి, అక్రమాలను కారణాలుగా చూపి ఏప్రిల్ 17న అభిశంసన ప్రక్రియకు తెరలేపారు.

ప్రతినిధుల సభ ఆమోదం తెలిపింది. మే 13న సెనెట్ ఆమోదం పొందింది. దీంతో ఆమెపై ఆరోపణలను విచారణ చేసేందుకు స్పెషల్ కమిషన్ ఏర్పాటు చేస్తారు. 180 రోజుల వ్యవధిలో సెనెట్ అంతిమ తీర్పు వెలువడుతుంది. ఆ కాలంలో ఆమె పదవిలో ఉండకూడదు. ఆ స్థానంలో బ్రెజిల్ బ్రూటస్‌గా పిలువబడే ఉపాధ్యక్షుడు మైఖేల్ టెమర్ అధ్యక్ష బాధ్యతలు చేపడతారు. ప్రపంచ ఆర్థిక మాంద్యం ప్రభావం బ్రెజిల్ ఆర్థిక వ్యవస్థను తాకింది. చమురు ధరలు పడిపోవడంతో ఆర్థిక వ్యవస్థ తీవ్ర ఇబ్బందుల్లో పడింది. సామాజిక సంక్షేమ పథకాల అమలుకు నిధుల కొరత ఏర్పడింది. ఈ నేపథ్యంలో సామాజిక భద్రతకు కోత పెట్టడమా, లోటును కట్టడి చేయడమా అనే అంశాలు ముందుకు వచ్చాయి. ఆమె ప్రభుత్వం సామాజిక భద్రత పథకాలను కొనసాగించడానికి మొగ్గు చూపింది. లోటును తగ్గించేందుకు బడ్జెట్‌లో కొన్ని మార్పులు చేసింది. దీనిలో వ్యక్తిగత ప్రయోజనం ఏమిలేదు. అందువల్ల ఈ అభిశంసనకు హేతుబద్ధత, న్యాయబద్ధత లేదు. సామాజిక భద్రతకు పెద్దపీట వేయడమే రౌసెఫ్ చేసిన నేరంగా విపక్షాలు గగ్గోలు పెడితే, దానికి అమెరికా తోడైంది. ప్రభుత్వరంగ చమురు కంపెనీలో అతిపెద్ద అవినీతి కుంభకోణం జరిగిందని విపక్షాలు ఆరోపించాయి కాని అభిశంసనలో చేర్చలేదు. రౌసెఫ్‌ను అభిశంసించే దిగువసభ అధ్యక్షుడు ఎడ్వర్డో కున్హా పెట్రోబా కంపెనీ నుంచి 52 మిలియన్ బ్రెజిలియన్ డాలర్ల లంచం తీసుకున్నట్లు సాక్ష్యాధారా లున్నాయి. ఆయనకు స్విట్జర్లాండ్ తదితర దేశాల్లో బ్లాక్‌మనీ ఖాతాలలో మిలియన్ డాలర్లు ఉన్నట్లు వార్తలు వెల్లువెత్తుతున్నాయి. అభిశంసన కమిటీలోని 65 మంది సభ్యుల్లో 37 మందిపై అవినీతి ఆరోపణలు ఉన్నాయి. వాటిపై ఇప్పటికే న్యాయవిచారణ జరుగుతోంది. తమపై ఉన్న అవినీతి ఆరోపణల నుంచి బయటపడేందుకు అధ్యక్షురాలిపై అభిశంసనకు కుట్ర పన్నారని విశ్లేషకులు భావిస్తున్నారు.

– ఎ. నరసింహారెడ్డి



"ఆకలిగొన్న వాళ్లకు తిండి పెడితే
మహాత్ముడివి అన్నారు.

ఆకలిగొన్న వాళ్లకు తిండి ఎందుకు లేదని అడిగితే
కమ్యూనిస్టువు అన్నారు."

**డామ్ హెల్డర్ కమారా** (1909 – 1999)
బ్రెజిల్ కాథలిక్ ఆర్చ్‌బిషప్, 1964 నుంచి 1985 వరకు సైనిక పాలనలో ఉన్న బ్రెజిల్‌లో లిబరేషన్ థియాలజీ ప్రచారకుడిగా ప్రజలకు సేవలు అందించారు.



❖ **కథకాని కథ** – వాల్యూం–1 – కానూరి 60 యేండ్ల కళారంగ అనుభవాలు – కానూరి వెంకటేశ్వరరావు మెమోరియల్ ట్రస్టు ప్రచురణలు – 250 పేజీలు, 1/8 డెమీ, రు. 150, ప్రతులకు: ప్రజావంథా కార్యాలయం, ఇ. నెం. 2-1-716(బి-6, ఎఫ్-4), ఎస్.వి.ఇ.ఎస్ స్కూల్ ఎదురుగా, ఒ.యు. రోడ్, విజ్ఞాన్‌పురి కాలనీ, విద్యానగర్, హైదరాబాద్ – 44



❖ **ఈలం విముక్తి పోరులో మహిళలు** – అడిల్ యాన్ – అనువాదం షహీదా, శ్రామికవర్గ ప్రచురణలు – 103 పేజీలు, 1/8 డెమీ, రు. 50, చిరునామా: వరవరరావు, ఫ్లాట్ నెం. 419, హిమసాయి హైట్స్, ఆంధ్రా కేఫ్ రోడ్, జవహర్ నగర్, ఆర్.టి.సి, క్రాస్ రోడ్ దగ్గర, హైదరాబాద్ – 20, తెలంగాణ; ప్రతులకు: అన్ని ప్రముఖ పుస్తక కేంద్రాలలో



❖ **అంబేద్కర్ – బుద్ధుడు** – డా. కత్తిపద్మారావు – లోకాయత ప్రచురణలు – 196 పేజీలు, 1/8 డెమీ, రు. 150, ప్రతులకు: కత్తి స్వర్ణకుమారి, లోకాయత ప్రచురణలు, అంబేద్కర్ కాలనీ, పొన్నూరు, గుంటూరు జిల్లా – 522 124; సెల్ నెం. 9849741695; అన్ని ప్రముఖ పుస్తక కేంద్రాలలో; Email: padmaraokathi@yahoo.co.in



❖ **సీమ గొంతుక వినండి** – అరుణ్ – విరసం ప్రచురణలు – 104 పేజీలు, 1/8 డెమీ, రు. 50, ప్రతులకు: పాణి, ఇ. నెం. 50–348, ఎల్ 19, బి–2, అరోరా నగర్, బి క్యాంప్, కర్నూలు – 2, ఆంధ్రప్రదేశ్; అన్ని ప్రముఖ పుస్తక కేంద్రాలలో



❖ **ప్రజా విప్లవసేనాని –** (కా. రాయల సుభాష్ చంద్రబోస్ సంస్మరణలో పాటలు, కవితలు – అరుణోదయ సాంస్కృతిక సమాఖ్య ప్రచురణలు – 120 పేజీలు, 1/8 డెమీ, రు. 50, ప్రతులకు: వాయిస్ ఆఫ్ న్యూడెమోక్రసీ, మార్క్స్ భవన్, 658, విద్యానగర్, 7వ లైన్, హైదరాబాద్ – 44; నవ తెలంగాణ బుక్‌హౌస్; నవోదయ బుక్‌హౌస్; విశాలాంధ్ర బుక్‌హౌస్



❖ **చెమట ప్రవాహమై పారినా** – కవిత్వం – మహ్మద్ ఖాజామైనద్దీన్ – తెలంగాణ సాహితి ప్రచురణలు – 78 పేజీలు, 1/8 డెమీ, రు. 100, ప్రతులకు: తెలంగాణ సాహితి, ఇ.నెం. 1–10–85/18, షాషాబ్‌గుట్ట, మహబూబ్‌నగర్ – 509001; చరవాణి: 9396626276; నవ తెలంగాణ బుక్‌హౌస్; హైదరాబాద్



❖ **వాన వెలిసింది – ఇతర కథలు –** టి. లలితప్రసాద్ – సాహితీ పబ్లికేషన్స్ – 127 పేజీలు, 1/8 డెమీ, రు. 50, ప్రతులకు: టి. రాజేశ్వరి, ఇ.నెం. 16–11–94/ ఎం–102, మూసారాంబాగ్, మలక్‌పేట్, హైదరాబాద్ – 500 036; సెల్ నెం: 9246507736, 040–65163592



❖ **అమ్మంగి వేణుగోపాల్ రచనలు – సమగ్ర పరిశీలన –** డా. ఆర్. సూర్యప్రకాశ్‌రావు – ప్రభాత శశి సాహిత్య వేదిక ప్రచురణలు – 567 పేజీలు, 1/8 డెమీ, రు. 375, ప్రతులకు: డా. ఆర్. సూర్యప్రకాశ్‌రావు, ఎఫ్2, ఓం రెసిడెన్సీ, ఉమానగర్, మేడ్చల్, రంగారెడ్డి – 501 401; సెల్ నెం. 9441046839; అన్ని ప్రముఖ పుస్తకేంద్రాలలో



❖ **రైతులు రాజ్యం** – తెలంగాణలో భూ సంస్కరణలు – ప్రొ. కె. సీతారామరావు – అడుగుజాడలు పబ్లికేషన్స్, 238 పేజీలు, 1/8 డెమీ, రు. 200, ప్రతులకు: అడుగుజాడలు పబ్లికేషన్స్, ఫ్లాట్ నెం. 302, వైష్ణవి నెస్ట్, తిరుమల మ్యూజిక్ సెంటర్ వెనుక, మూసారాంబాగ్, దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్ – 36



❖ **సాహస గెరిల్లా యోధుడు** – దిక్సూచి ప్రచురణ – 14 పేజీలు, 1/8 డెమీ, రు. 10, చిరునామా: గ్రా. జింకి భద్ర, మం. సోంపేట, జిల్లా. శ్రీకాకుళం; ప్రతులకు: అన్ని ప్రముఖ పుస్తక కేంద్రాలలో



❖ **డిటెన్యూ డైరీ** – కె.వి.ఆర్ – కె.వి.ఆర్. – శారదాంబ స్మారక కమిటీ – 340 పేజీలు, 1/8 డెమీ, రు. 170, ప్రతులకు: డా. ఎస్. రామక్రిష్ణ, శాంతి నర్సింగ్ హోమ్, నిర్మలా కాన్వెంట్ ఎదురుగా, పటమట, విజయవాడ – 520 010; సెల్ నెం. 9849083137



❖ **ప్రజలు–నిర్వాసిత సమస్య – పాలకులు** – ఎం. రత్నమాల – నూతన ప్రచురణలు – 32 పేజీలు, 1/8 డెమీ, రు. 20, ప్రతులకు: ఎం. రత్నమాల, మేఘా అపార్ట్‌మెంట్స్, ఫ్లాట్ నెం. 302, నల్లకుంట, హైదరాబాద్ – 500 044; ఫోన్ నెం. 040–27662957, 9440329445



❖ **హిందూత్వ కాషాయీకరణ** – వాయిస్ ఆఫ్ న్యూడెమోక్రసీ – 78 పేజీలు, 1/8 డెమీ, రు. 30, ప్రతులకు: వాయిస్ ఆఫ్ న్యూడెమోక్రసీ, మార్క్స్‌భవన్, 658, విద్యానగర్, 7వ లైన్, హైదరాబాద్ – 500 044; నవ తెలంగాణ బుక్ హౌస్; నవోదయ బుక్‌హౌస్; విశాలాంధ్ర బుక్ హౌస్



❖ **మూలవాసి –** ప్రగతిశీల ముస్లిం కవిత్వం – పఠాన్ రసూల్ ఖాన్ – ముస్లిం రచయితల సంఘం ప్రచురణ –88 పేజీలు, 1/8 డెమీ, రు. 50, ప్రతులకు: పఠాన్ రసూల్ ఖాన్, డోర్ నెం. 1–35, చైతన్య హైస్కూల్ ఎదురుగా, కోనేటి వీథి, యర్రగొండపాలెం, ప్రకాశం జిల్లా – 523 327; సెల్ నెం. 9397076152



❖ **అగ్నిపథం** – కవిత్వం – గొంద్యాల రమేశ్ – 89 పేజీలు, 1/8 డెమీ, రు. 80, ప్రతులకు: గొంద్యాల రమేశ్, గైక్వాడ్ బిల్డింగ్, 'ఎ' వింగ్, మొదటి అంతస్తు, రూం.నెం.2, మాన్‌పాడా రోడ్, డోంబివిలి (ఈస్ట్), ముంబై – 421 201; అన్ని ప్రముఖ పుస్తక కేంద్రాలలో



❖ **కల ఇంకా మిగిలే ఉంది** – కాంచనపల్లి – తెలంగాణ సాహిత్య సమాఖ్య ప్రచురణలు – 136 పేజీలు, 1/8 డెమీ, రు. 100, ప్రతులకు: ఎ. అంజనీదేవి, ఫ్లాట్ నెం. 2, స్నేహదీప్ అపార్ట్‌మెంట్స్, స్ట్రీట్ నెం.1, గోకుల్ నగర్, తార్నాక, సికింద్రాబాద్ – 500 017

# పార్లమెంటరీ ప్రజాస్వామ్యం ఎంత ఖరీదు!

పార్లమెంటరీయేతర పద్ధతుల్లో సమాజ మార్పు గురించి మాట్లాడేవాళ్లకు, ప్రయత్నించేవాళ్లకు సాధారణంగా ఒక ప్రశ్న ఎదురవుతుంది. "మీరు చెప్పేది ప్రజోపయోగకరమైనదైతే ఎన్నికల్లో నిలబడి ప్రజలను ఒప్పించి అత్యధిక వోట్లు తెచ్చుకుని పాలన చేపట్టి ఆ మార్పులు తేవచ్చు గదా" అనేది ఆ ప్రశ్న. ప్రఖ్యాత రచయిత్రి అరుంధతీ రాయ్ దాదాపు పది సంవత్సరాల కింద ఒక వ్యాసంలో, నక్సలైట్లు ఎన్నికల్లో నిలబడి గెలిచి వాళ్లు చేయదలచుకున్నది చేయవచ్చు గదా అనే ప్రశ్న వస్తుందని చెప్పి, "అబ్బో, ఆ ఖర్చు వాళ్లు భరించలేరు లెండి" అని పరిహాసపూర్వక జవాబిచ్చారు.

పార్లమెంటరీ ప్రజాస్వామ్యం పేరుమీద జరుగుతున్న ఎన్నికలు ఎంత ఖర్చుతో కూడుకున్నవై పోయాయో, ఆ ఖర్చు భరించడం, సాధారణ ప్రజానీకం అలా ఉంచి, మధ్యతరగతికి కూడ ఎంత అసాధ్యమో ఆ లెక్కలు చూస్తే అర్థమవుతుంది. భారత రాజకీయార్థిక వ్యవస్థ ఇవాళ ప్రధానంగా ఎన్నికల రాజకీయాల మీద ఆధారపడి ఉంది గనుక, ఈ మితిమీరిన ఎన్నికల ఖర్చుల వ్యవహారమే మిగిలిన రాజకీయార్థిక పరిణామాలకు కారణమని కూడ చెప్పవచ్చు.

గతవారం ముగిసిన ఐదు రాష్ట్రాల ఎన్నికల ఫలితాలు వెలువడిన వెంటనే అసోసియేషన్ ఫర్ డెమొక్రటిక్ రిఫార్మ్స్ అనే స్వచ్ఛందసంస్థ విడుదల చేసిన వివరాల ప్రకారం కొత్తగా ఎన్నికైన శాసనసభ్యులలో సగానికన్న ఎక్కువమంది (53 శాతం) కోటీశ్వరులు. ఎన్నికల నిబంధనల ప్రకారం ప్రతి అభ్యర్థీ తన ఆదాయ, వ్యయ, ఆస్తి వివరాలను ఎన్నికల సంఘానికి సమర్పించాలి. ఈ ఐదు రాష్ట్రాల ఎన్నికలలో 821 మంది శాసనసభ్యులు గెలవగా, వారు సమర్పించిన పత్రాలలో 812 మంది పత్రాలను ఈ సంస్థ పరిశీలించగలిగింది. అందులో 430 మందికి రు. కోటి కన్న ఎక్కువ ఆస్తి ఉన్నట్టు తేలింది. పుదుచ్చేరిలో గెలిచిన వారిలో 83 శాతం కోటీశ్వరులు కాగా, తమిళనాడులో 76 శాతం మంది శాసనసభ్యులు కోటీశ్వరులే. వీరిలో కూడ పుదుచ్చేరిలో ఒక కాంగ్రెస్ శాసనసభ్యుడు రు. 337 కోట్ల ఆస్తితో అత్యున్నత స్థానంలో ఉన్నాడు. అన్ని రాష్ట్రాలలోనూ శాసనసభ్యులలో కోటీశ్వరుల సంఖ్య ఒక ఎన్నికలకూ మరొక ఎన్నికలకూ మరింతగా పెరుగుతున్నది.

అదే సమయంలో రెండు సంవత్సరాల కింద ఎన్నికైన లోకసభ సభ్యుల విషయం చూస్తే, మొత్తం సభ్యులలో 82 శాతం మంది కోటీశ్వరులు. లోకసభలో కోటీశ్వరుల సంఖ్య 2004లో 30 శాతం ఉండగా, 2009 ఎన్నికలలో 58 శాతం కాగా 2014లో ఇలా 82 శాతానికి పెరిగింది. ఆంధ్రప్రదేశ్ కు చెందిన ఒక తెలుగుదేశం పార్లమెంటు సభ్యుడు రు. 683 కోట్ల ఆస్తితో ప్రథమ స్థానంలో ఉన్నారు. కాంగ్రెస్ ఎంపిల సగటు ఆస్తి రు. 16 కోట్లు కాగా, భారతీయ జనతా పార్టీ ఎంపిల సగటు ఆస్తి రు. 11 కోట్లు.

ఇలా చట్టసభల సభ్యులు మితిమీరిన ఆస్తిపరులు కావడం, వారి ఆస్తి ఒక ఎన్నికకూ మరొక ఎన్నికకూ ఇబ్బడి ముబ్బడిగా పెరిగిపోవడం ఒక వాస్తవమైతే, అందులో గుర్తించవలసిన అంశాలు మరికొన్ని ఉన్నాయి. ఈ లెక్కలన్నీ ఎన్నికల కమిషన్ కు సమర్పించే అఫిడవిట్ లో వ్యక్తిగత ఆస్తుల, కుటుంబ సభ్యుల ఆస్తుల గురించి స్వయంగా వారు చెప్పుకున్నవి. ఇవన్నీ తప్పుడు లెక్కలు కావడానికే అవకాశం ఎక్కువ. వారి ఆస్తిలో ఏ కొద్ది భాగానికో సంబంధించినవి మాత్రమే కావచ్చు. ఇవి కాక వీరందరికీ బేనామీ ఆస్తులు ఉంటాయి. మరొకరి పేరు మీద ఉండి వీరి అనుభవంలో ఉన్న ఆస్తులు ఉంటాయి. విదేశీ ఆస్తులుంటాయి. తమ అధికార హోదాలో ప్రభుత్వ ఆస్తులను సొంత ఆస్తులుగా వాడుకునే అవకాశం ఉంటుంది.

వారే స్వయంగా చెప్పుకున్న లెక్కలతోనే ఇది ఆస్తిపరుల ప్రభుత్వమే తప్ప పేదల ప్రభుత్వం కాదని స్పష్టమవుతున్నది. నిజానికి మన సమాజంలో ఆస్తిపరులు, అందులోనూ కోటీశ్వరులు ఒక్క శాతం కూడ ఉండరు. వార్షికాదాయం ఒక కోటి రూపాయలకన్న ఎక్కువ అని ప్రకటించి పన్ను చెల్లిస్తున్నవారి సంఖ్య దేశవ్యాప్తంగా ఇరవై వేల లోపేనని కేంద్ర ఆర్థిక మంత్రిత్వ శాఖ ఒక హాస్యాస్పదమైన గణాంకాన్ని ప్రకటించింది. సరిగ్గా అదే సమయంలో ఒక్క ముంబాయిలోనే నలభై లక్షల రూపాయలు ఖరీదు చేసే విలాసవంతమైన కార్లు 25,645 అమ్మకం అయ్యాయి. రు. 10 కోట్ల నుంచి రు. 100 కోట్ల ఖరీదు చేసే విలాసవంతమైన అపార్ట్‌మెంట్లు 1880 అమ్మకం అయ్యాయి. ఒక్క ముంబాయి ఇలా ఉంటే, దేశవ్యాపిత అమ్మకాలు, కొనుగోళ్లు చూసినప్పుడు ఒక కోటి రూపాయల కన్న ఎక్కువ ఆదాయం ఉన్నవారుగా ప్రభుత్వం చెపుతున్న అంకె నూటికి నూరు పాళ్లు తప్పని తేలుతుంది. లేదా ఈ విలాసవస్తువులు, గృహాలు కొంటున్నవారు తమ ఆదాయపు లెక్కలు చెప్పడం లేదనీ, అంటే పన్ను చెల్లించడం లేదనీ అర్థం.

ఇక ఆదాయంతో మాత్రమే కాక మొత్తం ఆస్తితో లెక్కిస్తే, రు. 25 కోట్ల కన్న ఎక్కువ ఆస్తి ఉన్నవారు దేశంలో 81,000 మంది ఉన్నారని ఒక అంతర్జాతీయ ద్రవ్యసంస్థ అంచనావేసింది. ఆరు కోట్ల రూపాయల (పది లక్షల డాలర్లు) కన్న ఎక్కువ ఆస్తి ఉన్నవారు దేశం మొత్తం మీద 1,85,205 మంది అని క్రెడిట్ స్వీస్ అనే అంతర్జాతీయ ద్రవ్య వ్యాపార సంస్థ అంచనా వేసింది. ఈ అంచనాలలో ఏవి చూసినా దేశంలో కోటీశ్వరులు కొన్ని లక్షల మందికి మించరని స్పష్టమవుతున్నది. అంటే దేశంలో కోటీశ్వరుల సంఖ్య మొత్తం జనాభాలో 0.016 శాతం కన్న తక్కువ.

కోటీశ్వరులు ఎంతమంది ఉన్నారనే వివరాలలోకి వెళ్లడం కన్న గుర్తించవలసిన విషయమేమంటే వారిలోనుంచే గణనీయమైన భాగం చట్టసభలలో సభ్యులుగా ఎన్నికవుతున్నారు. దేశ జనాభాలో 0.016 శాతంగా ఉన్న వీరు మిగిలిన 99.984 శాతం మంది జీవితాలను ప్రభావితం చేయగల రాజకీయార్థిక విధానాలను తయారుచేసే, నిర్దేశించే, అమలుచేసే అత్యున్నత నిర్ణయాధికార పీఠాల మీద కూచుంటున్నారనేది గుర్తించవలసిన విషయం.

మరి ఇంత అల్పసంఖ్యాకులకు అత్యధిక సంఖ్యాకుల వోట్లు ఎలా పడుతున్నాయి? వారు తమవారు కాదనీ, తమ మేలు కోసం ఏమీ చేయబోరనీ తెలిసినా అసంఖ్యాక ప్రజానీకం వారికి వోట్లు ఎలా వేస్తున్నారు? ఇక్కడ భారత పార్లమెంటరీ రాజకీయ వ్యవస్థ పుట్టిపెరిగిన ప్రత్యేక స్థితిని అర్థం చేసుకోవాలి. భూస్వామ్యం మీద బూర్జువావర్గపు తిరుగుబాట్లతో, పారిశ్రామిక విప్లవపు వెల్లువలో యూరప్‌లో పార్లమెంటరీ ప్రజాస్వామిక సంస్థలు పుట్టుకొచ్చాయి. పరిశ్రమలకు అంతకంతకూ

ఎక్కువగా కావలసిన శ్రమశక్తి కోసం బూర్జువావర్గం వ్యక్తిని పాత బంధనాల నుంచి విముక్తం చేయదలచింది. అందుకోసం వ్యక్తిస్వేచ్ఛ అని నినదించింది. వ్యక్తిస్వేచ్ఛతో పాటు వ్యక్తీకరణను అనుమతించి భావ ప్రకటనా స్వేచ్ఛను ఆమోదించింది. అలా ప్రతి వ్యక్తికీ పౌరుడనే గుర్తింపునిచ్చి ఆ వ్యక్తి తన వోటుతో తన ప్రతినిధిని ఎంచుకుని పాలనలో భాగం కావచ్చునని ప్రతిపాదించింది. అలా ఒక వ్యక్తికి ఒక వోటు అనే సూత్రం మీద ప్రాతినిధ్య పాలనగా పార్లమెంటరీ వ్యవస్థ ఫ్రాన్స్‌లో, ఇంగ్లండ్‌లో పుట్టుకువచ్చింది. ఈ పరిణామాలలో ఏ ఒక్కటీ లేకుండానే, ఉన్న ఒకటి రెండు కూడ పైపైన మాత్రమే ఉండి భారతదేశంలో బ్రిటిష్ పార్లమెంటరీ వ్యవస్థను అంటు కట్టడం జరిగింది. అందువల్ల అది బోన్సాయి మొక్క అయింది. అది గుంటపూలు పూసి, కుక్కమూతి పిందెలు వేస్తున్నది. దాని పుట్టుకే సక్రమంగా జరగలేదు గనుక దానికి అవసరమైన పోషకాలు లేవు. అత్యవసరంగా అనివార్యంగా ఉండవలసిన ఒక వ్యక్తికి వోటు అనే పద్ధతి బదులు ఇంకా వ్యక్తి తయారు కాని సమాజంలో కుల, మత, ప్రాంతీయ, భాషా భావోద్వేగాలే ప్రాతిపదికలు అవుతున్నాయి. అన్నిటికన్న మిన్నగా పనిచేస్తున్నది డబ్బు అనే పోషకం. నేరుగా డబ్బుకు వోటు కొనుక్కోవడం, డబ్బు ఆశచూపడం, వస్తువులు ఇవ్వడం, ఆకర్షణలు, ప్రలోభాలు చూపి మభ్యపెట్టడం వంటి రూపాలలో ఎన్నికలలో డబ్బు పాత్ర నానాటికీ పెరిగిపోతున్నది. అందువల్ల డబ్బున్నవారికే ఎన్నికలలో పాల్గొనే అవకాశం ఉంటుంది. డబ్బు వెదజల్ల గలిగినవారికి ఇతర ప్రాతిపదికలు కూడ జతకలిసినప్పుడు గెలుపు సాధ్యమవుతుంది. ఎన్నికల ప్రక్రియ గడప తొక్కాలంటే డబ్బు కావాలి. అది ప్రాథమికం.

నిజంగానే ఒక శాసనసభ నియోజక వర్గంలో ఒక లక్ష మందిని, ఒక లోకసభ నియోజకవర్గంలో పది లక్షల మందిని ఒక అభ్యర్థి కలుసుకోవలసి ఉంటుంది. కొన్ని వందల గ్రామాలు తిరగవలసి ఉంటుంది. ప్రచారం కోసం సామగ్రి సిద్ధం చేసుకోవలసి ఉంటుంది. ఈ ప్రచారానికి వాహనాలు కావాలి. ప్రచారం చేసేందుకు, సహకరించేందుకు కార్యకర్తలు కావలసి ఉంటుంది. ప్రచారం జరిగినన్ని రోజులూ కొన్ని వందల మంది కార్యకర్తలకు భోజన, వసతి తదితర సౌకర్యాలు కల్పించవలసి ఉంటుంది. అంటే ప్రలోభాలకు ఏమీ ఖర్చుపెట్టకపోయినా, ఏ అక్రమాలకూ పాల్పడకపోయినా కేవలం ప్రచారానికే ఒక అభ్యర్థికి కొన్ని లక్షల రూపాయలు ఖర్చుపెట్టక తప్పదు.

ఇటువంటి అనివార్యమైన ఖర్చులను దృష్టిలో ఉంచుకుని ప్రజా ప్రాతినిధ్య చట్టం ఎన్నికలలో ఒక అభ్యర్థి ఎంత వరకు ఖర్చు పెట్టవచ్చునో నిర్దేశిస్తూ గరిష్ఠ పరిమితి విధించింది. కాలక్రమంలో అది మారుతూ వచ్చింది. ప్రస్తుత నిబంధనల ప్రకారం ఒక శాసనసభ అభ్యర్థి రు. 28 లక్షలు, ఒక లోకసభ అభ్యర్థి రు. 70 లక్షలు ఖర్చు పెట్టవచ్చు. వారు పార్టీ అభ్యర్థులైతే కొంత ప్రచార ఖర్చు పార్టీ సాధారణ ఖర్చు ఖాతాలోకి పోతుంది. ప్రతి అభ్యర్థీ తన ఎన్నికల ప్రచారంలో ఖర్చు పెడుతున్న ప్రతి పైసాకూ లెక్కరాసి ఎన్నికల సంఘానికి సమర్పించాలి. ఇంతవరకు దేశంలో ప్రతి అభ్యర్థీ కూడ ఈ గరిష్ఠ పరిమితి లోపలే, 40 నుంచి 80 శాతం వరకు మాత్రమే ఖర్చుపెట్టానని ఎన్నికల సంఘానికి లెక్కలు సమర్పించారు. ఇది ఎంత హాస్యాస్పదమో ప్రజలలో ప్రతి ఒక్కరికీ తెలుసు. ఉజ్జాయింపు లెక్కలు వేసినా ఈ గరిష్ఠ పరిమితి అభ్యర్థుల ఖర్చు మొత్తంలో చిటికెడంత కూడ కాదని తేలుతుంది. నిజానికి ఒక శాసనసభ నియోజకవర్గంలో రు. 15 కోట్ల వరకు, ఒక లోకసభ నియోజకవర్గంలో రు. 50 కోట్ల వరకు ఖర్చు పెట్టిన ఉదాహరణలు ఎన్నో ఉన్నాయి. ఒక్కొక్క కుటుంబంలో ఎన్ని వోట్లున్నాయో లెక్కగట్టి వోటుకు ఐదు వందల రూపాయల నుంచి రెండు వేల రూపాయల దాకా ఇచ్చిన ఉదాహరణలు, మద్యం, చీరలు, ఉంగరాలు, గొలుసులు, వగైరా ఇచ్చిన ఉదాహరణలు, కుల పెద్దలకు, గ్రామ పెద్దలకు లక్షలాది రూపాయలు ఇచ్చిన ఉదాహరణలు, పత్రికల్లో అనుకూలంగా రాయించుకుని విలేఖరులకు వేలాది రూపాయలు ముట్టజెప్పిన ఉదాహరణలు ఎన్నో ఉన్నాయి. కనీసం రెండు కోట్లు ఖర్చు పెట్టకుండా శాసనసభ్యుడు, పది, పన్నెండు కోట్లు ఖర్చు పెట్టకుండా లోకసభ సభ్యుడు కావడం అసాధ్యమని సాధారణ అభిప్రాయం.

అవన్నీ అలా ఉంచి, ఎన్నికల సంఘం నిబంధనల ప్రకారం ఖర్చు పెట్టగలిగినవాళ్లయినా ఎందరున్నారనేది ఒక ప్రశ్న. అంటే భారత ఎన్నికల రాజకీయాలు నిబంధనల ప్రకారమే దేశప్రజలలో అత్యధికులను, బహుశా 90 శాతం ప్రజలను వెలివేస్తున్నాయి.

ఇక కోట్లాది రూపాయలుగా పెట్టిన ఖర్చును ఎన్నికైన వాళ్లు ఎలా రాబట్టుకుంటారు, ఓడిపోయినవాళ్లు ఎలా రాబట్టుకుంటారు అనేవి మరింత పెద్ద ప్రశ్నలు. ఇక్కడే మన రాజకీయార్థిక వ్యవస్థలోని అవినీతికి మూలాలు ఉన్నాయి. ఎన్నికల్లో అభ్యర్థులు పెట్టే ఖర్చులో కొంత భాగమే సొంతంగా ఖర్చు పెడతారనీ, మిగిలినది టికెట్ ఇచ్చిన పార్టీ చూసుకుంటుందనీ, లేదా ఆ నియోజకవర్గంలో ఆసక్తి ఉన్న పారిశ్రామిక, వ్యాపారవేత్తలు, సంపన్నులు "విరాళాలు"గా ఇస్తారని అందరికీ తెలుసు. వాళ్ల ఆసక్తి పూర్తిగా లాభ నష్టాల లెక్కలలోనే ఉంటుంది. వాళ్లు ఈ విరాళాన్ని పెట్టుబడిగానే చూసి దాని మీద ఎంత ప్రతిఫలం వస్తుందో లెక్కలు కట్టుకుంటారు.

శాసనసభ్యులు, లోకసభ సభ్యులు జీతభత్యాల మీద సంపాదించేది వారి కార్యాలయాలకు, ఇళ్లకు వచ్చే అతిథులకు, వారి ప్రయాణ ఆర్భాటాలకు కూడ సరిపోదు. ముంబై నుంచి 2009 ఎన్నికల్లో గెలిచి శాసనసభ్యులై, మళ్లీ 2014లో కూడ పోటీ చేసిన అభ్యర్థుల విషయంలో వారి ఆదాయం గురించీ, ఆస్తి గురించీ ఎన్నికల సంఘానికి సమర్పించిన అఫిడవిట్లను పోల్చి చూడగా, ముంబై లో 36 మంది శాసన సభ్యులుండగా అందులో 35 మంది మళ్లీ అభ్యర్థులయ్యారు. వారు చెప్పుకున్న ఆస్తి 2009లో రు. 350 కోట్లు ఉన్నదల్లా, 2014 నాటికి రు. 830 కోట్లు అయింది. ఇదంతా జీత భత్యాల నుంచి వచ్చినది కాదు. తమ నియోజకవర్గ పరిధిలో జరిగే ప్రతి కార్యక్రమంలో, అభివృద్ధి పథకాల నిధులలో, సంక్షేమ నిధులలో వారికి లెక్క ప్రకారం కమిషన్ ఉంటుంది. ఆ పథకాల కాంట్రాక్టులు ఎన్నికలకు ముందు విరాళాలు ఇచ్చినవారికి అందుతాయి గనుక వారికీ వారి డబ్బు తిరిగి వస్తుంది. ఇలా ఎన్నికలలో నిలబడడం అంటే ఒక వ్యాపారంలో పెట్టుబడి పెట్టడంలాంటిదే. ఈ వ్యాపారానికి పెట్టుబడీ చాల ఎక్కువ అవసరమవుతుంది. పెట్టుబడి మీద ప్రతిఫలం - లాభం కూడ చాల ఎక్కువగా ఉంటుంది.

"కాలం గడుస్తున్న కొద్దీ ఎన్నికలు చాల ఖరీదైపోతున్నాయి. ఎంత అసాధారణమైన వ్యక్తిగత ప్రతిష్ఠ ఉన్నా, ప్రజాసేవా చరిత్ర ఉన్నా సాధారణ పౌరులు ఎన్నికల్లో పోటీ చేస్తామని కలలో ఊహించే అవకాశం కూడ లేదు. ఉన్న వనరులన్నిటినీ కొన్ని రాజకీయ పార్టీలు, వాటి అభ్యర్థులు కైవసం చేసుకున్నారు. ఈ పరిస్థితి రాజకీయ పార్టీలు అంతకంతకూ ఎక్కువగా డబ్బు మీద ఆధారపడానికి దారి తీస్తున్నది. ఇది సమాజానికీ రాజకీయ వ్యవస్థకూ చాల ప్రతికూల ఫలితాలు ఇచ్చే పరిణామం" అని ఎన్నికల ప్రధానాధికారి ఎస్ ఎన్ జైదీ అన్నాడంటే పరిస్థితి ఎంత దిగజారి ఉందో అర్థమవుతుంది. ఇదీ ఈ దేశంలో పాలన! పార్లమెంటరీ ప్రజాస్వామ్య వ్యవస్థ!!! వీ

# ఐదు రాష్ట్రాల ఎన్నికల ఫలితాలు

***పాలక పార్టీలు ఎన్నికల్లో అవకాశవాద పొత్తులు పెట్టుకొని ఎన్నికల ఫలితాలను ప్రజామోదంగా కనబడేలా చేసినా, ప్రజల మౌలిక సమస్యలను పరిష్కరించలేవని అంటున్నారు* వై. రామచంద్రం**

ఎన్‌డిఎ అధికారంలోకి వచ్చిన తరువాత రాష్ట్రాల అసెంబ్లీలకు జరిగిన రెండవ ఎన్నికలు ఇవి. మొదట జరిగిన ఢిల్లీ, బిహార్‌ఎన్నికల్లో ప్రజలు బిజెపిని అధికారానికి దూరం పెట్టారు. గత ఏప్రిల్, మేలలో జరిగిన ఐదు రాష్ట్రాల అసెంబ్లీ ఎన్నికల ఫలితాలు ఒక రకంగా చెప్పాలంటే కేంద్ర ప్రభుత్వ పాలనా తీరుకు, అట్లాగే రాష్ట్రాల్లో అధికారంలో ఉన్న పార్టీల పాలనా తీరుకు సంబంధించిన ఫలితాలుగా కొంతవరకు భావించవచ్చు.

ఐదు రాష్ట్రాల ఎన్నికల ఫలితాలను పరిశీలిస్తే తమిళనాడులో అన్నాడిఎంకె పార్టీ డిఎంకె–కాంగ్రెస్ కూటమిని ఓడించి తిరిగి అధికారంలోకి వచ్చింది. పశ్చిమబెంగాల్‌లో తృణమూల్ కాంగ్రెస్ ఒంటరిగా పోటీచేసి సిపిఐ(ఎం)–కాంగ్రెస్ కూటమిని ఓడించి తిరిగి అధికారాన్ని నిలబెట్టుకుంది. కేరళలో కాంగ్రెస్ నాయకత్వంలోని యుడిఎఫ్ కూటమిని ఓడించి ఎల్‌డిఎఫ్ కూటమి అధికారంలోకి వచ్చింది. అస్సాంలో గత కాంగ్రెస్ కూటమిని ఓడించి బిజెపి నాయకత్వంలోని ఎన్‌డిఎ కూటమి అధికారంలోకి వచ్చింది. కేంద్రపాలిత ప్రాంతమైన పుదుచ్చేరిలో ఎఐఎన్ఆర్‌సిని ఓడించి కాంగ్రెస్–డిఎంకె కూటమి అధికారంలోకి వచ్చింది. కాంగ్రెస్ పార్టీ కేరళ, అస్సాం రాష్ట్రాల్లో తన అధికారాన్ని కోల్పోయింది.

ఐదు రాష్ట్రాల్లో ఎన్నికలు జరుగుతున్న సందర్భంలోనే దేశవ్యాప్తంగా తీవ్రకరువు పరిస్థితులు నెలకొని ఉన్నాయి. ఇవేవి పాలకులకు పట్టకుండా ఎన్నికల గోదాలో మునిగితేలారు. రైతులు అప్పులు తీర్చే మార్గంలేక ఆత్మహత్యలు చేసుకుంటున్నారు. వృద్ధులైన తల్లితండ్రులను వదిలి పట్టణాలకు వలసపోతున్నారు. పశువులకు తాగడానికి నీళ్లు, తినడానికి మేత లేక కబేళాలకు తరలించ బడుతున్నాయి. ఇక్కడ గోమాత నామ స్మరణ చేస్తున్న గోరక్షకులు గోమాతలను రక్షించలేక పోతున్నారు. ఈ కరువును కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు అంత ప్రధానమైన విషయంగా గుర్తించడం లేదు. చివరికి ఒక స్వచ్ఛంద సంస్థ కోర్టులో వేసిన ప్రజా ప్రయోజన వ్యాజ్యంతో ప్రజల ఆగ్రహం కట్టలు తెంచుకొని ఎటువైపు వెళుతుందోనని చివరికి సుప్రీం కోర్టు కలుగజేసుకునే వరకు కరువును గుర్తించింది లేదు. ప్రజలను ఓట్లుగా చూస్తున్నారే తప్ప మనుషులుగా చూడడంలేదు.

బిజెపి కేంద్రంలో అధికారాన్ని, ఆర్టికల్ 356ని ఉపయోగించుకొని 'కాంగ్రెస్ ముక్త్ భారత్' అనే నినాదంతో ఏదో ఒక నెపంతో కాంగ్రెస్ పాలిత రాష్ట్రాల్లో రాష్ట్రపతి పాలన విధిస్తోంది. అందులో భాగంగానే అరుణాచల్‌ప్రదేశ్‌లో కాంగ్రెస్ ప్రభుత్వాన్ని రద్దుచేసి రాష్ట్రపతి పాలన విధించింది. ఉత్తరాఖండ్ ప్రభుత్వాన్ని బలహీన పరిచి రాష్ట్రపతి పాలన విధించి చివరికి సుప్రీంకోర్టు ఆదేశాలతో బలపరీక్షలో కాంగ్రెస్ నెగ్గడంతో అభాసుపాలయింది. అధికారంలో ఉండగా బిజెపి పాలిత రాష్ట్రాల్లో ఇదే వైఖరిని యుపిఎ అనుసరించింది. అప్పుడు ప్రజాస్వామ్యాన్ని ఖూనిచేస్తున్నారని బిజెపి గగ్గోలుపెట్టింది. పాలకులు ఎవరు అధికారంలో ఉన్నా ప్రజాతీర్పుతో సంబంధంలేకుండా మిగతా పార్టీలను బలహీన పరుస్తున్నాయి. ఆ తరువాత రాష్ట్రపతి పాలన విధించి తమకు అనుకూలమైన ప్రభుత్వాలను ఏర్పాటు చేస్తున్నాయి.

అక్రమాస్తులు కలిగి ఉన్నందుకు తమిళనాడు ముఖ్యమంత్రి జయలలితను అరెస్ట్‌చేసి జైలు నిర్బంధంలో ఉంచారు. తరువాత కేంద్రంతో లోపాయకారి ఒప్పందం కుదుర్చుకొని జయలలిత జైలు నుంచి విడుదలై మళ్లీ ముఖ్యమంత్రి అయింది. అధికారంలో ఉన్నవాళ్లు తలుచుకుంటే చట్టాలు వారికి చుట్టాలుగా మారతాయనడానికి ఇది ఒక ఉదాహరణ మాత్రమే.

ఎన్నికల ఫలితాలను మీడియా విశ్లేషకులు, మీడియా తమదైన పద్ధతిలో విశ్లేషిస్తున్నాయి. జాతీయ పార్టీలు ఒక్కోటి ఒక రాష్ట్రంలో ప్రాంతీయ పార్టీల అవకాశవాద పొత్తులతో అధికారంలోకి వచ్చాయి. విశ్లేషకులు మాత్రం అస్సాంలో బిజెపి గెలుపును ఉత్తరాదిలో ఘన విజయంగా కొనియాడుతున్నారు. అట్లాగే కాంగ్రెస్ దేశవ్యాప్తంగా తన ప్రాభవాన్ని కోల్పోయిందని రేపు రేపు అంతర్ధానమయే పరిస్థితి ఉందని, మోడీ అంటున్నట్టుగా 'కాంగ్రెస్ ముక్త్ భారత్'గా మారే పరిస్థితి ఉందని అంటున్నారు. ఇందులో ఎక్కడా ప్రజలుగాని, వారి సమస్యలు గాని ప్రస్తావనకు రాలేదు. ప్రజలను ఓటు బ్యాంకుగా చూసే రాజకీయ పార్టీల ధోరణి మీడియాకు కూడా అలవాటవుతోంది.

**తమిళనాడు**

తమిళనాడులో అన్నాడిఎంకె, డిఎంకె పార్టీల మధ్య అధికార మార్పిడికి రెండోసారి గండిపడింది. 1984 ఎంజిఆర్ నాయకత్వంలో ఉన్నప్పుడు అన్నాడిఎంకె మొదటిసారి అధికారాన్ని చేపట్టింది. మళ్లీ అదే అన్నాడిఎంకె రెండోసారి అధికారాన్ని జయలలిత నాయకత్వంలో చేపట్టింది. 2011లో ఎన్నికల్లో 149 స్థానాలను గెలుచుకున్న అన్నాడిఎంకె ఈసారి 133 స్థానాల్లో గెలిచింది. కాంగ్రెస్, డిఎంకె కూటమి 90 స్థానాలను గెలుచుకుంది. గత ఎన్నికల్లో అన్నాడిఎంకెతో పొత్తుపెట్టుకుని డిఎండికె 48 స్థానాలను గెలుచుకుంది. ఈసారి డిఎండికె, వైగో నేతృత్వంలోని ఎండిఎంకె, టిఎంసి, వామపక్షాలు కలిసి మూడో కూటమిగా ఏర్పడి ఓట్లను చీల్చగలిగాయి కాని ఒక్క స్థానాన్ని కూడా గెలువలేక పోయాయి. అన్నాడిఎంకె గెలుపుకు కారణం జయలలిత ప్రభుత్వం అమలుచేసిన సామాజిక కార్యక్రమాలు, ఎన్నికల్లో ఇచ్చిన హామీలు అనే వాదన ఒకటి ఉంది. అట్లాగే డిఎంకె గత యుపిఎ ప్రభుత్వంలో భాగస్వామిగా ఉండి 2జి స్పెక్ట్రమ్ లాంటి అవినీతికి పాల్పడడం కూడా అన్నాడిఎంకె గెలుపుకు కారణమైంది. అన్నాడిఎంకె అధినేత జయలలిత అక్రమాస్తుల కేసులో జైలుకు వెళ్లినా డిఎంకె అవినీతి పక్కన కనిపించకుండా పోయింది.

జయలలిత తమిళనాడులో అమలుచేసిన పథకాలను, అమ్మ టిఫిన్

సెంటర్లని చూస్తే 'స్వాతంత్ర్యం' అనే అధికార మార్పిడి జరిగి ఏడు దశాబ్దాలు కావస్తున్నా కూడా అమ్మ పెట్టే భోజనం తప్ప వారికి వేరే ఆధారం లేకపోవడం ఆలోచించాల్సిన విషయం. ఉత్పత్తిలో పాల్గొనాల్సిన శక్తులను గంటల కొద్దీ అమ్మ పెట్టే భోజనం దగ్గర క్యూలు కట్టి అడుక్కుతినేలా చేస్తున్నారు. ప్రజల మౌలిక సమస్యలను పరిష్కరించకుండా ఉండాలనేది పాలకుల ఉద్దేశం. పాలితులు ఎప్పుడు అడుక్కునేవారు గానే ఉండాలనే భారతదేశ భూస్వామ్య లక్షణం మనకు కనబడుతోంది. మనుషులను ఉత్పత్తి శక్తులుగా గుర్తించడంలేదు. రాజకీయ పార్టీల ఎజెండా ప్రజల మౌలిక సమస్యలు కేంద్రంగా ఉండాలి. కాని నేడు అన్నాడిఎంకె ఎన్నికల వాగ్దానాల్లో కలర్ టివిలు, సెల్‌ఫోన్‌లు, మిక్సీలు, గ్రైండర్లు ఉన్నాయి. ప్రజల మౌలిక అవసరాలైన విద్య, వైద్యం, ఉపాధికి ఎక్కడా హామీ పడలేదు. గుత్తపెట్టుబడిదారులకు వనరులను కట్టబెట్టే క్రమంలో పొందిన అక్రమార్జనను ఎన్నికల్లో గెలుపొందడానికి ఈ విధంగా ఉపయోగించుకుంటున్నారు.

ఎన్నికల సంఘం 6,112 ఫ్లైయింగ్ స్క్వాడ్‌లు, లక్షలాది పోలీసు బందోబస్తు మధ్య ఎన్నికలు నిర్వహించింది. షరా మామూలుగానే మద్యం ఏరులై పారింది. ఇక అక్రమంగా సంపాదించిన లెక్కలేనంత డబ్బు పంచారు. కోట్లాది రూపాయలు కంటేనర్లతో పట్టుబడింది. ఇలాంటి అక్రమ సంపాదన ఆకలిగొన్న ప్రజల పై గుమ్మరించి వారిని ఓట్లుగా మలుచుకున్న తీరు మనకు తమిళనాడులో చాలా స్పష్టంగా కనబడుతుంది. కనీసం ఆయా పార్టీలు నిర్దేశించుకున్న పార్టీ ప్రణాళికలనైనా అమలుచేయడం లేదు.

**పశ్చిమ బెంగాల్**

పశ్చిమ బెంగాల్‌లో తృణమూల్ కాంగ్రెస్ (టిఎంసి) ఒంటరిగా పోటీచేసి తిరిగి రెండోసారి అధికారంలోకి రాగలిగింది. దాదాపు మూడున్నర దశాబ్దాలుగా పాలనచేసిన సిపిఐ(ఎం) పార్టీని ప్రజలు ఈ ఎన్నికల్లో కూడా విశ్వసించలేదు. మొత్తం 294 అసెంబ్లీ స్థానాల్లో పార్టీల వారిగా గెలుపొందిన సీట్లను చూస్తే తృణమూల్ కాంగ్రెస్ 211, కాంగ్రెస్ 44, సిపిఐ(ఎం) 26, బిజెపి 3, ఇతరులు10 గెలుపొందారు. టిఎంసి 2011లో కాంగ్రెస్‌తో పొత్తుపెట్టుకొని 184 గెలుచుకుంది. ఈసారి పొత్తు లేకుండానే పూర్తి మెజారిటీ సీట్లు సాధించింది. గత ఎన్నికల్లో సిపిఐ(ఎం) 40 స్థానాలు గెలుచుకోగా ఈసారి కాంగ్రెస్‌తో పొత్తుపెట్టుకొని 26 సీట్లకే పరిమితమైంది. పశ్చిమ బెంగాల్‌లో ఈ మధ్యనే జరిగిన చిట్‌ఫండ్ కుంభకోణం, కంట్రాక్టర్ల అవినీతి వల్ల ఫ్లైఓవర్ బ్రిడ్జ్ కూలడంతో ప్రజల్లో ప్రభుత్వం పట్ల వ్యతిరేకత ఏర్పడింది. ప్రభుత్వం పట్ల ఏర్పడిన వ్యతిరేకత కంటే సిపిఐ(ఎం) పాలనలో అమలుచేసిన ప్రజావ్యతిరేక విధానాలను ప్రజలు ఇంకా మరిచిపోలేదనేది తృణమూల్ కాంగ్రెస్ గెలుపుద్వారా మనకు తెలుస్తుంది. బిజెపి కూడా మూడు సీట్లు సాధించడంతో పాటు ఓట్ల శాతాన్ని పెంచుకోవడం వల్ల కూడా సిపిఐ(ఎం) పార్టీకి అధిక సీట్లు రాకుండా చేసింది.

**కేరళ**

కేరళలో 1965 నుండి గత ప్రభుత్వం వరకు సంకీర్ణ ప్రభుత్వాల ఒరవడి కొనసాగుతున్నది. ప్రతిసారి అధికార కూటములు మారుతున్నాయి. ఇప్పుడు కూడా ఇక్కడ అదే క్రమం కొనసాగింది. కేరళలోని మొత్తం 140 స్థానాలకు గాను 91 స్థానాల్లో సిపిఐ(ఎం) కూటమి ఎల్‌డిఎఫ్ గెలుపొందింది. కాంగ్రెస్ నాయకత్వంలోని పాలక యుడిఎఫ్ కూటమి 47 స్థానాలకు పరిమితమైంది. బిజెపి ఒక స్థానంతో కేరళ అసెంబ్లీలోకి అడుగుపెడుతోంది. సోలార్ కుంభకోణం, మద్యం ముడుపుల కుంభకోణాలు, అట్లాగే న్యాయశాస్త్ర విద్యార్థినిపై అత్యాచారం జరిపి, ఆమెను హత్య చేసిన ఘటన కలిసి యుడిఎఫ్ సర్కారును ప్రజలు ఈసారి అధికారానికి దూరంపెట్టారు. చాలా ముందుచూపుతో ఆర్ఎస్ఎస్ శక్తులు మత ప్రాతిపదికన పట్టణాల్లో పనిచేస్తూ స్థానిక సంస్థల ఎన్నికల్లో హిందూ మత ఓటు బ్యాంకును సీట్లుగా మార్చుకుంది. అది పార్లమెంట్, అసెంబ్లీ ఎన్నికలకు వచ్చేసరికి ఓట్ల శాతాన్ని పెంచుకుంటూపోతోంది.

**అస్సాం**

అస్సాం అసెంబ్లీకి 2011లో జరిగిన ఎన్నికలలో నాలుగు స్థానాలకే పరిమితమైన బిజెపి 126 అసెంబ్లీ స్థానాల్లో ఈసారి 60 స్థానాలను గెలుచుకుంది. ఈసారి కాంగ్రెస్, యునైటెడ్ పీపుల్స్ పార్టీ ఒక కూటమిగా ఏర్పడి 26 స్థానాల్లో గెలుపొందాయి. అట్లాగే బిజెపి, అస్సాం గణ పరిషత్(ఎజిపి), బోడో పీపుల్స్ ఫ్రంట్ (బిపిఎఫ్)లు ఒక కూటమిగా ఏర్పడి 86 స్థానాలను గెలుపొందాయి. అధికారంలో ఉన్న కాంగ్రెస్ కూటమికి 26 స్థానాలు మాత్రమే వచ్చాయి. అస్సాం గణ పరిషత్‌కు 14 స్థానాలు, బోడో పీపుల్స్ ఫ్రంట్‌కు 12 స్థానాలు, ఎఐయుడిఎఫ్‌కు13 స్థానాలు, ఇతరులకు ఒక స్థానం లభించింది. అస్సాంలో గత 15 సంవత్సరాలుగా కాంగ్రెస్ పాలనలో ఏర్పడిన ప్రజా వ్యతిరేకత, ప్రాంతీయ పార్టీలు బలహీనంగా ఉండడం వల్ల బిజెపి ఆ పార్టీలను కలుపుకొని ఒక కూటమిగా ఏర్పడడంతో అధికారంలోకి రాగలిగింది. కాంగ్రెస్ పట్ల అక్కడ పెరుగుతున్న వ్యతిరేకతను, స్థానిక పార్టీల బలహీనమైన పరిస్థితిని అదునుగా చేసుకొని బిజెపి అక్కడికి చాలా కాలం క్రితమే నాయకత్వాన్ని పంపించి అక్కడి పరిస్థితులను తనకు అనుకూలంగా మలుచుకుంది. ప్రధానంగా బంగ్లాదేశ్ నుండి వస్తున్న వలసలను చొరబాట్లుగా చిత్రీకరించి వారిని తిప్పిపంపాలనేది ఎన్నికల్లో ఒక అస్త్రంగా వాడుకొంది. పోలైన ఓట్లలో బిజెపి కన్నా కాంగ్రెస్‌కు ఆధిక్యం ఉన్నా అది సీట్ల రూపంలో మారలేదు.

**పుదుచ్చేరి**

కేంద్రపాలిత ప్రాంతమైన పుదుచ్చేరిలో మొత్తం 30 అసెంబ్లీ స్థానాలకు జరిగిన ఎన్నికల్లో పాలక పార్టీగా ఉన్న ఎఐఎన్ఆర్‌సి 8 స్థానాలకే పరిమితమైంది. గత ఎన్నికల్లో ఏడు స్థానాలకు పరిమితమైన కాంగ్రెస్ పార్టీ ఈ ఎన్నికల్లో 15 స్థానాల్లో గెలుపొందింది. డిఎంకె 2 స్థానాల్లో గెలుపొందింది. అన్నాడిఎంకె 4 స్థానాల్లో గెలిచింది. ఇతరులు ఒక స్థానాన్ని గెలుచుకున్నారు. కాంగ్రెస్ పార్టీ ఈ ఎన్నికల్లో డిఎంకె మద్దతుతో ప్రభుత్వాన్ని ఏర్పాటు చేయబోతోంది.

పార్లమెంటరీ పార్టీలన్నీ కూడా ప్రజల మౌలిక సమస్యలు పరిష్కరించకుండా తాము అధికారంలోకి రావడానికి మాత్రమే తమదైన పద్ధతిలో ముందుకుపోతున్నాయి. కాంగ్రెస్ పాలన అంతా కూడా వారసత్వ రాజకీయాలను పెంచిపోషించింది. కాంగ్రెస్ అమలులోకి తెచ్చిన ఆర్థిక సంస్కరణలు ప్రజలకు మేలుచేయక పోగా ప్రజల మధ్య అంతరాలకు దారితీశాయి. విదేశీ పెట్టుబడులు, ఉత్పత్తులు దేశంలోకి ఇబ్బడి ముబ్బడిగా రావడంతో ప్రభుత్వ రంగ సంస్థలు మూసివేయడమో, ప్రైవేటు రంగానికి అప్పగించడమో జరిగింది. దేశీయ కుటీర పరిశ్రమలు చితికిపోయాయి. వ్యవసాయరంగం మొత్తం విదేశీ గుత్త సంస్థల చేతుల్లోకి వెళ్లింది. దీంతో ఆయా రంగాల్లో ఉపాధి పొందుతున్న కోట్లాది ప్రజలు నిర్వాసితులై నిలువనీడ లేక వలసబాట పడుతున్నారు. రైతాంగం అప్పులు తీర్చలేక ఆత్మహత్యలకు పాల్పడుతున్నారు. దీనికి తోడు కాంగ్రెస్ పాలనా కాలంలో జరిగిన వేలకోట్ల అవినీతి కుంభకోణాల కారణంగానే కాంగ్రెస్‌ను క్రమంగా ప్రజలు అధికారానికి దూరంచేస్తున్నారు. కాంగ్రెస్ అమలు చేసిన సామ్రాజ్యవాద అనుకూల విధానాలనే బిజెపి అమలు చేస్తుంది కాబట్టి బిజెపిని కూడ అధికారానికి దూరం చేస్తారు. ప్రజల నిరాదరణ

# ఉత్తరాఖండ్‌లో బిజెపికి పరాభవం

***ఉత్తరాఖండ్‌లో రాష్ట్రపతి పాలన విధింపు, రద్దు వంటి పరిణామాల నేపథ్యంలో కేంద్రంలో అధికారంలో ఉన్న పార్టీలు, విపక్షాల అధికారంలో ఉన్న రాష్ట్ర ప్రభుత్వాలను కూల్చడానికి ఆర్టికల్ 356ని ఎట్లా దుర్వినియోగం చేస్తున్నాయో వివరిస్తున్నారు ఎ. నర్సింహారెడ్డి***

ఉత్తరాఖండ్ అసెంబ్లీకి 70 ఎంఎల్ఎ స్థానాలున్నాయి. 2012లో ఉత్తరాఖండ్ అసెంబ్లీకి ఎన్నికలు జరిగాయి. ఈ ఎన్నికల్లో కాంగ్రెస్ 36 స్థానాల్లో, బిజెపి 28 స్థానాల్లో గెలుపొందాయి. బిఎస్‌పికి 2 స్థానాలు, స్వతంత్ర అభ్యర్థులకు 3 స్థానాలు, ఉత్తరాఖండ్ క్రాంతి దళ్(పి)కి ఒక స్థానం దక్కాయి. కాంగ్రెస్ పార్టీకి చెందిన హరీశ్ రావత్ ముఖ్యమంత్రి అయ్యారు. 2016 జనవరిలో కాంగ్రెస్‌కు చెందిన 9 మంది ఎంఎల్ఎలు రావత్‌పై తిరుగుబాటు చేసి ఫిరాయింపుకు పాల్పడ్డారు. దీంతో కాంగ్రెస్ బలం 27కి పడిపోయింది. ముఖ్యమంత్రి రావత్‌ను గద్దె దించడమే లక్ష్యంగా వీరు పావులు కదిపారు. విపక్షాలు అధికారంలో ఉన్న రాష్ట్రాల్లో అసమ్మతిని రాజేసి ప్రభుత్వాలను కూల్చే అప్రజాస్వామిక చర్యలకు కేంద్రం ఒడిగట్టింది. గతంలో అరుణాచల్ ప్రదేశ్‌లో ఇలాంటి ప్రయోగాన్నే చేసి సఫలమయింది. ఇప్పుడు ఉత్తరాఖండ్‌లో 9 మంది ఫిరాయింపు ఎంఎల్ఎలను బిజెపి పంచన చేర్చుకుంది. దీంతో ప్రధాన పార్టీల బలాబలాల్లో మార్పు వచ్చింది. ఈ తతంగం వెనుక బిజెపి కేంద్ర ప్రభుత్వ హస్తముందన్నది బహిరంగ రహస్యమే.

ఉత్తరాఖండ్ అసెంబ్లీలో 2016-17 బడ్జెట్‌కు సంబంధించిన ద్రవ్య వినియోగ బిల్లు మూజువాణి ఓటుతో మార్చ్ 18న ఆమోదం పొందిందని స్పీకర్ గోవింద్ సింగ్ కుఞ్వాల్ ప్రకటించడాన్ని సవాల్ చేస్తూ కాంగ్రెస్ అసమ్మతి వర్గం, బిజెపి ఎంఎల్ఎలు రాష్ట్ర గవర్నర్‌ను కలిశారు. రావత్ ప్రభుత్వాన్ని రద్దు చేయాలని కోరారు. రావత్ తన బలాన్ని నిరూపించుకునేందుకు గవర్నర్ మార్చ్ 28 వరకు గడువు ఇచ్చారు. అనర్హతకు గురైన తొమ్మిది మంది కాంగ్రెస్ రెబల్స్‌ను మినహాయిస్తే ప్రస్తుతం అసెంబ్లీలో కాంగ్రెస్‌కు మిత్ర పక్షాలతో కలిసి 33 మంది ఎంఎల్ఎలు ఉన్నారు. కాంగ్రెస్ రెబల్స్‌తో కలిసి బిజెపికి 37 మంది ఎంఎల్ఎల బలం ఉంది. అయితే స్పీకర్ తొమ్మిది మంది ఎంఎల్ఎలను అనర్హులుగా ప్రకటించాడు. దీంతో రెబల్స్, బిజెపి హైకోర్టును ఆశ్రయించడంతో వివాదం న్యాయస్థానానికెక్కింది. మార్చ్ 28లోగా బల నిరూపణ చేసుకోవాలని రావత్ ప్రభుత్వాన్ని హైకోర్టు ఆదేశించినా... అంతవరకూ ఓపిక పట్టలేని కేంద్ర ప్రభుత్వం ఉన్నట్టుండి మార్చ్ 27న రావత్ ప్రభుత్వాన్ని బర్తరఫ్ చేసి 'సుప్తచేతనావస్థలో'కి పంపింది.

---

జాతీయ పార్టీలతో ప్రారంభమైనా ప్రాంతీయ పార్టీలకు కూడా అది విస్తరిస్తుంది. అది క్రమంగా మౌలికమైన మార్పువైపుకు దారితీస్తుంది. ఎందుకంటే ఈ పార్టీలేవీ ప్రజల మౌలిక సమస్యలను పరిష్కరించలేవనేది వాటి అవినీతిపాలన అవి ఎంచుకునే తలకిందుల 'అభివృద్ధి' తెలియజేస్తోంది.

రాష్ట్రాల్లో అధికారంలోకి రావడానికి ఢిల్లీ, బిహార్‌లో ప్రదర్శించిన మతోన్మాద దూకుడును బిజెపి తగ్గించుకుంది. ఆయా రాష్ట్రాలలో స్థానికంగా బలహీనంగా ఉన్న పార్టీలను కలుపుకుని, హిందూ ఓటు బ్యాంకును సమీకరించుకునే ఎత్తుగడ అవలంబిస్తోంది. అట్లాగే నగరాలను కేంద్రంగా చేసుకుని మత ప్రాతిపదికన దీర్ఘకాలిక దృష్టితో పావులు కదుపుతోంది. ప్రజల్ని మత ప్రాతిపదికన విభజించడానికి వచ్చిన ప్రతీ అవకాశాన్ని బిజెపి వాడుకుంటున్నది. ప్రజల మధ్యనున్న వైరుధ్యాలను, వెనుకబాటు తనాన్ని, మూఢ విశ్వాసాలను తనకు అనుకూలంగా మలుచుకుంటోంది. ఇదంతా ఇప్పటికిప్పుడు సీట్లుగా మారకపోయినా, 2019 పార్లమెంట్ ఎన్నికల్లో అది తన ఫాసిస్టు పద్ధతులను అమలుపరిచి అధికారంలోకి రావడానికి ప్రయత్నాలు మొదలుపెట్టింది.

ప్రాంతీయ పార్టీల విషయానికి వస్తే అవి ఆయా సందర్భాలలో ఒక లక్ష్యంతో వచ్చాయి. అవి క్రమంగా వాటి లక్ష్యాలకు దూరంగా వెళుతున్నాయి. దేశ వనరులను విదేశీ గుత్త పెట్టుబడి సంస్థలకు కట్టబెట్టడంలో అవి జాతీయ పార్టీలతో పోటీ పడుతున్నాయి. ఈ క్రమంలో దేశ ప్రజల ప్రయోజనాలు అప్రధానమై పోతున్నాయి. పార్లమెంటరీ పంథాను అనుసరిస్తున్న పార్టీలన్నీ కూడా దేశ సంపదను విదేశీ కార్పొరేట్ సంస్థలకు కట్టబెట్టడంలో పోటీపడుతున్నాయి.

ఎన్నికల ఫలితాలను గమనిస్తే జాతీయ పార్టీలు, ప్రాంతీయ పార్టీలు అధికారం కోసం అవకాశవాద పొత్తులు పెట్టుకొని ఎన్నికల్లో గెలుపే ప్రజామోదంగా భావిస్తున్నాయి. ఏ పార్టీకి కూడా ఒంటరిగా అధికారంలోకి రాలేని పరిస్థితి ఉందంటే, ప్రజలు ఏ ఒక్క పార్టీని కూడా విశ్వసించడంలేదు. అన్ని పార్టీలు ప్రజలను ఓటు బ్యాంకుగా మాత్రమే చూస్తున్నాయి. గెలిచిన పార్టీలకు ఓడిన పార్టీలకు ఓట్ల శాతంలో పెద్ద తేడా ఏమి లేదు. అసలు పోలైన ఓట్లు నూటికి నూరు శాతం లేవు. అందులో ఈ ఎన్నికల్లో గెలిచిన పార్టీల్లో అత్యధికంగా పోలైంది 44.8 శాతం వీరే మెజారిటీ ప్రజల పై అధికారాన్ని కలిగి ఉంటారు. ఈ గెలుపుకోసం వందల కోట్లు ఖర్చు పెట్టి అధికారంలోకి వచ్చిన పార్టీలకు ప్రజల ప్రయోజనాలు ఎందుకు ప్రధానమవుతాయి? ఈ విధంగా అధికారంలోకి వచ్చిన పాలకులు దేశ ప్రజలకు ఉపయోగపడాల్సిన సమస్త వనరులను విదేశీ సంస్థలిచ్చే కమీషన్లకు తలొగ్గి వాటికి ధారాదత్తం చేస్తున్నారు. దేశ వనరులు ఈ దేశ ప్రజలకు దక్కాలని పోరాడుతున్న ఆదివాసులను, వారికి అండగా నిలుస్తున్న ఉద్యమకారులను అసాంఘిక శక్తులుగా, దేశ ద్రోహులుగా చిత్రిస్తూ తీవ్ర హింసను ప్రయోగిస్తున్నారు. దేశ ప్రజల ఆకాంక్షలకు అనుగుణంగా దేశ వనరులను కాపాడడం కోసం ఉద్యమిస్తున్న ఆదివాసీల పక్షాన నిలువడం ఈ దేశ పౌరులు ప్రతి ఒక్కరు తమ కర్తవ్యంగా స్వీకరించాలి.

*(రచయిత వీక్షణం సహాయ సంపాదకుడు)*

రాష్ట్రపతి పాలన విధించడానికి కారణంగా రావత్ ఎంఎల్ఎల కొనుగోలుకు ప్రయత్నిస్తున్నట్టు చూపే 'స్టింగ్' వీడియోను చూపింది. ద్రవ్య వినియోగ బిల్లు విషయంలో స్పీకర్ వైఖరిని, 9 మంది తిరుగుబాటు ఎంఎల్ఎలను అనర్హులుగా ప్రకటిస్తూ ఆయన తీసుకున్న నిర్ణయాన్ని కూడా ఎత్తిచూపింది. ఈ కారణాలు హేతుబద్ధమైనవే అనుకున్నా... ఒక ప్రభుత్వాన్ని రద్దు చేయడానికి అవసరమైన ప్రాతిపదికను అవి ఎలా ఏర్పరచగలవో అనూహ్యం. వీడియోలోని సంభాషణలు వాస్తవమైనవో, కాదో ఫోరెన్సిక్ నిపుణులు తేల్చాలి. బలపరీక్ష సమయంలో స్పీకర్ తీరు ఎలా ఉంటుందో వేచి చూడాలి. ఆయన సక్రమంగా వ్యవహరించలేదనుకుంటే కోర్టులో సవాల్ చేయడానికి ఎటూ అవకాశం ఉండేది. ఈలోగానే 356వ అధికరణ ఉపయోగించడం తొందరపాటు చర్య అని, సర్వోన్నత న్యాయస్థానం గతంలో ఇచ్చిన తీర్పునకు విరుద్ధమని కేంద్రంలోని పెద్దలకు అనిపించకపోవడం ఆశ్చర్యకరం.

రాష్ట్ర శాసనసభకు సభాపతులుగా ఎన్నికయ్యాక తటస్థంగా, నిష్పక్షపాతంగా ఉండవలసిన దానికి విరుద్ధంగా వ్యవహరిస్తున్నారని వస్తున్న ఆరోపణల్లో అవాస్తవమేమీ లేదు. అది అన్నిచోట్లా బాహాటంగానే కనబడుతోంది. ఆంధ్రప్రదేశ్ అసెంబ్లీలో అవిశ్వాస తీర్మానం విషయం లోనూ, ద్రవ్య వినియోగ బిల్లు విషయంలోనూ విపక్ష వైఎస్ఆర్ కాంగ్రెస్ ఓటింగ్‌కు పట్టుబట్టినా మూజువాణి ఓటుతో కానిచ్చేసిన తీరు అందరికీ తెలుసు. అలాగే తెలంగాణలో కాంగ్రెస్, టిడిపి పార్టీ టిక్కెట్ పైనా గెలిసి టిఆర్ఎస్ పార్టీలో చేరి మంత్రి పదవులు అనుభవిస్తున్నా స్పీకర్ ఫిరాయింపుగా గుర్తించి వారి సభ్యత్వాలను రద్దు చేయడంలో నిమ్మకు నిరేత్తినట్టు వ్యవహరించడం మనం చూస్తునే ఉన్నాము. గతంలో 356 అధికరణాన్ని దుర్వినియోగం చేయడంలో కాంగ్రెస్ ఘనత తక్కువేమి కాదు. అధికారంలో ఉండగా కాంగ్రెస్ 356 అధికరణను దుర్వినియోగం చేసింది. ఇప్పుడు బిజెపి అదే పని చేస్తోంది. ఉత్తరాఖండ్ విషయంలో జాతీయ పార్టీలైన కాంగ్రెస్, బిజెపి రెండూ ఒకరినొకరు నిలదీసుకోవడం వలన ఫలితముండదు. ప్రజాస్వామిక వ్యవస్థను సుస్థిర పరచడంలో తమ బాధ్యతలను గుర్తెరిగి వ్యవహరించకపోతే న్యాయవ్యవస్థ ముందు, ప్రజల ముందు అబాసుపాలు కాక తప్పదు.

చట్టబద్ధంగా ఎన్నికైన ప్రభుత్వ బాధ్యతను చేపట్టిన రాష్ట్ర ప్రభుత్వాలను కేంద్ర ప్రభుత్వం రద్దు చేసి రాష్ట్రపతి పాలన విధించడానికి, రాజ్యాంగంలోని 356 అధికరణ అనేకసార్లు దుర్వినియోగం అయింది. నిజానికి అసెంబ్లీలో ఏ పార్టీ మెజారిటీ పొందలేకపోయినప్పుడు లేదా రాజ్యాంగ ఉల్లంఘన జరిగినప్పుడు మాత్రమే అత్యంత అరుదుగా ఆచితూచి 356 అధికరణాన్ని ఉపయోగించాల్సి ఉంది. 1994లో బొమ్మయి కేసులో సుప్రీంకోర్టు 356 అధికరణానికి ఉన్న పరిమితులను స్పష్టంగా వివరించింది. రాష్ట్ర మంత్రివర్గానికి మెజారిటీ సభ్యుల మద్దతు ఉన్నదా లేదా అనేది తేల్చవలసింది అసెంబ్లీలో బలపరీక్ష ద్వారా మాత్రమే అని స్పష్టం చేసింది. మంత్రివర్గానికి బలం ఉన్నదా లేదా అనేది ఒకరి (గవర్నర్ లేదా రాష్ట్రపతి) వ్యక్తిగత అభిప్రాయం కాదని కూడా వివరించింది. అయినా మోడీ ప్రభుత్వం సంకుచిత రాజకీయ ప్రయోజనాలకే ప్రాధాన్యతనిచ్చింది.

మార్చ్ 27న ఉత్తరాఖండ్‌లో రాష్ట్రపతి పాలన విధించడంతో అక్కడ అనేక కీలక పరిణామాలు చోటుచేసుకున్నాయి. ఉత్తరాఖండ్ ముఖ్యమంత్రి రావత్ హైకోర్టును ఆశ్రయించారు. కేంద్ర ప్రభుత్వ నిర్ణయాన్ని హైకోర్టు తీవ్రంగా తప్పుపట్టింది. ఇదంతా సుప్రీంకోర్టు నిర్దేశిత నిబంధనలకు విరుద్ధంగా జరిగిందని తేల్చిచెప్పింది. 'వారం రోజులపాటు రాష్ట్రపతి పాలన ఎత్తివేస్తామని లిఖితపూర్వక హామీ ఇవ్వలగరా? అలాగైతే, తీర్పును వాయిదా వేస్తాం' అని హైకోర్టు ధర్మాసనం కేంద్రం తరపు న్యాయవాదిని అడిగింది. 'అలాంటి హామీ ఇచ్చేది లేదు' అని అక్కడికక్కడే కేంద్రం తరపు న్యాయవాది హాలులోనే తెలిపాడు. ఆ వెంటనే ధర్మాసనం తన తీర్పు వెలువరించింది. రాష్ట్రపతి తన రాజకీయ వివేచన ఆధారంగా ఈ నిర్ణయం తీసుకున్నారని అటార్నీ జనరల్ అన్నప్పుడు, రాష్ట్రపతికి గవర్నర్ నివేదించిన అంశాలపై న్యాయస్థానం చేసిన విశ్లేషణ ఎంతో ముఖ్యమైనది.

మార్చ్ 18 నాటి నివేదికలో కానీ, ఆ మర్నాటి గవర్నర్ లేఖలో కానీ బడ్జెట్‌పై ఓటింగ్‌లో ముప్పై ఐదు మంది ఎంఎల్ఎలు డివిజన్ కోరిన విషయమే లేనందున, ఆయన వివేచనకు ఆధారాలు ఇంకేమిటన్నది న్యాయస్థానం ప్రశ్నించింది. గవర్నర్ తన నివేదికలో రాష్ట్రపతి పాలన సిఫారసు చేయలేదు. రాష్ట్రంలో రాజ్యాంగ వ్యవస్థ విఫలమైందని అనలేదు. గవర్నర్‌కు అలా తోచిన దాఖలాలు ఎక్కడా లేవు. సభ్యుల డివిజన్‌ను నిరాకరించడమే రాష్ట్రపతి పాలనకు దారితీసిన ఏకైక కారణమని ఒకవేళ అనుకున్న పక్షంలో కూడా, గవర్నర్ ఆ విషయమే ప్రస్తావించనప్పుడు రాష్ట్రపతికి ఎలా తెలుస్తుంది? అన్నది వివేచనతో కూడిన ప్రశ్న. కేవలం ఈ ఒక్క కారణమే రాష్ట్రపతి పాలన విధించడానికి సరిపోతుందా అన్నది వేరే ప్రశ్న. రాష్ట్రపతికి గవర్నర్ పంపిన నివేదికనూ, లేఖనూ తనకు సమర్పించాల్సిందిగా గతంలో కఠినంగా ఆదేశించి సీల్డు కవర్లో అందుకున్న హైకోర్టుకు వివిధ అంశాలపై స్పష్టమైన అవగాహన ఏర్పడింది. ఈ కారణంగానే, కోర్టు ముందున్న ఆధారాలకూ, రాష్ట్రపతి నిర్ణయం తీసుకొనే సమయంలో ఉపకరించిన అంశాలకూ ఏమాత్రం పొంతన లేదని, అలాగే నివేదికలు ఇచ్చే సమయానికి గవర్నర్‌కు పరిస్థితులపై పూర్తి అవగాహన లేదనీ పలుమార్లు అటార్నీ జనరల్ నానారకాలుగా సర్దుకోవలసి వచ్చింది.

కేంద్ర ప్రభుత్వ వైఖరిని తీవ్ర పదజాలంతో హైకోర్టు దునుమాడింది. కేంద్ర ప్రభుత్వ నైతిక భ్రష్టతను ఎత్తిచూపింది. విశేషమైన, సంచల నాత్మకమైన వ్యాఖ్యానం చేసింది. 'జనం ఎండ, వాన, చలి, మంచును లెక్క చేయకుండా ఓటు చీటి పట్టుకుని, పోలింగ్ బూత్ ముందు నిల్చుని ప్రభుత్వాలను ఎన్నుకొంటున్నారు. ఆ 'బలహీనుడి'లోని నమ్మకాన్ని చంపేస్తారా? రాష్ట్ర ప్రభుత్వాలను వదిలించుకోవడం, ప్రజాస్వామ్య బద్ధంగా ఎన్నికైన వాటిని కూకటి వేళ్లతో పెకలించడం, భయాందోళనలు సృష్టించడం... మీ అంతర్యం ఇదేనా? ఉత్తరాఖండ్ ప్రభుత్వాన్ని రద్దు చేయడం లేక తాత్కాలికంగా సస్పెండ్ చేయడం... ఏదైనా సరే! మా ఉద్దేశం ప్రకారం ఇది ప్రజాస్వామ్య పద్ధతిలో, ప్రక్రియలో భాగస్వాములైన పౌరుల గుండెల్లో వ్యవస్థ పట్ల విద్వేషాన్ని మొలకెత్తిస్తుంది. సమాఖ్య స్ఫూర్తి పునాదులను కదిలిస్తుంది. ప్రజాస్వామ్య విలువను దిగజారుస్తుంది' అని ధర్మాసనం తీవ్ర వ్యాఖ్యలు చేసింది. పార్టీ ఫిరాయించిన తొమ్మిది మంది కాంగ్రెస్ ఎంఎల్ఎలపై స్పీకర్ విధించిన అనర్హత వేటును సమర్థించింది. 'పార్టీ ఫిరాయిస్తూ వారు చేసిన రాజ్యాంగ దోషానికి తగిన ఫలితం అనుభవించాల్సిందే' అని వ్యాఖ్యానించింది. ఈ తీర్పు చూసైనా తెలుగు రాష్ట్రాల ముఖ్య మంత్రులకు, ఫిరాయింపులకు పాల్పడిన ఎంఎల్ఎలకు జ్ఞానోదయం కలిగితే బాగుండు.

ఉత్తరాఖండ్‌లో విధించిన రాష్ట్రపతి పాలనను న్యాయ సమీక్షకు అస్కారం లేదన్న కేంద్రం వాదనను ధర్మాసనం తోసిపుచ్చింది. 'ఇది

కేవలం హరీశ్ రావత్ ప్రభుత్వానికి సంబంధించిన విషయం కాదు. మొత్తం ప్రజాస్వామ్యానికి సంబంధించినది. రాష్ట్రపతి పాలన విధించేందుకు తగిన ప్రాతిపదిక, బలమైన కారణం కనిపించలేదు. ఇది కచ్చితంగా న్యాయ సమీక్షకు అర్హమే' అని ధర్మాసనం స్పష్టం చేసింది. హరీశ్ రావత్ ప్రభుత్వాన్ని పునరుద్ధరిస్తున్నట్లు ప్రకటించింది. ఈ తీర్పుపై సుప్రీంకోర్టుకు వెళతామని, అప్పటిదాకా తన తీర్పుపై 'స్టే' విధించాలని కేంద్రం తరపు న్యాయవాది చేసిన అభ్యర్థనను తోసిపుచ్చింది. 'ఇప్పుడు ఉత్తరాఖండ్‌లో రాష్ట్రపతి పాలనేం లేదు. రాష్ట్ర ప్రభుత్వాన్ని పునరుద్ధ రించాం. ఇప్పటికిప్పుడే తీర్పు చెప్పే తప్పనిసరి పరిస్థితి మీరే సృష్టించారు. మమ్మల్ని మోసం చేస్తామంటే కుదరదని ముందే' స్పష్టంగా చెప్పాం. 'ఈ విషయాన్ని విస్తృతమైన కోణంలో చూడాలి. రాష్ట్రాల సమాహారమే భారతదేశం. కేంద్రం, రాష్ట్రాలూ రెండూ వాటివాటి నిర్దిష్ట కోణాల్లో సార్వభౌమాధికారం ఉన్నవే' అని ధర్మాసనం తెలిపింది. 'ఒక్కటి మాత్రం సుస్పష్టం. మరేమార్గం లేనప్పుడు, అంతిమ అవకాశంగానే ఆర్టికల్ 356ను ప్రయోగించాలి. అదికూడా, అత్యంత జాగ్రత్తగా" అని తెలిపింది.

ఉత్తరాఖండ్ హైకోర్టు తన తీర్పులో రాష్ట్రపతి పాలన చెల్లదని ఏప్రిల్ 21న తీర్పు చెబుతూ ఈ సమస్యను ప్రజాస్వామిక దృక్కోణంలో పరికించింది. రాష్ట్రపతి పాలన విధించిన పరిస్థితిని ప్రజాస్వామ్యం, సమాఖ్యతత్వం, చట్టబద్ధపాలన వంటి విస్తృత కోణంలో చూడాలని ఈ తీర్పులో పేర్కొన్నది. నిష్పక్షపాతంగా ఉండవలసిన కేంద్ర ప్రభుత్వం ప్రైవేటు సంస్థ మాదిరిగా వ్యవహరిస్తున్నదని తప్పు పట్టింది. ఉన్నత (రాష్ట్రపతి) స్థాయిలో నిర్ణయం తగినంత జాగరూకతతో జరగలేదని, కేంద్రం అసత్యాలను ఆశ్రయించిందని హైకోర్టు తీవ్రంగా అభిశంసించింది. ఇటువంటి నిర్ణయాల వల్ల ప్రజలలో అనుమానాలు పెరిగి వ్యవస్థ పట్ల నమ్మకం కోల్పోవలసి వస్తుందని న్యాయస్థానం హెచ్చరించింది. అదే సమయంలో మా తీర్పు కాంగ్రెస్ పార్టీకి మెజారిటీ ఉన్నదని చెప్పడం లేదు. ముఖ్యమంత్రిగా ఉన్న రావత్‌పై వచ్చిన అవినీతి ఆరోపణలను కోర్టు సమర్థించినట్టు కాదని కోర్టు స్పష్టం చేసింది. ప్రజలు ఎన్నుకున్న రాష్ట్ర ప్రభుత్వాన్ని అవినీతి ఆరోపణలతో, ఇతరత్రా సాకులతో కేంద్రం రాష్ట్ర ప్రభుత్వాన్ని రద్దు చేయకూడదని హైకోర్టు స్పష్టం చేసింది. రావత్ ప్రభుత్వం అసెంబ్లీలో విశ్వాస పరీక్షను మార్చ్ 28న ఎదుర్కోవలసి ఉండగా, కేంద్రం హటాత్తుగా ఒక రోజు ముందు అంటే మార్చ్ 27న రాష్ట్ర ప్రభుత్వాన్ని రద్దు చేసి, రాష్ట్రపతి పాలన విధించడమే తప్పు. ప్రభుత్వానికి మెజారిటీ ఉన్నదా లేదా అనేది తేల్చడానికి గల ఒకే ఒక్క రాజ్యాంగబద్ధ మార్గం అసెంబ్లీలో విశ్వాస పరీక్ష జరపడమే అని హైకోర్టు స్పష్టంగా చెప్పింది.

చట్టాలకు, రాజ్యాంగ స్ఫూర్తికి విరుద్ధంగా ఎవరు ప్రవర్తించినా చర్య తీసుకోవడానికి న్యాయస్థానాలున్నాయి. ఉత్తరాఖండ్‌లో ఏడాది వ్యవధిలో ఎటూ అసెంబ్లీ ఎన్నికలు రాబోతున్నాయి. అసెంబ్లీలో బలపరీక్షను జరగనిచ్చి అక్కడ అన్యాయం జరిగిందనుకున్న పక్షంలో న్యాయస్థానం గడప తొక్కి ఉంటే పద్ధతిగా ఉండేది. విపక్షంలో ఉండి తామే అనేకసార్లు తీవ్రంగా వ్యతిరేకించిన, తప్పుబట్టిన 356 అధికరణాస్త్రాన్ని ఇలాంటి సమయంలో ప్రయోగించడం నైతికంగా సరికాదని ఎన్‌డిఏ ప్రభుత్వంలోని పెద్దలు భావించకపోవడం వింత. ఎస్ఆర్ బొమ్మై కేసులో సుప్రీంకోర్టు వెలువరించిన తీర్పు తర్వాత రాష్ట్రపతి తీసుకున్న నిర్ణయాలు న్యాయ సమీక్షకు లోబడే ఉంటాయని స్పష్టమైంది. ఆ సంగతి కేంద్ర ప్రభుత్వంలోని పెద్దలకు తెలియదనుకోవడానికి ఎలాంటి ఆస్కారం లేదు.

ఉత్తరాఖండ్ హైకోర్టు తీర్పు కేంద్రాన్ని ఇరకాటంలో పడేసింది. హైకోర్టు తీర్పును కేంద్రం సుప్రీంకోర్టులో సవాలు చేసింది. ఉత్తరాఖండ్ కేసులో సుప్రీంకోర్టు ఏప్రిల్ 22న హైకోర్టు ఉత్తర్వును స్టే చేసింది అదే సమయంలో రాష్ట్రపతిపాలన విధించడంపై దీపక్ మిశ్రా, శివకర్తి సింగ్‌లతో కూడిన ధర్మాసనం కేంద్రానికి ఏడు ప్రశ్నలను సంధించింది. అవి 1) సభలో బలపరీక్ష జరపాల్సిందిగా అధికరణం 175 (2) కింద గవర్నర్ సందేశం పంపడం సరైనదేనా? 2) గవర్నర్, స్పీకర్ రెండూ రాజ్యాంగ పదవులే అయినప్పుడు సభలో ఓటింగ్ జరపాల్సిందిగా అసెంబ్లీ స్పీకర్‌ను గవర్నర్ ఆదేశించవచ్చా? 3) సభలో బలపరీక్ష నిర్వహణలో జాప్యం ఏర్పడితే రాష్ట్రపతి పాలన విధించేందుకు అది ప్రాతిపదిక అవుతుందా? 4) ద్రవ్యబిల్లు వీగిపోతే సర్కారు పడిపోయినట్టే అనేది సంప్రదాయం. కానీ బిల్లు వీగిపోయిన సంగతి స్పీకర్ కాకుండా ఇంకెవరైనా ప్రకటించేందుకు వీలుందా? 5) ద్రవ్య వినిమయ బిల్లు ఏదశలో ఉంది? రాష్ట్రపతి పాలన ప్రమేయం ఇందుకు సంబంధించి ఏదశలో వస్తుంది? 6) ఎంఎల్‌ఎలను స్పీకర్ అనర్హులుగా ప్రకటించడానికి 356 అధికరణం కింద రాష్ట్రపతి పాలన విధించడానికి ఏమైనా సంబంధం ఉందా? 7) ఉత్తరాఖండ్‌లో రాష్ట్రపతి పాలన విధించే సందర్భంగా ఆ రాష్ట్ర అసెంబ్లీలో జరిగిన వ్యవహారాలను పరిగణనలోకి తీసుకున్నారా?

సుప్రీంకోర్టు కేంద్ర-రాష్ట్ర ప్రభుత్వాల వాదనలు విన్న తర్వాత రావత్‌కు మే 10న అసెంబ్లీలో బలాన్ని నిరూపించుకునేందుకు అవకాశం ఇచ్చింది. అయితే అసమ్మతి ఎంఎల్‌ఎలు ఓటు వేసేందుకు అర్హులా? కాదా అన్నది హైకోర్టు తీర్పుపైనే ఆధారపడి ఉంటుందని స్పష్టం చేసింది. హైకోర్టు మే 9న తిరుగుబాటు ఎంఎల్‌ఎలను ఓటింగ్‌కు అనర్హులుగా ప్రకటించింది. సుప్రీంకోర్టు హైకోర్టు తీర్పును సమర్థించింది. సుప్రీంకోర్టు ఆదేశం ప్రకారం మే 10న బలపరీక్ష నిర్వహణ కోసం ఉదయం 11 నుండి మధ్యాహ్నం ఒంటి గంట వరకు రాష్ట్రపతి పాలనను సడలించారు. ఈ బలపరీక్ష నిర్వహణ ప్రక్రియను శాసన సభ వ్యవహారాల ముఖ్య కార్యదర్శి పర్యవేక్షించాలని, మొత్తం కార్యకలాపా లను వీడియో తీయాలని, ఫలితాన్ని స్టీల్ కవరులో మరుసటి రోజు ఉదయం 10:30 గంటలకు తమ ముందుంచాలని సుప్రీంకోర్టు ఆదేశించింది.

సుప్రీంకోర్టు ఆదేశాల మేరకు మే 10న జరిగిన విశ్వాస పరీక్షలో రావత్ 33 మంది ఎంఎల్‌ఎల మద్దతు (కాంగ్రెస్ 25, పిడిఎఫ్ 6, బిజెపి రెబల్ 1, నామినేటెడ్ 1) పొందగా, బిజెపికి 27 మంది ఎంఎల్‌ఎల మద్దతు లభించింది. దీంతో రావత్ ప్రభుత్వం బలపరీక్షలో గట్టెక్కింది. కేంద్రంలోని మోడీ సర్కారుకు ఎదురు దెబ్బ తగిలింది. ఉత్తరాఖండ్ ఉత్కంఠ కొనసాగుతుండగానే బలపరీక్షకు ముందు రోజు ఆదరాబాదరాగా ఆ రాష్ట్ర బడ్జెట్‌కు సంబంధించిన బిల్లును లోక్‌సభలో ఆమోదింప చేయటం బిజెపి అధినాయకుల దుందుడుకు తనానికి నిదర్శనం.

ఉత్తరాఖండ్ పరిణామాలు ఎన్నో మలుపులు తిరిగి చివరికి సుప్రీంకోర్టు జోక్యంతో రాష్ట్రపతిపాలన రద్దు అయి రావత్ ప్రభుత్వం కొనసాగుతుంది. భారీ మెజారిటీతో అధికారంలో కూర్చున్నంత మాత్రానా దానిని అడ్డం పెట్టుకొని అప్రజాస్వామిక చర్యలకు ఓడిగడితే సాధ్యపడదని ఉత్తరాఖండ్ రుజువు చేసింది. ఈ మొత్తం పరిణామంలో హైకోర్టు, సుప్రీంకోర్టుల తీర్పులు అవకాశవాద రాజకీయాలకు చెంపపెట్టు అని చెప్పవచ్చు.

*(రచయిత ఉపాధ్యాయ నాయకులు, రాజనీతి శాస్త్ర విద్యార్థి)* వీ

# తెలంగాణలో విద్యా సంస్థల తనిఖీలు

***ఒకపక్క విద్యారంగంలో ప్రైవేటీకరణను ప్రోత్సహిస్తూ నియంత్రణ లేకుండా వ్యవహరిస్తున్న ప్రభుత్వం, మరోపక్క ప్రజలను భ్రమల్లో ఉంచడానికే విద్యా సంస్థలపై నామమాత్ర విచారణ పేరుతో కాలం గడుపుతోందని అంటున్నారు* బైరెడ్డి సతీష్**

సేవా దృక్పథంతోనో, సామాజిక బాధ్యతా అనే భావనతోనో ప్రైవేటు వ్యక్తులు ట్రస్టులను, సొసైటీలను ఏర్పాటు చేసి నిబద్ధతతో విద్యనందివ్వడం కొత్తదేమీ కాదు. రానురాను ప్రభుత్వాలు అనుసరిస్తున్న ఆర్థిక విధానాలు తీవ్రమైన సంస్కరణలతో కాదేదీ వ్యాపారానికి అనర్హం అన్నట్టు విద్యారంగంలో పెట్టుబడి ప్రవేశించింది.

1990లో ఊపందుకున్న ప్రపంచీకరణ, సరళీకరణ నేపథ్యంలో పునాది రంగంలో వచ్చిన తీవ్రమైన మార్పుల వల్ల విద్య మార్కెట్ వస్తువుగా మార్చబడి ప్రైవేటీకరణ జరిగిపోయి దేశవ్యాప్తంగా లక్షలకోట్ల వ్యాపార సామ్రాజ్యమైంది. మొత్తం విద్యావ్యవస్థనే శాసించే స్థితికి చేరుకున్నది. తన ప్రయోజనాలకు అనుగుణంగా విద్యా విధానాలను మార్చుకొనే ఆర్థిక, రాజకీయ ప్రాబల్యాన్ని సంపాదించుకున్నది.

తెలుగు రాష్ట్రాల్లోనూ ఈ స్థితిలో తేడా ఏమీ లేకపోగా, కార్పొరేట్ విద్యాసంస్థలు ఏర్పడి ప్రభుత్వ కనుసన్నుల్లోనే తిరుగులేని ఆధిపత్యాన్ని కనపరుస్తున్నాయి. అన్ని పార్టీల నాయకులు ఏదో ఒక ప్రైవేటు విద్యావ్యవస్థను నడపడమో లేదా విద్యాసంస్థల అధినేతలే రాజకీయ నేతలుగా అవతారమెత్తడం జరుగుతోంది. విషాధమేమిటంటే విద్యారంగంలో పచ్చివ్యాపారం చేసేవారిని మీడియా 'విద్యావేత్తలు'గా ప్రచారం చేయడం. మీడియా వ్యాపారానికి ఈ విద్యావ్యాపారులు మంచి వాణిజ్య ప్రకటనల వనరులుగా ఉండటమనే పరస్పర ప్రయోజనాల కోణాలున్నాయనుకోండి! ఇంతగా ఎదిగిపోయిన ఈ విద్యావ్యాపార వేత్తలకు, ప్రభుత్వ పెద్దలకు మధ్య తలెత్తే వైరుధ్యాలు 'ప్రజా ప్రయోజనాలు', 'ప్రమాణాల పెంపు' రూపంలో అప్పుడప్పుడు బయటపడుతుంటాయి. ఆ కోవలోకి వచ్చేదే తెలంగాణ ప్రభుత్వం ఏప్రిల్ 8న వెలువరించిన ప్రైవేటు విద్యాసంస్థల తనిఖీల ఉత్తర్వులు.

ఏ ప్రభుత్వానికైన తన పరిధిలోని ఏ విద్యాసంస్థనైన ఎప్పుడైన తనిఖీ చేసే చట్టబద్ధ అధికారం కలిగి ఉంటుంది. తెలంగాణ రాష్ట్ర ప్రభుత్వం ఏర్పడిన నాటి నుండి ప్రైవేటు విద్యాసంస్థలపై ప్రత్యేకించి ఇంజనీరింగ్ కళాశాలల నిర్వహణపై దృష్టినిలిపి నిబంధనలను ఉల్లంఘించి ప్రమాణాలు పాటించని అనేక కళాశాలలు మూతపడేలా చర్యలు తీసుకున్నది.

2008 నుండి అమలవుతున్న ఫీజు రీఇంబర్స్‌మెంట్ పుణ్యమా అని పుట్టగొడుగుల్లా అనేక వృత్తివిద్యా, సాధారణ కళాశాలలు పుట్టుకొచ్చాయి. ఇదే పథకం ప్రభుత్వ కళాశాలలను బలహీనపర్చిందనేది నిర్వివాదాంశం. అనేక ప్రాంతాల్లో ఇబ్బడి ముబ్బడిగా ఆ ప్రాంతాల విద్యావసరాలతో సంబంధం లేకుండా అవినీతి లావాదేవీలతో ఏ సదుపాయం లేకున్నా ప్రైవేటు విద్యాసంస్థలకు అనుమతులు జారీచేశారు. కళాశాలల్లో రికార్డుల నిర్వహణ, విద్యార్థుల హాజరు శాతం, అస్తవ్యస్తమైన ఆర్థిక వ్యవహారాల నిర్వహణ, ప్రయోగశాలలు లేకపోవడం, గ్రంథాలయా లంటే ఏంటో తెలియని కళాశాలలు కూడా ఉన్నాయి. అన్ని అర్హతలు కల్గిన బోధనా సిబ్బంది లేకపోవడం, కళాశాలలకు హాజరుకాని విద్యార్థులకు కూడా పూర్తిస్థాయిలో మినహాయింపునిచ్చి అనేక కళాశాలలు రీఇంబర్స్‌మెంట్‌ను పొందుతున్నాయి.

ఇలాంటి అవకతవకలకు అన్ని ప్రైవేటు విద్యాసంస్థలు పాల్పడక పోవచ్చు గానీ, ఏదో ఒక ఉల్లంఘునకు అన్ని సంస్థలు పాల్పడుతూనే ఉన్నాయి. ఈ నేపథ్యంలోనే తెలంగాణ ప్రభుత్వం ప్రమాణాల పెంపు, సౌకర్యాల మెరుగుదల, బోగస్ సంస్థల ఏరివేత లక్ష్యంగా తనిఖీలను ముమ్మరం చేసింది. ఈ తనిఖీలను వ్యతిరేకిస్తూ ప్రైవేటు విద్యాసంస్థల జెఎసి ఎంసెట్, టెట్ లాంటి పరీక్షలకు తమ సంస్థలను పరీక్షా కేంద్రాలుగా అనుమతివ్వమని తీవ్రంగానే ప్రభుత్వ చర్యను నిరసించాయి. తాము తనిఖీలకు వ్యతిరేకం కాదనీ, పోలీసుల చేత తనిఖీ చేయించడాన్ని వ్యతిరేకిస్తున్నామని హైకోర్టును ఆశ్రయించడంతో హైకోర్టు కూడా కేవలం తనిఖీ అధికారులకు పోలీసులు రక్షణగా మాత్రమే వెళ్లాలని ఆదేశించడంతో ఆ తతంగమంతా కొనసాగుతూనే ఉంది.

సాధారణంగా విద్యాశాఖ అధికారులు విద్యాపరమైన అంశాల పరిశీలనకు, విజిలెన్స్ ఎన్‌ఫోర్స్‌మెంట్ రెవెన్యూపరమైన అవకతవకలను పరిశీలించే నిమిత్తం వెళ్లే అధికారం ఉంది. అదేదో శాంతిభద్రతల అంశమన్నట్టు ప్రైవేటు సంస్థల్లోకి పోలీసులు ప్రవేశించడం ద్వారా భయభ్రాంతులకు గురిచేయడమే కాకుండా నైతికంగా దెబ్బతీసే అవకాశమూ లేకపోలేదు.

గత రెండు సంవత్సరాలుగా రీఇంబర్స్‌మెంట్ రూపంలో చెల్లించాల్సిన మూడు వేల కోట్ల రూపాయలు అందకపోవడంతో ప్రైవేటు సంస్థల నిర్వహణా భారం పెరిగి ఆ విద్యాసంస్థలు ఆర్థికపరమైన ఇబ్బందులను ఎదుర్కొంటున్న మాట వాస్తవం. ఆయా శాఖలకు సంబంధించిన అధికారులు, నిపుణులతో కూడిన తనిఖీని అభ్యంతరపెట్టాల్సిందేమీ లేదు. పోలీసులను భాగస్వాములను చేయడం ద్వారా సాధారణ తనిఖీలకు బెదిరింపు స్వభావాన్ని ఆపాధించినట్లయ్యింది. ఇది భవిష్యత్తులో మరిన్ని అవాంచితమైన పరిణామాలకు, పోలీసు ప్రత్యక్ష జోక్యానికి దారితీసే ప్రమాదముంది.

ఇప్పటికే దేశమంతటా కూడా విద్యాలయాల్లో ప్రత్యేకించి స్వయం ప్రతిపత్తి కలిగిన విశ్వవిద్యాలయాల్లో విద్యార్థుల న్యాయబద్ధమైన డిమాండ్ల సాధనలో భాగంగా చేసే ఉద్యమాలపైన కూడా ఆయా యూనివర్సిటీల పరిపాలనాధికారులు పోలీసుల విపరీతమైన జోక్యానికి అనుమతినిచ్చి

ప్రశాంత వాతావరణాన్ని కలుషితం చేస్తున్నారు. ప్రస్తుతం తెలంగాణ రాష్ట్రంలో ప్రైవేటు విద్యాలయాల్లో జరుగుతున్న ఈ తనిఖీల తతంగాల్లో సహితం పోలీసుల అవసరం లేకుండానే సమర్థవంతంగా, ప్రయోజనకరంగా నిర్వహించి ప్రతిపాదిత లక్ష్యాలను నెరవేర్చుకోవచ్చు.

అనవసరమైన పోలీసుల భాగస్వామ్యంతో విద్యాపరమైన అంశాలకు, ప్రమాణాలకు ప్రాముఖ్యత ఇవ్వడం కంటే ప్రభుత్వం ప్రైవేటు విద్యాసంస్థల్ని తమ చెప్పుచేతుల్లో ఉంచుకొనే ప్రయత్నం చేస్తుందనే సంకేతమే స్పష్టంగా కనిపిస్తుంది. ప్రభుత్వంపై ఆర్థిక భారాన్ని తగ్గించుకోవడానికో, ప్రమాణాలు, సౌకర్యాల మెరుగుదల పేరుతో చేపట్టిన ఈ తనిఖీలు కార్పొరేట్ విద్యాసంస్థలకు మేలుచేసే చర్యగానే కనబడుతుంది.

తెలంగాణ ఉద్యమ సందర్భంలో ఆంధ్రా కార్పొరేట్ కాలేజీలపై విరుచుకు పడినవారే ఇవాళ వాటిని కాపాడుతున్నారు. ఆ కార్పొరేట్ కాలేజీలే నిబంధనలను తుంగలో తొక్కి ఇష్టారాజ్యంగా వ్యవహరిస్తున్నా పాలకవర్గాలకు పట్టడం లేదు. ఫీజుల వసూళ్ళు, కాలేజీ పనిగంటలు పరిమితికి మించి సెక్షన్లు నడపడం, ప్రయోగశాలల లేమి, పరీక్ష ఫీజులను అధికంగా పిండుకోవడం, పదుల సంఖ్యల్లో కళాశాలలను ఒకేపేరుతో నడపడం, ఇంటర్మీడియట్ ప్రాక్టికల్ పరీక్షల్లో జంబ్లిగ్‌ను వ్యతిరేకించి తమకనుకూలంగా మార్చుకోవడం వంటి ఎన్ని ఉల్లంఘనలున్నా వాటిపైన ఎందుకు చర్యలు తీసుకోవట్లేదు, తనిఖీలు ఎందుకు చేయట్లేదనే ప్రశ్నలు సహజంగానే ఉత్పన్నమవుతాయి.

మొత్తంగా కార్పొరేట్ విద్యావ్యవస్థకు అనుకూలంగా వ్యవహరిస్తూ జీవనోపాధి కోసం నలుగురికి ఉపాధిని కల్పించే చిన్నస్థాయి ప్రైవేటు విద్యాసంస్థలపై తనిఖీలు అదీ పోలీసుల భాగస్వామ్యంతో చేయించడం ద్వారా కార్పొరేట్ కాలేజీలు తప్ప మరే ఇతర సాధారణ విద్యాసంస్థలు మనుగడ సాగించలేవు. ఇష్టారాజ్యంగా ఫీజులు పిండుకుంటూ, బోధనా సిబ్బందికి చాలీచాలనీ జీతాలిచ్చే అనేక ప్రైవేటు సంస్థలపై కూడా ఇటువంటి వైఖరే అవలంభించాలి.

సాధారణ ప్రజల ప్రయోజనాలు, సంక్షేమం దృష్ట్యా ఇటువంటి సంస్థలపై నిఘా ఉంచి నియంత్రణలో పెట్టాల్సిందే. రీఇంబర్స్‌మెంట్ చెల్లించకుండా, ఫీజులను నియంత్రించకుండా ప్రైవేటు సంస్థల్లో శ్రమదోపిడిని అరికట్టలేని ప్రభుత్వం తనిఖీల పేరుతో ప్రమాణాలను పెంపొందించలేదు. అసలు ప్రైవేటు విద్యాసంస్థల పుట్టుక, ఎదుగుదల లోనే ప్రభుత్వ పెద్దల అవినీతి ఉంటుంది.

ఓవైపు ప్రైవేటీకరణను, విద్యావ్యాపారాన్ని విచ్చలవిడిగా ప్రోత్సహిస్తూ ప్రైవేటు రంగమే ఉన్నత ప్రమాణాలతో కూడిన సేవలను అందిస్తుందనే భావజాలాన్ని ప్రభుత్వమే ప్రచారం చేస్తూ, మరోవైపు ప్రమాణాల పెరుగుదల కోసమే తనిఖీలు అని చెప్పడం హాస్యాస్పదం. ముందు తన ఇల్లు చక్కపెట్టుకోవడం మంచిది.

ఓవైపు ప్రభుత్వ రంగం కుప్పకూలిపోయేలా ప్రైవేటుకు అనుకూలమైన విధానాలను అనుసరిస్తూ మళ్ళీ ప్రమాణాల పెంపు అంటూ గోలపెట్టడం విడ్డూరంగా ఉంది.

కెజి టు పిజి ఉచిత విద్య ప్రాసగా ఆకర్శణీయంగా ఉన్నది కానీ గత రెండు సంవత్సరాల కాలంలో ఆ హామీని కార్యరూపంలోకి తీసుకొచ్చే ఒక్క చర్యను కూడా ప్రభుత్వం తీసుకోలేదు. అట్టహాసంగా ప్రచారం చేసుకుంటున్న ఈ అంశంలో ప్రభుత్వమే పెద్ద గందరగోళంలో ఉన్నది. గత రెండేళ్లుగా ఒక్క యూనివర్సిటీకి కూడా వి.సి.ని నియమించక పోవడంతో విశ్వవిద్యాలయాల నిర్వహణంతా అస్తవ్యస్తంగా తయారయ్యింది.

విద్యాశాఖలో ప్రత్యేకించి బోధనారంగంలో ఒక్క నియామకం కూడా జరగకపోవడంతో వేలాది లెక్చరర్ పోస్టులు అన్ని స్థాయిలో ఖాళీగా ఉండి బోధన కుంటుపడుతున్నది. ఇదిగో అదిగో అంటూ ప్రభుత్వం ఊరిస్తున్నదే తప్ప ఉపాధ్యాయ నియామకాలు ఎప్పుడవుతాయో తనకే తెలియక అయోమయంలో ఉన్నది.

పాఠశాల విద్యలో విద్యాసంవత్సరం ముగింపులో జరిగే పరీక్షలను ముందుగానే జరిపి నెలరోజుల సమయాన్ని వృథాపర్చి విద్యార్థుల్ని, ఉపాధ్యాయుల్ని ఎటువంటి ప్రయోజనకరమైన పనిలేకుండా వదిలేసింది. వేలసంఖ్యలో పాఠశాలల్ని మూసివేసే పరిస్థితికి తీసుకొస్తున్నది. ప్రభుత్వమే ప్రైవేటు వ్యవస్థను పెంచిపోషించటం, బెదిరించటం కంటే ప్రభుత్వ రంగ విద్యను బలోపేతం చేయడం మీద దృష్టి నిలపాలి.

ఓవైపు 6 నుండి 14 సంవత్సరాల వయస్సు పిల్లలకు ఉచిత నిర్బంధ విద్య అని విద్యాహక్కు చట్టం చెబుతున్నా నర్సరీ స్థాయిలో పిల్లల్ని మూడు సంవత్సరాల వయస్సులోనే ప్రైవేటు విద్యాసంస్థలు ఎగరేసుకుపోతుంటే ఆరవ ఏడు వచ్చేసరికి పిల్లలెవ్వరు ప్రభుత్వ పాఠశాలల ముఖం చూడటంలేదు. ఆరవ ఏట పాఠశాలల్లో ప్రవేశం అనే నిబంధనను ప్రభుత్వం సవరణకైనా ప్రయత్నించాలి లేదా ప్రైవేటు సంస్థలు ఖచ్చితంగా పాటించేలా వ్యవహరించాలి.

ప్రభుత్వ పాఠశాలల ఏర్పాటు, నిర్వహణపైన సవాలక్ష నియమాలు పాటించాలని చెప్పే ప్రభుత్వం ప్రైవేటు పాఠశాలలకు విచ్చలవిడిగా అనుమతినిచ్చే విధానానికి స్వస్తి పలకాలి. ఇప్పటికే ప్రైవేటు పాఠశాలల్లో 55 శాతం, కళాశాలల్లో 85 శాతం విద్యార్థులు విద్యనభ్యసిస్తు న్నారు. ఈ ప్రైవేటు సంస్థల పెరుగుదల కొనసాగితే వంద శాతం ప్రైవేటులోనే చదివే రోజులు దగ్గర్లోనే ఉన్నాయి. కెజి టు పిజి ప్రణాళికను అమలు జరిపేలోపు ఆ ప్రమాదమూ ముంచుకురావచ్చు.

ప్రభుత్వ కళాశాలల్లో బయోమెట్రిక్ పద్ధతి, సిసి కెమరాల ఏర్పాటు ప్రమాణాలు పెంచుతాయనుకోవడం ఒట్టి భ్రమ మాత్రమే. నిఘా పెరిగినంత మాత్రాన నాణ్యత పెరగదనే విషయాన్ని గమనించాలి. ప్రైవేటుకు మూకుతాడు వేయకుండా, విద్యావ్యాపారాన్ని అరికట్టకుండా ప్రభుత్వ విద్యారంగం పట్ల ప్రజల్లో విశ్వాసం పెంచేలా చర్యలు తీసుకోకుండా ఎన్ని పేర్లతో ప్రభుత్వ రంగంలో విద్యాసంస్థల్ని స్థాపించినా మనుగడ ప్రశ్నార్థకమే అవుతుంది.

*(రచయిత ఆంగ్ల ఉపన్యాసకులు)* వీ

***రచయితలకు సూచన :*** *తక్షణ, సమకాలీన అంశాలపై రచనలు చేసి ఆ సంచికలోనే రావాలనుకొనే రచయితలు 20వ తేదీ లోగా పంపగలిగితేనే మరుసటి నెల సంచిక కోసం పరిశీలించడం సాధ్యమవుతుంది. ఆ తరువాత వచ్చిన రచన, అంశం ఎంత ముఖ్యమైనదైనా పరిశీలించడం, ముద్రణకు సిద్ధం చేయడం అసాధ్యమవుతుంది. రచయితలు గుర్తించగలరు. – సం.*

# బ్రాండిక్స్ మహిళా కార్మికుల పోరాటం

***సెజ్‌లలో అమలవుతున్న కార్మిక వ్యతిరేక విధానాలకు, వాటికి అండగా నిలుస్తున్న ప్రభుత్వాలకు వ్యతిరేకంగా తమ హక్కుల కోసం మహిళా కార్మికులు చేసిన ఐక్య పోరాటాన్ని వివరిస్తున్నారు* పి.వి రమణ**

ఏప్రిల్ 30న విశాఖపట్నం, అచ్యుతాపురం ప్రత్యేక ఆర్థిక మండలిలో బ్రాండిక్స్ దుస్తుల కర్మాగారంలో తమ న్యాయమైన హక్కుల కోసం పోరాడుతున్న వేలాది మంది మహిళా కార్మికులపై పోలీసులు అతి కిరాతకంగా దాడి చేశారు. మహిళలనే విచక్షణ కూడా లేకుండా చీరలు లాగి, చింపేసి, దుస్తులూడదీసి దారుణంగా కొట్టారు. కార్పొరేట్ సంస్థలకు దన్నుకాస్తున్న చంద్రబాబు నాయుడు ప్రభుత్వంలో పోలీసులు ఎవరిపక్క ఉంటారో అన్నదాని మీద ఎటువంటి అనుమానం లేకుండా, తమ రాజభక్తిని ప్రకటించుకున్నారు. దాదాపు 300 మంది మహిళలను, కార్యకర్తలను, నాయకులను అరెస్టు చేశారు. 144 సెక్షన్ విధించామంటూ నలుగురిని కలవనివ్వకుండా చెదరగొట్టారు. తప్పించుకొని పారిపోతున్న మహిళా కార్మికులను ఈడ్చుకొని వాహనాలు ఎక్కించారు. అచ్యుతాపురం నుండి కంపెనీకి వెళ్లే రహదారిలో ఎక్కడికక్కడ చెక్‌పోస్టులను ఏర్పాటు చేశారు. ఆ మార్గంలో ఆటోలలో ప్రయాణించే మహిళలను అనుమానించి వెనక్కి పంపేశారు. సాధారణ ప్రయాణికులు కూడా భయంతో ప్రత్యామ్నాయ మార్గాలను చూసుకోవలసి వచ్చింది. గుంపుగా పదిమంది మహిళలు ఉంటే వారిని చెదరగొట్టి బస్సుల్లో స్టేషన్లకు తరలించారు.

విశాఖ జిల్లాలో అచ్యుతాపురంలో ఎ.పి.ఐ.ఐ.సి. ఆధ్వర్యంలో ఎస్ఇజెడ్ ఏర్పడింది. శ్రీలంకకు చెందిన బహుళజాతి కంపెనీ బ్రాండిక్స్‌కు 2005లో ఎకరాకు సంవత్సరానికి 1 రూపాయి చొప్పున 1000 ఎకరాలు కేటాయించారు. బ్రాండిక్స్, దాని అనుబంధ సంస్థలలో దాదాపు 24,000 మంది కార్మికులు పనిచేస్తున్నారు. వారిలో 90 శాతం మహిళా కార్మికులే. బ్రాండిక్స్ భారత దేశంలో స్త్రీల లోదుస్తుల ఎగుమతి కంపెనీగా ప్రసిద్ధి చెందింది. బ్రాండిక్స్ ఇండియా ఎపరల్ సిటీ (బిఐఎసి) పార్కులో పని ప్రారంభించి స్త్రీలకు సంబంధించిన లోదుస్తులు, టీషర్టులు, లెగిన్స్, ఇతర దుస్తులను ఇక్కడ తయారు చేసి అమెరికా, ఇంగ్లాండ్, యూరప్ దేశాలకు ఎగుమతి చేస్తున్నారు. ఈ పార్కులో 14 కంపెనీలు ఉన్నాయి. వీటన్నింటిలోను దాదాపు 22 వేల మంది కార్మికులు, మరో 2వేల మంది అధికారులు, సూపర్‌వైజర్లు పనిచేస్తున్నారు. కంపెనీ ప్రారంభించేటప్పుడు లక్షమందికి ఉద్యోగాలు కల్పిస్తామని కార్పొరేట్ సంస్థ ప్రకటించింది.

జిల్లాలోని దాదాపు 200 గ్రామాల నుండి వచ్చిన మహిళా కార్మికులు ఈ కంపెనీలలో పనిచేస్తున్నారు. ఉదయం 6 గంటల షిఫ్ట్ కోసం తెల్లవారు జామున 4 గంటలకే ఇంటి దగ్గర తయారవ్వవలసి వస్తుంది. పని గంటలు 9-10 వరకూ ఉంటాయి. ఈ కంపెనీలో మహిళా కార్మికులపై దుర్మార్గమైన అణచివేత కొనసాగుతుంది. సాధ్యంకాని టార్గెట్స్ పెట్టి వాటిని పూర్తిచేయలేదని అవమానకరంగా, అసభ్య పదజాలంతో తిడతారు. 'బ్రిటిష్ పాలనను తలపించే విధంగా బ్రాండిక్స్‌లో వెట్టిచాకిరి చేయిస్తున్నారు. టార్గెట్స్ పూర్తిచేయలేకపోతే ఇంటిలోని వారికి కూడా చెప్పుకోలేని రీతిలో అసభ్యపదజాలంతో తిడుతున్నారు. పనిచేసే చోట మంచినీళ్లు కూడా ఉండవు. ఎంతో దయనీయమైన పరిస్థితులలో పనిచేస్తున్నాం. కనీస వేతనం పెంచమని అడిగినందుకు ఆడవాళ్లని కూడా చూడకుండా బట్టలూడదీసి, లాఠీలతో చితకబాదారు. రెండు మూడు పోలీస్ స్టేషన్‌లకు తిప్పి అర్ధరాత్రి వరకు మమ్మలను స్టేషన్‌లోనే ఉంచేశారు.' అని మహిళా కార్మికులు తమ బాధను వివరించారు. 'కనీసం అవసరమైనప్పుడు వాష్‌రూమ్‌కి వెళ్లనివ్వరని, కొద్దినిమిషాలు ఆలస్యమైనా తలుపులు కొడతారని, అందరిముందు బూతులతో తిడతారని' అనేక మంది మహిళలు వాపోయారు. 'గంటకు 300 పీసులు కుట్టాలని టార్గెట్ పెడితే ఎవరైనా కుట్టగలరా? కుట్టకపోతే ఉద్యోగం వదిలేసి పొమ్మని బెదిరిస్తున్నారని, అనుకొకుండా జ్వరం వచ్చినా, ఏదైనా అనారోగ్య సమస్య కారణంగా సెలవు పెడితే ముందస్తుగా సెలవు పెట్టలేదని ఉద్యోగం తీసేస్తామని బెదిరిస్తున్నారని' కూడా చెప్పారు.

జీతం 4000 రూపాయలు చెల్లిస్తూ 8000 ఇస్తున్నట్లుగా సంతకాలు తీసుకుంటారని కొంతమంది చెప్పారు. 4 సంవత్సరాల నుండి పని చేస్తున్నా ఎటువంటి పెంపుదల లేకుండానే పనిచేయిస్తున్నారని ఆపరేటరుగా పనిచేస్తున్న మహాలక్ష్మి చెప్పారు. విజయదుర్గ అనే అమ్మాయి క్వాలిటీ సెక్షన్‌లో ఆడిటర్‌గా పనిచేస్తుంది. అనారోగ్య కారణంగా తన పనిలో ఒత్తిడి భరించలేక పని మార్పును అడిగితే ఉద్యోగం నుండి తొలగించారని చెప్పింది. చిన్న చిన్న కారణాలకే ఉద్యోగాలు తీసేయడం, మళ్లీ కొత్తగా చేర్చుకున్నట్లు చూపిస్తారు. ఎందుకంటే కార్మికచట్టాల ప్రకారం భవిష్యత్తులో వారిని రెగ్యులర్ చేయాల్సి వస్తుందని ఆ విధంగా చేస్తున్నారు.

కేంద్ర ప్రభుత్వం కార్మికుల పి.ఎఫ్ సొమ్మును 58 సంవత్సరాల వయస్సు పూర్తయిన వరకు మధ్యకాలంలో అవసరాలకు రుణం తీసుకునే హక్కు లేదని ప్రకటించిన తరువాత దేశవ్యాప్తంగా వచ్చిన తీవ్ర వ్యతిరేకత బ్రాండిక్స్ కార్మికులపై కూడా ప్రభావం చూపింది. దానితో ఇతర ప్రధాన సమస్యలతో పాటు పి.ఎఫ్ చెల్లింపు విధానంపై కూడా కార్మికులు తీవ్ర నిరసన ప్రకటించారు. కార్మికుల పోరాటం తీవ్రతరం కావడం చూసి యాజమాన్యం వారిని భయపెట్టే ప్రచారాలు ప్రారంభించింది. వారిని సమూహంగా కలవనివ్వకుండా చేసింది. పైగా స్వయంగా ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు నుండి కార్మికులకు 5000 రూపాయలకన్న జీతం ఇవ్వనక్కర్లేదని, ఎట్టి పరిస్థితులలోనూ కార్మికుల నిరసన కొనసాగనివ్వరాదని ఆదేశాలు వచ్చినట్లుగా ప్రచారం చేసి కార్మికులను భయభ్రాంతులను చేశారు.

బ్రాండిక్స్ పరిశ్రమలలో ధూళి కాలుష్యం చాలా ఎక్కువ. బట్టల ధూళి పీల్చడం వలన చాలామందికి శ్వాసకోస వ్యాధులు వస్తున్నాయి. దీనికారణంగానే కొంత మంది కార్మికులు చనిపోయినట్లుగా తెలుస్తుంది. భద్రతాపరంగా సరఫరా చేయవలసిన మాస్కులు, ఇతర పరికరాలు ఇవ్వడం లేదు. కార్మికచట్టాల ప్రకారం ఆరోగ్య పరీక్షలు దశల వారీగా నిర్వహించాలి. వాటిని ఏమాత్రం పాటించడం లేదు. రాష్ట్ర ప్రభుత్వం ప్రకటించిన కనీస వేతనం 7,000 రూపాయలు కూడా చెల్లించడం లేదు. సాంప్రదాయ దుస్తుల తయారీ పరిశ్రమలలో వర్తించే నిబంధనలను ఇక్కడ అమలు చేస్తూ కార్మికులకు అన్యాయం చేస్తున్నారు.

కార్మికులు తమ న్యాయమైన సమస్యలపై యాజమాన్యానికి అనేకసార్లు శాంతియుతంగానే నివేదించారు. కాని వాటిని ఏమాత్రం లెక్కచేయకపోవడంతో విసిగిపోయిన కార్మికులు, మే 15న దాదాపు ఏడువేల మంది ఒక్కసారిగా ఆందోళనకు శ్రీకారం చుట్టారు. కార్మికులంతా ఊరేగింపుగా బయలుదేరి కంపెనీ మేయిన్‌గేటు వైపు నినాదాలతో ప్రవాహంలా ముందుకొచ్చారు. అంతవరకు ఆ పరిశ్రమలలో ఎటువంటి యూనియన్‌లు లేవు. నాయకత్వం లేకుండానే కార్మికులు పోరాటం ప్రారంభించారు. తరువాత వారికి సిఐటియు, ఇతర యూనియన్‌లు వారికి మద్దతుగా నిలబడ్డారు. మధ్యాహ్నం నుండి ప్రారంభించిన ఆందోళన రాత్రంతా కంపెనీ పరిసరాలను వీడకుండా అక్కడే మకాం వేశారు. మరుసటి రోజు మధ్యాహ్నం వరకు ఆందోళన కొనసాగించారు. ఇతర డిమాండ్‌లతో పాటు కనీసవేతనం 10,000 రూపాయలు చెల్లించాలని, పి.ఎఫ్. అవసరాలకు తీసుకునే హక్కును కొనసాగించాలని డిమాండ్ చేశారు.

16వ తేది మధ్యాహ్నం కార్మికుల ఆగ్రహావేశాలను, పట్టుదలను చూసి ప్రభుత్వం, యాజమాన్యం ఉమ్మడిగా సమస్యలు 30వ తేదిలోగా పరిష్కరిస్తామని హామీ ఇవ్వడంతో కార్మికులు ఆందోళన విరమించారు. హామీ నెరవేరేవరకు పోరాటం కొనసాగించాలని కార్మికులు నిర్ణయించు కున్నారు. మొదట బ్రాండిక్స్ 1, 2 విభాగాలలో మొదలైన నిరసన, తరువాత నుండి బ్రాండిక్స్ 3, క్వాంటమ్, సీడ్స్, ఓషన్ ఇండియా, తదితర కంపెనీల నుండి మరో 9 వేల మంది వారితో కలిసి 18వ తేది ఉదయం నిరసన ప్రదర్శన కొనసాగించారు. యాజమాన్యం ఇచ్చిన గడువు 30వ తేది వరకు విధులకు హాజరు కాకుండా ఆందోళన కొనసాగించడానికి నిర్ణయించారు.

దానితో జిల్లా అధికారులు, పోలీసులు కలిసి పోరాటాన్ని విచ్ఛిన్నం చేయడానికి పూనుకున్నారు. ఏప్రిల్ 25 నుండి కార్మికులు విధులకు హాజరుకాకపోతే లాకవుట్ ప్రకటిస్తామని, ఉద్యోగాలు తీసేస్తామని ప్రచారం సాగించారు. అదనంగా బస్సులు పంపితే కార్మికులు వాటిని తిరిగి పంపించి వేశారు. యాజమాన్యం హామీ ఇచ్చిన 30వ తేదిన కార్మికులు కంపెనీ దగ్గరకు సమూహాలుగా చేరుకొనే క్రమంలో ఉండగా వారిపై పోలీసులు దుర్మార్గంగా దాడిచేసి అరెస్టులు చేశారు. నేటికీ పోలీసు రక్షణ వలయంలో కంపెనీ నడుస్తుంది.

ఈ ఎస్ఇజెడ్‌ల యాజమాన్యాలు కార్మికులు యూనియన్‌లు పెట్టుకునే ప్రాథమిక హక్కునే నిరాకరిస్తున్నారు. యూనియన్ రిజిస్ట్రేషన్ కోసం ప్రయత్నిస్తే కార్మికులను ఉద్యోగాల నుండి తొలగిస్తున్నారు. చాలా చోట్ల కనీస వేతనం, పి.ఎఫ్, ఇ.ఎస్.ఐ, సెలవులులాంటి ప్రాథమిక హక్కులు కూడా అమలు జరపడం లేదు. కార్మికులు సమస్యలపై ప్రశ్నిస్తే పోలీసు యంత్రాంగంతో తీవ్ర నిర్బంధాన్ని ప్రయోగిస్తున్నారు. అరెస్టులు చేస్తూ కేసులు పెట్టి భయభ్రాంతులను చేస్తున్నారు. ఎగుమతి ఆధారిత పరిశ్రమల పేరుతో ఈ కంపెనీలు అనేక రాయితీలు పొందుతూ కోట్లాది రూపాయల లాభాలు సంపాదిస్తూ, కార్మికులకు చట్టపరంగా ఇవ్వాల్సిన కనీస హక్కులు కూడా నిరాకరిస్తున్నారు. దీనిని బట్టి ఈ సెజ్‌లు ఆధునిక జైళ్లుగా నడుస్తున్నాయని అర్థమవుతుంది.

బ్రాండిక్స్ కంపెనీ తనకు కేటాయించిన 1000 ఎకరాలలో 300 ఎకరాలలో తమ పరిశ్రమలను ఏర్పాటుచేసి మిగిలిన 700 ఎకరాలను వేరే కంపెనీలకు 50 లక్షల రూపాయల వరకు లీజుగా వసూలు చేస్తున్నారని తెలుస్తుంది. ఇది చట్ట విరుద్ధం. అయినా ప్రభుత్వం ఎటువంటి చర్యలూ తీసుకోవడం లేదంటే కార్పొరేట్ కంపెనీలు ఎలాంటి అధికారాన్ని చలాయిస్తున్నాయో అర్థమౌతుంది.

భారతదేశ రెడీమేడ్ దుస్తుల భారీ పరిశ్రమలు బెంగుళూరు, తిరుపూర్, చెన్నై, ఢిల్లీ పరిసర ప్రాంతాలలో ఉన్నాయి. వీటిలో దాదాపు 10 లక్షల మంది కార్మికులు పనిచేస్తున్నారు. విశాఖలో బ్రాండిక్స్ కంపెనీ 15 వేల కోట్ల రూపాయల టర్నోవర్‌తో నడుస్తుంది. దీనిలో 24 వేల మంది పనిచేస్తున్నారు. బెంగుళూరు పరిశ్రమలలో దాదాపు 5 లక్షల మంది పనిచేస్తున్నారు. వీరిలో 85 శాతం మహిళా కార్మికులే.

అంతర్జాతీయ కార్మిక సంఘం (ఐ.ఎల్.ఓ) ప్రకారం భారతదేశంలో రెడీమేడ్ దుస్తుల తయారీ పరిశ్రమలే దేశ ఆర్థిక పరిస్థితికి ఎంతో తోడ్పడుతున్నాయి. గత రెండు దశాబ్దాలుగా చిన్న చిన్న కంపెనీలుగా ఉన్న పరిశ్రమ నేడు ఫ్యాక్టరీ స్థాయి పరిశ్రమకు ఎదిగింది. దీనికి ప్రత్యేకంగా కార్మికుల తోడ్పాటు ఎంతో ఉంది అని ప్రకటించింది. కానీ ఎవరి శ్రమతో పరిశ్రమ ఎదిగిందో వారి బాగోగులను చూడడంలో ఈ పరిశ్రమ ఎంతో దుర్మార్గంగా ప్రవర్తిస్తుంది.

బ్రాండిక్స్ కంపెనీ నీతి, నిజాయితీ, సామూహిక పని విధానం, వినియోగదారుల సేవా, నేర్చుకోవడం ద్వారా అభివృద్ధి అనేవి మా విలువలు అని ప్రకటించింది. మరి ఒకవైపు కార్మికుల కష్టం మీద కోట్లాది రూపాయల లాభాలు సంపాదిస్తూ, లాభాలకు మూలమైన కార్మికులకు మనుషులుగా బతికేందుకు కనీస వేతనం చెల్లించకుండా న్యాయం అడిగినందుకు దారుణంగా హింసను ప్రయోగించడం ఎంత వరకు సబబు అని కార్మికులు ప్రశ్నిస్తున్నారు.

బెంగుళూరు గార్మెంట్ పరిశ్రమలో నిబంధనల ప్రకారం 50 ఏళ్లు దాటితే ఉద్యోగాలు ఉండవు. కేంద్ర ప్రభుత్వం నూతనంగా విడుదల చేసిన పిఎఫ్ నిబంధనల ప్రకారం 58 సంవత్సరాలు దాటిన తరువాతే పిఎఫ్ సొమ్ము తీసుకోవడానికి వీలవుతుంది. అంటే ఉద్యోగం నుండి రిటైరైపోయిన తరువాత కూడా 8 సంవత్సరాలు పిఎఫ్ సొమ్ము కోసం కార్మికులు వేచి ఉండాలి. ఈ దుర్మార్గమైన నిబంధన కార్మికుల్లో తీవ్రమైన ఆగ్రహాన్ని రగిల్చింది. భారతదేశపు సిలికాన్‌వాలీగా పేరు గాంచిన బెంగుళూరును స్థంభింపజేశారు. మొదట కొన్ని ఫ్యాక్టరీల నుండి ఆగ్రహించిన మహిళా కార్మికులు రోడ్ల మీదకు వచ్చారు. పోలీసులు దీనిని మెరుపు సమ్మెగా పేర్కొన్నారు. ఈ వార్త దావానలంలా వ్యాపించింది. ఆ ప్రాంతంలో ఉన్న ఇతర ఫ్యాక్టరీల నుండి ఒక గంట

# మానవ మనుగడనే ప్రశ్నిస్తున్న కరవు

***అభివృద్ధి పేరుతో ప్రకృతి వనరుల విధ్వంసానికి పాల్పడుతున్న ప్రభుత్వాలు, వాటివల్ల ఏర్పడే కరవును నివారించడంలో వైఫల్యం వల్ల ప్రజలు పండుటాకుల్లా రాలిపోతున్నారని అంటున్నారు ఎ. పున్నయ్య***

పచ్చని ప్రకృతిలో సెలిమెతోడుకొని భూతల్లి వడగట్టి ఇచ్చిన చల్లని నీటిని కడుపు నిండా తాగే అడవి బిడ్డలు గుక్కెడు నీళ్ల కోసం కడవ పట్టుకుని అడివంతా గాలించే దౌర్భాగ్యం ఎప్పుడైనా చూశారా? బిడ్డ పెళ్లి కోసం తన ఇద్దరు కొడుకులతో అడవి దాటి వెళ్తూ దాహం వేసి నీటి కోసం వెళ్లిన తల్లి, ఆ తల్లిని వెతుక్కుంటూ వెళ్లి దాహం వేసి గొంతు తడుపుకునే దిక్కులేక అడవిలో, మండే ఎండలో ప్రాణాలు ఆవిరైపోయి, కమిలిపోయిన దేహాలను మీరెక్కడైనా చూశారా? ప్రాణ ప్రదమైన పశువులను కబేలాలకు అమ్మలేక, కళ్లముందే డొక్కలెండి కాళ్లీడ్చుకుపోతున్న దుక్కిటెద్దుల్ని చంపుకోలేక ఎద్దుల్ని అద్దెలకివ్వడం ఎప్పుడైనా విన్నారా! ద్వీపకల్పనదీ వ్యవస్థ కలిగి అద్భుత జీవనదులున్న ఈ దేశంలో ఒక ప్రాంతం నుంచి మరొక ప్రాంతానికి రైలు భోగీల్లో నీటిని తరలించడం ఎంత విషాదం! ప్రపంచంలో అత్యంత ఖరీదైన వినోదాత్మకమైన ఆటను నీటి కరవుతో ఒక ప్రాంతం నుండి మరో ప్రాంతానికి తరలించడం ఎంత విస్మయం! అంతేగాదు ఈ దేశ ఆర్థిక వ్యవస్థలో అత్యంత భాగస్వామ్యం గల, అతి పెద్ద రవాణా వ్యవస్థ అయిన రైల్వే వ్యవస్థలో ఒక రైలు కేవలం తాగడానికి, శౌద సదుపాయాలకు (స్నాన పానాదులకు) నీళ్లు లేవని ఒక రైల్వే స్టేషన్‌లో సుమారు నాలుగు గంటలు ఆగడం ఎప్పుడైనా చూశారా! ఒక్క సారిగా చెంప చెల్లుమనిపించే, ఒళ్లు జలదరింపజేసే ఈ వాస్తవాలన్ని ఈ దేశంలో నాల్గవ వంతు ప్రజలపై విరుచుకుపడ్డ కరవు రక్కసి ప్రతిబింబాలే అనడానికి ఎలాంటి సందేహం ఉండాల్సిన అవసరం లేదు. ఇలాంటి సంఘటనలే దేశంలోను, రాష్ట్రంలోను నెలకొన్న దుర్భిక్ష కరవు పరిస్థితులను కళ్లకు కడుతున్నాయి.

**అనాదిగా ప్రకృతిలో మానవుడు**

ఆదిమ కాలం నుండి ప్రకృతి ఆరాధకుడు మనిషి. ప్రకృతిని ఆరాధిస్తూనే ప్రాకృతిక వనరులను ఆకలి, అవసరం మేరకు మాత్రమే వినియోగించుకుంటూ ప్రకృతితో సహజీవనం సాగించాడు. మానవ పరిణామ క్రమంలో ఆదిమ దశ నుండి ఆధునిక కాలం వరకు జరిగిన వివిధ దశలలో మానవ జీవన విధానంలో వచ్చిన మార్పుకు అనుగుణంగా ప్రకృతి వనరుల వినియోగం పెరిగింది. జనాభా

---

సమయంలోపే వేలాదిగా కార్మికులు వెల్లువగా కదలి వచ్చి హొసూర్ రోడ్డును స్థంభింపజేశారు. అది ఎలక్ట్రానిక్ నగరానికి దారితీసే ప్రధాన రహదారి. అక్కడ ప్రముఖ ఐటి కంపెనీలు చాలా ఉన్నాయి. ఆగ్రహంతో ఉన్న కార్మికులు కార్పొరేట్ కార్యాలయాలు, పోలీసు స్టేషన్లపై దాడి చేశారు. బస్సులను దగ్ధం చేశారు. ఆశ్చర్యకరమైన విషయమేమిటంటే కార్మిక సంఘాల నాయకులు ఇంకా నిరసనను తెలపాలనే భావిస్తున్నంత లోపే, వారికి తెలియకుండానే కార్మికుల ఆగ్రహం ఈ రకంగా బద్దలయింది. 'మేము వారి నాయకులతో మాట్లాడాలని భావించాం. కాని మాకు మాదిరిగానే దీని గురించి వారికి ఎలాంటి సమాచారం లేదని మాకు తెలిసింది' అని పోలీసులు చెప్పారంటే కార్మికుల చైతన్యం ఏ స్థాయిలో ఉందో అర్థమౌతుంది.

కేంద్ర ప్రభుత్వం పిఎఫ్ సంస్కరణలపై వెల్లువెత్తిన ఆగ్రహం ఇలా నిరసన రూపంలో బద్దలయింది. ఏప్రిల్ 18, 19న బెంగుళూరు రెడీమేడ్ దుస్తుల తయారీ రంగంలోని మహిళా కార్మికులు మొత్తం బెంగుళూరుని స్థంభింపజేస్తూ, దారుణమైన పోలీసు నిర్బంధాన్ని కూడా ఎదురించి సాగించిన పోరాటం చివరకు కేంద్ర ప్రభుత్వం పిఎఫ్‌పై ఇచ్చిన ఉత్తర్వులను రద్దు చేసుకునేటట్లు చేశారు.

కేరళ టీ తోటల్లో 24 వేల హెక్టార్లలో దాదాపు 3 లక్షల మంది మహిళా కార్మికులు పనిచేస్తున్నారు. వారి న్యాయమైన హక్కుల సాధన కోసం 2015, సెప్టెంబర్, అక్టోబర్ నెలల్లో మున్నార్‌లో దాదాపు 10 వేల మంది మహిళా కార్మికులు 'పెంగల్ ఓట్రుమాయి' (మహిళా ఐక్యత) అనే బ్యానర్ కింద 'మేం పనిచేస్తాం- మీరు దోపిడీ చేస్తారు', 'గంజి కూడా మాకు- చికెన్ బిర్యాణి మీకు', 'పడిపోయే పాక ఇళ్లు మాకు - ఏసి భవనాలు మీకు' అనే నినాదాలతో తమ పోరాటం ద్వారా మొత్తం కేరళా ప్రభుత్వాన్నే స్థంభింపజేసి తమ హక్కులను కొంతమేరకైనా సాధించుకున్నారు. ఈ పోరాటాలు దేశ వ్యాప్తంగా అసంఘటిత కార్మికులకు గొప్ప ఉత్సాహాన్నిచ్చాయి. అందుకే బ్రాండిక్స్ కార్మికులు కూడా కొన్ని విజయాలు సాధించుకున్నారు. మొదట కంపెనీ నోవర్క్, నోపే అన్నా, సమ్మె చేసిన రోజులకు జీతం సాదించుకున్నారు. పిఎఫ్ విత్‌డ్రాను పాతపద్ధతులలోనే కొనసాగించేటట్లు ఆదేశాలు పొందారు. వేధింపులు, క్యాంటీన్, ఆరోగ్యం లాంటి ఇతర సమస్యలను పరిష్కరిస్తామని కలెక్టరు, సెజ్ కమీషనరుల నుండి హామీ పొందారు. తమ న్యాయమైన ఇతర డిమాండ్‌లతో పాటు కనీస వేతనం 10 వేల రూపాయలు చెల్లించాలని బ్రాండిక్స్ కార్మికులు తమ ఐక్యపోరాటం ద్వారా సాధించుకోవడానికి కృత నిశ్చయంతో ఉన్నారు. ప్రజాస్వామ్య వాదులు, సామాజిక కర్యకర్తలు, ప్రజలు వారి పోరాటానికి పూర్తి మద్ధతు ప్రకటించాల్సిన అవసరం ఎంతైనా ఉంది.

*(రచయిత కార్మికోద్యమ నాయకులు)* వీ

పెరుగుదలతో తన అవసరాల మేరకు మనిషి ప్రకృతి వనరుల వినియోగాన్ని అవసరాన్ని మించి వాడుకోవడం, వృథా చేయడం, అంతకు మించి దాచుకోవడం, దోచుకోవడం ప్రారంభమైంది. ఈ ధ్వంసం ఎక్కడికి చేరిందంటే శరవేగంగా సాగే నగరీకరణ, సైన్స్, సాంకేతికాభివృద్ధి, సత్వర పారిశ్రామికీకరణతో మరింత విధ్వంసానికి దారి తీసింది. ఆధునిక మనిషి సుఖమయ జీవనానికి కావలసిన వినియోగవస్తు సంస్కృతి విపరీతమైంది. ఆ దశలో సామ్రాజ్యవాద విష సంస్కృతి తోడైంది. ఈ క్రమంలో పారిశ్రామిక వస్తుత్పత్తుల కోసం పెట్టుబడిదారీ వ్యవస్థ, బహుళజాతి సంస్థల ప్రకృతి విధ్వంసం మొదలైంది. ప్రకృతి సమతుల్యత క్రమంగా దిబ్బతినడం ప్రారంభమైంది. వాతావరణంలో విపరీత మార్పులు అనివార్యంగా చోటుచేసుకుంటూ వస్తున్నాయి. ఫలితంగా సహజ వాతావరణం కలుషితమై ఉష్ణోగ్రతలు, వర్షపాతంపై ప్రత్యక్ష ప్రభావమే నేడు మన కళ్లముందున్న కరవు.

**రూపం మారిన కరవు**

గత దశాబ్దాలలో కరవంటే ఆకలి, పనిదొరకక, ఆహార కొరత తీవ్రతే కరవుగా భావించేవారు. ప్రస్తుత కాలంలో ఆహారపు కొరతతో పాటు, సాగునీటి లభ్యత లేకపోవడం, మంచినీళ్లు దొరకకపోవడమే కరవుగా గుర్తించే పరిస్థితి దాపురించింది. సాంకేతికంగా ఆలోచించినప్పుడు ఒక నిర్ణీత కాలంలో ఒక ప్రదేశంలో సగటుకంటే తక్కువగా నీటి లభ్యత, దానిలో ఉపరితల నీరు భూగర్భ జల నిల్వలు తగ్గిపోవడమే 'కరవుగా' కనిపిస్తుంది. ప్రపంచ జనాభాలో మూడవ వంతు జనాభా కలిగిన చైనా, భారత్‌లలో కేవలం మూడు వేలలోపు ఘనపు మీటర్ల నీరు ఒక వ్యక్తికి అందుబాటులో ఉంది. ప్రపంచ సగటు తొమ్మిది వేల ఘనపు మీటర్లు కాగా భారత్ కేవలం అందులో పదోవంతు నీటి లభ్యత కూడా ఒక వ్యక్తికి లేకపోవడం భారతదేశంలోని నీటి లభ్యతకు అద్దం పడుతుంది. ఒకప్పుడు ఆహారపు కొరత కరవుగా భావిస్తే నేడు నీరు లేకపోవడమే కరవుగా భావించడం సామాన్యమైంది. ఈ నేపథ్యంలో ఈ కరవు పరిస్థితులు నెలకొనడానికి గల కారణాలను అన్వేషించాల్సి ఉంది.

**మనిషిపై కరవును తరిమిన కారణాలు**

పారిశ్రామిక విప్లవానంతరం ప్రపంచ వ్యాప్తంగా సామ్రాజ్యవాద బహుళజాతి సంస్థలు జూలు విదిల్చాయి. అందివచ్చిన సాంకేతిక పరిజ్ఞానంతో ఈ శక్తులన్నీ ప్రకృతి విధ్వంసానికి నాంది పలికాయి. దాని ఫలితమే ఈ దేశంలో 30 శాతం కన్నా తక్కువగా ఉన్న పారిశ్రామిక రంగం కోసం 70 శాతం కలిగిన వ్యవసాయ రంగాన్ని నిర్వీర్యం చేశారు. దీనితో వ్యవసాయం దాని అనుబంధ రంగాలు కుదేలవడం మొదలైంది. ముఖ్యంగా అందరు అనుకుంటున్నట్లు 'హరిత విప్లవం' ఈ దేశంలో వ్యవసాయ అభివృద్ధికి తద్వారా పేద చిన్న సన్నకారు రైతాంగం అభివృద్ధికి తోడ్పడలేదు. హరిత విప్లవం కేవలం అత్యధిక నీటిని ఉపయోగించి పండించే పంటలను (వరి, గోదుమ వంటివి) ఆవిష్కరించింది. అంతేగాక అధిక దిగుబడి పేరుతో ప్రమాదకర రసాయన, క్రిమిసంహారక మందుల వాడకాన్ని పెంచింది. దీంతో సాగునీటి వినియోగం మోతాదుకు మించి అవసరమవడంతో బోర్లు, బావుల తవ్వకం విపరీతమైంది. వర్షాధారిత నీటి సంరక్షణ చర్యలు లేకపోగా భూగర్భ జలాలు వాడడం పెరిగిపోయి లెక్కకు మిక్కిలి బోర్లు, బావుల తవ్వకంతో భూగర్భ జలాలు అడుగంటాయి.

అంతేగాక విపరీతమైన రసాయనాలు వాడకంతో భూమి నిస్సారమై నీటి వనరులు పుష్కలంగా ఉన్న పంజాబు, హర్యానా లాంటి ప్రాంతాల్లో కూడా పంట భూములు చౌడు భూములుగా మారినాయి. దీనికితోడు ప్రపంచ వ్యాప్తంగా మానవ జీవన మనుగడనే సవాలు చేస్తున్న 'గ్లోబల్ వార్మింగ్'తో భూ ఉపరితలం వేడెక్కి మునుపెన్నడూ లేని ఉష్ణోగ్రతలతో వాతావరణం నిప్పులు గక్కుతుంది. ఉపరితల జలాలే కాదు, భూగర్భ జలాలు ఆవిరి రూపంలో కూడా కనిపించకుండా అంతర్ధానమైనాయి. ఈ నీటి కరవు వివిధ రంగాలతో పాటు వ్యవసాయ రంగాన్ని అందునా అన్నం పెట్టే రైతు బిడ్డల ఆత్మహత్యలకు దారి చూపింది. అవసరానికి మించి అంతమొందుతున్న అడవి పునరుద్ధరణ జరగడం లేదు. నరికినన్ని చెట్లనన్న నాటడం లేదు. పైగా పారిశ్రామిక రంగాల కొరకు అడవీ భూముల దారాదత్తం మరొక సమస్యగా మారింది.

లక్షలాది చెట్లు నాటుతున్నామని, వన సంరక్షణే మన సంరక్షణ అని చెప్పే మాటల్లో వాస్తవం దూరమైపోయి అడవులు కొన్ని రెట్లు తగ్గిపోయి సకాల వర్షాలకు దూరమవుతుంది. అసలు అడవులు అంతరించి ఆకాశహర్మ్యాలతో నూతన 'నగరారణ్యాలు' వెలుస్తుండడంతో కాంక్రీట్ జంగిల్ విపరీత ఉష్ణోగ్రతకు దారితీస్తుంది. సిమెంటు తారు రోడ్లు భూమిని కప్పేసి ఉష్ణోగ్రత తీవ్రతకు కారణమవుతున్నాయి. ఇటీవల గుజరాత్ రాష్ట్రంలో రోడ్లు కరిగి నడవడం కూడా విలుగాని స్థితిని కళ్లారా చూశాం. దీన్నే అర్బన్ హిట్‌ల్యాండ్ ఎఫెక్ట్ అంటారు. ఇవి వాతావరణ అసమతుల్యతకు దారి తీసి వర్షాభావ పరిస్థితులకు మూలమవుతున్నాయి.

వర్షాలు అకాలంగానో సకాలంగానో కురిసినా దాన్ని ఒడిసిపట్టే అవకాశాలు లేకపోవడం పెద్ద లోటు. ఇటీవల తెలంగాణ ప్రభుత్వం చేపట్టిన మిషన్ కాకతీయ వంటి పథకాలు కొంత ఆశాజనకమైనవి అయినా దీర్ఘకాలికమైనవి. సాగునీటి వినియోగ ప్రణాళిక లేకపోవడం, నీటి సంరక్షణ చర్యల్లో విపరీత నిర్లక్ష్యం కూడా నేటి నీటి ఎద్దడికి ప్రధాన కారణమే. చేపట్టిన పథకాలు కాలంతో సంబంధం లేకుండా, కొనసాగించకుండా మధ్యలో వదిలివేయడంతో పెసరుచేలో పోగొట్టుకుని పప్పుకుండలో వెతుకుతున్నట్లుంది. వర్షభావ పరిస్థితుల పట్ల ముందు చూపులేకపోవడం, మురుగునీటి పునర్వినియోగం, ఉప్పునీటి శుద్ధి, వినియోగ పరిజ్ఞానం పెంపొందించుకోకపోవడం కరవు పరిస్థితులకు మరో సాంకేతిక కారణమవుతుంది. ఎల్‌నినో ప్రభావంతో తీవ్ర వర్షాభావ పరిస్థితులు నెలకొంటున్నాయి.

**కరవు ప్రభావిత రంగాలు**

దేశ స్థూల జాతీయోత్పత్తి (జిడిపి)లో వ్యవసాయం వాటా 16 శాతమే అయినా దేశ జనాభాలో 53 శాతానికి జీవనోపాధి కల్పిస్తున్న వ్యవసాయ రంగం కరవు భారిన పడింది. గత రెండేళ్లుగా రుతు పవనాలు మొహం చాటేయడంతో రుతు పవనాల మీద ఆధారపడే మన దైన్య స్థితి విషమించింది. దేశ ఆర్థిక రంగానికి 'నీరే' ఇంధనమైనప్పుడు నీటి

కొరతతో ఆ రంగ ప్రగతి రథం ఆగిపోయినట్లే. వరస కరవుతో వ్యవసాయాధారిత పరిశ్రమలు తీవ్ర ప్రభావానికి లోనై, ఆహార ధాన్యాల ఉత్పత్తి కోట్ల టన్నుల మేరకు తగ్గింది. వ్యవసాయోత్పత్తులు తగ్గడంతో మార్కెట్‌లో ఆహార ధాన్యాల ధరలు ఆకాశాన్నంటుతున్నాయి. ఇది గ్రామీణ, పట్టణ పేదలపై మరింత ప్రభావాన్ని చూపిస్తుంది. 2015లో 1.31 లక్షల కోట్ల వ్యవసాయోత్పత్తుల ఆహార పదర్థాలు ఎగుమతులుండగా, 2016వ ఆర్థిక సంవత్సరంలో 1.05 లక్షల కోట్లకు తగ్గింది. ఈ ప్రభావం ప్రత్యక్షంగా పశు సంపద, పాడి పరిశ్రమ, మత్స్య సంపదలపై పడింది. పశుగ్రాసానికి తీవ్ర కొరత ఏర్పడింది. పాల దిగుబడి, పాల ఉత్పత్తులపై అలాగే ఆహార భద్రతపై మరింత ప్రభావం చూపింది.

నీటి కొరతతో కరవు కాటుకు గురై దేశంలోని అనేక జల, థర్మల్ విద్యుత్ కేంద్రాలు మూతపడ్డాయి. సాధారణంగా విద్యుత్ ఉత్పత్తి సరఫరా ఒక మెగావాటు పెరిగితే ఆర్థిక రంగంలో లక్షల రూపాయల మేరకు వృద్ధి నమోదు అవుతుంది. ఈ దేశంలో 70 శాతం థర్మల్ విద్యుత్ కావడం వల్ల కరవుతో ఏర్పడ్డ నీటి కొరతతో విద్యుత్ రంగం కుప్పకూలింది. ఈ ప్రభావం వలన పారిశ్రామిక రంగాలతో పాటు, మొత్తం ఆర్థిక వ్యవస్థను ప్రమాదంలో ముంచింది. కేంద్ర జల సంఘం (సిడబ్లుసి) లెక్కల ప్రకారంగా దేశంలోని 91 నీటి రిజర్వాయర్లలో 19 శాతం మాత్రమే నీళ్లు నిల్వ ఉన్నాయి. మిగతా ప్రాజెక్టుల్లో నీరు పూర్తిగా అడుగంటడంతో ఆయా ప్రాజెక్టుల కింద ఆయకట్టు మొత్తంగా బీడుగా మారింది. ఈ కరవు రక్కసి తల్లిదండ్రులకు బిడ్డలను, భార్యను భర్తను ఎడబాపి గల్ఫ్ పట్టణాలకు తరిమింది. కరవుకు భూములమ్ముకోవడం సాధారణం కాని, కరవు భారినపడి మనుషులు తమ రక్తాన్ని, కిడ్నీలను, పిల్లలను అమ్ముకోవడం అత్యంత విషాదం.

**సుప్రీం కోర్టు చురకలు**

దేశంలోనే ఒక స్వచ్ఛంద సంస్థ స్పందనతో కరవు పట్ల నిమ్మకు నీరెత్తినట్లున్న ప్రభుత్వ మొద్దు ఎద్దును దేశ అత్యున్నత న్యాయ స్థానం మునుపెన్నడు లేని విధంగా ముల్లు కర్రతో పొడిచి తట్టి లేపింది. 40 గంటల సుదీర్ఘ విచారణానంతరం దేశంలో నెలకొన్న హృదయ విధారకర కరవు పరిస్థితులను ఆకలింపచేసుకుని కరవు భారీ నుంచి ప్రజలను రక్షించాలన్న కొన్ని నిర్ధిష్ట సూచనలు చేసింది. విపత్తు పట్ల స్పందించేందుకు జాతీయ స్థాయిలో ఒక కమిటీని తగిన చర్యలను, నిర్దేశించే విధంగా జాతీయ విధానాన్ని రూపొందించాలన్నది. కరవును ప్రకటించే చట్టం చేసి, కరవు నివారణ చర్యలు రాష్ట్రాల బాధ్యత అని కేంద్రం తప్పుకోరాదని ఆదేశించింది. అత్యున్నత న్యాయస్థానం ఉద్ఘాటించిన తర్వాతనైనా ఆయా ప్రాంతాల్లో ప్రభుత్వాలు కరవు ప్రాంతంగా ప్రకటించకపోవడం ప్రభుత్వాల నిర్లక్ష్య వైఖరిని తెలియజేస్తుంది.

నిజానికి కరవు ప్రాంతంగా ప్రకటిస్తే ప్రభుత్వాలు ఆర్థిక భారంగా భావిస్తున్నాయి. కరవు ప్రాంతంలో ఉద్యోగులకు జీతంతో కూడిన సెలవులను, ప్రజలందరికీ ఆహార సరఫరా కేంద్రాలను, మంచినీటి వసతులను, పశుగ్రాసాన్ని అందించాల్సి ఉంటుంది. ప్రజల కనీస అవసరాలు విధిగా తీర్చాల్సి ఉంటుంది. బహుశా! పై కారణాల వలన ప్రభుత్వాలు కరవును ప్రకటించుటలో నిర్లక్ష్యం వహిస్తున్నాయి.

**అభిలషనీయ మార్గాలు**

కరవు నివారణకై శాశ్వత ప్రాతిపదికన చర్యలు చేపట్టాలి. ఇటీవల రాష్ట్రంలో పర్యటించిన తెలంగాణ జాయింట్ యాక్షన్ కమిటీ, తెలంగాణ విద్యా వంతుల వేదిక, సామాజిక వేత్తలు, స్వచ్ఛంద సంస్థలు రిపోర్టులను అనుసరించి రాష్ట్రంలోని వ్యవసాయ శాస్త్రవేత్తల, నీటి రంగ నిపుణుల అభిప్రాయాలను అనుసరించి నీటి కొరత నివారణకై కరవును పారదోలే క్రమంలో మరిన్ని చర్యలు అవసరం. ప్రధానంగా స్థానిక వాగులు, వంకలు, ఏర్లను, సమీప నదులను, చెరువులను అనుసంధానం చేయాలి. ప్రభుత్వం చేపట్టిన మిషన్‌కాకతీయకు అనుబంధంగా ఇంటికొక ఇంకుడు గుంత, చేనుకొక కందకాన్ని తవ్వే చర్యలను ఉపాధి హామీ పథకంతో భాగస్వామ్యం చేయాలి.

సాగునీటి వినియోగాన్ని నియంత్రించే వ్యవసాయ పంటల సాగుకు కృషి చేయాలి. వాణిజ్య పంటలు కాకుండా జీవనాధార పంటల సాగును ప్రోత్సహించాలి. కర్బన ఉద్గారాలను తగ్గించేందుకు తగిన చర్యలు చేపట్టాలి. గ్లోబల్ వార్మింగ్‌ను నియంత్రించాలి. కాలుష్య నియంత్రణకు హరితహారం లాంటి సామాజిక అడవుల సంరక్షణ వంటి కార్యక్రమాలను ఆచరణాత్మకంగా నిరంతరం కొనసాగించాలి. మురుగు నీటి పునర్వినియోగానికి పట్టణాలు, నగరాల్లో తగిన ఏర్పాట్లు చేసుకోవాలి. ఉప్పునీటి శుద్ధి, వినియోగాన్ని అమల్లోకి తీసుకురావాలి. భూగర్భ జల సంరక్షణకు విచక్షణారహిత బోరు బావులు వేయడాన్ని నియంత్రించాలి. వ్యవసాయాధికారుల సూచనలతో పరిమిత జలాలతో (బిందు సేద్యం) పంటల ఉత్పత్తికి మార్గాలను అన్వేషించి ప్రోత్సహించాలి.

**ముగింపు**

ప్రపంచ దేశాలలోను అసమతుల్య వాతావరణంతో మనిషి స్వయం కృత చేష్టలతో అనివార్యంగా కరవు కొరల్లోకి నెట్టబడుతున్న మానవ జాతి మాత్రమే మార్క్‌ట్వెయిన్ అన్నట్లు అందుకు సిగ్గుపడాల్సింది. మానవ జాతి ఒక్కటే మనిషి పర్యావరణం పట్ల మొద్దునిద్ర వీడకుంటే రానున్న కాలంలో మనిషి మనుగడే శూన్యం అవుతుంది. అంతేకాక 'ప్రకృతి అనేది స్థిరమైన దత్తాంశం కాదు, అంతర్గత గతితర్కం వల్ల అది నిరంతరాయంగా మార్పు చెందుతున్న అంశం. మనిషి జోక్యం లేకుండా కూడా ప్రకృతి మారుతుంది. ఎప్పుడైనా ప్రకృతి విశ్రాంతి స్థితిలో ఉండదు. సమతౌల్య స్థితిలోను ఉండదు. అది చలన స్థితిలో ఉంటుంది.' అన్న మార్క్సిజం మౌలిక సూత్రాన్ని ప్రభుత్వాలు అర్థం చేసుకోలేనంత కాలం ఇలాంటి దుర్భిక్ష పరిస్థితులు దాపురిస్తూనే ఉంటాయి. కావున కరవును దాని ప్రభావాన్ని ఎదుర్కొనేందుకు, భవిష్యత్తులో ఇలాంటి దురవస్థ తలెత్తకుండా కాచుకునేందుకు అందుబాటులో ఉన్న మార్గాలన్నింటినీ అనుసరించడం ప్రభుత్వ విహిత కర్తవ్యం! బహుముఖ వ్యూహమే తరుణోపాయం. కరవంటూ కాటకమంటూ, కనిపించని కాలాలెప్పుడో... దాశరథీ.

*(రచయిత అసిస్టెంట్ ప్రొఫెసర్, తెలంగాణ యూనివర్సిటీ)*

# ఫిరాయింపుల అప్రజాస్వామ్యం

*చట్టసభల్లోని రాజకీయ నాయకులు ఏ రోజు ఏ పార్టీలో ఉంటున్నారో తెలియడం లేదనీ, ఇలాంటి వారు పాలనాకర్తలు కావడంవల్ల ప్రజల పేదిరికం పెరిగిపోతుంటే కొద్ది మంది బిలియనీర్లు అవుతున్నారనీ అంటున్నారు* **షేక్ కరిముల్లా**

*అల్పబుద్ధి వానికధికారమిచ్చిన*
*దొడ్డవారినెల్ల దొలగ గొట్టు*
*చెప్పు తినెడి కుక్క చెరుకు తీపెరుగునా*
*విశ్వదాభిరామ వినురవేమ!*

ఇటీవల పరిణామాలు, పార్లమెంటరీ వ్యవస్థలోని లోపాలను, డొల్ల తనాన్ని తెలుపుతున్నాయి. తెలుగు రాష్ట్రాలలోని పార్టీ ఫిరాయింపులు, చట్ట సభలలోని తన్నులాటలు దీనికి చక్కని ఉదాహరణలు. పార్లమెంటరీ ప్రజాస్వామ్యం ఇక ఈ దేశంలో ఏమాత్రం నిలబడదని తేలిపోయింది. స్వాతంత్ర్యం తరువాత అర్థ శతాబ్దం పాటు నిర్మించుకున్న సంస్థలు, వ్యవస్థలు నేడు అవసాన దశకు చేరుకుని, ప్రజలకు పూర్తిగా దూరమై, నేడో రేపో కూలిపోవడానికి సిద్ధంగా ఉన్నాయి. మొదటి రెండు, మూడు పార్లమెంట్‌లలో లోహియా, కృపలాని, సుందరయ్య లాంటి వాళ్ళుండే వారు. వారికి ప్రజా శ్రేయస్సే కాని, వ్యక్తిగత ప్రయోజనాలు లేవు. కాని ఇప్పుడు ఎవ్వరు ఏమి మాట్లాడతారో తెలియదు. ఎప్పుడు ఏ పార్టీ ఎటువైపు ఉంటుందో తెలియదు. ఏ పార్టీ ఎవరి పంచన చేరుతుందో తెలియదు. ఏ ఎంఎల్‌ఎ, ఎంపి ఏ పార్టీలో ఉంటాడో తెలియదు. 'ఆయారాం, గయారాం'లతో పార్టీలు ఫుల్ బిజీ అయిపోయాయి. చివరికి సొంత పార్టీ మీదే అవిశ్వాస తీర్మాణం పెట్టేదాకా పరిస్థితి వెళ్ళిపోయింది. ఈ గందరగోళాలతో చట్ట సభలు దాదాపు కూలిపోవడం వలన ప్రజల సమస్యలు పరిష్కారం కాక ఓ అభద్రతతో కూడిన భారతీయ సమాజం ఒక సంక్షోభ దశకు నేడు చేరుకుంది.

నేడు తెలుగు రాష్ట్రాల రాజకీయాలు చాలా విషతుల్యమయ్యాయి. ఏ ఒక్క రాజకీయ పార్టీ కూడా విలువలకు నిలబడలేదు. ప్రజా ప్రతినిధులు తాము చాలా ధనం ఖర్చుపెట్టి ఎన్నికయ్యాం కాబట్టి ప్రజల పట్ల బాధ్యత లేదనుకుంటున్నారు. ప్రజల నైతిక స్థాయి పడిపోయిందని, ప్రజలు ఓట్లను వేసేటప్పుడు అవకాశవాదంతో వేస్తున్నారని మాట్లాడుతూ, తప్పంతా ప్రజలదేనని అంటూ నీతి తప్పి పక్కు రాజకీయ వ్యాపారం చేస్తున్నారు. ఈ విషయాన్ని ముందే ఊహించి 1969 మార్చ్1న తరిమెల నాగిరెడ్డి ఈ చట్ట సభల ద్వారా సమాజానికి తాము ఏమి చేయలేమని భావించి తన ఎంఎల్‌ఎ పదవికి రాజీనామా చేసి 'ఈ అసెంబ్లీ ఒక బాతాకానీ షాపు మాత్రమేనని, ఇక్కడ ప్రజా ప్రయోజనాలకు తావు లేదని' ప్రకటించి, సమసమాజాన్ని నిర్మించడానికి విప్లవ రాజకీయాలలోకి వెళ్ళిపోయారు.

అలా ఆ ముందు తరం నాయకులు పోయారు. ఆ రాజకీయాలు పోయాయి. నేడు ఈ రాజకీయాలలోని కాలుష్యంను చూస్తున్న చదువుకున్న సామాజిక స్పృహకలిగిన ఈ తరం వారు ఈ రాజకీయాలకు దూరంగా ఉంటున్నారు. దీనితో రాజకీయ వ్యాపారుల ఇష్టారాజ్యం అయిపోయింది. నేడు ఆంధ్రప్రదేశ్, తెలంగాణ సహా దేశ వ్యాప్తంగా వివిధ రాష్ట్రాలలో యథేచ్ఛగా కొనసాగుతున్న పార్టీ ఫిరాయింపుల చరిత్ర చూస్తే 1967కు ముందు తక్కువనే చెప్పాలి. 1967 తరువాత ఫిరాయింపులకు అడ్డుకట్ట వేయడానికి అప్పటి కేంద్ర మంత్రి వై.బి. చవాన్ అధ్యక్షతన ఒక నైతిక సూత్రాల (ఎథిక్స్) కమిటీ ఏర్పాటు చేయబడింది. ఈ కమిటీ సిఫార్సులు ఫిరాయింపులను ఆపలేక పోయింది.

1967-1973 మధ్య కాలంలో పార్లమెంట్, శాసన సభలలో రికార్డు స్థాయిలో మొత్తం 2700 ఫిరాయింపులు జరిగాయి. ఫిరాయింపు దారులలో 212 మందికి మంత్రి పదవులు దక్కాయి. మరో 15 మంది ఏకంగా ముఖ్యమంత్రులే అయ్యారు. దీనితో పార్టీ ఫిరాయింపులు లాభసాటిగా మారాయి. ఈ ఫిరాయింపులను నిరోధించడానికి రాజీవ్ గాంధీ నాయకత్వంలోని కాంగ్రెస్ ప్రభుత్వం 1985లో 52వ రాజ్యాంగ సవరణ ద్వారా 10వ షెడ్యూల్ చేర్చి, రాజ్యాంగంలోని 101, 102, 190, 191 అధికరణలకు కొన్ని సవరణలు చేసింది. ఈ 1985 పార్టీ ఫిరాయింపుల నిరోధక చట్టం 1985 మార్చ్ 1 నుంచి అమలులోకి వచ్చింది. ఈ చట్టాన్ని 2003లో వాజ్‌పేయ్ ప్రభుత్వం కూడా కొన్ని సవరణలు చేసింది. అయితే ఈ చట్టాలు పార్టీ ఫిరాయింపులను ఆపకపోగా ఎక్కువయ్యాయి. అందుకు ఈ చట్టంలోని లొసుగులే కారణం. మిగతా చట్టాల లాగా ఈ చట్టం కూడా ఉత్సవ విగ్రహం లాగా మిగిలిపోయి, ఆచరణలో పూర్తిగా విఫలమయింది. దీని పర్యవసానమే నేటి ఈ ఫిరాయింపుల వికృతరూపం.

రాజ్యాంగం మీద ప్రమాణం చేసి అదే రాజ్యాంగాన్ని తరచూ ఉల్లంఘించే రాజకీయ నాయకులకు ఈ చట్టం ఓ లెక్కా? చట్ట సభలలో ప్రజా ప్రతినిధుల అనర్హతలను, పార్టీల చీలిక, పార్టీల విలీనం లాంటివి వివాదం అయినప్పుడు, వాటిని పరిశీలించి నిర్ణయించేది లోక్‌సభ స్పీకర్, రాజ్యసభ డిప్యూటి ఛైర్మన్, శాసనసభ స్పీకర్, శాసనసభ మండలి ఛైర్మన్లే. వీరి తుది నిర్ణయాలే ఫైనల్. ఈ వివాదాలలో జోక్యానికి కోర్టులకు అధికారం లేదని కూడా చట్టం స్పష్టం చేస్తున్నది. సహజంగా అధికార పార్టీ శాసన సభ్యుడే స్పీకర్ కనుక తన పార్టీ ప్రయోజనాలకు అనుగుణంగా వ్యవహరిస్తూ, చట్టంలో ఉన్న లొసుగును దుర్వినియోగం చేయడం పరిపాటిగా మారిపోయింది. దీనికి తోడు నిరక్షరాస్యులు, ధనవంతులైన వ్యాపారస్తులు, రౌడీలు, గూండాలు, రియల్టర్లు చట్టసభలకు ఎన్నికవడం వలన ఈ పార్టీ ఫిరాయింపులు ఎక్కువైపోయాయి.

ఒక్క మాటలో చెప్పాలంటే ఈ చట్టం పార్టీ ఫిరాయింపులను ప్రోత్సహిస్తుందని చెప్పవచ్చు. దీని కారణంగా నైతిక విలువలతో, చట్టాలతో నిమిత్తం లేకుండా 'అభివృద్ధి' కోసం అంటూ అభివృద్ధి పేరు చెప్పి అధికార పార్టీలోకి ఫిరాయిస్తున్నారు. అంటే 'అభివృద్ధి' ఈ రోజు వీరి ఫ్యాషన్ పదం అయిపోయింది. ఈ పేరు చెప్పి ఏమైన చేయవచ్చు అని వీరి అభిప్రాయం. ఒక పార్టీ టిక్కెట్టుపై ఎన్నికై ఆ పార్టీని విడిచి పెట్టాలనుకున్న ప్రజా ప్రతినిధి ఆ ప్రాతినిధ్య సభ్యత్వానికి రాజీనామా ఇచ్చి కావాలంటే తిరిగి పోటీచేసి గెలవాలన్నది కనీస ధర్మం. ఇక్కడ ధర్మానికి చోటు లేదు. స్వార్థం, ప్రలోభాలు, పదవులే ధర్మం. దీనికి మంచి ఉదాహరణ తెలంగాణలో తెరాస పార్టీలోకి టిడిపి ఎంఎల్ఎల ఫిరాయింపులను తీవ్రంగా వ్యతిరేకించి, చేసిన చంద్రబాబు ఆంధ్రప్రదేశ్ లో మాత్రం అదే పార్టీ ఫిరాయింపులను నిస్సిగ్గుగా ప్రోత్సహిస్తున్నారు.

ఏమైన నేడు ఆంధ్రప్రదేశ్‌లో జరుగుతున్న పార్టీ ఫిరాయింపుల అంశంపై దేశవ్యాప్తంగా ఒక చర్చకు తెరలేచింది. అలాగే అదే ఒరవడిలో నీతిమాలిన రాజకీయాలపై కూడా చర్చ జరుగుతుంది. కొన్ని సంస్కరణలు జరగాలని ప్రతిపక్ష పార్టీలు మాట్లాడుతున్నాయి. దీంట్లో భాగంగా పార్టీ ఫిరాయింపుదారులపై అనర్హత వేటువేసే అధికారాన్ని స్పీకర్ పరిధి నుంచి తప్పించి ఎన్నికల సంఘానికి అప్పగించాలని, ఎన్నికల సమయం లో ఇచ్చిన హామీలు అమలు చేయకుంటే ఆ పార్టీలపై తగుచర్యలు తీసుకునే అధికారం కూడా ఎన్నికల సంఘానికి ఉండాలని పార్టీలు కోరుతున్నాయి.

అసలు ప్రజా ప్రతినిధులను ఎన్నుకున్న ప్రజలకే పూర్తి అధికారం ఎందుకు ఇవ్వకూడదని? ఈ ప్రతినిధులను ఎన్నుకున్న ఓటర్లకే ప్రజా ప్రతినిధి సరిగ్గా పనిచేయకపోతే తిరిగి వెనక్కి పిలిచే (రికాల్) హక్కు ఇవ్వడం సముచితమనే అభిప్రాయముంది. ఈ పద్ధతి ప్రత్యక్ష ప్రజాస్వామ్యంలో స్విట్జర్లాండ్‌లో అమలులో ఉంది.

ఈ గందరగోళం చూస్తే భారత పార్లమెంటరీ రాజకీయాలు ప్రజల ఆకాంక్షలు నెరవేర్చడంలో విఫలమైనాయనేది వాస్తవం. నేటి రాజకీయ నాయకులు చాలా క్లియర్‌గా ఉన్నారు. మేము మా స్వప్రయోజనాల కోసమే ఈ రాజకీయాలు తప్ప, ప్రజలకు సేవ చేయడానికి కాదని వారు తేల్చి చెపుతున్నారు. రాజకీయాలంటే కేవలం పదవులు ధనార్జన, ప్రకృతి వనరులు దోచుకోవడానికి అన్న అవగాహనతోనే అన్ని రాజకీయ పార్టీలు ఉన్నాయి. ఇక తేల్చుకోవాల్సింది ప్రజలే.

స్వాతంత్ర్యానంతరం 1952 నుంచి మొదలైన ఎన్నికల ప్రక్రియ ఇప్పటికి 16 సార్వత్రిక ఎన్నికలు జరిగాయి. దాదాపు అన్ని పార్లమెంటరీ పార్టీలకు పార్లమెంట్ పీఠం దక్కింది. కాని ప్రజల సమస్యలు పరిష్కారం కాకపోగా ఇంకా జటిలమైనాయి. ప్రపంచంలో ఏ దేశంలో లేనన్ని సహజ వనరులు, చక్కని శీతోష్ణస్థితి, వీటన్నిటికి మించి మానవ వనరులుండి ఈ దేశంలోని ప్రజలు ఆకలి చావులు చస్తున్నారు. అన్నదాతలు లక్షల సంఖ్యలో ఆత్మహత్యలు చేసుకుంటున్నారు. విద్యా, వైద్యం అందని ద్రాక్ష పండైనాయి.

ఈ రోజు దేశ మూలవాసులకు తమ దేశభక్తిని నిరూపించుకోవలసిన దౌర్భాగ్యం పట్టింది. కొద్ది కాలంలోనే దేశంలో వంద మంది బిలీనియర్లను తయారు చేసిన ప్రభుత్వ విధానాలను ప్రశ్నించకూడదు. ప్రభుత్వాల దమననీతిని, రాజ్య హింసను ప్రశ్నించకూడదు. దేశ వనరులు అప్పనంగా దేశ, విదేశీ వ్యాపార సంస్థలకు కట్టబెట్టడాన్ని ప్రశ్నించకూడదు. విజయ్ మాల్యా లాంటి వారు ప్రజలు బ్యాంకుల్లో దాచుకున్న సొమ్ము కాజేసి, పారిపోయి విదేశాల్లో జల్సాలు చేస్తున్నా ప్రశ్నించకూడదు. వాక్ స్వాతంత్ర్యం, భావ ప్రకటనా స్వేచ్ఛ ప్రమాదంలో పడినా ప్రశ్నించకూడదు. ఒకవేళ ప్రశ్నిస్తే దేశద్రోహి, తీవ్రవాది అనే ముద్ర పడిపోతుంది.

చివరకు ఢిల్లీ వర్సిటి బిఎ చరిత్ర విభాగంలో భగత్‌సింగ్, చంద్రశేఖర్ ఆజాద్, సూర్యసేన్‌తో పాటు పలువురు స్వాతంత్ర్య సమర యోధులను కూడా ఉగ్రవాదులుగా చిత్రీకరించి, వక్రీకరించి రాయడం జరిగిందంటే పరిస్థితి ఎక్కడిదాక వెళ్లిందో అర్థం చేసుకోవచ్చు. నేడు ప్రసిద్ధ జెఎన్‌యు, ఎచ్‌సియు పరిశోధక విద్యార్థులు దేశ ద్రోహులు, ఇది వలస పాలనను ఎమర్జెన్సీ చీకటి రోజులను తలపిస్తున్నాయి.

నేడు దేశాన్ని ఈ స్థితికి తెచ్చిన పార్లమెంటరీ ఎన్నికలకు ప్రజల మౌలిక సమస్యల పరిష్కారాలకు ఏమీ సంబంధం లేదని రుజువు చేస్తున్నాయి. అన్నీ అక్రమాలకు, ప్రలోభాలకు అవకాశమున్న ఎన్నికల పవిత్రత గురించి మాట్లాడడం అర్థ రహితం. ఎన్నికల ద్వారా వ్యవస్థలో మార్పులు తేవచ్చు అనుకోవడం భ్రమే అవుతుంది. ఈ దేశపు క్షేత్ర స్థాయిలో ఏమి జరుగుతున్నదో, భారత ప్రజాస్వామ్య వ్యవస్థ భవిష్యత్తు ఎలా ఉండబోతుందో, ఈ దేశపు అట్టడుగు పొరల్లోని ఘర్షణలు వీరికి ఎరుక? ఎన్ని ప్రశ్నలు నేడు మనముందున్నాయి.

సామాజిక గతిని తార్కికంగా అధ్యయనం చేసే వారికి రేపటి బీజం నేటిలోనే ఉంటుందని సులువుగానే అర్థమవుతుంది. నేడు రోహిత్ వేముల, కన్హయ్య, ఉమర్ ఖాలిద్ లాంటి విద్యార్థుల ఉద్యమాలు, ప్రసంగాలు దేశంలో ఒక కొత్త ప్రత్యామ్నాయ రాజకీయాలకు తెర లేపాయి. నేడు ఈ యువత ఆజాదీ కోరుకుంటున్నారు. ఆకలి, పేదరికం, కుల దురహంకారం నుండి మాకు స్వేచ్ఛ కావాలి అంటున్నారు. 'ఇంక్విలాబ్ జిందాబాద్, లాల్ సలాం, జై భీం' అని నినదిస్తున్నారు.

వీరి ఈ ప్రశ్నలకు రాజకీయ పక్షాల దగ్గర సమాధానం ఉందా? కొత్తతరం సూచిస్తున్న ఒక కొత్త భవితవ్యాన్ని, ప్రత్యామ్నాయ రాజకీయాలను ప్రజలు సీరియస్‌గా తీసుకోవాలి. ఈవేళ పాలకులకు సవాల్ చేస్తున్న వీరి సాహసాన్ని ప్రజలు ఎత్తిపట్టాలి. మౌలికమైన సామాజిక మార్పులు ఎన్నికల ద్వారా రావడం సాధ్యంకాదని, ప్రజా ఉద్యమాల ద్వారా మాత్రమే సాధ్యమని ప్రజలు అర్థం చేసుకోవాలి. మానవీయ సమాజం వైపు మన ఆరాటాలు, పోరాటాలు సాగాలని ఆశిస్తూ...!

*(రచయిత సామాజిక విశ్లేషకులు)* వీ

***పాఠకులు ఫిర్యాదులు, సమాచారం కోసం కార్యాలయానికి పనిదినాల్లో ఉదయం 10:30 నుండి సాయంత్రం 6.00 గంటలలోగా స్వయంగా లేదా ఫోన్ ద్వారా సంప్రదించవచ్చు. మిగతా సమయాల్లో ఫోన్ చేస్తే అది ఫ్యాక్స్‌లోకి వెళ్లి మీకు జవాబు రాదు. అప్పుడు మీరు ఫోన్ ఎత్తికూడా మాట్లడడంలేదని అనుకునే అవకాశం ఉంది. ఇది గమనించగలరు.***

# మరో భోపాల్ కానున్న ఉత్తరాంధ్ర

***రసాయన, ఔషధ పరిశ్రమల్లో కనీస భద్రతా ప్రమాణాలు పాటించకుండా యాజమాన్యాలు కార్మికుల జీవితాలను, పరిశ్రమ చుట్టుపక్కల ఉన్న ప్రజల ప్రాణాలను హరిస్తున్నాయని అంటున్నారు సృజన్***

విశాఖపట్నంతో పాటు, శ్రీకాకుళం, విజయనగరం జిల్లాలలో అనేక పరిశ్రమలు ఏర్పాటవుతున్నాయి. ఫార్మా సిటీ ఏర్పాటుతో ఔషధ పరిశ్రమలకు విశాఖ ప్రధాన కేంద్రంగా మారింది. శ్రీకాకుళం జిల్లాలో పైడి భీమవరం, చిలకపాలెం, పరిసర ప్రాంతాలలో అనేక ఔషధ, రసాయన పరిశ్రమలు ఏర్పాటు చేశారు. ఇక్కడ తరచు ఏదో ఒక ప్రమాదం జరుగుతూనే ఉంది. ఈ ప్రాంతంల నుండి వెలువడుతున్న కలుషిత రసాయనాల వాయువులు ఆ పరిసర ప్రాంతాల ప్రజలను, కార్మికులను, చెన్నై – కలకత్తా రహదారిపై ప్రయాణించే వారిని తీవ్ర అనారోగ్యానికి గురిచేస్తున్నాయి. 2012లో నాగార్జునా అగ్రికెం పరిశ్రమలో భారీ ప్రమాదం జరిగినప్పుడు దాదాపు శ్రీకాకుళం ప్రజలందరూ తమ ఇళ్లను వదిలిపొమ్మని సాక్షాత్తూ అక్కడి ప్రభుత్వ అధికారులే పిలుపునివ్వడం జరిగిందంటే, భారీ ప్రమాదాలు జరిగితే ప్రభుత్వం, కంపెనీ యాజమాన్యాలు ఏమీ చేయలేని ప్రమాద పరిస్థితులు గుర్తించగలం. ఈ పరిశ్రమల చుట్టూ వందల గ్రామాలలో లక్షలాది మంది ప్రజలు నివసిస్తున్నారు. వారందరూ ఏ క్షణాన ఈ కంపెనీలలో ప్రమాదం జరుగుతుందోనని భయంతో బతుకుతున్నారు.

విశాఖపట్నం శివార్లలో ఉన్న దువ్వాడ సెజ్‌లో బయోమాక్స్ ఫ్యూయల్ లిమిటెడ్, బయోడీజిల్ కంపెనీలో ఏప్రిల్ 26న రాత్రి భారీ అగ్నిప్రమాదం సంభవించింది. ముడి సరుకు నిల్వచేసి ఉన్న 12 ట్యాంకులు మంటలలో చిక్కుకున్నాయి. మంటలార్పడానికి అగ్నిమాపక శాఖ మొదట 5 ఫైరింజన్‌లతో ప్రయత్నించింది. మంటలు అదుపులోకి రాకపోగా మరో 5 ట్యాంకులు పేలిపోయాయి. 3 వేల కిలో లీటర్ల సామర్థ్యం, 17 మీటర్ల ఎత్తు ఉన్న ట్యాంకులలో 70 నుండి 100 శాతం వరకు ముడి సరుకు నిల్వలు ఉన్నాయి. ఒక్కో ట్యాంకు దాదాపు కోటి రూపాయల ఖరీదు చేస్తుంది. 12 ట్యాంకులలో ముడి సరుకు దాదాపు 100 కోట్ల రూపాయల వరకు ఉంటుంది. సంస్థలో 180 మంది సిబ్బంది ఉండగా బి షిఫ్ట్‌లో ఉన్న 30 మంది కార్మికులు మంటలను పసిగట్టి బయటకు పారిపోయి ప్రాణాలు దక్కించుకున్నారు. ముందస్తు చర్యలలో భాగంగా యాజమాన్యం అగ్నిమాపక పరికరాలు, ఇసుక, ఫోమ్ వంటి విపత్తులను ఎదుర్కొనే యంత్ర సామాగ్రిని ఏర్పాటు చేసి ఉండాలి. కాని అటువంటివేమి అక్కడ లేవని తేలింది.

నౌకాదళ హెలికాప్టర్‌ల ద్వారా మంటలు అదుపు చేయడానికి అధికారులు ప్రయత్నించారు. కాని సఫలం కాలేదు. ట్యాంకుల నుండి విపరీతమైన వేడితో వస్తున్న మంటలు, పొగలు హెలికాప్టర్లు తట్టుకోలేవు. పైగా కాలిపోయే ప్రమాదం ఉంది. అందువలనే ఆ ప్రయత్నాన్ని విరమించుకున్నారు. సంఘటన ప్రాంతం నుండి వెలువడుతున్న దట్టమైన పొగ విశాఖ నగరం వైపు ప్రయాణించింది. దీని వలన ఎటువంటి ప్రమాదం సంభవిస్తుందోనని ప్రజలు భయంతో వణికిపోయారు. చుట్టుప్రక్కల గ్రామాల ప్రజలు ఇళ్లు వదిలి పారిపోయారు.

జిల్లా నలుమూలల నుండే కాకుండా ఇతర జిల్లాల నుండి కూడా అగ్నిమాపక వాహనాలను తరలించారు. నేవీ, విశాఖ పోర్టు, గంగవరం పోర్టు, ఎన్‌టిపిసి స్టీల్‌ప్లాంట్, ఎచ్‌పిసిఎల్, ఫార్మసిటీ తదితర సంస్థలకు చెందిన మొత్తం 40 అగ్నిమాపక వాహనాలను ఉపయోగించారు. బుధవారం సాయంత్రానికి దాదాపు 10 టన్నుల ఫోమ్ ఉపయోగించారు. అదనంగా 10,000 టన్నుల ఫోమ్ సేకరణకు ఆదేశించారు.

ఈ మంటలు దాదాపు అరకిలోమీటరు వరకు తీవ్ర ప్రభావాన్ని చూపాయి. వీటిని అదుపు చేయడానికి చివరి ప్రయత్నంగా 'మంటలార్పే బంతులు' వినియోగించారు. ఈ బంతులను నేల మీద నుండి చేతులతో నేరుగా ట్యాంకులలోకి విసరడంతో పాటు హెలికాప్టర్‌ల ద్వారా నేరుగా ట్యాంకులలో పడవేయడానికి ప్రయత్నించారు. ఈ బంతులు థాయిలాండ్‌లో తయారవుతాయి. వీటిలో మంటలను అదుపుచేసే గుణంగల అమోనియా పాస్పేట్, పొటాషియం నైట్రేట్‌ల మిశ్రమం ఉంటుంది. బంతి మంటలో పడగానే ఆక్సిజన్‌ను నివారిస్తుంది. దానితో మంట తీవ్రత తగ్గి ట్యాంకులు చల్లబడతాయి. కానీ వీటి వలన కూడా పెద్దగా ప్రయోజనం చేకూరలేదు.

జిల్లా అగ్నిమాపక అధికారులు బ్రాంటో స్కై అనే అధునాతన లిఫ్ట్ పరికరాన్ని తొలి రోజు సహాయక చర్యలలో వినియోగించారు. తరువాత సాంకేతిక లోపం వలన దానిని పక్కన పెట్టవలసి వచ్చింది. దానికి రిపేర్ చేయాలంటే ఇక్కడి వారితో వీలు కాదట. ఢిల్లీ నుండి సిబ్బందిని రప్పిస్తేనే గాని రిపేర్ సాధ్యపడదని తేలింది. ఎగిసిపడుతున్న మంటలను అదుపు చేసే ముఖ్యమైన పరికరానికే రిపేర్లు వస్తే, వెంటనే ఆపవలసిన ప్రమాదాలను ఎలా ఎదుర్కొంటారో తెలియని పరిస్థితి కొనసాగుతుంది.

ఏప్రిల్ 26న ప్రమాదం జరిగితే నాలుగు రోజుల వరకు మంటలను అదుపు చేయలేకపోయారు. ప్రస్తుతానికి మంటలు ఆరినా మళ్లీ ఉత్పత్తి ప్రారంభమైతే పెద్ద ప్రమాదానికి అవకాశం ఉందని స్థానికులు భయాందోళనలు చెందుతున్నారు. భారీ ప్రమాదం సంభవిస్తే కంపెనీలో కనీసం ఒక్క ఫైరింజన్ కూడా లేదంటే పరిస్థితి ఎంత తీవ్రంగా ఉందో అర్థమవుతుంది.

కనీసం నీటిని కూడా అందుబాటులో ఉంచకపోవడంపై యాజమాన్య ప్రతినిధులపై అగ్నిమాపక అధికారులు మండిపడ్డారు. తాము ఇంతగా శ్రమిస్తున్నా అవసరమైన మేరకు నీటిని కూడా అందించకపోతే తాము ఏమీ చేయలేని పరిస్థితి ఏర్పడుతుందని హెచ్చరించారు.

ఎస్ఇజెడ్‌లలో అగ్ని ప్రమాద రక్షణ యంత్రాలు లేకుండా పోయాయి. ప్రమాదం సంభవిస్తే ప్రాథమిక స్థాయిలో మంటలు ఆర్పేందుకు కనీసం

ఒక వాహనం కూడా లేని పరిస్థితి కొనసాగుతుంది. ఇతర కంపెనీల నుండి, సంస్థల నుండి అగ్నిమాపక శకటాలు వచ్చేవరకూ ఏమీ చేయలేని పరిస్థితి కొనసాగుతుందంటే పరిస్థితుల తీవ్రత అర్థమవుతుంది.

పేలిపోయిన ట్యాంకుల మధ్య దూరం కేవలం 6 మీటర్లు మాత్రమే ఉంది. మూడు వేల కిలో లీటర్ల ప్రమాదకరమైన రసాయనాలను నిల్వచేసే టప్పుడు ఇంత దగ్గరగా ట్యాంకులు నిర్మించడం భద్రతా నిబంధనలకు పూర్తి వ్యతిరేకమని నిపుణులు చెప్తున్నారు.

దువ్వాడ- సత్తివానిపాలెం వద్ద 2003 ఆగస్టులో బయోమ్యాక్స్ ఫ్యూయల్స్ లిమిటెడ్ కంపెనీ ప్రారంభమై 2007లో సంవత్సరానికి 5 లక్షల టన్నుల లక్ష్యంతో ఉత్పత్తి ప్రారంభించింది. భారతదేశంలోనే అతి పెద్ద బయోడీజిల్ కంపెనీలలో ఇది ఒకటి. విదేశాల నుండి ముడి సరుకును రప్పించి మిథనాల్ లాంటి రసాయనాలను ఇక్కడ శుద్ధి చేసి బయోడీజిల్‌ను ఉత్పత్తి చేసి విదేశాలకు ఎగుమతి చేస్తారు.

కరెంటు షార్ట్ సర్క్యూట్ వలన ప్రమాదం సంభవించిందని యాజమాన్యం చెబుతున్నా, ట్యాంకర్లలో సామర్థ్యానికి మించి లోడింగ్ చేయడం వలన ఈ ప్రమాదం జరిగిందని కొంత మంది సిబ్బంది అభిప్రాయపడ్డారు. పక్కనే కేవలం 30-50 అడుగుల దూరంలో మిథనాల్ ట్యాంకులు ఉన్నాయి. అవిగాని ముట్టుకుంటే మరింత భారీ నష్టం వాటిల్లి ఉండేది. అవి అంటుకుంటే దాదాపు 15 కిలోమీటర్ల వరకూ ఉన్న ఊళ్లన్నీ కాలి బూడిదయి ఉండేవని నిపుణులు చెబుతున్నారు.

కంపెనీ వల్ల ప్రమాదం ఉందని ప్రారంభం నుండే స్థానికులు అనేక ఆందోళనలను చేసినా ప్రభుత్వం పట్టించుకోలేదు. తరువాత కంపెనీ వదులుతున్న రసాయన వ్యర్థాల దుర్వాసనను భరించలేని చుట్టు పక్కల ఉన్న సత్తెవానిపాలెం, కోటనరవ, జగ్గయ్యపాలెం, కాపుజగ్గరాజుపేట, డాక్‌యార్డు కాలనీకు చెందిన ప్రజలు నిరసనలు తెలుపుతున్నా యాజమాన్యం పట్టించుకోలేదు.

బయోడీజిల్ తయారీకి ఉపయోగించే పిఎఫ్ఎడి అనే ముడి సరుకు 130 డిగ్రీల సెంటీగ్రేడ్ ఉష్ణోగ్రత దగ్గర గానీ మండదు. అంత ఉష్ణోగ్రత ఎలా సంభవించిందో అర్థం కాక అధికారులు అయోమయంలో పడిపోయారు.

10వ నెంబరు ట్యాంకులో మిథనాల్, బయోడీజిల్ మిశ్రమం ఉన్నట్లు అధికారుల ప్రాథమిక పరిశీలనలో తేలింది. మిథనాల్‌ది వెంటనే మండే స్వభావం. వెంటనే పేలుతుంది కూడా. పిఎఫ్ఎడి ట్యాంకులు పేలినపుడు వాటి నిప్పురవ్వలు ఎక్కడ మిథనాల్ ట్యాంకులపై పడతాయోనని అధికారులు భయాందోళనలకు గురై అలా జరగకుండా ఉండడానికి తీవ్ర ప్రయత్నాలు చేశారు.

డైరెక్టర్ జనరల్ ఆఫ్ స్టేట్ డిజాస్టర్ రెస్పాన్స్ అండ్ ఫైర్ సర్వీసెస్ అయిన టి.ఎ త్రిపాఠి 'బయోమ్యాక్స్ కంపెనీ చట్ట ప్రకారం తీసుకోవలసిన భద్రతా చర్యలేమీ తీసుకోలేదు' అని ప్రకటించారు.

ఆంధ్రప్రదేశ్ పొల్యూషన్ కంట్రోల్ బోర్డు ఛైర్మన్ జి.ఎన్ ఫణి కుమార్ కంపెనీని పరిశీలించి 'కంపెనీ రసాయన ఉత్పత్తుల ప్రక్రియ ముగిసిన అనంతరం విడిచే రసాయన వ్యర్థాలను నిబంధనల ప్రకారం శుద్ధి చేయకుండానే కంపెనీ బయటకు ట్యాంకుల ద్వారా పారబోస్తుంది' అని అన్నారు.

జివిఎంసిలో 20 లక్షల జనాభా ఉన్నారు. నేషనల్ ఫైర్ అడ్వైజరీ బోర్డు రిపోర్టు ప్రకారం 50 వేల జనాభాకు ఒక ఫైర్ స్టేషన్ ఉండాలి. ఒక్కో ఫైర్ స్టేషన్‌లో 16 మంది సిబ్బంది ఉండాలి. దీని ప్రకారం విశాఖలో 40 ఫైర్ స్టేషన్‌లు, 640 మంది సిబ్బంది ఉండాలి. కానీ నగరంలో కేవలం 3 ఫైర్ స్టేషన్‌లు, 80 మంది సిబ్బంది మాత్రమే ఉన్నారు. వాటిలో కూడా అత్యాధునిక ఫైర్ ఫైటింగ్ పరికరాలు లేవు. ప్రమాదం జరిగితే కేవలం 54 మీటర్ల ఎత్తు వరకూ మాత్రమే సహాయం అందించగల స్థాయిలో ఉన్నారు. అంతకంటే ఎత్తు స్థాయిలో ప్రమాదం జరిగితే మంటలను అదుపు చేసే అవకాశం లేదు. నేడు నగరంలో దాదాపు 100 మీటర్ల ఎత్తు వరకూ భవనాలు నిర్మాణం అవుతున్నాయి. ఆ స్థాయికి తగ్గట్లు ఫైర్ ఫైటింగ్ సదుపాయాలు లేవు.

ఇంధన ఉత్పత్తి, నిల్వ, రవాణా జరిపే కంపెనీలలో భారత ప్రభుత్వం జారీ చేసిన పరిశ్రమల చట్టంలో నిబంధనలు అమలు చేయాలి. వీటిలో ప్రాసెస్ అండ్ మేనేజ్‌మెంట్ సిస్టమ్ ప్రమాణాలను ఖచ్చితంగా పాటించాలి. ఈ కంపెనీలు వివిధ రకాల రసాయనాల కలయికతో సంభవించే మంటల అదుపునకు ఫోమ్, డ్రై కార్బనేట్ పౌడర్‌ను అందుబాటులో ఉంచాలి. ఇంధన ఉత్పత్తుల పరిశ్రమలలో చుట్టూ లోపల అగ్ని మాపక నిరోధకాల కోసం పైపు లైన్లను ఏర్పాటు చేయాలి. కంపెనీ సాగించే ఉత్పత్తుల వివరాలను, ప్రమాదం జరిగితే వాటి వలన వచ్చే సమస్యలను ప్రజలకు అర్థమయ్యేలా తెలియజేయాలి. అనుకోకుండా ప్రమాదం జరిగితే సంస్థలోపల చేపట్టాల్సిన ప్రాథమిక విధులు అనుసరించాలి. సంస్థ ఉత్పత్తుల వలన ప్రజలకు వాటిల్లబోయే ప్రమాదాల గురించి కూడా ప్రజలలో అవగాహన కల్పించాలి. కానీ చాలా కంపెనీలలో ఇవేమీ అమలు జరగడం లేదు.

పరవాడలో 2004లో ఫార్మాసిటీ ఏర్పాటు చేశారు. మొత్తం 83 కంపెనీలు ఉత్పత్తులు సాగిస్తుండగా, మరో 20 కంపెనీలు నిర్మాణంలో ఉన్నాయి. 2012 నుండి విశాఖలో దాదాపు 30 ప్రమాదాలు జరిగితే వాటిలో ఫార్మా కంపెనీలలోనే 15 వరకూ జరిగాయి. గత కొద్ది సంవత్సరాలలోనే పది పెద్ద ప్రమాదాలు జరిగి, దాదాపు పది మందికి పైగా చనిపోయారు. 50 మంది గాయపడ్డారు. గ్లోకెమ్ కంపెనీలో మూడుసార్లు, ఆక్టస్ కంపెనీలో మూడు సార్లు ప్రమాదాలు జరిగాయి. ప్రమాదం జరిగిన కంపెనీలోనే మళ్లీ మళ్లీ ప్రమాదాలు జరుగుతున్నా యంటే భద్రతా చర్యలు, పర్యవేక్షణ ఎంత దిగువ స్థాయిలో ఉందో సులువుగానే అర్థమవుతుంది. పరవాడ రాంకీ ఫార్మా సిటీలో 83 పరిశ్రమలు పనిచేస్తున్నా ఒకే ఒక్క అగ్నిమాపక వాహనం అక్కడ ఉందంటే, రేపు పెద్ద ప్రమాదాలు జరిగినప్పుడు ఏం చేయగలరో అన్నది పెద్ద ప్రశ్నగా మారింది.

ఫార్మా కంపెనీలలో మందుల తయారీకి కొన్ని రకాల రసాయనాలను మిశ్రమం చేస్తారు. కొన్నింటిని వేడి చేస్తారు. ఇలాంటి పనులకు రియాక్టర్లను వాడతారు. వీటిలో ఉష్ణోగ్రత అధికంగా ఉంటుంది. రసాయనాల తీరు, లక్షణాలను బట్టి రియాక్టర్లో ప్రెజర్, టెంపరేచర్ నిర్ణయించి మిశ్రమం తయారు చేస్తారు. ఇది నిపుణుల ఆధ్వర్యంలో జరగాలి. ఏమాత్రం అజాగ్రత్తగా ఉన్నా భారీ ప్రాణనష్టం, ఆస్తి నష్టం వాటిల్లే ప్రమాదం ఉంది. రియాక్టర్లలో అధిక పీడనం ఉండడం వలన ప్రమాదం సంభవించినపుడు అవి బాంబుల్లా పేలి తీవ్రనష్టం కలిగిస్తాయి.

ఫార్మా కంపెనీలు చట్టపరమైన నిబంధనలేమీ పాటించడం లేదు. అగ్ని మాపక అనుమతులు లేకుండానే ఉత్పత్తులు ప్రారంభిస్తున్నారు. కాలుష్య నియంత్రణ సూచనలను పెడచెవిన పెట్టి ప్రమాదకరమైన మందులను పెద్ద సంఖ్యలో ఉత్పత్తి చేస్తున్న కంపెనీలు ఉన్నాయి. ఈ విషయాలన్నీ అధికారులకు తెలుసు. నిబంధనలను పాటించడం లేదని

చట్ట ప్రకారం ఆ కంపెనీలను మూసేయాలి. కానీ అధికారులు లంచాలు మింగి ఆ పనులు చేయడం లేదని ప్రజలు బహిరంగంగానే విమర్శిస్తున్నారు.

ప్రతీ సంవత్సరం ఫార్మా కంపెనీలలో రియాక్టర్లు పేలుతూనే ఉన్నాయి. పూర్తి అనుమతులు లేకుండానే కంపెనీలు ఉత్పత్తులు సాగిస్తున్నాయి. తీసుకున్న అనుమతి ఒకటైతే, తయారు చేసే మందులు వేరే రకం ఉంటున్నాయి. నైపుణ్యం కలిగి, శిక్షణ పొందిన వారిని నియమించుకుంటే వారికి అధిక వేతనాలు ఇవ్వాల్సి వస్తుందని స్థానికంగా లభించే వారితో తక్కువ వేతనాలకు పని చేయించుకుంటున్నారు. దీనితో సరైన అవగాహన లేని పర్యవేక్షణ వలన ప్రమాదాలు పెరిగిపోతున్నాయి.

విశాఖపట్టణంలో 2015 మే 6 నుండి జాతీయ విపత్తుల నిర్వహణా సంస్థ, పెట్రోలియం, నేచురల్ గ్యాస్ రెగ్యులేటరీ బోర్డు, ఫెడరేషన్ ఆఫ్ ఇండియన్ చాంబర్ ఆఫ్ కామర్స్ అండ్ ఇండస్ట్రీ, కెమికల్ ఇండస్ట్రియల్ డిజాస్టర్ మేనేజ్‌మెంట్ తదితర సంస్థలన్నీ కలిసి 'పరిశ్రమల భద్రత' పై మూడు రోజుల సదస్సు నిర్వహించారు. ఈ సదస్సులో రాష్ట్ర భూమి, విపత్తుల నిర్వహణ శాఖ ముఖ్య కార్యదర్శి జగదీష్ చందర్ మాట్లాడుతూ 'రాష్ట్రంలోని 50 శాతం పరిశ్రమలలో భద్రతా ఏర్పాట్లు సరిగ్గా లేవని, పరిశ్రమలలో రసాయన సంబంధిత ప్రమాదాలు ఎక్కువవుతున్నాయని' పేర్కొన్నారు.

**కొనసాగుతున్న ప్రమాదాలు**

- 1997 సెప్టెంబర్ 14న ఎచ్‌పిసిఎల్‌లో గ్యాస్‌లీక్‌తో భారీ పేలుళ్లు, మంటలలో 60 మంది ప్రాణాలు కోల్పోయారు. 2013 అదే కంపెనీలో కూలింగ్ టవర్ కూలి 30 మంది బలైపోయారు.
- 2013 జనవరి 5న నక్కపల్లి హెటిరో ఔషద కంపెనీలో రియాక్టర్ పేలిన ఘటనలో నలుగురు చనిపోగా, ఇద్దరు తీవ్ర గాయాలపాలయ్యారు.
- 2014 పరవాడ ఫార్మాసిటీలోని ఆక్టాస్ ఔషద కంపెనీలో రియాక్టర్ పేలింది.
- ఇదే ఏడాదిలో గ్లోకెం ఫార్మా కంపెనీలో రెండుసార్లు రియాక్టర్లు పేలడంతో భారీ ప్రమాదం జరిగింది.
- 2015 సెప్టెంబర్ 28న పరవాడ సాయినార్ ఔషద కంపెనీలో రియాక్టర్లు పేలడంతో శ్రీనివాస్, హరీష్‌కుమార్ అనే ఇద్దరు కార్మికులు మృతి చెందారు. ఐదుగురికి తీవ్రగాయాలయ్యాయి.
- 2015 ఆగస్టు 24 పరవాడ రాంకీ ఎస్ఇజెడ్‌లోని అలివెరా యానిమల్ హెల్త్ లిమిటెడ్‌లో ప్రొడక్షన్ ఉత్పత్తి రసాయన ప్రయోగశాలలో ఒక్కసారిగా దట్టమైన పొగలు వ్యాపించి మంటలు చెలరేగాయి. మంటలను, శబ్దాలను గమనించిన 'ఎ' షిఫ్టు కార్మికులు బయటకు పరుగులు తీయడంతో పెద్ద ప్రాణనష్టం తప్పింది.
- 2015 డిసెంబర్ 6న అర్థరాత్రి దాటిన తరువాత పరవాడ ఫార్మాసిటిలోని మైలాన్ లేబొరేటరీస్‌లో జరిగిన ప్రమాదంలో ఇద్దరు కార్మికులు తీవ్రంగా గాయపడ్డారు.
- 2016 జనవరి 24న పాయకరావుపేట మండలం కేశవరం డెక్కన్ ఫైన్ కెమికల్ ఫ్యాక్టరీలో భారీ అగ్ని ప్రమాదం చోటుచేసుకుంది. ఇక్కడ ఎటువంటి ప్రాణ నష్టం జరగనప్పటికీ కార్మికులు, పరిసర ప్రాంత ప్రజలు భయాందోళనలకు గురయ్యారు. డెక్కన్ ఫైన్ కెమికల్ కంపెనీలో రసాయనాలు నిల్వచేసే కోల్డ్ స్టోరేజ్‌లో పెద్ద ఎత్తున మంటలు ఎగిసి పడడంతో అగ్నిమాపక శాఖ వెంటనే స్పందించి మంటలు అదుపు చేసింది. ఈ కంపెనీలో గతంలో రియక్టర్ పేలిన ఘటనలో ఐదుగురు కార్మికులు మృతి చెందారు. మరో 20 మంది కార్మికులు గాయపడ్డారు.
- 2016 ఏప్రిల్ చిప్పాడ దివీస్ లేబొరేటరీస్‌లోని ఎచ్ బ్లాక్‌లో అగ్ని ప్రమాదం సంభవించింది. ఈ ప్రమాదంలో ముగ్గురు కార్మికులు తీవ్రంగా గాయపడగా, వారిలో ఇద్దరు మృతి చెందారు.
- ఏప్రిల్ 26న దువ్వాడ బయోమ్యాక్స్ ప్యూయల్స్ లిమిటెడ్‌లో అగ్నిప్రమాదం సంభవించి 18 ట్యాంక్‌లకు గానూ 12 బయోడీజిల్ (క్రూడాయిల్ ట్యాంక్) లు కాలిపోయాయి. ప్రాణ నష్టం జరగలేదు.

మంత్రులు, అధికారులు ప్రమాదం జరిగిన వెంటనే పెద్ద హడావుడి చేసి తీవ్రమైన చర్యలు తీసుకుంటామని, బాధ్యులను ఎట్టి పరిస్థితులలోనూ వదలబోమని ప్రతీసారీ ప్రకటిస్తారు. కానీ అవన్నీ ఒట్టి మాటలేనని ప్రజలకు అనుభవమే. ఫార్మా రంగంలో లాభాలు భారీగా వస్తున్నాయని ప్రజా ప్రతినిధులలో అనేక మంది వాటిలో భాగస్వాములు కావడంతో ప్రజలకు న్యాయంచేసే దిక్కులేకుండా పోయిందని ప్రజలు వాపోతున్నారు. ప్రతిసారీ విచారణకు ఆదేశిస్తారు. కానీ అవి కేవలం కంటి తుడుపు చర్యలుగా, తూతూ మంత్రంగా జరిగి ఎవరి మీదా ఎటువంటి చర్యలు లేకుండానే ముగిసిపోతాయి.

ఇప్పటికే కొనసాగుతున్న నష్టం చాలదన్నట్లు ప్రజల జీవితాలను మరింత ప్రమాదంలోకి నెట్టడానికి విశాఖ జిల్లాలో 2వ ఫార్మసిటీ ఏర్పాటుకు సన్నాహాలు చేస్తున్నారు. అచ్యుతాపురం, నక్కపల్లిల మధ్య దాదాపు 500 ఎకరాల స్థలంలో ఈ పరిశ్రమలను ఏర్పాటు చేస్తారు. ఉత్తరాంధ్ర ప్రాంతంలో తమ పరిశ్రమలు పెట్టడానికి బడా కార్పొరేట్ సంస్థలు పరుగుపెడుతున్నాయి. ఎందుకంటే వారికిక్కడ ఎటువంటి అడ్డంకులు లేని, అనుకూలమైన చోట స్థలాలు, అవసరమైన ఎయిర్‌పోర్టు, హైవేలు, సముద్ర సంధానం లాంటి అనుకూల అంశాలు ఉన్నాయి. కానీ ఈ క్రమంలో ప్రజల ప్రాణాలు పోయినా లాభాలే వారికి ముఖ్యం.

ప్రత్యేక ఆర్థిక మండళ్లలో ఏర్పాటైన ఈ పరిశ్రమలు చాలా ప్రమాదకరమైన ఉత్పత్తులు కొనసాగిస్తున్నాయి. వీటిలో భద్రతా ప్రమాణాలు, ఫైర్ సేఫ్టీ మేనేజ్‌మెంట్ ఏ స్థాయిలో ఉన్నాయో ప్రమాదాల చరిత్రే చెబుతుంది. ఈ ప్రమాదాల వలన అనేక మంది కార్మికుల ప్రాణాలు బలైపోతున్నాయి. అనేక మంది అవయవాలు కోల్పోయి వికలాంగులుగా మారుతున్నారు. ఈ పరిశ్రమల చుట్టు ప్రక్కల ప్రాంతాలలో నివసిస్తున్న ప్రజలు నిరంతరం ప్రాణాలు అరచేతిలో పెట్టుకుని బితుకు బితుకుమని జీవిస్తున్నారు. ఎప్పుడు ఏ కంపెనీలో పేలుతుందో, ఏ ప్రాణాలు తీసే రసాయనాల ప్రమాదం ముంచుకొస్తుందో ననే భయంతోనే బతుకుతున్నారు. భోపాల్ లాంటి అనుభవం ఉత్తరాంధ్ర ప్రజలకు ఏ క్షణాన ఎదుర్కోవలసి వస్తుందోనని ప్రజలు భీతిల్లిపోతున్నారు. రాజకీయ నాయకులు, మంత్రులు, మా చేతుల్లో ఉన్నారనే అహంకారంతో ఈ బడా కార్పొరేట్ కంపెనీలు చట్ట ప్రకారం తీసుకోవలసిన కనీస భద్రతా చర్యలు తీసుకోవడం లేదంటే పరిస్థితి ఎంత దారుణంగా ఉందో అర్థమౌతుంది. ప్రజల ప్రాణాలు తీసే హక్కు వీరికెవరిచ్చారని ప్రశ్నించాల్సిన అవసరంతో పాటు, ఉత్తరాంధ్రను మరో భోపాల్‌లా తయారు చేయకుండా, ప్రజలను చైతన్య పరచి, ఐక్యపోరాటాల ద్వారా అడ్డుకోవాల్సిన బాధ్యత మనందరి మీదా ఉంది.

*(రచయిత సామాజిక కార్యకర్త)* వీ

# అభివృద్ధి పై చర్చ జరగాలి

*ఏ ప్రభుత్వ కార్యక్రమం మీదనైనా ప్రజలలో విస్తృతంగా చర్చ జరిగినప్పుడే ప్రజాస్వామ్యం వికసిస్తుందంటున్నారు*

**హారతి వాగీశన్**

అభివృద్ధి (డెవలప్‌మెంట్) అనే మాటకు సామాజిక శాస్త్రాల్లో దాదాపు రెండువందల సంవత్సరాల నుండి ప్రచారం ఉన్నది. ప్రగతి (ప్రొగ్రెస్), పురోగమనం (అడ్వాన్స్‌మెంట్) అన్న మాటల తరువాత ఈ మాటకు ఎక్కువ ప్రచారం జరిగింది అనిపిస్తుంది. విమోచన (ఎమాన్సిపేషన్) అన్న మాట ప్రధానంగా పీడనకు గురి అవుతున్న శ్రేణులకు బాగా నచ్చిన మాట అనిపిస్తుంది. అభివృద్ధి అన్నమాట వినవచ్చిన ప్రతిసారీ ఈ మాటలు గుర్తుకు రావడం కాకతాళీయం కాదు. స్థూలంగా మనిషి గౌరవప్రదమైన మనుగడ సాగించేందుకు కావలసిన స్వేచ్ఛా సమానత్వాల సంపుటి ఏమిటి అన్న ప్రశ్నకు ఆయా స్థల కాలాల్లో వచ్చే తర్క బద్ధమైన జవాబే అభివృద్ధి అనిపిస్తుంది. ఇక్కడ గౌరవప్రదమైన మనుగడ అన్నమాట కీలకమైనది. ఆలోచనా భావ ప్రకటనా స్వేచ్ఛలు, పుట్టుక ఆధారమైన వివక్షలేని తనం, నిలకడగలిగిన (సస్టైనబుల్) బతుకుదెరువు అనే మూడు రాజీలేని అంశాలు గౌరవ ప్రద జీవితంలో ఉండాలని అనుకుంటే తప్పు కాదు అనిపిస్తుంది.

ఇక అభివృద్ధి గురించి క్షేత్రస్థాయిలో జరగవలసినది ఏమిటి అన్న ప్రశ్నకు వస్తే, ప్రతి మనిషి కనీస స్థాయి నేర్పులు గల దశకు చేరుకునే స్థితి ఉండడం, సహజ వనరుల సద్వినియోగం జరగడం. ఈ పై రెండూ ప్రాధాన్యతల అమలు వల్ల, సమత్వమూ స్వేచ్ఛా ప్రతి ఒక్కరికీ అందే తీరులో పాలనారూపం ఉండడం అని జవాబు చెప్పడం సాధ్యమే అనిపిస్తుంది. దీనిలో న్యాయ భావన అందునా సామాజిక న్యాయ భావన అనివార్యంగా ఉంటుంది. పై కారణాలవల్ల ప్రజాస్వామిక పాలనా రూపాలు ఉన్న దేశాలలో అభివృద్ధి అన్న అంశం చుట్టూ నిరంతరం చర్చ – చర్య (ఆలోచనా – ఆచరణ) జరుగుతూ ఉండాలి. అభివృద్ధి అనేది కేవలం ప్రభుత్వం చేసే పని అనుకుంటే అది ప్రజాస్వామికం కాదు. (ప్రజాస్వామ్య) ప్రభుత్వం చేసే ప్రతిపనీ చెడ్డదే కాకపోవచ్చు కానీ అది అభివృద్ధి అనే పేర చేసే ప్రతిపనీ, జాగ్రత్తగా గమనించదగినదీ, పరిశీలించదగినదీ అనడంలో సందేహం అక్కరలేదు. ఈ గమనింపు పరిశీలనలే ప్రజాస్వామిక పాలన మంచి ఫలితాలను ఇచ్చేందుకు తోడ్పడుతుంది. ఈ గమనింపు పరిశీలనలు పక్షపాతం లేని హేతు దృష్టితో, ఉన్నది ఉన్నట్టు చూసే పద్ధతిలో సాగాలి. అసలు జవ జీవాలున్న సారవంతమైన (సబ్‌స్టేంటివ్) ప్రజాస్వామికం అంటేనే అది.

ఈ చర్చ – ఆచరణలు ఏ రూపంలో ఉండాలి? అవి ఎట్లా జరుగాలి? వాటిని ఏ ఏ బృందాలు ఏ ఏ స్థాయిలలో చేస్తూ ఉండాలి? ఆ చర్చా చర్యలకు ప్రజాస్వామిక ప్రభుత్వానికీ మధ్య సంబంధం ఎట్లా ఉండాలి? అనేవి చాల అవసరమైన ప్రశ్నలు. తెలంగాణలో ఈ దిశగా జరుగవలసిన ప్రయత్నం పెద్దది. సాధారణంగా పార్లమెంటరీ అధికారపక్షానికి వ్యతిరేకంగా ఉండే ప్రతిపక్ష రాజకీయాలు, పార్లమెంటరీ రాజకీయాలను తిరస్కరించిన రాజకీయాలు మాత్రమే అలవాటైన తెలంగాణలో ఇది మరింత ముఖ్యం. తెలంగాణ ఉద్యమ సమయంలో పార్లమెంటరీ రాజకీయాలతో సంబంధం లేని అనేక బృందాలు తెలంగాణ చేతన కోసం చేసిన ప్రయత్నం మాదిరిగానే ఇప్పుడు తెలంగాణలో అభివృద్ధి అన్న అంశం మీద చర్చ జరగాలి. అది కేవలం ప్రస్తుతం అధికారంలో ఉన్న పార్టీ చేస్తున్న లేక చెయ్యని పనులకు స్పందన కానక్కరలేదు. ప్రస్తుతం అధికారంలో ఉన్న పార్టీ తెలంగాణ ఏర్పాటులో కీలక పాత్ర వహించిన మాట నిజమే. దానికి రాబోయే కాలంలో తెలంగాణలో అధికారంలో ఉండాలనే కోరిక ఉండడమూ అసహజమేమీ కాదు. అయితే తెలంగాణ ఎట్లా ఉండాలి అనే విషయం ఆ పార్టీకీ దాని నాయకునికీ మాత్రమే సంబంధించిన విషయం కాదు అనే ఎరుక ఉండడమూ అవసరం.

అయితే అభివృద్ధికి సంబంధించిన మానవ వనరుల వికాసం, సహజవనరుల వికాసం, సమత్వం, స్వేచ్ఛలతో (న్యాయం–సామాజిక న్యాయాలతో కూడి) సాగాలంటే ఆ చర్చ రాజకీయ చర్చగా కూడా మారక తప్పదు. ఇక్కడ రాజకీయం అంటే కేవలం పార్టీ రాజకీయాలు అనే అర్థంలో కాక భిన్న రాజకీయ దృక్పథాలు అని అర్థం చేసుకోవాలి. రాజ్యం, మార్కెట్, సమాజం ఎట్లా ఉండాలి, అభివృద్ధి అనే విషయంలోని ప్రధాన అంశాలు అయిన విద్య, ఆరోగ్యం, బతుకుదెరువులు (జీవనాధారాలు–లైవ్లీహుడ్స్) అన్న వాటి వికాసంలో ఈ రాజ్యం (ఇక్కడ తెలంగాణ ప్రభుత్వం), సమాజం, ఇక్కడి మార్కెట్ శక్తులూ ఎటువంటి పాత్ర వహించాలి అనేవి చర్చనీయాంశాలు ఔతాయి. అసమానతలు, స్వేచ్ఛ లేమి గల సామాజిక ఆర్థిక వాస్తవికత గల ప్రాంతంలో వివిధ ప్రాధాన్య అంశాలలో పనులు ఎట్లా సాగాలి, వాటి దిశ దశ ఎట్లా ఉండాలి అనేవి చర్చకు వస్తవి.

ప్రతి కీలక అభివృద్ధి సంబంధిత అంశం చుట్టూ సమాచారంతో కూడిన హేతుబద్ధ చర్చ జరగాలి అంటే ముందుగా ప్రభుత్వం ఆయా రంగాల విషయంలో చేస్తున్నది ఏమిటి అన్న విషయం స్పష్టం కావాలి. అంటే ఆరోగ్యకరమైన చర్చకు ప్రభుత్వం ముందు సిద్ధంగా ఉండాలి. అట్లనే ప్రతి కీలక అభివృద్ధి అంశం చుట్టూ విధాన రూపకల్పన (పాలసీ మేకింగ్) నుండి మొదలు క్షేత్ర స్థాయి అమలు (ఫీల్డ్ లెవల్ ఎక్సిక్యూషన్) లో అనుభవం గలవారి బృందాలు అట్టడుగు జనావాసం (హాబిటేషన్) నుండి పై స్థాయి వరకు ఉండాలి. ఒక చర్చ, మద్దతు, మదింపు బృందం ప్రతి అభివృద్ధి అంశం చుట్టూ ఉండాలి.

ఉదాహరణకు అంగన్‌వాడీలను మెరుగు చేసుకోవడం ఎట్లా అనే చర్చ–చర్య విషయం చూద్దాం. ప్రభుత్వం వాటిని ప్రైమరీ స్కూల్స్‌తో జోడించాలి అనుకుంటున్నది. అంగన్‌వాడీలలో ప్రీ ప్రైమరీ విద్య ఒక అంశం మాత్రమే. అంగన్‌వాడీలు దానితో పాటు యవ్వనప్రాయపు యువతుల ఆరోగ్యం, గర్భిణుల ఆరోగ్య పోషణ అంశాలను చూస్తున్నాయి. ఆ రకంగా అవి ఆరోగ్య అంశాలు కూడా చూస్తున్నాయి. ఈ రెండూ అత్యంత కీలక అంశాలు. వీటిని ఎట్లా బలోపేతం చెయ్యాలి అనేది చర్చ కావాలి. అసలు ఈ రోజుకీ అంగన్‌వాడీని 'ప్రాజెక్ట్' అని పిలువడం సబబేనా అన్నచోట చర్చ మొదుల కావాలి. అధికారానికి

# గోదాలో హోదా - అయోమయంలో అభివృద్ధి

***కేంద్ర ప్రభుత్వం ఆంధ్రప్రదేశ్‌కు ప్రత్యేక హోదా ఇవ్వనని చెప్తున్నా రాష్ట్ర ప్రభుత్వం ఇంకా నాన్చుడు ధోరణే అవలంబిస్తూ ప్రజలను మభ్యపెట్టడానికి ప్రయత్నిస్తోందని అంటున్నారు*** **వైఎచ్‌కె మోహన్‌రావు**

వాగ్ధాన భంగంలో మన రాజకీయ నాయకుల తీరు 'అతని కంటే ఘనుడు ఆచంట మల్లన్న' అనే నానుడికి సరిగ్గా అన్వయం అవుతుంది. అధికారంలోకి వచ్చిన పిదప ఇచ్చిన హామీలను తుంగలో తొక్కడంలో మన పాలకులకు గిన్నీస్ రికార్డ్, నోబుల్ బహుమతి అంతకు మించి ఇంకేదైనా ఉంటే ఆ బహుమతి కూడా ఇవ్వవచ్చు. అవి కూడా మన నాయకులకు సరిపోవని చెప్పవచ్చు. తెలుగు నేల రెండు రాష్ట్రాలుగా విడిపోయి దాదాపు రెండేళ్లు ముగుస్తున్న సందర్భంలో ఆంధ్రప్రదేశ్‌కు ప్రత్యేక హోదాపై పార్లమెంట్‌లో ఎంపి అవంతి శ్రీనివాస్ అడిగిన ప్రశ్నకు కేంద్ర ప్రభుత్వ పాలకుల నుండి అధికారికంగా వెలువడిన సమాధానం అవశేష ఆంధ్రప్రదేశ్‌కు అశనిపాతమైంది. కేంద్ర ఆర్థిక శాఖా సహాయ మంత్రి జయంత్ సిన్హా పార్లమెంట్‌లో ఆంధ్రప్రదేశ్‌కు ప్రత్యేక హోదా ఇవ్వడం కుదరదని ఇచ్చిన లిఖితపూర్వక సమాధానం తీవ్ర శరాఘాతమై రాష్ట్ర ప్రజల మనసులను గాయపరిచింది. రెండేళ్లుగా ఊరిస్తున్న ప్రజల ఆశల పల్లకిపై ఒక్కసారిగా పిడుగుపడినట్లు రాష్ట్రం ఉలిక్కిపడింది. ఈ శూన్య ప్రకటనతో రాష్ట్ర ప్రత్యేక హోదా మిథ్యగా మారి అభివృద్ధి అయోమయంలోకి జారింది. హోదాతో పన్నుల మినహాయింపు సౌలభ్యం వనగూడి రాష్ట్రానికి ఇబ్బడి ముబ్బడిగా పరిశ్రమలు పరుగులు తీస్తాయని, పారిశ్రామికీకరణతో కొల్లలు కొల్లలుగా కొలువులు ఏర్పడతాయని, ఉద్యోగాలు లభిస్తాయనే నిరుద్యోగ యువత ప్రగాఢ విశ్వాసంపై నిప్పుల వాన కురిసినట్లు అయింది.

కేంద్ర ఆర్థిక శాఖా సహాయ మంత్రి సిన్హా ప్రకటనతో రాష్ట్ర ప్రజల స్వరాలన్నీ అదుపు తప్పుతున్నాయి. మనసుల్లో మంటలు రాజుకుంటు న్నాయి. గళాలన్నీ కట్టు, గట్టు దాటుతున్నాయి. ఆగ్రహ జ్వాలలై చుట్టుముట్టడమే తరువాయి. ఇప్పటికే అనంతపురం, విజయవాడలో హోదా సాధన సమితి ఆధ్వర్యంలో నడిచిన నిరసన కార్యక్రమాలు నిప్పును అంటించాయి. వైఎస్‌ఆర్‌సిపి మే 10న రాష్ట్ర వ్యాప్త నిరసన నిర్వహించింది. రాష్ట్రంలోని ప్రతిపక్ష పార్టీలన్నీ హోదా కోసం తెగబడి పోరాడే పరిస్థితి గోచరిస్తుంది. రాష్ట్ర పాలక ప్రభుత్వంపై, కేంద్ర బిజెపి పాలనపై పోరాటం ఉధృతం చేయనున్నాయి. ఈ పూర్వ రంగంలో కేంద్ర ప్రభుత్వం, రాష్ట్ర ప్రభుత్వం దోషులుగా నిలిచిపోనున్నాయి. అయినా కేంద్ర పాలక బిజెపి ప్రభుత్వం హోదాపై ససేమిరా అంటూ తల అడ్డం తిప్పుతుంది. ఇక రాష్ట్ర పాలక టిడిపి ప్రభుత్వం తరపున ముఖ్యమంత్రి ఉడుత చూపులే చూస్తున్నారు. ఇంకా ఆయన నంగి నంగి పలుకులే వినిపిస్తున్నాయి. హోదాపై మెతక మాటలే వల్లేవేస్తున్నారు. ఎక్కడ బిజెపితో నెయ్యం కూలిపోతుందోననే ఆందోళనలోనే ఉన్నారు. ఆయన ఈ ప్రకటన అనంతరం కూడా తన పార్టీ శ్రేణులకు గీతా బోధన చేస్తూ ఘర్షణ వైఖరిగా మాట్లాడవద్దని సెలవిచ్చారు. బిజెపి పాలక ప్రభుత్వంతో కయ్యం రాష్ట్రానికి శ్రేయస్కరం కాదని సందేశమిచ్చారు. తగవు వలన ఇప్పుడు అందుతున్న సాయం కూడా అందదనే భయంలో బాబు కొట్టుమిట్టాడు తున్నట్లు కనిపిస్తున్నాడు.

ఒకసారి రెండేళ్లు వెనక్కు వెళ్లి ఎన్నికల సమయాన్ని నెమరు వేసుకుందాం. సిపిఎం మినహా మిగిలిన అన్ని రాష్ట్ర జాతీయ పార్టీలు కూడా రాష్ట్ర విభజనకు సమ్మతిని ఏదో ఒక రూపంలో ఆమోదం తెలిపినవే. టిడిపి అయితే రెండు పర్యాయాలు తమ పార్టీ తీర్మానాన్ని కేంద్రానికి పంపింది. శాసనసభలో అప్పటి కాంగ్రెస్ ప్రభుత్వాన్ని నిలదీస్తూ 'మీరు తీర్మానం పెట్టండి మేము మద్దతు ఇస్తాం. సత్తా లేకపోతే ప్రతిపక్ష పార్టీగా టిడిపి తీర్మానం ప్రవేశ పెడతాం' అంటూ సవాళ్లు విసిరిన చంద్రబాబు విభజన జరిగిపోయిన తరువాత కూడా అనుకూల వైఖరే ప్రదర్శించాడు. హోదా విషయమై కాంగ్రెస్ పార్టీ తరపున పార్లమెంట్‌లో ప్రధాని మన్మోహన్ సింగ్ ఐదు సంవత్సారాలు ప్రకటిస్తే, భారతీయ జనతా పార్టీ తరపున రాజ్యసభలో సభ్యుని పాత్రలో పది సంవత్సరాలు కావాలని వెంకయ్యనాయుడు ప్రవేశపెట్టిన తీర్మానం వీగిపోయింది.

---

దూరంగా ఉండే కులవర్గాల ప్రజలకు పనికి వచ్చే ఈ కార్యక్రమం పట్ల పట్టింపు అవసరం. అసలు క్షేత్ర స్థాయిలో ఏమి చేస్తే అవి బాగు పడుతాయో అన్న విషయాన్ని ఆ రంగంలో ఉన్న వారితో చర్చించాలి. ఆ చర్చలో ముందుకు వస్తున్న అంశాలకు సంబంధించిన పబ్లిసిటీ జరగాలి. ఒక నిర్ణీత కాల అవధిలో – అంటే ఒక ఆరు నెలల కాలంలో చర్చ, ఒక ఆచరణతో కూడిన ముగింపుకు రావాలి. నిర్ణయాల అమలు–అవసరాన్ని బట్టి సవరణ అనేవి నిరంతరం సాగాలి. ఈ చర్చల గురించి పబ్లిసిటీ ఉండాలి (పబ్లిసిటీ అనేదే చర్చకు తోడ్పాటు అందించే సాధనం). తీసుకున్న నిర్ణయాల అమలును చర్చలో పాల్గొన్న విషయ పరిజ్ఞానం గల వారిచే మదింపు (మానిటర్) చేసే వీలు ఉండాలి. ఇదీ మౌలిక అంశాలకు సంబంధించి చర్చ–చర్య జరుగవలసిన తీరు.

ఎలాంటి విధాన నిర్ణయం విషయంలోనైనా ఇదే పద్ధతి సాగితే మంచిది. ఐతే తెరాస ప్రభుత్వం దీనికి సుముఖంగా ఉంటుంది అని అమాయకంగా నమ్మలేం. మన ప్రజాస్వామ్యంలో నాయకులూ వారి ఆరాధనా ప్రధాన లక్షణంగా మారిన స్థితి ఉన్నది. తెలంగాణ ప్రస్తుతం దానికి మినహాయింపు ఏమీ కాదు. అట్లని చేతులు ముడుచుకొని కూర్చోవడమో, మూతులు ముడిచి అలగడమో, చాటు మాటుగా సర్కారును దెప్పడమో, లేక పత్రికలలో కనిపించేందుకు ప్రభుత్వం మీద కొన్ని డిమాండ్లు చేస్తే సరిపోదు. తెలంగాణ పౌరసమాజం ఈ విషయాన్ని ఎంత తొందరగా గుర్తిస్తే అంత మంచిది.

ఆలోచన, ఆచరణ, నిర్మాణం, పరిశీలన, మదింపు, నేర్పు, ప్రచారం, అన్న గొలుసుకట్టు పద్ధతిలో పనులు జరగాలి. తెలంగాణ సమాజం, సర్కారు దానికి సిద్ధంగా ఉన్నాయా అన్నది కీలక ప్రశ్న.

*(రచయిత నల్సార్ విశ్వవిద్యాలయంలో అధ్యాపకులు)* వీ

పది సంవత్సరాలు కూడా చాలదని చంద్రబాబు 15 సంవత్సరాల పాటు హోదాను డిమాండ్ చేశారు. తాము అధికారంలోకి వస్తే 15 సంవత్సరాలు సాధిస్తామని చెప్పుకొచ్చారు. ఇదే అంశాన్ని ఆయన తన ఎన్నికల ప్రణాళికలో పొందుపరిచారు.

ఏమి రాబట్టాడు? కేంద్రంతో సయోధ్యతోనే రాష్ట్రానికి అధిక సహాయం అందుతుందని, నిధులు ఎక్కువగా వస్తాయని చెబుతున్న చంద్రబాబు మాటల్లో డొల్లతనం తప్ప వాస్తవాన్ని గమనించలేం. రెండు సంవత్సరాల పాలనలో కేంద్రంతో భాగస్వామ్యంతోనే కాలం సఖ్యతతో నడిచింది. కేవలం ఇతర రాష్ట్రాలు మాదిరిగానే ఆంధ్రప్రదేశ్‌కు కూడా జనాభా ప్రాతిపదికన ఆర్థిక సంఘం సిఫార్సుల మేరకే సాయం అందిందని, అంతకు మించి ఒక్క రూక కూడా రాలేదని ఎపి ఆర్థిక శాఖాధికారులు గణాంకాలతో వల్లెవేస్తున్నారు. 2014-15లో 35 వేల కోట్లు, 2015-16లో 43,467 కోట్లు కేంద్రం నుండి సాయంగా వచ్చినట్లు ప్రకటించిన ఎపి ఆర్థిక శాఖ ఈ మొత్తంలో ఒక్క రూపాయి కూడా ప్రత్యేక సాయంగా చెప్పడానికి వీల్లేదని తెగేసి తేల్చింది. అయినా ఇప్పటికీ చంద్రబాబు స్వర వరవడిలో మార్పేమీ కనిపించడం లేదు. 2016-17 బడ్జెట్‌లో గానీ, నీతీ అయోగ్ సమావేశంలో గానీ, ఎపికి ప్రత్యేక హోదా గురించి గానీ, ప్రత్యేక సాయం గురించి గానీ ఏ విధమైన సానుకూల ప్రకటన రాకపోయినా బాబు కిమ్మనలేదు. కాగా ఇప్పుడు కేంద్ర ఆర్థిక శాఖ సహాయ మంత్రి సిన్హా ప్రత్యేక హోదా ప్రకటన అనంతరం కూడా చంద్రబాబు తీరులో మార్పు కనిపించలేదు. పైగా తన సహచర పార్టీ నేతలను కేంద్రంపై దురుసుగా మాట్లాడవద్దని బోధించారు. 16 వేల కోట్ల లోటు బడ్జెట్‌తో పాటు ఎపికి అనేక అవసరాలు తక్షణమే ఒనగూర్చాల్సిన కేంద్రం ఆ దిశగా కనీస ఆలోచన చేయకపోయినా చంద్రబాబు మౌనంగానే ఉంటున్నారు. ఎన్నికల సందర్భంగా బిహార్‌కు, జమ్మూ కశ్మీర్‌కు లక్షల కోట్ల ప్రత్యేక ప్యాకేజీలు ప్రకటించిన ప్రధాని మోడీ ఎపి పట్ల తిరస్కార వైఖరినే ప్రదర్శిస్తున్నారు.

ఏమిటో మౌనం! ఎందుకీ ధ్యానం. రాష్ట్రానికి ఏ సాయమూ రానప్పటికీ ప్రధాని మోడీ చాలా ఇచ్చారు, చాలా చేశారు అంటూ చంద్రబాబు భజన చేయడం వెనుక మర్మమేమిటి? అమరావతి శంఖుస్థాపనకు వచ్చిన మోడీని ఇదే విధంగా కీర్తించడాన్ని మనం చూసి ఉన్నాం. ఈ కీర్తనల పూర్వ రంగం ఏమై ఉంటుంది? మోడీ అంటే భయపడుతున్నాడనే అనుమానం కలుగుతుంది. తన ప్రభుత్వానికి మోడీ వలనా, కేంద్ర ప్రభుత్వ బిజెపి ప్రభుత్వం నుండి ముప్పుందని ఆందోళన ఉన్నట్లుగా తోస్తుంది. తన బలగాలను పక్కకు నడిపించి తనపై తన ప్రభుత్వంపై వేటు వేస్తారనే సంశయం బాబును వెంటాడుతున్నట్లుగా అనిపిస్తుంది. అందువలననే తన ప్రభుత్వానికి తగినంత, సరిపోయినంత బలం ఉన్నప్పటికీ వైసిపి పార్టీ నుండి శాసన సభ్యులను తన పార్టీకి చేర్చుకుని గుంపును మరింత పెంచుకుంటున్నాడు. అవసరం లేకపోయినా ఇతర పార్టీకి చెందిన శాసనసభ్యులను ప్రలోభాలకు గురిచేసి తన పక్షానికి చేర్చుకుంటున్నాడు. అంతేగాక మోడీతో పెట్టుకుంటే విచారణలు కూడా ఎదుర్కోవలసి ఉంటుందనే ఆందోళన చెందుతుండవచ్చు.

ఉత్తరాఖండ్ ముఖ్యమంత్రి రావత్ పైకి సిబిఐని ఉసికొల్పినట్లు తనపై కూడా మోడీ తలచుకుంటే సిబిఐ అస్త్రాన్ని ప్రయోగిస్తే తన పరిస్థితి ఏమిటనే అభద్రతలో కూడా ఉన్నాడేమోననే సంశయం కలుగుతుంది. మోడీపై తగిన నమ్మకం లేనట్లుగా కనిపిస్తుంది. ఎందుకంటే మోడీ వాజ్‌పేయ్‌కీ చాలా భేదం ఉంది కదా? మోడీ వాజ్‌పేయి అంతటి పెద్ద మనిషి కాదుకదా? వాజ్‌పెయ్ ప్రధానిగా ఉన్నప్పుడు లోక్‌సభ స్పీకర్ ఎన్నికకు బిజెపి అభ్యర్థి ఖరారు చేసుకున్న అనంతరం చంద్రబాబు ఫోన్ సూచనతో మార్చుకున్న సంగతి మనకు తెలిసిందే! ఇప్పుడట్లా కాదు. బిజెపికి కేంద్రంలో సరిపోయినంత సంఖ్యా బలం ఉంది. అప్పటి మాదిరిగా 'దేశం' సహకారం కేంద్ర బిజెపికి అవసరం లేదు. అందుకే బాబు భయంతో ఉన్నాడనిపిస్తుంది. మోడీతో పెట్టుకుంటే ఒక జగన్, ఒక కణిమొళి, ఒక రాజా లాగా తను కూడా ఇబ్బంది పడవలసి వస్తుందనుకుంటున్నారా! బాబు.

ఇదే కోవలో ఓటుకు నోటు కేసులో ఇప్పటికే పీకల్లోతుల్లో మునిగి ఉన్న చంద్రబాబు ఈ కేసుతో తెలంగాణలో తను ఏమి కోల్పోయాడో అనుభవంతో ఉంది. ఈ నేపథ్యంలోనే కేంద్రంతో తలపడడానికి వెనుకాడుతున్నట్లుగా చెప్పవచ్చు. తెలంగాణలో ఓటు నోటు కేసును అడ్డుపెట్టుకుని కెసిఆర్ టిడిపిని నేల మట్టానికి తొక్కినా బాబు పెదవులు కదిల్చే పరిస్థితిని మనం చూడకపోతిమి. కనీసం బల్దియా ఎన్నికల్లో కూడా జరిగిన బహిరంగ సభలలో కూడా కెసిఆర్‌ను కానీ, టిఆర్ఎస్‌ను కానీ ఒక్క విమర్శ చేయకపోవడాన్ని మనం చూశాం. అక్కడ నుండే టిడిపి బలహీనపడడం మరింత వేగం పుంజుకుని ముగ్గురు శాసన సభ్యుల సంఖ్యకు టిడిపి చేరుకుంది. వీటన్నింటినీ మూల్యాంకనం చేసుకునే ప్రత్యేక హోదా గురించి గానీ, నిధుల గురించి గానీ బాబు కేంద్రంతో కయ్యానికి దిగడం లేదనేది నగ్న సత్యం.

ప్రతిపక్షంలో ఉన్న సందర్భంలో ఉన్నప్పుడు రాష్ట్రాలలో ప్రజాస్వామ్య బద్ధంగా పాలనలోకి వచ్చిన ప్రభుత్వాల పీకనొక్కే ఆర్టికల్ 356ను రద్దు పరచాలని గగ్గోలు పెట్టిన బిజెపి ఇప్పుడు కేంద్రంలో పాలనలో ఉండి తమకు ప్రతిపక్షంగా ఉన్న పార్టీల రాష్ట్ర ప్రభుత్వాలపై అదే ఆర్టికల్ ప్రయోగిస్తూ తన ద్వంద విధానాలనూ, అరాచక రాజకీయ పోకడనూ ప్రదర్శించుకుంటుంది. ఈ విధమైన దోష భూయిష్ట ఆచరణను అవలంభిస్తున్న కేంద్రాన్ని, మోడీ ప్రభుత్వాన్ని సుప్రీం కోర్టు చీత్కరించి మొట్టికాయలు వేస్తున్నా మోడీ ప్రభుత్వానికి మెలుకువ రాలేదు. పైగా మోడీ తన అనుచితపోకడతో రాష్ట్రపతికి కూడా ఈ మైలను అంటించారు.

ఉత్తరాఖండ్ రాష్ట్ర ప్రభుత్వాన్ని కూలదోసి రాష్ట్రపతి పాలన విధించడాన్ని సుప్రీం తప్పుపట్టిన తీరు మోడీ ప్రభుత్వానికీ, రాష్ట్రపతికీ అత్యంత అగౌరవ ప్రదమైన వ్యాఖ్యానమే. ఉత్తరాఖండ్‌లో కాంగ్రెస్ పార్టీ ఆధ్వర్యంలో రావత్ ముఖ్యమంత్రిగా సాగుతున్న ప్రభుత్వం అస్థిర పడడానికి ఆ పార్టీకి చెందిన తొమ్మిది మంది శాసనసభ్యులు ఆ పార్టీని వీడడానికి ప్రోత్సహించిన మోడీ ప్రభుత్వం బలా బలాలతో నిమిత్తం లేకుండా ప్రజాస్వామ్య బద్ధంగా ఏర్పడిన ప్రజా ప్రభుత్వాన్ని రద్దు పరచి రాష్ట్రపతి పాలన విధించి రాజ్యాంగ స్ఫూర్తికి తీవ్ర విఘాతం కలిగించింది. అందుకు సుప్రీం కోర్టు కలుగజేసుకుని చీత్కరించడమే గాక, రావత్ ప్రభుత్వానికి విశ్వాస పరీక్ష అనుమతిచ్చి తిరిగి అక్కడ ప్రజా ప్రభుత్వాన్ని నిలపడం వంటి అనూహ్య సంఘటనతో శాసన అధికారాలలో న్యాయ స్థానాల జోక్యం అత్యంత అవశ్యమని స్పష్టమవుతుంది. మార్చ్ 28న మొదలైన రాష్ట్రపతి పాలన మే 11న కోర్టు జోక్యంతో తొలగింది. అత్యున్నత న్యాయ స్థానం ఎదుట చేతులు కట్టుకున్న అటార్నీ జనరల్ తలదించుకుని ఉత్తరాఖండ్‌లో రాష్ట్రపతి పాలనను కేంద్ర ప్రభుత్వం ఎత్తివేస్తుందని విన్నవించారు. ఇంతకంటే చిన్న తనం కేంద్ర ప్రభుత్వానికి ఏముంటుంది. ఇంతకంటే కురచదనం ఉంటుందా? లాగి చెంపపై ఒకటిచ్చినట్లుగా భావించవద్దా? ఇక ముందు కేంద్రంలో అధికారంలో ఉండే ప్రభుత్వాలు ఈ ఆర్టికల్‌ను ప్రయోగించి రాష్ట్ర ప్రభుత్వాల గొంతుకోయకుండా ఉంటాయని ఆశిద్దాం. ఈ సంఘటనతో మోడీ కూడా గతంలో రాష్ట్ర ప్రభుత్వాల ఆయువు తీసిన ప్రధానులలాగే తన క్రూరత్వాన్ని ఆవిష్కరించుకున్నట్లు వెల్లడైంది.

*(రచయిత అధ్యక్షులు, పల్నాడు రచయితల సంఘం)* వీ

# ఎస్ఎస్‌సి, ఇంటర్ పరీక్షలు, మూల్యాంకనం

***దశాబ్దాలుగా మూసపోసిన విద్యా విధానం వల్ల ప్రాథమిక స్థాయిలోనే విద్యార్థుల చదువు అలక్ష్యానికి గురవుతోందనీ, సరైన ప్రాధాన్యత ఇవ్వకపోతే విద్యావ్యవస్థ కుప్పకూలిపోతుందనీ అంటున్నారు* చావలి శ్రీనివాస్**

ప్రతి విద్యా సంవత్సరంలో మార్చ్, ఏప్రిల్ నెలల్లో ఇంటర్మీడియట్, పదవ తరగతి పరీక్షలు మన తెలుగు రాష్ట్రాలలో నిర్వహించబడు తున్నాయి. పదవ తరగతి, ఇంటర్మీడియట్ పరీక్షల నిర్వహణకు, పదవ తరగతి మూల్యాంకనంనకు ప్రాథమిక, ప్రాథమికోన్నత పాఠశాలల్లోని ఉపాధ్యాయులను కూడా వినియోగిస్తున్నారు. అసలే ప్రాథమిక, ప్రాథమికోన్నత పాఠశాలల్లో అంతంత మాత్రంగా (సరిపడినంత మంది లేరు) ఉన్న ఉపాధ్యాయులు ఇంటర్, పదవ తరగతి పరీక్షలకు ఇన్విజిలేటర్లుగా వెళ్లడం వలన ఆయా ప్రాథమిక, ప్రాథమికోన్నత పాఠశాలలు విద్యా సంవత్సరం చివర్లో సిలబస్‌లు పూర్తి చేయవలసిన సమయంలో ఇబ్బందులకు గురి కావలసి వస్తోంది. అంతేకాక ఆయా పాఠశాలల్లో పరీక్షల నిర్వహణ, పాఠశాల నిర్వహణ కూడా కష్టమవు తోంది. మార్చ్, ఏప్రిల్ రెండు నెలలు మొత్తంగా ప్రాథమిక, ప్రాథమికోన్నత పాఠశాలల్లో సగం లేదా అంతకన్నా ఎక్కువ మంది ఉపాధ్యాయులు ఇన్విజిలేషన్, పదవ తరగతి – స్పాట్ – స్పెషల్ అసిస్టెంట్ విధుల వలన వారి వారి పాఠశాలలకు దూరమవుతున్నారు. ఈ పరిస్థితులలో తల్లిదండ్రులకు, గ్రామస్తులకు ఉపాధ్యాయులు విధులు ఎగగొడుతున్నారనే భావన వచ్చిన సందర్భాలు కూడా ఉన్నాయి. అంతేకాక ప్రభుత్వ పాఠశాలల్లో ఉపాధ్యాయులు సరిగ్గా రారనే భావనతో, తమ పిల్లలను ప్రైవేట్ పాఠశాలలకు పంపే పరిస్థితి ఉంది.

ఇక పదవ తరగతి మూల్యాంకనం (స్పాట్ వాల్యుయేషన్) విషయానికి వస్తే, మూల్యాంకనా కేంద్రాలు (స్పాట్ వాల్యుయేషన్ సెంటర్స్) లో స్పెషల్ అసిస్టెంట్స్‌గా ప్రాథమిక, ప్రాథమికోన్నత పాఠశాలల్లో పనిచేస్తున్న ఎస్‌జిటి, ఎల్ఎఫ్ఎల్, ఎల్‌పి (తెలుగు – హిందీ)లను ఉపయోగిస్తున్నారు. కొన్ని సందర్భాలలో స్కూల్ అసిస్టెంట్స్‌ను కూడా ఉపయోగిస్తున్నారు. ప్రతి సంవత్సరం ఏప్రిల్ నెలలో పదవ తరగతి మూల్యాంకనం జరుగుతుంది. అదే సమయంలో ఒకటవ తరగతి నుండి తొమ్మిదవ తరగతి వరకూ పరీక్షలు నిర్వహించబడతాయి. ఈ పరిస్థితులలో ప్రాథమిక, ప్రాథమికోన్నత పాఠశాలల్లోని ఉపాధ్యాయులు పదవ తరగతి స్పాట్ వాల్యుయేషన్‌లో స్పెషల్ అసిస్టెంట్స్‌గా వెళితే వారి వారి పాఠశాలల్లోని పరీక్షల నిర్వహణ ఎలా? అనే విషయాన్ని ప్రభుత్వం, అధికారులు పక్కనపెడుతున్నారు. పాఠశాలల్లో నిరంతర క్రమబద్ధీకరణ (రేషనలైజేషన్ ఆఫ్ టీచర్స్) కారణంగా మిగిలిన ఒకరిద్దరు ఉపాధ్యాయులతో ప్రాథమికోన్నత పాఠశాలల్లో (అప్ స్కూల్) ఎనిమిది తరగతులకు పరీక్షల నిర్వహణతో పాటు, మధ్యాహ్న భోజనం నిర్వహణ కూడా చూడడం అసాధ్యంగా మారుతోంది. ఎలాగోలా బడి నడపడం అనే పరిస్థితుల్లోకి ఉపాధ్యాయులు నెట్టబడుతున్నారు.

ఇకపోతే పైన చెప్పుకున్న ఇంటర్, పదవ తరగతి పరీక్షల నిర్వహణతో పాటుగా, స్పాట్ కేంద్రాల్లో స్పెషల్ అసిస్టెంట్‌గా నియామకం కోసం అధికారులు సూత్రబద్ధత లేకుండా వ్యవహరిస్తున్నారు. ఒక పాఠశాల నుండి ఎవరిని (సీనియర్, జూనియర్, ఎచ్ఎం), ఇన్విజిలేటర్ లేదా స్పెషల్ అసిస్టెంట్‌గా పంపాలనే విషయంలో స్పష్టత లేకుండా వ్యవహరిస్తున్నారు. ఈ సందర్భంలో పైరవీలు కూడా రాజ్యమేలు తున్నాయి. ఆరోగ్య సమస్యల రీత్యానో, పాఠశాల పరిస్థితుల దృష్ట్యానో ఆయా విధులకు హాజరు కాలేమంటే మినహాయింపు ఇవ్వడం లేదు సరికదా! మెమోలు ఇస్తామని బెదిరిస్తున్నారు. కొన్ని సందర్భాల్లో మెమోలు కూడా పంపించడం గతంలో జరిగిన సందర్భాలు ఉన్నాయి. ఇదేకాక పరీక్ష సెంటర్ లేదా స్పాట్ కేంద్రానికి ఎనిమిది కిలోమీటర్ల లోపు ఉన్నవారిని ఉపయోగించుకుంటే టిఏ, డిఏ (ప్రయాణం ఖర్చులు, రోజు భత్యం) ఇవ్వనవసరం లేదని ఆ పరిధిలో ఉపాధ్యాయినీ, ఉపాధ్యాయులను ఇబ్బందులకు గురి చేస్తున్నారు. కొన్ని సందర్భాలలో పరీక్షా/మూల్యాంకనా కేంద్రాలకు ఎనిమిది కిలోమీటర్లు దాటి ఉన్న పాఠశాలల ఉపాధ్యాయు లకు కూడా ఉత్తర్వులను పంపించి బలవంతంగా ఇన్విజిలేషన్ లేదా స్పెషల్ అసిస్టెంట్ విధానాలను నిర్వహింపజేస్తున్నారు. కానీ వారికి కూడా టిఏ, డిఏ ఇవ్వడం లేదు.

పదవ తరగతి మూల్యాంకనలో ఒక్కో జిల్లాలో ఒక్కో రకమైన ఇబ్బందులను ఉపాధ్యాయులు ఎదుర్కొంటున్నారు. ఉదాహరణకు ఈ విద్యా సంవత్సరం (2015-16)లో శ్రీకాకుళం జిల్లా కేంద్రంలో జరుగుతున్న పదవ తరగతి మూల్యాంకనా కేంద్రానికి ముందుగా సరిపడినంత మంది స్పెషల్ అసిస్టెంట్స్‌ను నియమించుకోలేదు. స్పాట్ రెండవ రోజు (2016 ఏప్రిల్ 10) శ్రీకాకుళం పట్టణం, రూరల్, పరిసర మండలాల్లో పనిచేస్తున్న ఉపాధ్యాయులకు ఈ విధంగా చరవాణి సందేశం వచ్చింది.

'ఎస్ఎస్‌సి 2016 – స్పాట్ – యుఆర్ అపాయింటెడ్ యాజ్ స్పెషల్ అసిస్టెంట్ ఎట్ గీతాంజలి స్కూల్, బిసైడ్ జిఎచ్ఎస్ శ్రీకాకుళం – రిపోర్ట్ డివైఇఒ, శ్రీకాకుళం విథౌట్ ఫెయిల్ – నొ ఎగ్జంప్షన్ అలవ్‌డ్ – బై ఆర్డర్ – డిఇఒ శ్రీకాకుళం'

ఈ సమాచారం 'ఎం– డిఇఒ ఎస్‌కెఎల్' అనే అక్షరాలతో అంతర్జాలం నుండి వచ్చింది నెంబర్ లేదు. ఇటువంటి మెసేజ్‌లు పాఠశాలల్లో ఒక్కరిని మినహాయించి మిగిలిన వారందరికీ వచ్చాయి. కొన్ని పాఠశాలల్లో అందరు ఉపాధ్యాయులకు వచ్చాయి. ఈ మెసేజ్ 'సంతకు చీటి – లచ్చికి గాజులు' అన్నట్లుగా ఉంది. డిఇఒ నుండి వచ్చిందని చెప్పబడుతున్న ఈ మెసేజ్‌లో ఆర్ఇ నెంబర్ లేదు. ఉత్తర్వులు ఎక్కడ

ఎలా అందజేస్తారో లేదు. ఎవరిని ఏ ఫోన్ నెంబరులో సంప్రదించాలో లేదు. సాధారణంగా ఉత్తర్వులన్నీ డ్రాయింగ్ ఆఫీసర్/ఎంఇఒ/ ప్రధానోపాధ్యాయుల ద్వారా ఉపాధ్యాయులకు అందజేయబడతాయి. కాని ఈ సెల్ మెసేజ్ ఉత్తర్వులు డైరెక్ట్‌గా డిఇఒ నుండి ఉపాధ్యాయులకు రావడంతో ఉపాధ్యాయులు కంగారు పడ్డారు. కొంత మంది ఉపాధ్యాయులు, ప్రధానోపాధ్యాయులు చరవాణి ద్వారా ఎంఇఒ - (శ్రీకాకుళం) ను సంప్రదించి సమాచారం అడిగితే వారు (ఎంఇఒ) తనకు ఏ విషయం తెలియదన్నట్లు సమాధానం చెప్పారు. అంటే ఎంఇఒలకు (డిడిఒలకు) తెలియకుండా డిడిఒ/ఎంఇఒ ద్వారా కాకుండా డిఇఒ ఉపాధ్యాయులకు డైరెక్టుగా ఉత్తర్వులిస్తారా? అదీ ఆధిరీకృతం కాని చరవాణి సందేశం ద్వారా, ఒక ఉపాధ్యాయుడు ఉత్తర్వులు లేకుండా ప్రధానోపాధ్యాయుడు/ఎంఇఒ రిలీవ్ చేయకుండా ఎలా స్పాట్‌లో విధులకు హాజరవుతారు? ఇదండీ మన విద్యా పాలన - పరిపాలన!

స్పాట్ ప్రారంభమైన మూడవ రోజు (2016 ఏప్రిల్ 11) సిఆర్‌పిలు ఉపాధ్యాయులకు ఫోన్లు చేస్తూ స్పాట్ కేంద్రానికి రమ్మని ఒత్తిడి చేస్తూ చెప్పారు. సిఆర్‌పిలు (క్లస్టర్ రిసోర్స్ పర్సన్స్) తాత్కాలిక ఉద్యోగులు, అధికారులు కారు, సిఆర్‌పిలు ఫోన్లు చేసి ఒత్తిడి చేస్తున్నారు. స్పాట్ కేంద్రానికి రమ్మని అని ఎంఇఒలకి ఫోన్ చేసి ఉపాధ్యాయులు అడిగితే, తమకు ఆ విషయంలో సంబంధం లేదని ఎంఇఒ చెపుతున్నారు. ఇక్కడ ఒక అస్పష్టత, కమ్యూనికేషన్ గ్యాప్, అధికారుల నిర్లక్ష్య వైఖరి చాలా స్పష్టంగా కనిపిస్తోంది. ఉపాధ్యాయులు అయోమయానికి గురవుతున్న పరిస్థితిని కూడా గమనించవచ్చు. విచిత్రం ఏమిటంటే కొంత మంది టీచర్ల యూనియన్ నాయకులు కూడా స్పాట్ విధులకు వెళ్లమని ఉపాధ్యాయులపై ఒత్తిడి చేయడం గమనార్హం. సరే ఎస్ఎంఎస్‌లు వచ్చిన వారంతా స్పాట్ వాల్యుయేషన్‌లో స్పెషల్ అసిస్టెంట్స్‌గా వెళ్లిపోతే యుపి పాఠశాలల్లో మిగిలిన ఒక్క ఉపాధ్యాయుడు 2016 ఏప్రిల్ 12 నుండి నిర్వహించబడే వార్షిక పరీక్షలు ఎలా నిర్వహించాలో తెలియదు. కొన్ని పాఠశాలల్లో ఉపాధ్యాయులందరికీ స్పాట్‌లో పని చేయమని ఎస్ఎంఎస్‌లు వచ్చాయని చెపుతున్నారు. వారు పాఠశాలలను మూసి వేయాలా?

ప్రభుత్వానికి, ప్రభుత్వ యంత్రాంగానికి పదవ తరగతి స్పాట్ నిర్వహించడం ముఖ్యమైతే (కాదనలేనిదే - ముఖ్యమైనదే) టీచర్లందరినీ స్పాట్‌లకు పంపిస్తే సాధారణ ప్రాథమిక, ప్రాథమికోన్నత పాఠశాలల్లో పరీక్షలు, మధ్యాహ్న భోజనం నిర్వహణ, పాఠశాల నిర్వహణ ఎవరు చేస్తారు? ఎవరు చూస్తారు?

ఈ అధికారులే క్వాలిటీ ఎడ్యుకేషన్ గురించి మాట్లాడతారు. పరీక్ష, గ్రేడుల నమోదు సకాలంలో చేయమని, నిర్వహించమని చెప్తారు. ప్రభుత్వ ఉపాధ్యాయులు సరిగ్గా పనిచేయడం లేదని కూడా చెప్తారు. పాఠశాలల సందర్శనలు (విజిట్స్) చేయడం, సమీక్షలు చేయడం, ఉపాధ్యాయుల గురించి ఎగతాళిగా మాట్లాడడం చేస్తుంటారు. ఈ అంశాలు ఎక్కడా రికార్డు కావు. ప్రభుత్వ పాఠశాలలను కార్పొరేట్ పాఠశాలలకు ధీటుగా చేస్తామని అప్పుడప్పుడూ గప్పాలు కొడుతూ వాగాడంబరాన్ని ప్రదర్శిస్తూ ఉంటారు. పైన చెప్పుకున్న ఇన్విజిలేషన్స్, మార్కులు లెక్కపెట్టుకోవడం వంటి డ్యూటీలు - ప్రభుత్వం తంతు నడిపేందుకు ఉపయోగపడతాయి తప్ప, ప్రాథమిక ఉపాధ్యాయులకు వారి వారి తరగతి గదుల్లో ఏ విధంగానూ ఆ అనుభవాలు ఉపయోగపడవు.

ఈనాడు సెకండ్లలో కౌంటింగ్ చేయగలిగే కంప్యూటర్‌లు, ట్యాబ్‌లు ఉన్నా ప్రతి జిల్లాలో వందలాది మంది ఉపాధ్యాయులను వారి బోధనా రంగం నుంచి తప్పించి నోటితో లెక్కలు కట్టించి రాయించడం చూస్తుంటే, సాంకేతికంగా మనం విద్యా, బోధనా, మూల్యాంకనా పరిపాలనా రంగాల్లో ఎంత వెనుకబడి ఉన్నామో అర్థమవుతుంది.

మార్కుల కౌంటింగ్ వంటి విధుల కోసం పొరుగు సేవల విధానాన్ని (అవుట్ సోర్సింగ్) అమలు చేయవచ్చు. అసోసియేట్ టీచర్లు (అమెరికాలో అమలులో ఉంది) వంటి వారిని నియమించుకుని సంవత్సరం పొడుగునా వారి సేవలు ఉపాధ్యాయులకు సహాయకారులుగా ఉపయోగించుకుని పరీక్షలు, మూల్యాంకనా సమయంలో వారి సేవలు ఉపయోగించు కోవచ్చు.

'ఎంకి పెళ్లి సుబ్బి చావుకి వచ్చినట్లు' ఇంటర్/పదవ తరగతి పరీక్షలు, ఎస్ఎస్‌సి మూల్యాంకనాలు ప్రాథమిక ఉపాధ్యాయుల చావుకి వస్తోంది. దాదాపు రెండు నెలలు (మార్చ్ మొదటి వారం నుండి ఏప్రిల్ చివరి వారం వరకూ) ప్రాథమిక/ప్రాథమికోన్నత పాఠశాలల ఉపాధ్యాయులను వారి పాఠశాలలకు, బోధనకు - ఇన్విజిలేషన్స్, ఎస్ఎస్‌సి మూల్యాంకనం పేరు చెప్పి దూరం చేయడం సమంజసం కాదు. విద్యా హక్కు చట్టం (ఆర్‌టిఇ - 2009) ప్రకారం ఉపాధ్యాయులను విద్యేతర పనులకు పంపించకూడదు. ప్రాథమిక ఉపాధ్యాయులకు (ఎస్‌జిటిడబ్ల్యు) భాషా పండితులు (ఎల్‌పి - హిందీ, తెలుగు) లకు ఇంటర్మీడియట్, పదవ తరగతి పరీక్షల ఇన్విజిలేషన్ డ్యూటీలు, పదవ తరగతి మూల్యాంకనంలో మార్కులు లెక్కించే విధులు (స్పెషల్ అసిస్టెంట్స్) బోధనేతర (నాన్ టీచింగ్) అంశాలే కదా? ఈ అంశాలపై అధికారులు ఎన్నడూ దృష్టి సారించడం లేదు.

**ముగింపు**

జిల్లాల్లో విద్యా పరిపాలనా విధానం భ్రష్టుపట్టిపోయి ఉన్నది. పర్మినెంట్ ఎంఇఒలు సంవత్సరాల తరబడి ఉండరు. ఇన్‌ఛార్జీలు, ఎఫ్‌ఎసి ఎంఇఒలు తమకు ఏమీ తెలియదంటారు. దశాబ్దాలుగా మూసపోసిన పరిపాలనా విధానాలతోనే సాగుతోంది మన విద్యా విధానం. పదవ తరగతి పరీక్షలు నిర్వహించడం, మూల్యాంకనం నిర్వహించడమంటే - ప్రాథమిక, ప్రాథమికోన్నత పాఠశాలలను పాడుచేయమని అర్థం కాదు కదా. ప్రాథమిక, ప్రాథమికోన్నత పాఠశాలల్లో చెప్పేవి కూడా పాఠాలే. విద్యా సంవత్సరం చివర్లో ఈ సంస్థల్లో నిర్వహించేవి కూడా పరీక్షలే అనే జ్ఞానం అధికారుల్లో లేనేలేదు. మొత్తంగా చూస్తే పదవ తరగతి ఒక్కటే పాఠశాల విద్యగా, పదవ తరగతి పరీక్షలే పరీక్షలుగా పాఠశాల విద్యారంగం నడుస్తోంది. భవిష్యత్తులో పదో తరగతికి వచ్చే విద్యార్థినీ, విద్యార్థులందరూ ప్రాథమిక, ప్రాథమికోన్నత స్థాయిలు దాటి వస్తారని, ఆయా స్థాయిలకు సరిపోయిన ప్రాధాన్యతలు ఇవ్వాలని, మన అధికారులు, విద్యా వ్యవస్థ నిర్వహించేవారు, నడిపించేవారు ఎప్పుడు ఆలోచిస్తారో వేచి చూడాలి. ఈ ప్రపంచంలో భౌతిక విధ్వంసానికి, ఉగ్రవాదులు అగ్రదేశాల ఆగ్రహాలు కారణమైతే, మనవంటి దేశాల్లో ఇటువంటి అవకతవక పాలనా విధానాలు విద్యారంగ సామాజిక, సాంస్కృతిక విధ్వంసానికి కారణమవుతున్నాయి. మొత్తంగా పిల్లల చదువులు, అటు సర్కారీ బడుల్లో ఇటు అక్షరాల అంగళ్లలో, వ్యవస్థీకృత అలక్ష్యానికి గురవుతున్నాయి. రేపటి పౌరుల భవితే మరణిస్తే ఆ పాపం ఎవరిది? ఎవరు బాధ్యత వహిస్తారు?

*(రచయిత ఉపాధ్యాయులు)* వీ

# భారత చరిత్రలో బౌద్ధం ప్రాధాన్యత

***మతతత్వ చరిత్రకారులు భారత దేశ చరిత్రను హిందూ చరిత్రగా వక్రీకరించే ప్రయత్నాలు చేశారనీ, చేస్తున్నారనీ, నిజానికి దేశ చరిత్రలో బౌద్ధానికి ప్రముఖ స్థానం ఉందనీ అంటున్నారు ప్రొ. చల్లపల్లి స్వరూపరాణి***

'ఎవరో చెప్పారని కానీ, తరాల నుంచి వస్తుందని కానీ, ఎక్కువ మంది ఆమోదం పొందిందని కానీ, ఎవరో రుషి, పెద్దవారు చెప్పారని కానీ, నమ్మడం నీకు అలవాటయ్యిందని కానీ, సంప్రదాయంగా నీకు బోధించబడిందని కానీ దేనినీ నమ్మకు. హేతుబద్ధమై అందరికీ మంచి చేసే దాని కోసం పని చేస్తూ దాని ప్రకారం జీవించు.'

*(కాలామ సుత్త, అంగుత్తర నికాయ)*

మతతత్వ చరిత్రకారులు భారతదేశ చరిత్రను మూడు భాగాలుగా విభజించారు. వీరు, ప్రాచీన భారతదేశ చరిత్రను హిందూ యుగంగానూ, మధ్యయుగ చరిత్రను ముస్లిం యుగంగానూ, ఆధునిక చరిత్రను బ్రిటిష్ యుగంగానూ విభజించడం జరిగింది. ఈ విభజన అనేది పాఠకులలోనూ విద్యార్థులలోనూ ఓ రకమైన గందరగోళాన్ని సృష్టించింది. ఈ విభజనకు సహేతుకమైన ఆధారాలు లేవు. మధ్యయుగాన్ని ముస్లిం యుగంగా పేర్కొనడం చూస్తే ఆ కాలంలో పాలకులుగా ఉన్నవారి వ్యక్తిగత మతాన్ని దృష్టిలో వుంచుకుని ఈ విభజన చేసినట్లు అనిపిస్తుంది. ఆ విధంగా చూసినప్పటికీ ప్రాచీన కాలంలో భారతదేశాన్ని పరిపాలించిన రాజవంశాలన్నీ దాదాపుగా బౌద్ధాన్ని అవలంబించినట్టు తెలుస్తుంది. ఈ దేశంలో జనపదాల అనంతరం మొట్టమొదటి రాజ్యంగా చెప్పబడుతున్న మగధను పాలించిన బింబిసారుడు బుద్ధుడి సమకాలికుడు కావడమే కాకుండా, బౌద్ధ సంఘంలో ప్రారంభ సభ్యుడు. అతని కుమారుడు అజాత శత్రువు ఆధ్వర్యంలోనే మొదటి బౌద్ధ సంగీతి రాజగృహలో జరిగింది.

మొట్టమొదటి సామ్రాజ్యంగా చెప్పబడే మౌర్య సామ్రాజ్యం, దానిని పరిపాలించిన అశోకుడు కూడా ప్రపంచం ఎరిగిన బౌద్ధాభిమాని. అశోకుడు బౌద్ధ మత ప్రచారానికి తన శక్తినంతా ధారపోశాడు. క్రీ.శ. ఏడవ శతాబ్దం వరకు పాలించిన హర్షవర్ధనుడి దాకా మిగిలిన రాజులు, ప్రజలు బౌద్ధాన్ని అవలంబంచినట్లు అనేక చారిత్రక ఆధారాల వలన రుజువు అవుతుంది. అటువంటప్పుడు ప్రాచీన యుగం హిందూ యుగం ఎలా అవుతుంది.

మతపరంగా ఇటువంటి వక్రీకరణలు చరిత్ర రచనలో కోకొల్లలు. అవన్నీ జరిగిన చరిత్రలోనివి కావు. చరిత్రకారుల దృక్పథమే చరిత్ర రచనలో వక్రీకరణలకు దోహదం చేసిందని తెలుస్తుంది. ఇప్పుడు చరిత్ర రచనలో నూతన ధృక్కోణాలు ఆవిష్కరించబడుతున్నాయి. చరిత్ర రచనలో వక్రీకరణ, విస్మరణకు గరైన బౌద్ధం, దళితుల చరిత్ర బయటకు వస్తున్నాయి. హిందుత్వవాద చరిత్రకారుల గ్రంథాలలో శాస్త్రీయత లోపించడమే కాకుండా కట్టుకథలు, పిట్టకథలు మూఢనమ్మకాలు, హేతువుకు నిలబడని అనేక ఊహాజనితమైన పురాణగాథలు అసలు చరిత్రగా చాలాకాలం పాటు చెలామణి అయ్యాయి. వైదిక మతానికి దూరంగా ఉండే అనార్య జాతులను రాక్షసులుగానూ, క్రూరమైన వారిగానూ చిత్రించడం, బౌద్ధాన్ని అవలంబించిన ఈ అనార్య నాగ, యక్ష జాతులను పాములుగా చిత్రించడం కూడా వాస్తవ చరిత్రను కప్పి ఉంచడమే ఈ విషయంలో హిందూ పురాణ సాహిత్యం అవలంబించిన ధోరణినే చరిత్రకారులు కూడా అనుసరించడం వారిలో లోపించిన శాస్త్రీయ దృక్పథంగా భావించవచ్చు.

మధ్యయుగాల్లో భారతదేశాన్ని పాలించిన ముస్లిం రాజుల్ని దృష్టిలో ఉంచుకుని మధ్యయుగాన్ని ముస్లిం యుగంగా పేర్కొనడం కూడా సరైన పద్ధతి కాదు. అశేషంగా ఉన్న ప్రజల సాంస్కృతిక అస్థిత్వాలు భిన్నంగా ఉన్నపుడు కేవలం కొద్దిమంది రాజుల్ని ఉద్దేశించి సూత్రీకరణలు చేయడం చరిత్రకారుల హ్రస్వ దృష్టికి నిదర్శనం. అలాగే బ్రిటిష్ వారిని దృష్టిలో ఉంచుకుని ఆధునిక యుగాన్ని బ్రిటిష్ యుగం అనడం కూడా అలాంటిదే! అయితే భారతదేశమంటే, హిందూదేశం అని ముద్ర వేయడం జాతీయోద్యమ కాలంలో ఎక్కువగా జరిగింది. జాతీయవాదం పేరుతో ప్రచారమయ్యిందంతా హిందుత్వవాదమే! వారు బ్రిటిష్ వారి నెదిరించిన హిందువులను మాత్రమే దేశభక్తులుగా కీర్తించి ఇతరులు బ్రిటిష్ పాలనకు వ్యతిరేకంగా పోరాడినప్పటికీ వారిని విస్మరించడం ఉద్దేశపూర్వకంగానే జరిగింది.

ఈ రకమైన చరిత్ర రచనా పద్ధతిలో స్థానిక సంస్కృతులు, ఆచారాలు, ప్రాంతీయ పరమైన ప్రత్యేక అస్తిత్వాలన్నిటిని పాతరేసి భారతదేశమంటే హిందూ దేశమని, ఇక్కడ ఏకశిలా సదృశ్యమైన హైందవ సంస్కృతి ఒకటి అనాదిగా ఉంటూ వస్తుందని చెబుతూ వచ్చారు. అలాగే మొట్టమొదటిదిగా వెలుగులోకి వచ్చిన అనార్య, ద్రవిడ సంస్కృతి అయిన సింధూ నాగరికతను కాదని, ఆర్య నాగరికతే అసలైన ఈ దేశ నాగరికత అని, ఆర్యులు స్వదేశీయులని చెప్పి వారు ఓ ఉదాత్తమైన నాగరికతను ఉక్కడ నిర్మించినట్లు, అదే ఈ దేశానికి చెందిన జాతీయ సంస్కృతి అని, దానినే యావత్ భారత దేశమంతా అన్ని ప్రాంతాలు, జాతులు, కులాల ప్రజలు అవలంబిస్తున్నట్లు నమ్మించడానికి ఇంకా ప్రయత్నం చేస్తూనే ఉన్నారు. ఇదంతా కాకతాళీయంగా జరుగుతున్న వ్యవహారం కాదు. ఆధిపత్య కులాలు అణగారిన ప్రజల మత విశ్వాసాలను తృణీకరించడం, ప్రాంతీయ అస్తిత్వాలను, సంస్కృతులను మరింత మూలకు నెట్టివెయ్యడంగా భావించాలి. ఇది కరుడుకట్టిన హిందూ సామ్రాజ్యవాద నైజం. ఈ సామ్రాజ్యవాదమే ఇప్పుడు జడలు విప్పి 'ఘర్‌వాపసీ' అనే కార్యక్రమాలు చేస్తూ కుల వ్యవస్థకు దాని తాలూకు

అసమానత్వానికి దైవపరమైన ఆమోద ముద్రను వేసి వ్యవస్థీకృతం చేసిన భగవద్గీతను రాష్ట్ర గ్రంథంగా ముందుకు తీసుకు వెళ్తుంది.

ఘర్‌వాపసీ అంటే హిందూ మతం అనేది ఈ దేశ ప్రజల అసలైన మతం అనీ, హిందూమతం నుంచి ఇతర మతాల్లోకి వెళ్లిన వారంతా తమ ఇంటికి అంటే హిందూ మతంలోకి తిరిగి రావాలని పిలుపునివ్వడం. ఇదెంత విడ్డూరమంటే అసలులేని ఇంటికి తిరిగి రమ్మనడం లాంటిది. ప్రొ. కంచ ఐలయ్య అన్నట్టు ఈ కార్యక్రమం లక్ష్యం క్రైస్తవ మతం లోకి వెళ్లిన దళిత ఆదివాసీలను మాత్రమే తిరిగి రమ్మనడం. ఎందుకంటే ఎవరైనా ఒకసారి ఇస్లాంలోకి వెళ్లాక వారి కులపరమైన గుర్తింపు రద్దు అవుతుంది. కానీ క్రైస్తవంలో పరిస్థితి వేరు. ఇండియాలో క్రైస్తవ మతంలోకి వెళ్లిన అగ్రకులాలు అక్కడ కూడా పీఠాధిపతులుగా ఏలుబడి చెయ్యడమే కాకుండా క్రైస్తవంలో కూడా బ్రాహ్మణవాదాన్ని అంటే కులాధిపత్యాన్ని ఎంచక్కా కొనసాగిస్తూ తమ పీఠాలను కాపాడుకుంటున్నారు. అలాగే వారికి క్రైస్తవంలో బెర్త్ ఉన్నట్టే బ్రాహ్మణవాదంలో కూడా బెర్త్ రిజర్వు అయి ఉంటుంది. క్రైస్తవులుగా మారిన దళిత, ఆదివాసీలకు ఎక్కడా బెర్త్ ఉండదు.

ఈ దేశంలో హిందూ మత చరిత్ర చాలా చిన్నది. జాతీయోద్యమ కాలం నుంచి మాత్రమే ఇప్పుడున్న అర్థంలో హిందూ మతంగా చెలామణి అవుతున్న మతం ప్రచారంలోకి వచ్చిందని చెప్పాలి. ఇక్కడ అశేష ప్రజానీకం అనాదిగా ప్రకృతి సహజమైన పితృ దేవతారాధన, గ్రామదేవతారాధన, ప్రకృతిలోని చెట్టు, పుట్టలను పూజించడం వంటివి ఈ దేశపు ప్రాచీన మత సంస్కృతి. ఈ దేశపు ప్రాచీన నాగరికతగా పేర్కొనబడుతున్న సింధూ నాగరికతలో కూడా ప్రజలు మాతృ దేవతలను ఆరాధించినట్లు తెలుస్తుంది. తర్వాత బయటి నుంచి వచ్చిన ఆర్యులు క్రమంగా స్థానిక సంస్కృతులను ధ్వంసం చేసి తమ ఆధిపత్యాన్ని స్థాపించారు. నాలుగు వేదాలను ముందుకు తెచ్చిన వారి నాగరికతను వైదిక నాగరికతగా చరిత్రకారులు పేర్కొంటారు. వైదిక మతం అర్థం పర్థంలేని సంస్కృత శ్లోకాలు, కర్మకాండలు, జంతుబలులు, యజ్ఞ యాగాలు పేరుతో మతాన్ని ఓ ఖరీదైన, హింసాత్మకమైన వ్యవహారంగా మార్చివేసి సామాన్యులకు వైదిక మతంలో స్థానం లేకుండా చేసింది. ఇటువంటి విపరీతమైన పరిస్థితులలో భౌతికవాదులైన చార్వాకులు, లోకాయతులు వైదిక మతం పైన సాంస్కృతిక తిరుగుబాటు ప్రారంభించి వైదిక బ్రాహ్మణ మతంలోని హేతురాహిత్యాన్ని, డొల్లతనాన్ని బయట పెట్టారు. సత్యకామ జాబాలి, అజితకేశ కంబలి, మక్కలి గోశాలుడు, పూర్ణకశ్యపుడు మొదలైన వారంతా అనార్య జాతులకు చెందిన మేధావులు, తత్వవేత్తలు. వీరు వైదిక బ్రాహ్మణవాదంపైన సాంస్కృతిక యుద్ధాన్ని ప్రారంభిస్తే వీరికి కొనసాగింపుగా వర్ధమాన మహావీరుడు, గౌతమ బుద్ధుడు వైదిక మతం ఒక మేడిపండు వంటిదని నిరూపించారు. చార్వాకులు, లోకాయతులు అధికార వ్యవస్థకు దూరంగా ఉన్న సామాన్య ప్రజానీకం నుంచి వచ్చిన వారు కాబట్టి ఆనాటి పాలకవర్గాల అండదండలతో బ్రాహ్మణవాదులు వారిని చెవుల్లో సీసం పోసి క్రూరంగా హింసించి చంపారు. అయితే మహావీరుడు, బుద్ధుడు రాజవంశాలకు చెందిన వారు కాబట్టి వారు సమాజంలో తమకున్న పరపతి కారణంగా తమ సిద్ధాంతాలకు ఆదరణ ఆమోదం సంపాదించుకున్నారని చెప్పవచ్చు. కొన్ని హిందూ మత గ్రంథాలు బుద్ధుడిని చార్వాకుడ్ని అని పేర్కొనడం భావజాల పరంగా బుద్ధుడికి చార్వాక, లోకాయత తత్వవేత్తలతో వున్న సాన్నిహిత్యం వల్లనే కావచ్చు.

క్రీ.పూ. ఆరవ శతాబ్దానికి చెందిన గౌతమ బుద్ధుడు ఆనాటి జన పదాలలో ఒకటైన శాక్య జనపదాన్ని పాలిస్తున్న సుద్ధోధనుడి కుమారుడు. ఆయన తనకు ముందున్న చార్వాక లోకాయత భౌతికవాద ధోరణుల నుంచి కొంతమేరకు స్ఫూర్తి పొంది తనదైన తాత్విక సిద్ధాంతాన్ని రూపొందించాడు. వేదాలు అపౌరు షేయాలని, వాటిని స్వయంగా భగవంతుడు భూమ్మీదకు పంపాడని చెప్పుకున్న వైదిక మతాన్ని బుద్ధుడు తన సిద్ధాంతంతో ఎదిరించాడు. వేదాల ప్రామాణికతను ప్రశ్నించి బ్రాహ్మణాధిపత్యాన్ని ఎండగట్టి ఓ కొత్త సామాజిక విప్లవానికి బుద్ధుడు తెరతీశాడు. అలాగే యజ్ఞయాగాలు, కర్మకాండలు పేరుతో వైదికమతం ప్రజల, మూగ జీవుల హక్కులను హరించి వేస్తుందని అన్నాడు.

బుద్ధుని ఆలోచనా విధానంలో 'అనాత్మ', 'అనిత్య', 'ప్రతీత్య', 'సముత్పాద', 'అష్టాంగమార్గం', 'మధ్యేమార్గం', 'శీల', 'కరుణ', 'సమత', 'ప్రజ్ఞ' వంటివి ప్రధానమైనవి. బుద్ధుడు ఆత్మ లేదనడం ఆరున సిద్ధాంతంలోని భౌతికవాద దృక్పథానికి మచ్చుతునక. అలాగే బుద్ధుడు 'అనిత్య' అనే భావన ద్వారా సమాజం చలనశీలమైనదని చెప్పాడు. ప్రతీత్య సముత్పాద ద్వారా వివిధ అంశాల మధ్య వుండే కార్యకారణ సంబంధాన్ని ముందుకు తీసుకొచ్చి హేతువుకు ప్రాధాన్యమిచ్చాడు. అష్టాంగ మార్గం సరైన పద్ధతిలో వ్యక్తి తన దృక్పథాన్ని ఏర్పరచుకోవడానికి, వ్యక్తిత్వ వికాసానికి దోహదం చేస్తుంది. బౌద్ధంలోని ఈ అంశాలన్నీ బౌద్ధాన్ని ఒకమతం అనే స్థాయి నుంచి ఒక తత్వశాస్త్ర స్థాయికి తీసుకెళ్లాయి. అలాగే స్త్రీలకు, అణగారిన వర్గాలకు బుద్ధుడు తన సంఘం లో స్థానం కల్పించాడు ఒక వేశ్య అయిన ఆమ్రపాలి, వేశ్యాపుత్రుడైన జీవకుడు, దొంగ అయిన అంగలీమాలుడు, మంగలి కులస్థుడైన ఉపాలి బౌద్ధ సంఘంలో మంచి గౌరవాన్ని, హోదాను పొందడం విశేషం.

బుద్ధుడు ఆనాటికి పండితుల భాషగా దేవ భాషగా గుర్తింపు పొందిన సంస్కృతాన్ని కాదని ప్రజల భాషయైన పాళీ భాషకు ప్రాధాన్యత నివ్వడం కూడా బుద్ధుడు బ్రాహ్మణ వాదానికి ప్రత్యామ్నాయవాదాన్ని ప్రతిపాదించడంలో భాగంగానే అర్థం చేసుకోవాలి. బౌద్ధమత సాహిత్యం చాలావరకు పాళీ భాషలోనే గ్రంథస్తం అయ్యింది.

బుద్ధుని అనంతరం ఆయన బోధనలు చాలా ప్రాంతాలలో, దేశాలలో వ్యాప్తి చెందాయి. బుద్ధునికి సమకాలీనుడైన అజాత శత్రువు బుద్ధుని మరణానంతరం తన రాజధానియైన రాజగృహలో సుమారు వంద రోజులకు మొదటి బౌద్ధసంగీతిని ఏర్పాటు చేశాడు. అనంతరం కాలాశోకుని కాలంలో వైశాలిలో రెండవ బౌద్ధ సంగీతి, తర్వాత కాశ్మీర్‌లో కనిష్కుని కాలంలో నాల్గవ బౌద్ధ సంగీతి జరిగాయి. ఈ సంగీతులన్నీ బుద్ధుని బోధనలను గ్రంథస్థం చేసి కాపాడడానికి తోడ్పడ్డాయి.

పాలకవర్గం అండదండలు వున్నంత కాలం బౌద్ధం విస్తృతంగా వ్యాప్తి చెందింది. ఉత్తర భారతంతో పాటు దక్షిణాది రాష్ట్రాల్లో కూడా బౌద్ధం వేగంగా చొచ్చుకు పోయిందనడానికి ఆంధ్రప్రదేశ్‌లో అడుగడుగునా నిక్షిప్తమయిన బౌద్ధస్థూపాలు, విహారాలు, బౌద్ధమతపరమైన ఆనవాళ్లే సాక్ష్యం. ఆంధ్రప్రదేశ్‌లో బౌద్ధం ప్రవేశించే నాటికి ఇక్కడ పూర్తిగా

అనార్య సంస్కృతి ఉండేది. శబర, పుళింద, మూతిబ నాగ, యక్ష అనే అనార్య జాతుల వారు స్థానికంగా నివశిస్తూ ఉండేవారు. వీరికి కుల వ్యవస్థ తెలియదు. తర్వాత ఉత్తరాదిన పుష్యమిత్ర శృంగుడి కాలంలో మొదలైన వైదికమత పునరుద్ధరణ కార్యక్రమం అంతకు ముందు రోజులలో ఉన్న సామాజిక అంతరాలను పటిష్టపరచమే కాకుండా వైదిక బ్రాహ్మణ ఋషులను దక్షిణాదికి పంపి వైదిక మతాన్ని, తద్వారా కుల వ్యవస్థను దక్షిణాదిలో స్థిరీకరింపచేయడమనే ప్రక్రియ ఆంధ్రప్రదేశ్‌లో మొట్టమొదటిదిగా చెప్పబడుతున్న శాతవాహన రాజ్యకాలంలో మొదలైంది. ఈ క్రమాన్ని చరిత్రకారులు ఆర్యనైజేషన్ అని పిలుస్తారు. ఆంధ్రదేశంలోకి బౌద్ధం వ్యాప్తి చెందడం మొదలయ్యాక ఆర్యనైజేషన్ ప్రక్రియ మొదలయ్యిందనడానికి ఆధారం. ఇక్ష్వాకుల కాలంలో రాజవంశాలకు చెందిన స్త్రీలు బౌద్ధులుగా ఉండగా, పురుషులు వైదిక మతపరమైన యజ్ఞ యాగాలు చెయ్యడమే! సామాన్య ప్రజలు, చేతి వృత్తులవారు, వ్యాపారులు ఎక్కువగా బౌద్ధాన్ని ఆదరించినట్లు తెలుస్తుంది.

బౌద్ధ సాహిత్యంలోనూ, శిల్పంలోనూ ఎక్కువగా కనిపించే నాగులు, యక్షులు ఆనాడు బౌద్ధంలో క్రియాశీలక పాత్ర వహించారు. వీరే ఈనాటి దళితులుగా చెప్పవచ్చు. వీరికి బౌద్ధంలో సముచితమైన స్థానం ఉందనడానికి అమరావతి, నాగార్జున కొండ మొదలైన క్షేత్రాలలో కనిపించే శిల్పాలే ప్రత్యక్ష సాక్ష్యం. ఆర్యనైజేషన్ క్రమంలో బౌద్ధం ధ్వంసమై వైదిక హిందూ మతం ఇక్కడ నిలదొక్కుకుంది. ఈ క్రమంలో అనార్య జాతులు అంటరానివారిగా పరిగణించబడి ఊరి చివరకు నెట్టబడ్డారు.

బౌద్ధం వేదాల ప్రామాణికతను, బ్రాహ్మణాధిపత్యాన్ని ప్రశ్నించడమే కాకుండా హేతువాదానికి, భౌతికవాదానికి ప్రాముఖ్యతనివ్వడం బౌద్ధాన్ని బ్రాహ్మణ వాదానికి ప్రత్యామ్నాయంగా నిలబెట్టింది. 'అనాత్మ' వాదంతో పాటు శాస్త్రీయ దృక్పథాన్ని ప్రతిపాదించే 'ప్రతీత్య సముత్పాద' వంటి భావనలు బుద్ధుడిని ఇతర ప్రవక్తలకంటే, తత్వవేత్తల కంటే పై అంతస్థులో నిలబెట్టాయి. ప్రజ్ఞ, కరుణ, సమత, మైత్రి, శీల వంటి భావనలు బౌద్ధం విశాలమైన ప్రాపంచిక దృష్టికి నిదర్శనం. అందువల్లనే ప్రముఖ చరిత్రకారిణి రోమిల్లా థాపర్ బౌద్ధాన్ని వరల్డ్ రిలిజియస్ పార్లమెంట్ అని పిలిచారు. ప్రాచీన భారతదేశంలో ఓ పెద్ద సామాజిక విప్లవానికి నాంది పలికిన గౌతమబుద్ధుడు రాజవంశానికి చెందిన వాడు కావడం వలన కూడా ఆయన సిద్ధాంతం అన్ని వర్గాల ప్రజల్ని ఆకర్షించిందన వచ్చు. ఆయన సంఘంలో అణగారినవర్గాలకు చెందిన ప్రజలు, స్త్రీలు సహజంగానే సభ్యులయ్యారు. బ్రాహ్మణవాదం పుట్టుకతో వస్తుందని చెప్పే ప్రతిభ, పాండిత్యాలను కాదని ప్రయత్నంతోనూ, ప్రజ్ఞతోనూ సాధించే జ్ఞానానికి బుద్ధుడు ప్రాధాన్యతనివ్వడం జరిగింది. అంబేద్కర్ బౌద్ధ ధర్మ స్వీకరణ బౌద్ధమత చరిత్రలో ఓ కీలక అధ్యాయం. ప్రాచీన కాలంలో జరిగిన నాలుగు బౌద్ధ సంగీతుల తర్వాత 1954 లో బర్మా రాజధాని రంగూన్ లో జరిగిన ఐదవ బౌద్ధ సంగీతికి అంబేద్కర్ హాజరై కీలకోపన్యాసం చేశాడు. అదే క్రమంలో నేపాల్ రాజధాని ఖాట్మాండు బౌద్ధ సమ్మేళనం, అమెరికాలోని హెటెరొడొక్స్ రిలిజన్‌లో కూడా ఆయన ముఖ్యవక్తగా పాల్గొనడం బౌద్ధాన్ని తిరిగి ప్రపంచ వ్యాప్తంగా పునరుజ్జీవింపచెయ్యడమే!

అయితే బౌద్ధంలోని సామాజిక విప్లవ సిద్ధాంత రూపాలైన బ్రాహ్మణాధిపత్యాన్ని ఖండించడం, వేదాలను తిరస్కరించడం వంటి అంశాలు గిట్టని బ్రాహ్మణవాదులు బుద్ధుని అనంతరం బౌద్ధాన్ని భౌతికంగా నిర్మూలించడంతో పాటు బుద్ధుని తాత్వికతపై కూడా సామదాన భేద దండోపాయాలను ప్రయోగించారు. సర్వేపల్లి రాధాకృష్ణన్ 'బుద్ధుడు వైదిక మతంలో పుట్టి, వైదిక మతంలో పెరిగి, వైదిక మతంలోనే మరణించాడు. ఆయన తానొక మతాన్ని ప్రారంభిస్తున్నానని చెప్పుకోలేదు' అని ఒక పుస్తకానికి రాసిన ముందు మాటలో వ్యాఖ్యానించాడు. అంతే కాకుండా ఆ పుస్తకం మొదటి ముద్రణలో అంబేద్కర్ బౌద్ధమత పునరుజ్జీవనానికి చేసిన కృషిపై ఉన్న వ్యాసాన్ని తొలగించి రెండవ ముద్రణకు రాసిన ముందు మాటలో రాధాకృష్ణన్ పై వాఖ్యలు చెయ్యడం అనేది బ్రాహ్మణవాద కుట్ర. ఇదంతా బుద్ధుని ఆలోచనా విధానంలోని కీలకాంశాలను పక్కదారి పట్టించడమే. బ్రాహ్మణవాదం వైదిక హిందూమతంలోని డొల్లతనాన్ని ఎండగట్టిన బుద్ధుని విష్ణుమూర్తి దశవతారాల్లో ఒక అవతారంగా చేసి తనలో జీర్ణం చేసుకుని తేన్చింది. మధ్యయుగాల్లో అనార్యజాతులు పూజించే గ్రామ దేవతల్ని కూడా హైందవ పురుష దేవతలకిచ్చి పెళ్లిచేసి వారి అస్తిత్వాలను కబ్జా చేసిందని మన సాంస్కృతిక చరిత్ర రుజువు చేస్తుంది.

అలాగే హిందూ తాత్వికులుగా పేరొందిన ఆదిశంకరాచార్యులు, కుమారిల భట్టు వంటి వారు బౌద్ధంపైన నైతిక దాడికి పాల్పడ్డారు. వారి ప్రతినిధులు బౌద్ధ విహారాలను ధ్వంసం చేయడంతో బౌద్ధం భారతదేశం నుంచి వెళ్లిపోయింది. బౌద్ధాన్ని దేశం నుంచి వెళ్లగొట్టి భారతదేశం ఆత్మహత్య చేసుకుందని గురజాడ వాపోయాడు. బౌద్ధం భారతదేశం నుంచి నిష్క్రమించినప్పటికీ ప్రపంచవ్యాప్తంగా విస్తృతంగా వ్యాప్తి చెందింది. దాదాపు ఆగ్నేయాసియా దేశాలన్నీ బౌద్ధ దేశాలుగా తమ రాజ్యాంగంలోనే ప్రకటించుకున్నాయి.

బ్రిటిష్ పాలనలో బౌద్ధం భారతదేశంలో పునరుజ్జీవనం పొందడం ప్రారంభించింది. పురావస్తు తవ్వకాల ద్వారా బౌద్ధ స్థూపాలు, విహారాలు వెలుగులోకి వచ్చాయి. బౌద్ధమత గ్రంథాలు పాళీభాష నుంచి సంస్కృతం నుంచి ఇంగ్లీష్‌లోకి తద్వారా ప్రాంతీయ భాషలలోకి అనువాదం పొందుతున్నాయి. శ్రీలంకకు చెందిన బౌద్ధభిక్షువు అనాగారిక ధర్మపాల స్థాపించిన మహాబోధి సొసైటీ భారతదేశంలో కలకత్తా, మద్రాసు, బెంగుళూరు వంటి నగరాలలో విస్తరించి బౌద్ధాన్ని తిరిగి ప్రజలలో ప్రచారం చేస్తుంది. తమిళబౌద్ధ ఉద్యమకారుడు పండిత అయోతీదాస్, సుప్రసిద్ధ బౌద్ధ పండితుడు ప్రొ. పోకల లక్ష్మీనరుసు డా. అంబేద్కర్ బౌద్ధంలోని సామాజిక విప్లవ సిద్ధాంతాన్ని విడమర్చి ప్రజలకు వివరించడమే కాకుండా అంబేద్కర్ తన బౌద్ధమత దీక్షతో దళితులను బౌద్ధ మతం బానిస సంకెళ్ల నుంచి బయటకు వచ్చే ఓ విముక్తి సిద్ధాంతం అని చాటి చెప్పాడు. ఆయనతో పాటు సుమారు ఐదు లక్షల మంది అనుచరులు కూడా 1956లో నాగపూర్‌లో బౌద్ధ ధర్మదీక్ష తీసుకోవడంతో దళిత ప్రజలు బౌద్ధం గురించి ఆలోచించడం ప్రారంభించారు. దళిత ఉద్యమకారులు, మేధావులు బౌద్ధం పైన చర్చించడం పుస్తకాలు ప్రచురించడం, దీక్షా కార్యక్రమం నిర్వహించడం దేశ వ్యాప్తంగా జరుగుతుంది. ఇప్పుడు బౌద్ధం ఒక ఉద్యమంగా ముందుకొస్తుంది. ఒకప్పుడు బౌద్ధులుగా ఉన్న దళితులు మళ్లీ తమ అస్తిత్వ మూలాల

# జెఎన్‌యు విద్యార్థి గళాలకు శిక్షలు

***కేంద్ర ప్రభుత్వ హిందూ ఫాసిస్టు విధానాలను వ్యతిరేకిస్తూ ప్రజల పక్షాన ప్రశ్నిస్తున్న మేధావుల, విద్యార్థుల గొంతు నొక్కాలని ప్రయత్నిస్తున్న ప్రభుత్వాన్ని నిలదీస్తూ జెఎన్‌యు విద్యార్థులు ఉద్యమిస్తున్నారని అంటున్నారు* సంతోష్**

**2014** మేలో అధికారంలోకి వచ్చిన నరేంద్రమోడీ ప్రభుత్వం ఈ రెండు సంవత్సరాలలో దేశాన్ని మరింత తిరోగమన దిశలోకి నెట్టింది. ఆర్‌ఎస్‌ఎస్ నేతృత్వంలో బిజెపి, దాని నాయకత్వంలోని ప్రభుత్వం దేశంలో జరుగుతున్న ప్రతి అంశంలోనూ హిందూత్వ మతతత్వ ఫాసిస్టు శక్తుల దృష్టికోణాన్ని ఆమోదించవలసిందిగా ఒక పద్ధతి ప్రకారం అభ్యుదయ వాదులను, రచయితలను హత్యలు చేస్తూ, మైనారిటీలపై దాడులు చేస్తూ యావత్ ప్రజానీకానికి బెదిరింపులు సాగిస్తూ వస్తోంది. ఏరకమైన అసమ్మతినిగానీ, అంతేగాక ప్రభుత్వ సామ్రాజ్యవాద అనుకూల ప్రజా వ్యతిరేక విధానాలను ప్రశ్నించడాన్ని కూడా అనుమతించడం లేదు. బిజెపి, దాని అనుంగు మతతత్వ సంఘపరివార్ శక్తులు, గత ఆరు మాసాలుగా ఈ రకమైన బెదిరింపు పరిస్థితిని మనదేశ ప్రతిష్టాత్మక ఉన్నత విద్యా సంస్థలలో కల్పిస్తున్నారు. బిజెపి పాలనలో మోగుతున్న ఫాసిస్టు ప్రమాద ఘంటికలు ఈ కాలంలో దళితులపై, మైనారిటీలపై జరిగిన అనేక సంఘటనలు సూచిస్తున్నాయి. ఈ పరిణామాలన్నింటిని మోడీ ప్రభుత్వం ప్రారంభించిన విద్య కాషాయీకరణ – కార్పొరేటీకరణ అజెండాలో భాగంగా చూడాలి. ఓ వైపు మతతత్వాన్ని ఎగదోస్తూ, మరోవైపు దేశ సార్వభౌమత్వాన్ని సైతం సామ్రాజ్యవాదులకు తాకట్టు పెడుతూ, దేశ వనరులన్నీ కార్పొరేట్ సంస్థలకు దోచిపెడుతోంది. దాన్ని ఎదిరించే వారిని ఫాసిస్టు పద్ధతుల్లో అణచివేసే రాజకీయార్థిక విధానాల్లో భాగమే ఈ అజెండా.

జెఎన్‌యు విద్యార్థుల అరెస్టు, దేశద్రోహ నేరం మోపడం వంటి ఘటనల ద్వారా కూడా రాజ్యం, బిజెపి పాలకులు తమకు భిన్నమైన ఆలోచనలు, దృక్పథాలు, అభిప్రాయాలు కలవారిని వ్యతిరేకించడంలో, వారిని అణచివేయడంలో, అక్రమ కేసులు బనాయించడంలో ఎంతటి నీచత్వానికి దిగజారుతారో గమనించవచ్చు. అరెస్టు చేయబడి, పోలీసుల అదుపులో ఉన్న జెఎన్‌యు విద్యార్థి సంఘ నాయకుడైన కన్నయ్య కుమార్ పైనా, విద్యార్థులు, ప్రొఫెసర్లు, జర్నలిస్టులపైనా బిజెపి అనుకూల న్యాయవాదులు, గూండాలు కలగలిసి, జెఎన్‌యు విద్యార్థుల కేసు విచారణ సాగుతున్న పాటియాలా న్యాయస్థాన ఆవరణలోనే దాడులకు పాల్పడ్డారు. బిజెపిలో, బిజెపి నాయకత్వంలోని ప్రభుత్వంలో నిరంకుశ ధోరణులు ఏవిధంగా, ఎంతటి ప్రమాదకర స్థాయిలో ప్రబలి పోతున్నాయనేదానికి ప్రత్యక్ష తార్కాణంగా పేర్కొనవచ్చు. ఈ విధంగా బిజెపి వ్యూహాత్మకంగా ఉన్మాద గుంపులను ప్రయోగించి దాడులు సాగించి, ప్రత్యర్థులను భీతావహులను చేయడం ద్వారా వారిని నోరు మెదపకుండా చేయడంతో పాటు 'జాతీయవాదం', 'దేశభక్తి' సాకుతో చట్టబద్ధ పాలనను తుంగలో తొక్కుతున్నది.

జెఎన్‌యులో ఫిబ్రవరి 9న జరిగిన కార్యక్రమానికి సంబంధించి పాలకవర్గం అనాలోచితంగా, నిరాధారంగా విద్యార్థులకు 'శిక్షలు' ఖరారు చేసింది. ప్రొక్టోరియల్ కమిటీని పక్కనపెడుతూ, జెఎన్‌యు కులపతి జగదీశ్ కుమార్ 'హై లెవల్' ఎన్‌క్వైరీ కమిటీ (హెచ్‌ఎల్‌ఇసి) పేరుతో త్రిసభ్య విచారణ కమిటీని ఏర్పాటు చేసినప్పుడే దీని స్క్రిప్టు తయారైంది. రిజర్వేషన్లను ద్వేషించే రాకేశ్ భట్నాగర్ అధ్వర్యంలో ఈ కమిటీ ఏర్పాటు చేశారు. ఈ కమిటీ దళితుల పట్ల, రిజర్వేషన్‌ల పట్ల, మైనారిటీల పట్ల వ్యతిరేకత చూపుతుందన్న సందేహంతో దీన్ని ఒప్పుకోమని విద్యార్థులు ఆనాడే స్పష్టం చేశారు. ఈ మేరకు విద్యార్థుల జనరల్ బాడీ సమావేశం ఓ తీర్మానం చేసింది. కమిటీని సరైన ప్రాతినిధ్యంతో విస్తరించాలని వారు డిమాండ్ చేశారు. కానీ 'నాగపూర్' రిమోట్‌తో నడిచే విసి జగదీశ్‌కుమార్ దీన్ని పెడచెవిన బెట్టారు.

---

వైపు దృష్టి సారిస్తున్నారు. వారి పరంగా 'ఘర్‌వాపసీ' అంటే తిరిగి బౌద్ధంలోకి వెళ్లడమే! భారతదేశమంటే బౌద్ధ దేశమే!

స్థానిక సంస్కృతులను, బౌద్ధాన్ని కబ్జా చేసిన హిందూ మతం హిందువులు కానివారిని అంటరానివారిగా, దేశద్రోహులుగా, నేరస్థ జాతులుగా ముద్ర వేసి లాఠీ తీసుకుని తరుముకొస్తే వారు ఈ వ్యవస్థలో తిండికి బట్టకి నోచుకోక, మనిషితనానికి నోచుకోక తన సొంత నేలమీద కాందిశీకులుగా బతికారు. అణగారిన వర్గాలపై తాను కొనసాగిస్తున్న దాష్టీకానికి మతపరమైన ఆమోదాన్ని తెచ్చుకున్న హైందవం ఇప్పుడు బరితెగించి భగవద్గీతను రాష్ట్రగ్రంథంగా ప్రకటించడం సిగ్గుచేటు. చాపకిందనీరులా జాతీయోద్యమ కాలం నుంచి ప్రచారంలో ఉన్న హిందూ జాతీయవాదం ఇప్పుడు రాజ్యాధికారం చేపట్టాక బహిరంగంగానే హిందుత్వ వాదాన్ని ఈ దేశపు తాత్వికతగా ముందుకు తీసుకురావడంలో భాగమే 'ఘర్‌వాపసీ' కార్యక్రమం. హిందూమతం అంటే కులవాదమని గుర్తించవలసిన వారు గుర్తించారు. అందుకే తమ స్వంత మతమైన బౌద్ధం వైపు ఆశక్తిగా చూస్తున్నారు. అంబేద్కర్ కలలుకన్న 'ప్రబుద్ధ భారత్' సాకారం కాబోయే రోజులు సమీప భవిష్యత్‌లో వస్తాయని ఆశిద్దాం.

మే 21 బుద్ధపూర్ణిమ సందర్భంగా

*(రచయిత నాగార్జున విశ్వవిద్యాలయంలో ప్రొఫెసర్)* వీ

అఫ్జల్‌గురు వర్ధంతి సందర్భంగా చోటు చేసుకున్నట్లు చెబుతున్న సంఘటనలకు సంబంధించి ఈచర్యలు తీసుకున్నట్లు చెబుతున్నారు. ఉన్నతస్థాయి విచారణ కమిటీ విద్యార్థుల వాదనలేమిటో తెలుసుకోకుండానే ఏకపక్షంగా నివేదిక తయారు చేసింది. దాని ఆధారంగా ఏప్రిల్ 26న 14 మంది విద్యార్థులకు శిక్షలు ప్రకటించింది. అందులో కన్నయ్య కుమార్ సహా పలువురు విద్యార్థులకు జరిమానాల నుంచి రస్టికేషన్, హాస్టల్ వెలి, క్యాంపస్ బహిష్కారాల దాకా వేర్వేరు శిక్షలు ప్రకటించింది. ఇదే కార్యక్రమానికి సంబంధించి విద్యార్థులపై నమోదైన రాజద్రోహం కేసు కోర్టు విచారణలో ఉండగానే శిక్షలు విధించడం గమనార్హం. నిజానికి వీడియోలను మార్ఫింగ్ చేశారని మెజిస్టీరియల్ విచారణలో నిగ్గు తేలినప్పుడే 'జాతీయవాదం', 'దేశభక్తి' ముసుగులో దాగున్న ఆర్ఎస్ఎస్ శక్తులు విద్యార్థులపై వేలెత్తే నైతిక అర్హతను కోల్పోయాయి.

జెఎన్‌యు విద్యార్థి సంఘ అధ్యక్షుడు కన్నయ్య కుమార్‌కు పది వేల రూపాయల ఫెనాల్టీని విధించగా, ఉమర్ ఖలీద్, అనిర్బన్ భట్టాచార్యలకు 20 వేల ఫెనాల్టీతో పాటు రెండు సెమిష్టర్లు హాజరు కాకుండా బహిష్కరించారు. మరికొందరు విద్యార్థులపైనా ఈతరహా శిక్షలు విధించారు. ముజిల్ గట్టూ కశ్మీర్ విద్యార్థి, ఇతని పేరు పోలీసు జాబితాలో లేకున్నా డిబార్ చేశారు. అలాగే ఉన్నతస్థాయి విచారణ కమిటీ జాబితాలో లేని ఐశ్వర్య అధికారిని కూడా డిబార్ చేశారు. అశితోష్ కుమార్, కోమల్ మోహిత్ లను హాస్టల్ నుండి బహిష్కరించారు. ఇంకా విద్యార్థి సంఘ నాయకులైన రామానాగ్, అనంత ప్రకాశ్, గార్గీ అధికారి, చింటూ కుమారీలను కూడ డిబారు చేశారు. చివరికి జెఎన్‌యులో ప్రస్తుతం లేని పూర్వ విద్యార్థులైన బాగొ జోత్సవ లాహ్రి, ద్రౌపతిలను కూడ డిబార్ చేశారు.

ఏప్రిల్ 26న జెఎన్‌యు రిజిస్ట్రార్ ఈ నిర్ణయం వెలువరించిన వెంటనే విశ్వవిద్యాలయంలో మళ్లీ ఉద్రిక్త పరిస్థితులు నెలకొన్నాయి. శిక్షల్ని ఎటువంటి పరిస్థితుల్లోనూ అంగీకరించేది లేదని విద్యార్థులు ప్రకటించారు. ఫిబ్రవరి 9 ఘటనకు సంబంధించి జెఎన్‌యు విద్యార్థులపై తీసుకున్న అక్రమ చర్యలను ఉపసంహరించాలనే డిమాండుతో ఏప్రిల్ 27 నుంచి నిరసన దీక్షలు చేపట్టారు. ఈ దీక్షలో 20 మంది విద్యార్థులు కూర్చున్నారు. మరోవైపు వర్సిటీ పాలకవర్గం వైఖరికి నిరసనగా జెఎన్‌యు టీచర్స్ అసోసియేషన్ రిలే నిరాహార దీక్షలకు పిలుపునిచ్చింది. నిరసన తెలుపుతున్న విద్యార్థులతో వర్సిటీ పూర్వ విద్యార్థులు కూడ చేరారు. వీరంతా మానవహారం నిర్వహించారు. చర్చల ద్వారా సమస్యను పరిష్కరించడానికి బదులుగా విద్యార్థుల నిరసన చట్టవ్యతిరేక చర్య అని జెఎన్‌యు విసి జగదీశ్ కుమార్ ఆక్షేపించడం సిగ్గుచేటు.

విశ్వవిద్యాలయ అధికారులు విధించిన ఈ శిక్షలు సమాజంలో ఎన్నో ప్రశ్నలను లేవనెత్తాయి. వాస్తవానికి ఈ ప్రశ్నలకు వారి వద్ద కూడా సమాధానాలు లేవు. ఈ పరిస్థితులే జెఎన్‌యు యాజమాన్య చిత్తశుద్ధిని, నిష్పాక్షికతని సందేహాస్పదం చేసింది. దేశ వ్యతిరేక నినాదాలు చేశారన్నది కన్నయ్యతో పాటు మిగిలిన విద్యార్థులపై ఉన్న ప్రధాన ఆరోపణ పూర్తిగా కుట్ర పూరితమైనదని ఇప్పటికే స్పష్టంగా తేలింది. మార్ఫింగ్ చేసిన వీడియోలతో కాషాయ దళాలు చేసిన కుట్రను దేశ ప్రజలందరూ వీక్షించారు. వీటితో పాటు కేంద్ర మంత్రులతో పాటు, పలువురు ఎబివిపి, బిజెపి నాయకులు ఉద్దేశ పూర్వకంగానే తిమ్మిని బమ్మిని చేయడానికి ప్రయత్నించారన్న విషయం స్పష్టమైంది.

ఈ విషయాలన్నీ విశ్వవిద్యాలయ అధికారులకు తెలియదని భావించలేం. ఒకవేళ తెలియదనుకున్నా ఆ నినాదాలు ఇచ్చిందెవ్వరో ఇప్పటి వరకు స్పష్టంగా తేలని స్థితి ఎందుకు ఏర్పడింది. హెచ్ఎల్ఇసి.... నివేదిక ముగింపులో జెఎన్‌యు విద్యార్థులు జాతి వ్యతిరేక నినాదాలు చేయలేదని పేర్కొంది. యూనివర్సిటీలో వెలుపలి నుంచి వచ్చిన వారు జాతి వ్యతిరేక నినాధాలు చేశారని తెలిపింది. అంటే జెఎన్‌యులో రచ్చ రాజేయడానికి ఆర్ఎస్ఎస్ సంబంధిత వ్యక్తులు లేదా బిజెపితో కలిసి కశ్మీర్‌లో ప్రభుత్వం ఏర్పాటు చేసిన పిడిపికి చెందిన వారై ఉంటారన్న అనుమానాలు మొదటి నుంచి ఉన్నాయి. ఇంతవరకు జాతి వ్యతిరేక నినాదాలు చేసిన ఏ ఒక్క వ్యక్తిని గుర్తించి అదుపులోకి తీసుకోలేదు. ఈ వ్యవహారంపై ఢిల్లీ ప్రభుత్వం విచారణ జరుపుతోంది. ఫిబ్రవరి 9 నాటి కేసులో అక్రమంగా దేశద్రోహ నేరం కింద ఇరికించబడి జైలులో ఉన్న ప్రొ. గిలానికి ఇంతవరకు బెయిల్ దొరకలేదు.

ఈ దేశద్రోహ ఆరోపణలపై కన్నయ్యతో పాటు ఉమర్ కూడా కొంత కాలం జైలులో గడిపి వచ్చారు. కోర్టు తీర్పు ఇంకా వెలువడలేదు. న్యాయవ్యవస్థ తన నిర్ణయాన్ని చెప్పకముందే దోషులెవ్వరో విశ్వవిద్యాలయ అధికారులు ఎలా నిర్ణయించారో అర్థం కాదు. కోర్టు తీర్పు కోసం ఆగాల్సిన అవసరం లేదని విశ్వవిద్యాలయ వైస్ ఛాన్సలర్‌తో పాటు ఆయన సహచరులు భావించారా? అదే నిజమైతే భవిష్యత్‌లో కన్నయ్య కుమార్‌తో పాటు ఇతరులు నిర్దోషులని కోర్టు తీర్పు ఇస్తే ఏం చేస్తారు? తప్పుడు శిక్షల కారణంగా ప్రభావితమై, నష్టపోయే విద్యార్థుల జీవితాలకు బాధ్యత ఎవరిది? చేతులు కాలాక ఆకులు పట్టుకోవడం మూర్ఖుల పనే అవుతుంది. జెఎన్‌యు యాజమాన్యం ఇప్పటికైనా పునరాలోచించాలి. పాలకుల కరుణా కటాక్షాల కోసం అతి ఉత్సాహంతో విద్యార్థుల జీవితాలతో చెలగాట మాడడం సరికాదు. భేషరతుగా విద్యార్థులపై విధించిన శిక్షలను ఉపసంహరించుకోవాలని విద్యార్థులు, అధ్యాపకులు, ప్రజాస్వామిక వాదులు డిమాండ్ చేస్తున్నారు.

జెఎన్‌యులో తలెత్తిన సంక్షోభాన్ని వెంటనే పరిష్కరించాలని కోరుతూ కాంగ్రెస్, సిపిఐ-ఎం, సిపిఐ, జెడియు, ఎన్‌సిపి, బిజెడి పార్టీలకు చెందిన ఎంపిలు రాష్ట్రపతికి లేఖ రాశారు. జెఎన్‌యు పాలకవర్గం విద్యార్థులకు విధించిన శిక్షలను తక్షణం వెనక్కి తీసుకోవాలని కోరారు. మరోవైపు జెఎన్‌యు విద్యార్థులకు తీరని అన్యాయం జరిగిందని, తక్షణమే జోక్యం చేసుకోవాలని రాష్ట్రపతిని 'ప్రహార్' (పీపుల్స్ రెసిస్టెన్స్ ఎగైనెస్ట్ హేట్రెడ్ అండ్ అథారిటేరియన్ డిప్రెషన్) ప్రతినిధులు విజ్ఞప్తి చేశారు. వర్సిటీలో స్వేచ్ఛా భావజాలానికి సంకెళ్లు వేస్తున్నారని, మతచాందసవాదాలు, పాలకుల ప్రజావ్యతిరేక విధానాలపై గొంతెత్తుతున్న విద్యార్థి లోకాన్ని అణచివేసేందుకు కుట్రలు జరుగుతున్నాయని వివరించారు. ఎంతో భవిష్యతు ఉన్న భావి పౌరులపై వివక్షపూరిత చర్యలతో వేటు వేశారని, తక్షణమే విజిటర్‌గా జోక్యం చేసుకుని విద్యార్థులను కాపాడాలని విజ్ఞప్తి చేశారు. ఈ బృందంలో ప్రొఫెసర్ కృష్ణగార్గ్, చంద్రశేఖరన్, సుబ్రహ్మణియన్, శ్వేతభట్ అమితాబచ్ సహా నలభై మంది ఉన్నారు.

జెఎన్‌యు పాలకవర్గం పరీక్షలు, సెలవుల సమయాన్ని చూసి ఏప్రిల్ 26న శిక్షలు ప్రకటించింది. ఇలా చేస్తే విద్యార్థులు పోరాడకుండా ఇండ్లకు వెళ్లిపోతారని పాలకవర్గం ఆశించింది. విద్యార్థులు చదువుల్లో మునిగిపోయి ఉంటారు కాబట్టి ఈ సమయంలో తాము ఏం చేసినా చెల్లుతుందని, ఆందోళనలు ప్రారంభం కావని విశ్వ విద్యాలయ అధికారులు భావించినట్టున్నారు. అయితే యాజమాన్యం అంచనాలకు భిన్నంగా 'పోరాటాలకు సెలవులుండవని' తెగేసి చెబుతూ విద్యార్థులు ఏప్రిల్ 27 నుంచి పోరుశంఖం ఊదారు. విద్యార్థులపై ఈ కక్షసాధింపు చర్యల వెనుక హెచ్‌ఆర్‌డి, ఆర్‌ఎస్‌ఎస్‌ల హస్తం ఉందనేది బహిరంగ రహస్యం. విద్యార్థులు పదే పదే చెబుతున్నట్టుగా, దీనంతటికీ కారణం ఫిబ్రవరి 9 నాటి కార్యక్రమం అనే భ్రమలు ఎవరికీ ఉండనక్కరలేదు. ఈ దాడిలో మరెన్నో అంశాలు అంతర్భాగంగా ఉన్నాయి. ఉదాహరణకు 9 నెలల క్రితం క్యాంపస్‌లో ప్రదర్శించిన 'ముజఫర్‌నగర్ బాకీ హై' అనే డాక్యుమెంటరీ విషయంలో ఉమర్, అనిర్బన్‌లకు ఇప్పుడు నోటీసులందాయి. సరిగ్గా ఇదే డాక్యుమెంటరీ ప్రదర్శన సాకుతో హెచ్‌సియులో రోహిత్, అతని సహచరులను వేధింపులకు గురిచేసి చివరకు రోహిత్‌ను ఆత్మహత్య వైపు నెట్టేశారన్న వాస్తవాన్ని ఈ సందర్భంగా గుర్తు చేసుకోవాలి.

ఏప్రిల్ 8న 'మనుస్మృతి' ప్రతులను దగ్ధం చేసిన సంఘటనపైనా కొందరు విద్యార్థులపై విచారణ జరుగుతోంది. ఆఖరుకు పరిపాలనా భవనం గోడపై 'జై భీం' అని రాసిన విద్యార్థిని సైతం వేధింపులకు గురి చేస్తున్నారంటే అంబేద్కర్ జయంతి పేరిట వీరు చేసే ఆర్భాటం ఎంత బూటకమో అర్థం చేసుకోవచ్చు. అంతేకాదు, ఈమధ్యే జెఎన్‌యులో ప్రవేశానికి సంబంధించి ఓ మౌలిక మార్పు చేశారు. వెనుకబడిన ప్రాంతాల నుంచి వచ్చే మహిళా విద్యార్థినులకు ఇచ్చే 'డిప్రైవేషన్ పాయింట్ల'లో కోత విధించారు. ఓబిసి కోటాను సైతం కుదించే కుట్రలు చేశారు. ఈ పరిణామాలు జెఎన్‌యుకు మాత్రమే పరిమితం కాదు. దేశంలోని ఉన్నత విద్యా సంస్థలన్నింటి స్వయం ప్రతిపత్తిని కాలరాసి, వాటిపై సంఘ్‌పరివార్ శక్తులు పట్టు బిగిస్తున్నాయి. శాస్త్రీయతకు, విజ్ఞానానికి నెలవుగా ఉండే ఐఐటిలలో సంస్కృతాన్ని రుద్దుతున్నారు. దళిత, అణగారిన విద్యార్థులను వేధింపులకు, వివక్షకు గురి చేస్తున్నారు.

బహుళత్వం, వైవిధ్యం విలసిల్లే దేశంలో హిందూత్వ కుట్రలు, కుయుక్తులు సాగవని గతంలో అనేక సందర్భాల్లో రుజువైంది. రోహిత్ ఆత్మహత్య సృష్టించిన ప్రకంపనల నుంచి పుట్టుకొచ్చిన విద్యార్థి ఉద్యమం దావానలంగా దేశవ్యాప్త ప్రతిఘటన ప్రభంజనమైంది. మత ఉన్మాద చర్యలను ఎదుర్కొనేందుకు దేశ లౌకిక, ప్రజాస్వామ్య విలువల పరిరక్షణకు యువత కదం తొక్కుతోంది. వీరికి దేశీయ, విదేశీ మేధావుల నుండి సంఘీభావం అందుతున్నది. అరెస్టులు, కేసులు, దాడులు, క్రమశిక్షణ చర్యలు... ఇవేమీ వారి లక్ష్యాన్ని, పోరాటాన్ని కించిత్ కూడా పక్కకు తప్పించలేవని మరోమారు చాటారు. విచారణ కమిటీ ఎటువంటి చర్యలు, శిక్షలకు సిఫార్సు చేయకపోయినా కేంద్రం చేతిలో కీలుబొమ్మలుగా మారిన పాలకమండలి సభ్యులు తీసుకున్న క్రమశిక్షణ చర్యలను విద్యార్థులు సవాల్ చేస్తున్నారు. వారు నిరవధిక నిరాహార దీక్షకు పూనుకొన్నారు. విద్యార్థి ఉద్యమానికి అధ్యాపకుల మద్దతు వెల్లువెత్తుతోంది. ఇది విద్యార్థి ఉద్యమంగా మాత్రమే చూడరాదు. దేశంలో ప్రజాస్వామ్య లౌకిక విలువల పరిరక్షణోద్యమంగా పరిగణించాలి.

దేశ వర్తమాన చరిత్రలో విద్యార్థులు ఓ మహత్తర పాత్ర పోషిస్తున్నారు. వారిలో 'జెఎన్‌యుయైట్లు' అగ్రగాములుగా నిలిచారు. తొలి నుంచీ జెఎన్‌యు ప్రజాస్వామ్య, ప్రగతిశీల, విప్లవ భావజాలానికి బలమైన గొంతుకగా నిలిచింది. దేశంలోని వివిధ వర్గాల పీడిత ప్రజలందరికీ అదొక సంఘీభావ వేదికగా ఉంది. మతతత్వ, తిరోగమనవాద శక్తులకు అది ఎప్పుడూ కొరకరాని కొయ్యగానే ఉంది. అందుకే అది పాలకుల కంట్లో నలుసైంది. దాన్ని దెబ్బ తీయాలని మతతత్వ శక్తులు ఎప్పటి నుంచో ప్రయత్నిస్తున్నాయి. అందులో భాగంగానే 'దేశద్రోహకర' నినాదాల పేరిట తప్పుడు ఆరోపణలు ముందుకు తెచ్చారు. ఆ సాకుతో విద్యార్థులను వెంటాడుతూ వేధిస్తున్నారు. అయితే విద్యార్థులు దీనికి ఎదురు నిలిచారు. తమ సమస్యలపై పోరాడుతూనే దేశంలోని కార్మికులు, రైతులు, దళితులు, ఆదివాసులు చేస్తున్న పోరాటాలన్నింటికి సంఘీభావం ప్రకటిస్తున్నారు. తమపై జరుగుతున్న దాడికి మూలాలు 'నాగ్‌పూర్' భావజాలంలో ఉందంటూ సమైక్య పోరాటాలకు పిలుపునిస్తున్నారు. వారి నినాదం ఇప్పుడు జెఎన్‌యు గోడల్ని దాటి దేశం మూలమూలలా ప్రతిధ్వనిస్తోంది. దానికి గొంతు కలపడం ప్రజాస్వామ్యాన్ని, లౌకికవాదాన్ని కోరుకునే వారందరి బాధ్యత.

కేంద్ర ప్రభుత్వం అనుసరిస్తున్న పచ్చి నిరంకుశ వైఖరి మరోసారి వెల్లడైంది. విశ్వవిద్యాలయాల్లో ప్రజాస్వామిక, వామపక్ష, అంబేద్కరిస్టు భావజాల విద్యార్థులపై కక్ష సాధింపు చర్యలకు పాల్పడుతోందని రూఢి అవుతోంది. విద్యార్థులపై వర్సిటీ పాలక మండలి క్రమశిక్షణ చర్యలు తీసుకోవడానికి కేంద్రానికి సంబంధం ఏమిటనే సందేహానికి ఇక్కడ తావులేదు. హైదరాబాద్ కేంద్రీయ విశ్వవిద్యాలయం(హెచ్‌సియు), జవహర్‌లాల్ నెహ్రూ యూనివర్సిటీ (జెఎన్‌యు) ఘటనల్లో కేంద్ర పాలకుల ప్రమేయం సుస్పష్టంగా వెల్లడైంది. హెచ్‌సియులో దత్తాత్రేయ, స్మృతి ఇరానీ లేఖలు, అలాగే జెఎన్‌యులో స్మృతి ఇరానీ, ఇతరులు అనుసరించిన వైఖరి ఎంత వివాదాస్పదమైందో, ఎంతటి దుర్మార్గంగా ఉందో స్పష్టమైన ఆధారాలు ఉన్నాయి. కన్నయ్యకుమార్‌పై దాడులు, హత్య చేస్తామంటూ బెదిరింపులు, ఆయన సభల నిర్వహణను ఎక్కడికక్కడ అడ్డుకునేందుకు యత్నించడం తెలిసిందే.

ఈ నేపథ్యంలో జెఎన్‌యు తీసుకున్న దుర్మార్గమైన కఠిన క్రమశిక్షణ చర్యల వెనుక కేంద్ర పాలకుల కక్షపూరిత సాధింపే కనిపిస్తుంది. జెఎన్‌యు విద్యార్థి ఉద్యమానికి పలు వర్సిటీల విద్యార్థులు, ప్రొఫెసర్లు, ప్రజాస్వామిక వాదులు పెద్దఎత్తున మద్దతుగా నిలిచారు. ఈ కేసు న్యాయస్థానంలో విచారణలో ఉంది. ఈ దశలో ఈ శిక్షలు విధించడానికి వర్సిటీ పాలకమండలి తొందరపడాల్సిన అవసరం ఏమొచ్చింది? ఇందుకు పాలకమండలిపై ఎవరి ఒత్తిడి ఉందో ప్రత్యేకంగా చెప్పాల్సిన అవసరంలేదు. తమ హిందూత్వ భావజాలంతో విశ్వవిద్యాలయాలు, విద్యార్థుల మెదళ్లను నింపేయాలనే భావనతో ముందుకు సాగుతున్న కేంద్ర పాలకులు, వారికి మార్గదర్శకం చేస్తున్న ఆర్‌ఎస్‌ఎస్, విహెచ్‌పిలకు వామపక్ష, అంబేద్కర్ భావజాల విద్యార్థులు అడ్డంకిగా మారడంతోనే ఈ భౌతిక దాడులు, క్రమశిక్షణ పేరిట వారి జీవితాలతో

చెలగాటమాడుతున్నారనే వాస్తవం తేటతెల్లమవుతోంది.

విశ్వవిద్యాలయాలు మేథోమదనానికీ, భిన్న భావాలకు కేంద్రంగా వర్ధిల్లుతున్న సంప్రదాయానికి స్వస్తి పలికి తమ మతతత్వవాద భావజాల విద్యార్థులకు నిలయంగా మార్చాలనే కుట్రతోనే కేంద్రం ఈ తరహా నిరంకుశ వైఖరికి దిగుతోంది. రాజ్యాంగం కల్పించిన భావప్రకటన స్వేచ్ఛను హరించేందుకు తెగబడుతోంది. విస్తృత దృష్టితో చూసినప్పుడు అన్ని రంగాలకు చెందిన వాక్ స్వాతంత్ర్యాన్ని ప్రమాదంలోకి నెడుతున్నట్లు స్పష్టమవుతోంది. ఎఫ్‌టిఐఐ, హెచ్‌సియు, అలీఘడ్ ముస్లిం విశ్వవిద్యాలయం, జెఎన్‌యు, మద్రాసు ఐఐటిలోని పెరియార్ అంబేద్కర్ స్టడీసర్కిల్, జాదవ్‌పూర్ యూనివర్సిటీ, అలహాబాద్ యూనివర్సిటీ ... ఇలా ప్రతిచోటా మితవాద, మతవాద శక్తులు దళిత, వామపక్ష విద్యార్థులపై ఆరోపణలూ, అభియోగాలూ, దాడులు గుప్పిస్తూ ఆ సంస్థల ప్రతిష్ఠకు మసిపూసే, విద్యార్థుల్లో ప్రశ్నించే తత్వాన్నీ, సృజనాత్మక ఆలోచనలను తుంచివేసే ప్రయత్నం అంతూపొంతూ లేకుండా సాగుతోంది. విజ్ఞాన సముపార్జనలో విశ్వవిద్యాలయాల విహంగ స్వేచ్ఛను హరించేందుకు, వాటిని హిందూత్వ కూడళ్లుగా మార్చేందుకు కేంద్రం ఈ తరహా చర్యలు, కక్షపూరిత ధోరణులు ప్రదర్శిస్తోంది.

జెఎన్‌యు విద్యార్థుల ఉద్యమంలో వినూత్న రూపాల్లో నిరసనలు వ్యక్తమవుతున్నాయి. సృజనాత్మకతకు, నిత్యనూతనత్వానికి మారుపేరుగా నిలిచే జెఎన్‌యు విద్యార్థులు గొంతెత్తి నినాదాలు చేయడమే కాదు, తమ కలాలకు సైతం పదును పెడుతున్నారు. నిత్యం వ్యాఖ్యలు, వార్తా కథనాలు రాస్తున్నారు. ఇవి ప్రధాన స్రవంతి మాధ్యమాల్లో అంతగా చోటు చేసుకోనప్పటికీ సోషల్ మీడియాను వేదికగా వాడుకుంటున్నారు. కన్నయ్య కుమార్ అడపాదడపా తన కలంతోనూ కాక పుట్టిస్తున్నారు. తాజాగా ఆయన 'మదర్స్ డే' సందర్భంగా తన ఫేస్‌బుక్‌లో హెచ్‌ఆర్‌డి మంత్రి స్మృతి ఇరానీ పేరిట ఓ లేఖ రాశారు. దాని సారాంశాన్ని అందులోని ఆవేదనను ప్రతి ఒక్కరు అర్థం చేసుకోవాలి.

కన్నయ్య తన లేఖలో 'మోడీ గారి ఏలుబడిలో మన సొంత తల్లులే కాకుండా గోమాత, భారత్ మాత, గంగా మాత, స్మృతి మాత వంటి మాతలందరూ ఉండగా రోహిత్ ప్రాణాలెలా పోయాయన్నది నా ప్రశ్న. దీనికి నా దగ్గర జవాబు లేదు. రోహిత్‌నూ, అతని సహచరులనూ శిక్షించడానికి స్మృతి మాత మంత్రిత్వశాఖ ఒకటి కాదు, ఎన్నో లేఖలు రాసిందని, మీ మూలంగానే రోహిత్‌కు ఏడు నెలలు ఫెలోషిప్ లభించలేదని కూడా ఈ జాతివ్యతిరేకి అంటున్నాడు. ఒక తల్లి నకిలీ వీడియోలు, ఏకపక్ష విచారణ ఆధారంగా తన పిల్లలను శిక్షించే ప్రక్రియకు ఎలా ఆమోదం తెలుపుతుంది? మీ పిల్లలు అన్నం తినకుండా నిరాహారదీక్షలో అఘోరిస్తూ, మిమ్మల్నీ ప్రశ్నలడుగుతున్నారు. సమయం లభిస్తే తప్పక జవాబివ్వండి. నిజమైన మాతలైతే పిల్లలకు తప్పును తప్పు, ఒప్పును ఒప్పు అని అనడం నేర్పిస్తుంది. వారు తమ పిల్లలకు అన్యాయాలకు, అక్రమాలకు వ్యతిరేకంగా గొంతు విప్పాలని నేర్పిస్తున్నారు. అందుకే నిరాహారదీక్ష చేస్తున్న పిల్లల మనోస్థైర్యాన్ని పెంచడానికి ఎందరో తల్లులు ఈ పోరాటంలో చేరుతున్నారు. స్మృతి మాత జవాబిస్తారని ఆశిస్తున్నాను."

గత రెండేళ్లుగా దేశంలో భిన్నభిప్రాయాలపై, అభ్యుదయ భావాలపై, పౌర ప్రజాతంత్ర స్వేచ్ఛపై దాడులు జరుగుతున్నాయి. ఇవన్నీ ఫాసిస్టు లక్షణాలే. గత రెండు సంవత్సరాలలో చోటు చేసుకుంటున్న సంఘటనలను గమనిస్తే ప్రస్తుత పరిస్థితుల్లో ఫాసిస్టు తరహా పాలన తీవ్రత సంకేతాలు ఏ రూపంలో వ్యక్తమౌతున్నాయో అర్థమౌతోంది. ఇవాళ దేశవ్యాప్తంగా మైనార్టీలపై, దళితులపై నేరాలను ప్రోత్సహించే విధంగా, హత్యలకు సహకరించే వాతావరణాన్ని సృష్టిస్తున్నారు. దీన్ని సవాళుగా తీసుకొని భారతదేశ జీవన మార్గాన్ని కాపాడడానికి ప్రజాస్వామిక, లౌకిక, వామపక్ష శక్తులు నరేంద్ర మోడీ, ఆయన అనుచరులతో పోరాడుతున్నారు. మనదేశంలోని ప్రజాతంత్ర వాదులు, నిజమైన దేశభక్తులు యావన్మంది పీడిత, తాడిత ప్రజానీకంతో కలసి ఫాసిస్టు ప్రమాద ఘంటికలను నిరసిస్తూ, ఐక్యంగా నిలచి, నిశ్చయాత్మకంగా పోరాడుతున్నారు. ఇవ్వాళ మానవాభివృద్ధి, సామాజిక న్యాయం, స్వావలంబన, సార్వభౌమాధికారాన్ని మోడీ తుంగలో తొక్కారు.

ఈ పరిస్థితుల్లో హిందూత్వ శక్తుల రాజ్యాంగ వ్యతిరేక పోకడలను, అసత్యాలను తిప్పికొట్టేందుకు కేవలం భావజాల చర్చ ఒక్కటే సరిపోదు, ప్రజాస్వామ్య లౌకిక, సోషలిస్టు శక్తులు ఏకం కావాల్సిన అవసరం ఉంది. ఇప్పుడు జాతీయతకు సరికొత్త నిర్వచనాన్ని అందించాల్సిన సందర్భమూ వచ్చింది. ప్రజాస్వామ్యం, జాతీయవాదం అనేవి ఒక శతాబ్దికి ముందు ఆచరణలో లేవు. ఆధునిక రాజ్యవ్యవస్థ లక్షణాలుగా ఇవి చలామణిలోకి వచ్చాయి. ఇప్పుడు జాతీయత అంటే సమాజంలోని అన్ని వర్గాల ప్రయోజనాలను పరిగణనలోకి తీసుకోవాలనే నిర్వచనం ఇవ్వాలి. ప్రజలకే అధికారం అనే భావన సూత్రప్రాయంగా వచ్చిందేగానీ, సంపద ప్రజలందరిదీ అనే భావన ఈసమంత కూడ ఆచరణలోకి రాలేదు. దాని ఫలితమే నేడు సమాజంలో తలెత్తుతున్న విపరిణామాలన్నీ, దేశ సంపదను దేశ విదేశ కార్పొరేట్ సంస్థల గుత్తసొత్తుగా మార్చడం జాతి వ్యతిరేకం కాదా?

ఇవాళ జాతీయత, దేశభక్తి అంటే.. మహిళలు, బడుగు బలహీన వర్గాలు, గిరిజనులు, దళితులు, మైనార్టీలు ఇలా అందరి ప్రయోజనాలను పరిగణనలోకి తీసుకోవడం, వాటిని పాలనాయంత్రాంగం అమలుచేయడం లక్ష్యంగా మారాలి. ప్రజలందరి ఆత్మగౌరవ వికాసంలో, ఆహార భద్రతలో జాతి పునర్వికాసాన్ని, భవిష్యత్తును ఆవిష్కరించుకోవడంగా ఈ పదాలకు అర్థాన్ని ఇవ్వాలి. హిందూత్వ ఉన్మాదులు లేవనెత్తిన ఈ సందర్భాన్ని ప్రగతిశీల శక్తులు సద్వినియోగం చేసుకొనే చక్కని అవకాశం ఉంది. అసహన వాతావరణం తర్వాత వేముల రోహిత్ ఎపిసోడ్, ఇప్పుడు జెఎన్‌యు రాద్ధాంతం... మోడీ సర్కారు ప్రతిష్ఠను దిగజార్చాయనే చెప్పాలి. హిందూత్వ శక్తుల వీరంగమే తప్ప, అది సాధించిందేమీ లేదు, సాధించబోయేదీ ఏమీ ఉండదు. అయితే దీన్ని ఆ దిశగా మలచుకునే సత్తాను ప్రగతిశీల శక్తులు ప్రదర్శించాల్సిన తరుణం ఇది. మోడీ దూకుడుగా అమలు చేస్తున్న సామ్రాజ్యవాద ప్రపంచీకరణ అభివృద్ధి నమూనాకు ప్రత్యామ్నాయ అభివృద్ధి సమూన కావాలని కోరుకునే ప్రతి ప్రజాస్వామిక లౌకిక వాది, సామ్రాజ్యవాద అనుకూల మతతత్వ పాలన సాగిస్తున్న మోడీ ఫాసిస్టు విధానాలను తిప్పి కొట్టాల్సిన అవసరం ఉంది.

*(రచయిత ఉపాధ్యాయులు)*

# అత్యాచారాల, రాజ్యహింసల ఛత్తీస్‌గఢ్

*ఛత్తీస్‌గఢ్ బిజాపూర్ జిల్లాలో ఆదివాసి మహిళలపై భద్రతా దళాలు జరిపిన అత్యాచారాల ఘటనలను వివరిస్తున్నారు*

*నిజ నిర్ధారణ కమిటీ సభ్యురాలు* **పద్మజా షా**

ఛత్తీస్‌గఢ్ దక్షిణ భాగం జాతీయ భద్రత రీత్యా కీలకమైన సరిహద్దు ప్రాంతమేమీ కాదు. అక్కడేమీ దేశం నుంచి విడిపోవాలనే ఉద్యమం జరగడం లేదు. కాని అక్కడ సుదీర్ఘకాలంగా ప్రచ్ఛన్న, మంద్రస్థాయి యుద్ధం జరుగుతూ ఉంది. ఆ ప్రాంతం నుంచి జనాలను నిర్వాసితులను చేసి ఆ ప్రాంతాన్ని ఇతర ఉపయోగాల కోసం వాడాలనేది రాజ్య లక్ష్యం. ఆ ప్రాంతానికి యదాలాపంగా వెళ్లినా ఈ విషయం గుర్తించవచ్చు. ఆ ప్రాంతంలో జరిగిన అత్యాచారాల, హింసల ఘటనల వాస్తవాలను నిర్ధారించడానికి విమెన్ అగెనెస్ట్ సెక్సువల్ వాయిలెన్స్ అండ్ స్టేట్ రిప్రెషన్ అనే సంస్థ ప్రతినిధులతో పాటు, కొందరు స్వతంత్ర కార్యకర్తలం మే 5 నుంచి 7 వరకు ఛత్తీస్‌గఢ్ బిజాపూర్ జిల్లాలో పర్యటించాం.

గంగలూర్ పోలీస్ స్టేషన్ పరిధిలో అడవిలో 14 కిమీ లోపల ఉన్న కోర్చోలి అనే గ్రామానికి చేరుకోవడమే చాల కష్టం. అక్కడి దాకా వాహనాలు వెళ్లగలిగిన రోడ్డు లేదు. లోయలు, వాగులు, మామిడి తోటలు, దట్టమైన అడవి, వేసవి కాలపు మండుటెండలో ఎండిపోయిన గడ్డి, దుబ్బులు, పొదలు దాటి ట్రాక్టర్ మీద వళ్లు హూనమయ్యే, ఎముకలన్నీ ఎక్కడికక్కడ నలగ్గొట్టినట్టు అయ్యే ప్రయాణం చేసి మాత్రమే ఆ ఊరికి వెళ్లగలం. అది కేవలం పద్నాలుగు కిమీ దూరమే గాని నిండా మూడు గంటలు పడుతుంది.

ఆ గ్రామం చాల విశాలమైనది. ఇళ్లు అక్కడొకటీ ఇక్కడొకటీ విస్తరించి ఉన్నాయి. ఇళ్ల చుట్టూ క్రమబద్ధంగా కంచెలున్నాయి. ఎన్నో రకాల చెట్లున్నాయి. అయితే ఆ గ్రామపు ప్రశాంత సౌందర్యం పైకి చూడడానికి మాత్రమే. మావోయిస్టుల కోసం, వారి సానుభూతిపరుల కోసం కూంబింగ్ చర్యల పేరుతో భద్రతా బలగాలు అక్కడి శాంతిని చాల తరచుగా భగ్నం చేస్తున్నాయి.

రేణు (భద్రత దృష్ట్యా పేరు మార్చాం) ఇద్దరు బిడ్డల తల్లి. ఒకరు అంబాడే వయసులో బిడ్డ, మరొకరు ఇంకా పాలు మరవని శిశువు. ఈ సంవత్సరం జనవరిలో ఒకరోజు ఆమె వంటచెరకు కోసం బైటికి వెళ్లింది. గ్రామం చుట్టూ భద్రతా బలగాలు పహరా కాస్తున్నాయని ఆమెకు తెలియదు. హఠాత్తుగా ముగ్గురు యూనిఫారంలో ఉన్న ఆగంతుకులు ఆమెను అడ్డుకుని గ్రామం నుంచి దూరంగా లాక్కుపోయారు.

ఆ ఆగంతుకులు గోండి, హిందీ మాట్లాడారని, సి ఆర్ పి ఎఫ్ వాళ్లు వేసుకునే లాంటి యూనిఫారాలు వేసుకుని ఉన్నారని ఆమె అంటున్నది. ఇంట్లో పాలు తాగే బిడ్డ ఉన్నాడని, వదిలిపెట్టమని తాను ఎంత బతిమిలాడినా వాళ్లు వదలలేదు. ఆమె గట్టిగా ఏడ్చి, అరిచిన కొద్దీ వాళ్ల కోపం ఇంకా పెరిగిపోయింది. వాళ్లు ఆమెను అడవిలోకి లాక్కుపోయి, ఒకరి తరువాత ఒకరు ఇద్దరు అత్యాచారం చేశారు. మిగిలినవాళ్లు ఆమెను నేలకు అదిమిపట్టారు.

తీవ్రమైన అవమానంతో తన వాంగ్మూలం ఇస్తూ ఆమె తన మీద జరిగిన అత్యాచారాన్ని తన గ్రామానికి చెందిన ఇద్దరు స్త్రీలు చూశారనీ, వాళ్లు గ్రామస్తులకు చెప్పారనీ అంది. ఎట్లాగూ ప్రతి ఒక్కరికీ తెలిసిపోయింది గనుక ఈ విషయం మాట్లాడడానికీ, న్యాయం కోరడానికీ ఇప్పుడు ముందుకొస్తున్నానని ఆమె చెప్పింది.

చేర్పాల్ సమీపంలో రేగడగట్టలోని పాఠశాలను భద్రతా బలగాలు ఆక్రమించుకోవడంతో ఈ గ్రామానికి చెందిన ఎందరో ఆడపిల్లలు బడికి పోవడం మానుకున్నారు. కొందరు మగపిల్లలు మాత్రం ఇంకా చదువుకోసం ఆశ్రమ పాఠశాలలకు వెళ్తున్నారు. ఆడపిల్లలకు అందిన కొద్దిపాటి చదువు వల్ల, వలస కార్మికులుగా ఆంధ్రప్రదేశ్ కూ తెలంగాణకూ ఇతర ప్రాంతాలకూ వెళ్లివచ్చినందువల్ల వాళ్లకు తెలుగు, హిందీ అర్థం చేసుకోవడం, మాట్లాడడం బాగానే వచ్చు. రేణు చెప్పినదాన్ని మాకు అనువాదం చేసి చెప్పినతర్వాత, ఇతర బాధితులు భద్రతా బలగాల చేతుల్లో 2015 అక్టోబర్ నుంచీ అనుభవిస్తున్న ఎన్నో క్రూర హింసా ఘటనలను మాకు వివరించారు.

2015 నవంబర్ లో ఒక పెద్ద భద్రతా బలగాల గుంపు కొండలు దిగి వచ్చి ఇతవర్ అనే గ్రామంలో బస చేసింది. ఆ గ్రామానికి చెందిన సుక్కు కుంజమ్ అనే యువకుడిని పట్టుకుని తమను కోర్చోలి గ్రామానికి తీసుకుపొమ్మని నిర్బంధించారు. వాళ్లు కోర్చోలి చేరిన తర్వాత సుక్కు కుంజమ్ తమకు బంధువైన ఒక పెద్దమనిషి ఇంటికి భోజనానికి వెళ్లాడు. ఆ ఇంటి నుంచి మరి కొందరితో కలిసి తన గ్రామానికి వెళ్లిపోవడానికి ప్రయత్నించాడు. భద్రతా బలగాలు గాలిలో కాల్పులు జరుపుతూ ప్రతి ఒక్కరినీ చంపివేస్తామని బెదిరించారు. ఆ క్రమంలో సుక్కు కుంజమ్ ను కాల్చి చంపారు. ఆ మృత దేహాన్ని ఒక ప్లాస్టిక్ షీట్ లో చుట్టి, పోలీసు స్టేషన్ కు ఈడ్చుకుపోయి, అక్కడ తాము ఒక నక్సలైటును చంపామని చెప్పుకున్నారు.

అదే సందర్భంలో అదే గ్రామానికి చెందిన సుక్కి, జమ్లి అనే ఇద్దరు ఆడపిల్లలను పట్టుకున్నారు. మొదట సుక్కిని పట్టుకున్నారు. అక్కను ఎందుకు తీసుకుపోతున్నారని చెల్లి జమ్లి వారిని వెంటాడింది. ఇద్దరినీ అడవిలోకి లాక్కెళ్లారు. అక్కడ ఇద్దరు ఆడపిల్లల బట్టలూ చింపివేశారు. తీవ్రంగా కొట్టారు. ఇద్దరినీ నగ్నంగా అడవిలోనే రెండు రోజుల పాటు నిర్బంధించి పెట్టారు. సమీప గ్రామమైన దోవల్ నేంద్రకు హెలికాప్టర్ వచ్చాకనే ఆ అమ్మాయిలను వదిలేశారు. ఈ ఘటన 2015 నవంబర్ 23-25 ప్రాంతంలో జరిగిందని గ్రామస్తులు అంటున్నారు. ఆ రెండు రోజులు ఆ అమ్మాయిలకు ఏం జరిగిందో తెలియదు గాని గ్రామస్తులు మాత్రం వారి మీద అత్యాచారం జరగలేదంటున్నారు.

ఇక పశువులను మేపడానికి బైటికి వెళ్లే ఆడపిల్లలకూ ఇటువంటి చెప్పుకోవలసిన ఘటనలెన్నో ఉన్నాయి. జనవరిలో సోమ్లి, మంగ్లి, తుల్సి అనే ముగ్గురు ఆడపిల్లలు పశువులను మేపుకు రావడానికి వెళ్లారు. దారిలో గస్తీ తిరుగుతున్న జవాన్లు ఈ అమ్మాయిలు బడికి వెళ్తున్నారా అని, బడికి వెళ్లే యూనిఫారాలు ఎందుకు లేవని ప్రశ్నించి, కొట్టి, వాళ్ల

బట్టలు చింపేశారు. ఆ గ్రామానికే చెందిన ఒక వృద్ధురాలు, గస్తీ అంటే ఆడపిల్లలను అవమానించడమేనా అని వారిని మందలించేసరికి, వెళ్లిపోయారు.

జవాన్లు తమ ఇళ్లలోకి ఇష్టారాజ్యంగా జొరబడతారని, బియ్యం, కోళ్లు, తిండి దినుసులు ఎత్తుకుపోతారని, వండుకుంటారని, అక్కడే తింటారని ఎంతోమంది స్త్రీలూ పురుషులూ చెప్పారు. ఎవరైనా అభ్యంతరం చెపితే జవాన్లు పాత్రలు పగలగొట్టి, ఇంట్లో ఉన్న తిండి గింజలన్నీ తగులబెట్టి పోతారని వాళ్లు చెప్పారు.

ఇళ్లలో ఏమైనా డబ్బు దొరికితే కూడ జవాన్లు ఎత్తుకుపోతారు. ఒక ఇంట్లో, తన అమ్మమ్మను కలవడానికి వచ్చిన అమ్మాయిని నక్సలైట్ అని ఆరోపిస్తూ ఆమె ఫొటో తీసుకుపోయారు. మరొక సందర్భంలో ఇంట్లో వివాహం కోసం కుటుంబం కుట్టించుకున్న మంచి బట్టలను తగులబెట్టిపోయారు.

కోర్చోలి లో బోరుబావి పంపును కూడ జవాన్లే విరగ్గొట్టారని గ్రామస్తులు అన్నారు. గ్రామస్తులు దాన్ని మరమ్మత్తు చేయించి పెట్టుకుంటే మళ్లీ జవాన్లు వచ్చి విరగ్గొటిపోయారు. ఇక గ్రామస్తులందరూ ఇప్పుడు తమ బట్టలు ఉతుక్కోవడానికీ, మంచినీటికీ దూరాన ఉన్న నదికి వెళ్లవలసి వస్తోంది. అలాగే, నిత్య జీవితావసరాలైన కిరాణా సరుకుల కోసం, ఇతర వస్తువుల కోసం వాళ్లు అడవిలో మైళ్లకొద్దీ నడవవలసి వస్తోంది. ఆ సమయంలో గస్తీ తిరిగే భద్రతా బలగాలు ఉన్నాయంటే మగవాళ్లకైతే ప్రాణాలకే ప్రమాదం, ఆడవాళ్లయితే లైంగిక హింస, వేధింపు ఎదుర్కొనే ప్రమాదం ఉంటుంది.

భద్రతా బలగాలు జరిపిన ఇటువంటి దారుణ మానవహక్కుల ఉల్లంఘనల, చట్టవ్యతిరేక ప్రవర్తనల ఘటనలు తోడ్క, సావునార్, ఇతవర్ వంటి గ్రామాల్లో కూడ వినిపించాయి. అయితే చత్తీస్‌గడ్ ప్రత్యేక ప్రజా భద్రతా చట్టం ఇచ్చిన నిరంకుశాధికారాలతో కలిసి రాజ్య అణచివేత ఎంత నిర్దాక్షిణ్యంగా జరుగుతున్నప్పటికీ, ప్రజలను భయపెట్టడంలో విజయం సాధించలేక పోయింది.

జస్టిస్ సురేష్ నాయకత్వంలో, సరిహద్దు భద్రతా దళాల మాజీ డైరెక్టర్ జనరల్ రామ్ మోహన్, టాటా ఇన్ స్టిట్యూట్ ఆఫ్ సోషల్ సైన్సెస్ (గువాహతి) డైరెక్టర్ డా. వర్జినియస్ హాహా ల ఉన్నత స్థాయి విచారణ కమిటీ మే 7న బిజాపూర్ సర్క్యూట్ హౌజ్ కు వచ్చినప్పుడు ఈ గ్రామాల నుంచి దాదాపు వంద మంది వాంగ్మూలాలు ఇవ్వడానికి ముందుకు వచ్చారు.

భద్రతా బలగాల చేతుల్లో తాము ప్రతి రోజూ ఎదుర్కొంటున్న వేధింపుల గురించి, అడ్డూ ఆపూ లేని హింస గురించి స్త్రీలు కమిషన్ ముందు వివరంగా చెప్పారు. తమ పట్ల జరుగుతున్న లైంగిక హింస, అవమానాల లెక్కలేనన్ని ఘటనలను వాళ్లు వివరించారు. తమ గ్రామాల్లో తాము ప్రశాంతంగా జీవించలేని పరిస్థితి ఎలా ఉందో వివరించారు.

చత్తీస్‌గడ్ ప్రజల నిత్యజీవితంలో హింస, మానవహక్కుల ఉల్లంఘన ఇంత పెద్ద ఎత్తున ఉండడం చూసి కమిషన్ సభ్యులు నిర్ఘాంతపోయారు.

బిజాపూర్ జిల్లాను 2011లో దంతెవాడ జిల్లా నుంచి విభజించి ఏర్పరచారు. ఇది చాల తక్కువ జనాభా ఉన్న జిల్లా. ఇక్కడ మొత్తం జిల్లా జనాభా 2,55,000 మాత్రమే కాగా జనసాంద్రత చదరపు కిలో మీటరుకు 39 మంది మాత్రమే. అలాగే ఇది దేశంలోకెల్లా పేద జిల్లాలలో ఒకటి. అక్షరాస్యతలో, పోషకాహార లోపంలో ఇది అన్ని జిల్లాల కన్న కింది స్థాయిలో ఉంది. రాజ్యం ఇక్కడి ప్రజలకు కనీస అవసరాలైన తాగునీరు, విద్య, ఆరోగ్యాలను అందించలేక పోయింది. జిల్లాలో రోడ్లనేవి లేవు. బిఎస్ ఎన్ ఎల్ మినహాయిస్తే మరే మొబైల్ సర్వీసు ఇక్కడ పనిచేయదు. బిఎస్ ఎన్ ఎల్ కూడ మారుమూల గ్రామాలలో పనిచేయదు. అది పనిచేసిన చోట్ల కూడ చాల తరచుగా, భద్రతా బలగాలు ఒక చోటి నుంచి మరో చోటికి కదులుతున్నప్పుడు, అది పనిచేయకుండా చేస్తారు. ఈ ప్రాంతంలో ఇప్పటికీ నోటి మాటే ఏకైక సమాచార సంబంధాల వ్యవస్థ.

జిల్లా కేంద్రానికి మాత్రం ఏడెనిమిది హిందీ వార్తా పత్రికలు మధ్యాహ్నం ఒంటి గంట సమయానికి చేరుతాయి. ఇంగ్లిష్ వార్తాపత్రికలు దొరకవు. అటువంటి జిల్లాలో, కేవలం రెండున్నర లక్షల మంది ఉన్న జిల్లాలో, 240 భద్రతా బలగాల శిబిరాలున్నాయి. ఇరవై వేల మంది పారా మిలిటరీ బలగాలున్నాయి. కొన్ని కిలోమీటర్లకొకసారి భారీ బందోబస్తు ఉన్న భద్రతాబలగాల శిబిరం కనబడుతుంది.

ఈ ప్రాంతాన్ని ఇంతగా సైనికమయం చేసిన రాజ్యం, ప్రజలను తమ స్థిర ఆవాసాలను నుంచి వెళ్లగొట్టే కార్యక్రమం మొదలుపెట్టింది. తద్వారా ఈ విశాల సంపన్న అడవులను కార్పొరేట్ దోపిడీకి అప్పగించదలచింది. కొద్ది నెలల కిందనే చత్తీస్‌గడ్ ప్రభుత్వం అటవీ భూముల మీద ఆదివాసుల సాంప్రదాయిక హక్కులను రద్దు చేసింది.

దేశంలో విశాల ప్రాంతాలలో ప్రస్తుత కరవు సంక్షోభానికీ, అటవీ విస్తీర్ణం తగ్గిపోతుండడానికీ సంబంధాన్ని చెరిపేయడానికి రాజ్యం ప్రయత్నిస్తోంది. వాటి రాజకీయ రంగులతో సంబంధం లేకుండా కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలన్నీ స్థూల జాతీయోత్పత్తి వంటి ఆర్థిక సూచికలను ఆరాధిస్తూ, అడవులను మింగేసే, పర్యావరణాన్ని ధ్వంసంచేసే గనుల పరిశ్రమ మీదనే కేంద్రీకరిస్తున్నాయి. ఈ అభివృద్ధి నమూనాను భారీ మానవ మూల్యం చెల్లించి అమలు చేస్తున్నాయి. ఈ క్రమంలో పౌరుల అత్యంత కనీస హక్కులైన జీవన స్వేచ్ఛ, ఉపాధి స్వేచ్ఛ, స్వాతంత్ర్యాలను సాయుధ అణచివేతతో కాలరాస్తున్నాయి.

ఈ గ్రామాలలో మేం విన్న అత్యాచారాల, లూటీల ఘటనల వంటివే బిజాపూర్, సుక్మా, దంతెవాడ జిల్లాలలో గత ఆరునెలలుగా జరుగుతున్నాయని వార్తలు వస్తున్నాయి. గత సంఘటనల విషయంలో కూడ స్వచ్ఛంద సంస్థల, న్యాయవాదుల సహాయంతో బాధితులు వాంగ్మూలాలు ఇచ్చారు, ప్రాథమిక దర్యాప్తు నివేదికలు నమోదయ్యేలా చూశారు.

కోర్చోలి ఫిర్యాదుల విషయంలో పోలీసులు మొదట ఎఫ్ ఐ ఆర్ నమోదు చేస్తామని జస్టిస్ సురేష్ కమిషన్ ముందర అంగీకరించారు. కాని ఆ తర్వాత ఆ పని చేయలేదు. బాధితుల నుంచి ఒక ఫిర్యాదును మాత్రం తీసుకుని, దాని మీద ప్రాథమిక విచారణ జరుపుతామని అన్నారు. అత్యాచార ఘటనలలో మొట్టమొదట ఎఫ్ ఐ ఆర్ నమోదు చేసి విచారణ జరపాలని నిర్దేశించే సి ఆర్ పిసి సెక్షన్ 154 కూ, నేరారోపణల నమోదు గురించి సుప్రీం కోర్టు ఆదేశాలకూ ఇది వ్యతిరేకం.

పౌరహక్కుల సంఘం 2016 ఏప్రిల్ 30న హైదరాబాదులో జరిపిన ఒక బహిరంగ సభలో సోనీ సోరి చెప్పిన మాటలు భారత రాజ్యం తన సొంత ప్రజల మీద యుద్ధం చేయడానికీ, వారిని వారి భూముల నుంచి నిర్వాసితులను చేయడానికీ మావోయిజం అనే సాకును వాడుకుంటున్నదని తేటతెల్లం చేస్తాయి.

భద్రతా బలగాలకు విడిదిగా వాడకపోతే పాఠశాలలను ఏమీ చేయబోమని మావోయిస్టులు అంగీకరించారని, అలా తన పాఠశాలను కాపాడుకోగలిగానని, కాని ఆ తర్వాత భద్రతా బలగాలు తనను, తన కుటుంబ సభ్యులను నిర్బంధించడంతో ఆ విజయం నిష్ఫలమైపోయిందని సోని సోరి ఆ సభలో అన్నారు. ఆమె భర్తను నిర్బంధించారు. ఆయన ఆ తర్వాత మరణించాడు. ఆమెను కూడ జైలులో పెట్టారు. పోలీసు

# గొల్లుమంటున్న గొల్లూరిలోయ

***ప్రాథమిక ఆరోగ్యాన్ని, తాగునీటి సమస్యను పట్టించుకోని పాలకులు కార్పొరేట్, గుత్తపెట్టుబడి సంస్థల ప్రయోజనాలకు ఖనిజ సంపదను కట్టబెడుతున్నారనీ, పోలీసు బలగాలతో ఆదివాసులపై తీవ్రహింసకు పాల్పడుతున్నారనీ అంటున్నారు* మర్రి కామయ్య**

రెండు రాష్ట్రాల (ఆంధ్ర – ఒడిస్సా) మూడు జిల్లాల (కోరాపుట్, విశాఖ, విజయనగరం) సరిహద్దు కూడలి (ట్రై–జంక్షన్)లో 'గొల్లూరి లోయ'గా ప్రసిద్ధి గాంచిన ఆదివాసి ప్రాంతం కలదు. ఈ ప్రాంతం ఆంధ్రప్రదేశ్‌కు చెందిన విశాఖ, విజయనగరం జిల్లాల పరిధిలోని 7 గ్రామ పంచాయితీల్లో, కోరాపుట్ (ఒడిస్సా) జిల్లాకు చెందిన 5 గ్రామ పంచాయితీల పరిధిలో విస్తరించి ఉంది. దాదాపు 50 వేలకు పైగా ఆదివాసి ప్రజానీకం జీవనం సాగిస్తున్నారు. మెజారిటీ నూకదొర, కొండదొర తెగల ప్రజానీకంతో పాటు కువ్వి వాల్మికి, భగత, గదబ, పోర్జ, పరంగి పోర్జ, పెంగి పోర్జ, మాలి తదితర ఆదివాసి తెగల ప్రజలు జీవిస్తున్నారు. వీరు ప్రధానంగా పోడు వ్యవసాయం అటవీ ఉత్పత్తుల సేకరణపై ఆధారపడి బతుకు నావ నడుపుకుంటున్నారు. సాగు యోగ్యత కలిగిన భూములు, తగినన్ని నీటి వనరులు పుష్కలంగా ఉన్నప్పటికీ ఆంధ్ర – ఒడిస్సా సర్కార్ల నిర్లక్ష్యం మూలంగా జల వనరులు వృదాగ పడి ఉన్నాయి. మరొకపక్క గొల్లూరిలోయ గుండా ప్రవహిస్తున్న పెద్దగెడ్డ నదిపై పాచిపెంట (విజయనగరం జిల్లా) వద్ద రిజర్వాయరు నిర్మించి మైదాన ప్రాంత ఆదివాసేతరుల భూములకు నీటిని అందిస్తున్నారు. రిజర్వాయరు నిర్మాణం వలన నష్టపోయిన ప్రజలకు మొక్కుబడిగా నష్ట పరిహారం చెల్లించి చేతులు దులుపేసుకున్నారు. మూల వాసులు మూతి తడుపుకోవడానికి ముంతెడు నీళ్లు కరువైపోతున్నది. ఇక ఎండకాలం వచ్చిందంటే నీళ్ల కోసం కొండ లోయల్లో, వాగుల్లో, వంకల్లో వెతుకులాడాల్సిందే. ఆదివాసుల పట్ల ప్రభుత్వాల నిర్లక్ష్యం, వివక్ష మూలంగా కోట్లాది రూపాయలు మంజూరవుతున్నా సాగు, తాగు నీటి వెతలు తీరడం లేదు.

ఇక్కడి ఆదివాసుల జీవనోపాధికి చిన్న తరహా అటవీ ఉత్పత్తులే ప్రధాన ఆధారం. ప్రధానంగా వెదురు, తేనె, చింతపండు, కుంకుడు, సీకాయ, కొండ చీపురు, గనారు, సొందేమాను, నేలవేప వంటి కలప, కలపేతర అటవీ ఉత్పత్తులపై ఆధారపడి అధిక శాతం గిరిజనులు బతుకుతున్నారు. ఆదివాసి గ్రామాలకు ఉమ్మడి అటవీ హక్కులు కల్పిస్తామని అప్పట్లో యుపిఎ, ఇప్పటి ఎన్‌డిఏ ప్రభుత్వాలు హామీ ఇచ్చినా ఫలితం కనిపించడం లేదు. అటవీ హక్కుల గుర్తింపు చట్టానికి విరుద్ధంగా విజయనగరం జిల్లా మోదుగా పంచాయితీకి చెందిన రాయిగుడ్డి వలస, గాజులగుడ్డి, బుచ్చంపాడు, ఏడుగుమ్మల వలస, ఇప్పలగుడ్డి మొదలగు గ్రామాల ఆదివాసుల సాగు భూములను అటవీ శాఖా వారు దౌర్జన్యంగా ఆక్రమించుకుని, టేకు, వెదురు, ఇతర ప్లాంటేషన్లు నాటుతున్నారు. భూములు కోల్పోయిన గిరిజనులు అదే ప్లాంటేషన్లలో రోజు కూలీలుగా మారి బతుకులీడుస్తున్నారు. అటవీ హక్కుల గుర్తింపు చట్టం – 2006 అమలులోకి వచ్చి 9 ఏండ్లు గడిచినా భూమి హక్కులు దాఖలుపరచకపోవడం విచారకరం. సరైన కారణాలు చూపకుండా గిరిజనుల భూములు గుంజుకోవడం వారి ఆవేదనకు కారణమవుతోంది.

ఇక్కడి ఆదివాసులకు విద్య, వైద్యం అందని ద్రాక్షే. ఆంధ్ర ప్రాంతంలో రెండు ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు, ఒక ఏరియా ఆస్పత్రి ఉండగా, ఒడిస్సా ప్రాంతంలో ఆది కూడా 30 – 40 కిలోమీటర్ల దూరంలో ఎక్కడో బ్లాకు సెంటర్‌లో ఒక పిఎచ్‌సి ఉంది. అయినప్పటికీ పారాసిటిమల్ టాబ్లెట్ దొరకడం గగనమైపోతోంది. పీడిత కుటుంబాలు వైద్య చికిత్స కోసం అప్పులపాలై సర్వస్వం కోల్పోయి, అనాదలుగా మిగిలిపోయి కన్నీరెడుతున్నారు. ఆస్పత్రుల్లో కనీస సౌకర్యాలు మృగ్యం. డాక్టర్లు ఉంటే మందులుండవు, మందులుంటే డాక్టర్లు ఉండరు. ప్రజా ధనంతో పాలిస్తున్న పాలక వర్గాలు ప్రజల ఆరోగ్య పరిరక్షణకు ఎందుకు పూచీపడడం లేదు. మూల వాసుల ఆరోగ్యం పట్ల పాలక ప్రభుత్వాలకు ఎందుకంత నిర్లక్ష్యం. బాధ్యతారాహిత్యం, వివక్షత చూపిస్తూ 'గొల్లూరిలోయ' మూల వాసుల జీవించే హక్కుపై దాడి చేస్తున్నారు. ప్రజలు ప్రశ్నిస్తుంటే నవీన్ పట్నాయక్, చంద్రబాబు దారితప్పిన దొంగల్లాగా తప్పించుకుంటున్నారు.

---

నిర్బంధంలో ఉండగా ఆమె మీద అతి భయంకరమైన లైంగిక అత్యాచారాలు జరిపారు, చిత్రహింసలకు గురిచేశారు. ఆ చిత్రహింసలన్నిటినీ పర్యవేక్షించిన పోలీసు అధికార్ అంకిత్ గార్గ్ కు వరుసగా ప్రభుత్వాలన్నీ పారితోషికాలు, పురస్కారాలు ఇచ్చాయి.

అలాగే ఈ ప్రాంతం నుంచి మనుషులను ఖాళీ చేయించడమే తన మిషన్ 2016 లక్ష్యమని బహిరంగంగా చెప్పుకునే ఐజి ఎస్ ఆర్ పి కల్లూరి వంటి అధికారులకు బస్తర్ ప్రాంతంలో విచారణాతీతంగా పనిచేసే అపరిమితాధికారాలు ఇస్తున్నారు.

ఈ అణచివేత ఘటనలు అడ్డూ ఆపూ లేకుండా సాగిపోతున్నాయి. ఈ ప్రాంతంలోని ఆదివాసి ప్రజానీకం మీద నిజంగా జాతిహననకాండ లాంటి దాడి జరుగుతున్నది. అంతమాత్రమే కాదు, ఈ ప్రాంతపు అపారమైన సహజవనరులను స్వాధీనం చేసుకుని, తమ ఆశ్రితులకు అప్పగించే వ్యూహాత్మక యుద్ధం ఇది. నిర్వాసితులను చేయడం ద్వారా ఆస్తి పోగువేసుకోవడానికి ప్రామాణికమైన ఉదాహరణ ఇది.

బాధితులకు నష్టపరిహారం అందించే సంప్రదింపుల ప్రక్రియ ద్వారా, అభివృద్ధి నమూనాను పునరాలోచించడం ద్వారా, దుర్మార్గమైన చత్తీస్‌గఢ్ ప్రత్యేక ప్రజా భద్రతా చట్టాన్ని ఉపసంహరించడం ద్వారా మాత్రమే దక్షిణ చత్తీస్‌గఢ్ ప్రజలకు ఉపశమనం దొరుకుతుంది.

ఇవాళ్టికివాళ ఉన్న భయంకరమైన నిర్బంధం దృష్ట్యా, బాధితులకు ప్రభుత్వ యంత్రాంగం పట్ల ఏ మాత్రం నమ్మకం లేదు. తమ సమస్యలను బహిరంగంగా చెప్పుకోవడానికి కూడ వారేమీ భయపడడం లేదు.

*(రచయిత ఉస్మానియా విశ్వవిద్యాలయ రిటైర్డ్ ప్రొఫెసర్)* వీ

అక్షర వెలుగులు అసలే సోకడంలేదు. బదులన్నీ అలంకారప్రాయంగా మిగిలిపోయి ఉన్నాయి. ప్రభుత్వాలు గిరిజన ప్రాంత ఆదివాసుల విద్య కొరకు కోట్లాది రూపాయలు ఖర్చు పెడుతున్నాయని ఢంకా భజాయిస్తూ ఊదరగొడుతున్నాయి. కాని ఆదివాసులు విద్యకు ఆమడ దూరంలో ఉన్నారని వివిధ సర్వేల్లో తేటతెల్లం అవుతుంది. ప్రభుత్వాల అనాలోచిత నిర్ణయాల వల్ల పెట్టుబడి వ్యవస్థకు, ప్రైవేట్ విద్యా సంస్థలకు ప్రయోజనం చేకూరేలా వ్యవహరిస్తోంది. 'అందరు చదవాలి – అందరు ఎదగాలి' అనే నినాదం కాస్తమారి 'కొందరే చదవాలి – కొందరే ఎదగాలి' అనే చందంగా ఉంది. దీంతో ఇక్కడి బాల బాలికలు – యువతీ యువకులు విద్యకు నోచుకోక పశువుల కాపర్లుగా, వ్యవసాయ కూలీలుగా, లారీల్లో క్లీనర్లుగా పనిచేస్తున్న దృశ్యాలు కండ్లకు కట్టినట్లుగా కనబడుతుంది. మరీ ఒడిస్సాలోనైతే విద్య పరిస్థితి మరింత దిగజారి పోయింది. చాలి చాలని జీతభత్యాలతో, ఉద్యోగ భద్రతలేమితో అక్కడి ఉపాధ్యాయులు పాఠశాలలు నడపడమంటే ఘోరం. మరీ అలాంటి అధ్వాన్న పరిస్థితుల్లో విద్య ఎలా ఉంటుందో ఊహించుకుంటే అర్థం కానిదేమికాదు. స్వాతంత్ర్యం సిద్ధించి ఏడు దశాబ్దాలు కావస్తున్నా ఇప్పటికి కనీస మౌలిక వసతులకు నోచుకోని జనం ఉన్నారంటే ఆశ్చర్యపడ నక్కరలేదు.

ఇక గొల్లూరిలోయను ప్రసిద్ధి చెందిన ప్రాంతంగా ఎందుకు చెప్పాల్సి వచ్చిందంటే ఈ ప్రాంతం అపారమైన ఖనిజ నిక్షేపాలు కలిగిన ప్రాంతం. ఇక్కడ ఒడిస్సా ప్రాంతంలో బాక్సైట్, గ్రానైట్, ఇనుము, నాపరాయి, సున్నపురాయి, కాల్‌సైట్ వంటి ఖనిజాలు ఉన్నాయి. ఆంధ్ర ప్రాంతంలో బాక్సైట్, అభ్రకం, గ్రానైట్, నాపరాయి, సున్నపురాయి, కాల్‌సైట్ వంటి గనులు ఉన్నాయి. సర్వ రోగాలు నయం చేసే విలువైన వనమూలికలకు ఈ ప్రాంతం నిలయం. కోట్లాది రూపాయలు ఖరీదు చేసే కలప, కలపేతర అటవీ ఉత్పత్తులకు పెట్టని కోట. నిత్యం గలగల పారే భూతలజోరే, పిల్లిమామిడి జోరే, కోతులగెడ్డ, బురదగెడ్డ, పెద్దలోవ, రక్తకంటిజోరే వంటి వాగులు, వంకలు కలిసి 'పెద్దగెడ్డ' జీవనది. బ్రిటిష్ సామ్రాజ్య వాదులుకు వ్యతిరేకంగా పోరాటం జరిగినపుడు ఫిరంగులు దాచిన, ఫిరంగుల మెట్ట, రాజులు యుద్ధంలో ఉపయోగించిన కత్తులు దాచిపెట్టిన కంజరకొండ, శతృవుల రాకను గమనించి మోగించే తుడుం ఒర్కలు (మెట్టలు) వంటి పురాతన ప్రదేశాలు కలవు. ఇలా ప్రాంతం విశిష్టతలు చెప్పుకుంటూ పోతే పెద్ద గ్రంథమే తయారవుతుంది.

'అన్నీ ఉన్నా అల్లుని నోట్లో శని' ఉన్నట్లు ఈ ప్రాంతం ఎలాంటి అభివృద్ధికి నోచుకోలేదు. కటిక దారిద్ర్యాన్ని, పేదరికాన్ని అనుభవిస్తు న్నారు. ఇరురాష్ట్ర ప్రభుత్వాలు సరిహద్దు ప్రజలపట్ల వివక్ష చూపుతున్నాయి. వారి ఆవేదన, ఆందోళన అటు నవీన్ పట్నాయక్ గానీ ఇటు చంద్రబాబు గానీ వినే పరిస్థితిలో లేరు. ఎందుకంటే ప్రస్తుతం వారు తమ ప్రభువులైన సామ్రాజ్యవాదులు, దళారీ నిరంకుశ భూర్జువాల పాదసేవలో తలమునకలై ఉన్నారు. గనుక వారికి గొల్లూరిలోయవాసుల గోడు పట్టదు.

మరీ! అదే సమయంలో ఆంధ్ర – ఒడిస్సా సర్కార్లు గొల్లూరిలోయను టోకున సామ్రాజ్యవాద బహుళజాతి సంస్థలకు, దేశీయ కంపెనీలకు అమ్మి వేస్తున్నారు. ఇప్పటికే ఈ ప్రాంతంలో మైనింగ్ కార్యకలాపాల కోసం విస్తారమైన భూముల్ని, అడవుల్ని దారాదత్తం చేసేశారు. అడవులకు కోత పెట్టడం, విచ్చలవిడిగా బ్లాస్టింగ్స్ జరపడం మూలంగా ఈ ప్రాంతంలో పర్యావరణ సమతుల్యంపై తీవ్ర ప్రభావం చూపుతున్నాయి. చలి కాలంలో రాత్రిపూట ఉబ్బరించడం, విపరీతమైన వేడి వంటి పరిణామాలు చోటు చేసుకుంటున్నాయి. చలికాలంలో చెట్ల ఆకులు రాలి ఎండ కాలాన్ని తలపిస్తున్నది. తీవ్రమైన జల కాలుష్యం, వాయు కాలుష్యం వలన ఈ ప్రాంత ప్రజలు గుండె సంబంధమైన శ్వాసకోస వ్యాధులతో సతమతమవుతున్నారు. ఇక్కడ తోచల్ కంపెనీ నిర్వహిస్తున్న సిమెంట్ ఫ్యాక్టరీ విడుదల చేస్తున్న పొగ మూలంగా సమస్త జీవరాసుల ఉనికి దెబ్బతింటుంది. దీనికి వ్యతిరేకంగా గిరిజనులు అవిశ్రాంతంగా పోరాడి ఫ్యాక్టరీ యాజమాన్యం మెడలు వంచి, కాలుష్య నివారణ చర్యలు తీసుకునేలా చేశారు. అంతేగాకుండా గ్రానైట్, కాల్‌సైట్ వెలికితీత మూలంగా జరుగుతున్న దుష్ప్రభావాలపై సైతం భిర్లా పెర్క్యూలేస్ కంపెనీకి, ఒఎండిసికి వ్యతిరేకంగా గిరిజనులు పోరాడి ఆ కంపెనీల కార్యకలాపాలు తాత్కాలికంగా నిలుపుకునేలా వత్తిడి చేశారు.

సామ్రాజ్యవాదం తీవ్రమైన ద్రవ్య, ఆర్థిక సంక్షోభంలో ఉంది. అది సంక్షోభంలో నుండి బయటపడేందుకు తీవ్రంగా ప్రయత్నిస్తున్నది. ఈ పరిస్థితికి అనుగుణంగానే చంద్రబాబు నాయుడు, నవీన్ పట్నాయక్‌లు 'అభివృద్ధి' పేరుతో గొల్లూరిలోయలోకి సామ్రాజ్యవాద బహుళజాతి కంపెనీలకు, దేశీయ బడాకంపెనీలకు రెడ్‌కార్పెట్ పరుస్తున్నారు. గొల్లూరిలోయకు ఆనుకొని ఉన్న విశాఖ జిల్లా అరకు మండల పరిధిలోని చిట్టంగొంది, రక్తకండి, మాలిసింగ్రాం పర్వత శ్రేణుల్లో నిక్షిప్తమై ఉన్న బాక్సైట్ గనులు వెలికితీయడంకై జిందాల్ కంపెనీతో ఒప్పందాలు కుదుర్చుకున్నారు. అందుకు అవసరమైన జిఒ (97) ను కూడా విడుదల చేశారు. అదే విధంగా గిల్లూరిలోయ పర్వత సానువుల్లో ఉన్న నాపరాయి, సున్నపురాయి క్వారీలు తోచల్ కంపెనీకి, గ్రానైట్, కాల్‌సైట్ గనులు భిర్లా, ఒఎండిసికి, ఇనుప గనులు ఆధిత్యభిర్లా గ్రూప్స్‌కి అప్పగించారు.

విజయనగరం జిల్లా గోటూరు గ్రామ పంచాయితీ పరిధిలోని 'డెల్లిపాడు' ప్రాంతంలో సర్వే పనులు, మట్టి నమూనాలు సేకరించే పనిలో నిమగ్నమై ఉన్నారు. త్వరలోనే ఒప్పందాలు కుదుర్చుకునే అవకాశం ఉంది. మొత్తం మీద వీరు అమలు చేయదలచుకున్న ప్రపంచ బ్యాంకు అభివృద్ధి నమూనా మూలంగా గొల్లూరిలోయ ఎడారిగా మారిపోనుంది. పెద్దగెడ్డ జీవనది ఎండిపోనుంది. ఫలితంగా ఆ నదిపై నిర్మించిన పాచిపెంట రిజర్వాయర్‌లో నీరు అడుగంటి పోతుంది. రిజర్వాయర్ దిగువన వ్యవసాయం చేస్తున్న రైతాంగం తీవ్రమైన నీటి సంక్షోభం ఎదుర్కోవలసి వస్తుంది. ఇప్పటికే పంట చేతికి రాక, చేసిన అప్పులు తీరక, ఆత్మహత్యలు చేసుకుంటున్న రైతాంగానికి ప్రపంచ బ్యాంకు అభివృద్ధి నమూనా ఒక పిడుగుపాటే.

గొల్లూరిలోయకు ఇరువైపుల (ఆంధ్ర – ఒడిస్సా) నివాసముంటున్న ఆదివాసులకు, పశు పక్షాదులకు గొంతు తడుపుకోవడానికి చుక్క మంచినీరు దొరకని పరిస్థితి ఏర్పడుతుంది. విలువైన వన మూలికలు, కోట్లాది ఖరీదు పలికే కలప – కలపేతర అటవీ ఉత్పత్తులు ధ్వంసం కాబడుతాయి. పురాతన ప్రదేశాలు కనుమరుగైపోతాయి. సుమారు 200 గ్రామాలు, 50 వేల మంది ఆదివాసి ప్రజానీకం నిరాశ్రయులవుతారు. ఇదే ప్రపంచ బ్యాంకు అభివృద్ధి నమూనా అంతస్సారం.

పీడిత ప్రజలు కాపాడుకున్న సంపదను, సంపద సృష్టించే వనరులను ప్రైవేట్‌వ్యక్తుల, కంపెనీల, పెట్టుబడిదారుల చేతిలో పెట్టడమే నేటి అభివృద్ధి మంత్రం సారం. ప్రజల శ్రమను, వాళ్లు కాపాడుకున్న వనరు లను, భూమిని, ఖనిజాలను పెట్టుబడిగా మారుస్తూ, తద్వారా సృష్టించే సంపదను, లాభాన్ని మాత్రం ప్రైవేట్ వ్యక్తులకు ఇస్తూ, ఆ ప్రాజెక్టులు, గనులు సృష్టించే కాలుష్యం, ఇతర దుష్ప్రభావాలు మాత్రం ఆదివాసులు భరించేలా చేస్తున్నారు. ఇందుకు గొల్లూరిలోయనే చక్కటి ఉదాహరణ. ఇక్కడ మైనింగ్ కార్యకలాపాలు నిర్వహించిన ఒఎండిసి, భిర్లా, తోచల్ కంపెనీలు సూపర్ లాభాలు పొందుతుంటే, లోయవాసులు మాత్రం జల, వాయు కాలుష్యం భరిస్తూ గుండె సంబంధమైన వ్యాధులకు గురై, సరైన వైద్యచికిత్సలు పొందలేక దీర్ఘకాల రోగులుగా మంచం పడుతున్నారు. సామ్రాజ్యవాదులకు నమ్మిన బంట్లైన చంద్రబాబు, నవీన్ పట్నాయక్‌లు విదేశీ పెట్టుబడుల కోసం 'కాలికి బలపం కట్టుకుని'

తిరుగుతున్నారు. తమ యజమానులైన సామ్రాజ్యవాదులు, దేశీయ కార్పొరేట్ శక్తుల ప్రయోజనాలను నెరవేర్చడంలో 'చాంపియన్ల'లా వ్యవహరిస్తున్నారు. అదే సమయంలో వారి ప్రయోజనాలకు ఏమాత్రం ఆటంకం కలిగిన ఉగ్రరూపం దాల్చుతున్నారు. గొల్లూరిలోయ విస్థాపితం కావడాన్ని జీర్ణంచేసుకోని లోయ మూలవాసులు గత రెండేళ్లుగా పోరాటం చేస్తున్నారు. వీరి ప్రజాస్వామిక ఆకాంక్షను, న్యాయమైన ఆందోళనలను ఇరు రాష్ట్ర ప్రభుత్వాలు తీవ్రంగా అణచివేతకు పూనుకున్నాయి.

ఇందులో భాగంగా గొల్లూరిలోయ చుట్టూత కార్పెట్ సెక్యూరిటీని ఏర్పాటు చేస్తున్నారు. ఇప్పటికే గొల్లూరిలోయకు ముఖద్వారమైన సుంకీ వద్ద ఒక బిఎస్ఎఫ్ క్యాంపు, లోయకు పడమట వైపు కవర్ చేసేలా ఎన్ఎచ్ రాళ్లగెడ్డ వద్ద మరొక బిఎస్ఎఫ్ క్యాంపు ఏర్పాటు చేశారు. లోయకు దక్షిణ భాగంలో అరుకు వద్ద సిఆర్‌పిఎఫ్, ఎపిఎస్‌పి బలగాలను మోహరించబడి ఉంది. అదే విధంగా గొల్లూరిలోయకు తూర్పు ముఖాన విజయనగరం జిల్లా పాచిపెంట, సాలూరుల్లో సిఆర్‌పిఎఫ్ - ఎపిఎస్‌పి బలగాల క్యాంపులు పెట్ట బడ్డాయి. చివరకు లోయ నడిబొడ్డున బిఎస్ఎఫ్ బలగాలతో ప్రత్యేకక్యాంప్ ఏర్పాటుకు విశ్వప్రయత్నాలు జరుగుతున్నాయి. ఈ విధంగా ప్రత్యేక సాయుధ బలగాల బల ప్రయోగం ద్వారా గొల్లూరి లోయను కబ్జా చేయాలనుకుంటున్నారు. దీనికి 'ఆపరేషన్ సరెండా' మాదిరిగా 'ఆపరేషన్ గొల్లూరి'గా నామకరణం చేసి, రెండు రాష్ట్రాల పోలీసు బలగాలతో పాటు పారా మిలటరీ బలగాలను కలుపుకొని, సమన్వయంతో సంయుక్తంగా కూంబింగ్ ఆపరేషన్స్ చేపడుతున్నారు. దీంట్లో భాగంగా పోరాడుతున్న ప్రజానీకంపై రకరకాల అణచివేత పద్ధతులను ప్రయోగిస్తున్నారు.

ముఖ్యంగా ఆంధ్రకు చెందిన గ్రేహౌండ్స్, ఎపిఎస్‌పి, పారా మిలటరీ బలగాలైన బిఎస్ఎఫ్, సిఆర్‌పిఎఫ్ ఒడిస్సాకు చెందిన ఎస్ఒజి, కేంద్ర బలగమైన కోబ్రాల ఆకృత్యాలకు అడ్డు లేకుండా పోయింది. గ్రామాలపై దాడులు చేసి, విస్థాపిత సమస్యకు వ్యతిరేకంగా పనిచేస్తున్న వారిని అక్రమ అరెస్టులు చేయడం, పోరాటంలో పాల్గొంటే సింగన్న - ఆంధ్రులకు పట్టిన గతే పడుతుందని బెదిరిస్తున్నారు. చారిత్రాత్మకంగా చెప్పుకుంటున్న నారాయణపట్నం ఉద్యమాన్నే నలిపి పారేశాం. విస్థాపిత ఉద్యమం మాకు లెక్క కాదు. దీన్ని కూడా అణచివేస్తామని ప్రగల్భాలు పలుకుతున్నారు.

మరొకపక్క విప్లవ ప్రతిఘాతకులను తయారు చేసి, పోరాట నాయకత్వాన్ని (గ్రామ స్థాయిలో) దెబ్బతీయాలని కుట్ర పన్నుతున్నది. అలాగే అరెస్ట్ కాబడిన వారిని శారీరకంగా, మానసికంగా తీవ్రంగా హింసించి, లొంగదీసుకుని ఉద్యమాన్ని అణచివేయడానికి పావులుగా మారమని వత్తిడి చేస్తున్నారు. ఆదివాసుల విస్థాపిత ఉద్యమం వెనుక మావోయిస్టులున్నారనే, ఉద్దేశంతోనే ఫాసిస్టు దమనకాండను తీవ్రతరం చేశామని మాట్లాడుతున్నారు. మరీ! వైద్య ఆరోగ్య మిత్ర సిబ్బంది ఉద్యమం, అంగన్‌వాడి కార్యకర్తల ఉద్యమం, భోగాపురం విమానాశ్రయ భూముల ఆక్రమణకు వ్యతిరేకంగా జరిగిన, జరుగుతున్న ప్రజాస్వామిక ఉద్యమాల వెనుక ఏ మావోయిస్టులు ఉన్నారు? ఎందుకు క్రూరమైన పద్ధతులు అవలంభించి అణచివేతకు పూనుకున్నారు. చెప్పగలరా? అని ప్రశ్నిస్తున్న మేధావుల, బుద్ధిజీవుల వెనుక ఏ మావోయిస్టులు ఉన్నారనీ, మీరు వారిని కూడా నొక్కేస్తున్నారు. ఎందుకంటే రాజ్యం అంటే హింసే. రాజ్యం తన వర్గ ప్రయోజనాలు నెరవేర్చేందుకు, పీడితులపై దారుణమైన హింసను ప్రయోగించకుండా వారి శ్రమను, వారు కాపాడుతున్న వనరులను, సంపదను లూటీ చేయడం సాధ్యం కాదు.

అలాగే వారు తమ మనుగడ కోసం చేసే ఉద్యమాలను బల ప్రయోగం ద్వారా అణచిపెట్టకుండా తన వర్గ ప్రయోజనాలు ఈడేర్చ జాలవు. ఇదే సూత్రాన్ని గొల్లూరిలోయ విస్థాపిత ఉద్యమం పట్ల అనుసరిస్తున్నది. అందుకనే రేపు మరింత ఫాసిస్టు దమనకాండను తీవ్రతరం చేయనుంది. డిసెంబర్ నుండి ఏకదాటిగా కొనసాగుతున్న ప్రత్యేక పోలీసు బలగాల కూంబింగ్ ఆపరేషన్ల సందర్భంగా విశాఖ జిల్లా అరకులోయ మండలం ఇరిగాయి గ్రామ పంచాయితీకి చెందిన మొర్రిగూడ గ్రామ ఆదివాసి రైతు, తన భార్యతో కలిసి వంట చెరకు సేకరణ నిమిత్తం, సమీప గన్నెల అటవీలోకి వెళ్లారు. అంతే గోతిలో గుంటనక్క దాక్కున్న చందంగా అడవి పొదల్లో నుండి బూడిద రంగు కుక్కలు (గ్రేహౌండ్స్) ఒక్కసారిగా అదివాసి జంటపై పడి దాడిచేశారు. రైతును తీవ్రంగా గాయపరిచి, అతని భార్యపై సామూహిక అత్యాచారానికి ఒడిగట్టారు. గొల్లూరి గ్రామ పంచాయితీ మొట్టుసిడిగ గ్రామానికి చెందిన సీత అనే అమ్మాయిని ఆంధ్ర గ్రేహౌండ్స్ బలగాలు తెల్లవారు జామున ఐదు గంటలకు అదుపులోకి తీసుకుని, అడవిలోకి పట్టుకుపోయారు. సుమారు నాలుగు గంటల పాటు ఆమెను మానసికంగా హింసించి, వేధించి వదిలిపెట్టి వెళుతూ, ఎవ్వరితో చెప్పొద్దని, చెప్పినట్లు మా చెవిలో పడితే నీవు దిక్కులేనిదానివై పోతావని బెదిరించి చేతిలో 100 రూపాయలు పెట్టి పోయారు. చంద్రబాబు దత్తత తీసుకున్న అరకులోయ సందర్శన సందర్భంగా చేపట్టిన భద్రత చర్యల్లో భాగంగా కూంబింగ్ ఆపరేషన్స్ చేపట్టారు. ఆ సందర్భంగా ఒడిస్సా - ఆంధ్ర సరిహద్దు పుక్కలి గ్రామ పంచాయితీకి చెందిన బైలువలస గ్రామ ఆదివాసి అమ్మాయిపై గ్రేహౌండ్స్ బలగాలు సామూహిక అత్యాచారానికి పాల్పడ్డాయి.

బిఎస్ఎఫ్, సిఆర్‌పిఎఫ్ బలగాల అత్యాచారాలకు పదుల సంఖ్యలోనే మహిళలు బలైపోయారు. కిరాయి స్వభావం కలిగిన పోలీసులు ఈ దోపిడీ వర్గాలకు సేవ చేసేందుకు ఎంతటి కిరాతకానికైనా పాల్పడతారు. ఈ దోపిడీ వర్గాల ఆర్థిక, రాజకీయ లక్ష్యాలను నెరవేర్చేందుకు పోలీసులు గొల్యూరిలోయలో నిర్బంధకాండను రోజు రోజుకు తీవ్రతరం చేస్తున్నారు. ఈ పోలీసు వ్యవస్థ స్వతంత్రమైంది కాదు. దోపిడీ పాలక వర్గాలు కుక్క అనుకుంటే, పోలీసులు దాని తోకలాంటి వాళ్లు. కుక్క తన తోకను తన ఇష్టానికి అనుగుణంగా ఊపినట్లుగానే పాలక వర్గాలు తమ ప్రయోజనా లకు అనుగుణంగానే పోలీసులను వాడుకుంటున్నారు. కాబట్టే పాలకవర్గ ప్రతినిధులు ఈ అఘాయిత్యాలపై నోరు మెదపడం లేదు. పైగా చోద్యం చూస్తున్నారే తప్ప! తమకు ఓట్లేసి అధికారంలో కూర్చోబెట్టిన ప్రజానీకంపై అమలు జరుగుతున్న భయంకరమైన దాడిపై మాట్లాడాలనే ఇంగిత జ్ఞానం కూడా ప్రదర్శించడం లేదు.

క్యూబ విప్లవ నేత చెగువేరా 1964లోనే అన్నట్లు నిరాయుధ ప్రజలను భక్షిస్తున్న రాజకీయనేతలు మన వ్యవస్థలోని సకల అన్యాయాలకు సాక్షి భూతులై ఉన్నారు. నిస్సహాయులు మరి కొందరు నిస్సాహాయిలను చూస్తుండి పోతున్నారు. జరిగిన, జరుగుతున్న ఘోర అకృత్యాలపై బాధితులు బయటకు వచ్చి మాట్లాడలేని స్థితి. ఒకటి వారి వెనుకబాటుతనం. రెండవది మాట్లాడితే రాజ్యం ఎప్పుడు ఎక్కడ విరుచుకు పడుతోందనే ఆందోళన. అలాగే గతంలో వాకపల్లి, భల్లుగూడ గ్రామాలలో మహిళలపై సామూహిక అత్యాచారాలకు వ్యతిరేకంగా బాధిత మహిళలు, ఇతర అన్ని సెక్షన్ల ప్రజలు గల్లీ నుండి ఢిల్లీ దాకా, కింది స్థాయి కోర్టుల నుండి అత్యున్నత న్యాయస్థానాల వరకు పోరాడిన, చివరకు బాధిత మహిళల్నే దోషులుగా ఈ కోర్టులు - చట్టాలు నిలబెట్టిన క్రమం కూడా వీరిని ప్రభావితం చేస్తున్నది. ఒక్కమాటలో చెప్పాలంటే రాజ్యంపట్ల, న్యాయవ్యవస్థల పట్ల, చట్టాల పట్ల మొత్తంగా ఈ వ్యవస్థ పట్ల వారికున్న అవిశ్వాసమే. కనుక ఈ దోపిడీవర్గాలకు వారి సాయుధ బలగాలకు వ్యతిరేకంగా నీరు, అడవీ, భూమి, ఆత్మగౌరవం, ప్రజాస్వామ్యం కోసం పోరాడాలి.

*(రచయిత రాజనీతి శాస్త్ర విద్యార్థి)* వీ

# కాకులను కొట్టి గద్దలకు వేసే ఆర్థిక వ్యవస్థ

***సమాజంలో ఆర్థిక అంతరాల గురించి అంతర్జాతీయ పరిశోధనతో ఆక్స్‌ఫామ్ ప్రకటించిన నివేదిక వివరాలను పరిచయం చేస్తున్నారు* విద్యాభూషణ్**

ఆయనో రాజ్యసభ సభ్యుడు. ఓ 250 వింటేజ్ కార్లు, ప్రపంచ వ్యాప్తంగా 42 ఇళ్లు. ఓ బోయింగ్ విమానం, మరో రెండు జెట్ విమానాలు ఈయనకు ఉన్నాయట. ఇవి మచ్చుకు కొన్ని. లక్షల కోట్ల రూపాయలను కూడబెట్టిన ఈయన దేశంలో పలు బ్యాంకుల దగ్గర తొమ్మిది వేల కోట్ల రూపాయల అప్పులు తీసుకుని అనేక సంవత్సరాలు చెల్లించకుండా తిరిగేస్తున్నాడు. ఇటీవల ఢిల్లీకి చెందిన సెంటర్ ఫర్ పబ్లిక్ ఇంటరెస్ట్ లిటిగేషన్ అనే స్వచ్ఛంద సంస్థ సుప్రీం కోర్టులో ఓ ప్రజా ప్రయోజన వ్యాజ్యాన్ని వేసింది. దానిలో ప్రభుత్వ బ్యాంకులకున్న మొండి పద్దుల వివరాలను, ఎగవేతకు పాల్పడిన వారి వివరాలను వెల్లడించాలని కోరింది. ఈ మేరకు మార్చ్‌లో 500 కోట్లకు పైబడిన రుణాలను ఎగవేసిన సంస్థల, పెద్ద మనుషుల జాబితాను సీల్డ్ కవర్‌లో పెట్టి రిజర్వ్ బ్యాంకు సుప్రీం కోర్టుకు అందజేసింది. ఈ ఎగవేతదార్ల పేర్లను రహస్యంగా ఉంచాలనీ కోరింది. ఎగవేతదార్ల పేర్లను బైట పెడితే వారి విశ్వాసాలు దెబ్బతిని, కోలుకునేందుకు చేస్తున్న ప్రయత్నాలు విఫలమవుతాయనీ రిజర్వ్ బ్యాంకు పేర్కొంది. ఇదే డిఫాల్టర్ లిస్టులో ఉన్న పైన ప్రస్తావించిన 'కుబేరుడు' మాల్యాకు స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా కింగ్‌ఫిషర్ కంపెనీ పేరు మీద మరో 900 కోట్ల రూపాయల రుణాన్ని మంజూరు చేసింది. పైగా 'ఈ తరహా ఎగవేతలు ప్రపంచ వ్యాప్తంగా సర్వసాధారణమేనని, భారతదేశానికే పరిమితం కాదని' నిర్మలా సీతారామన్ వ్యాఖ్యానించారు.

ప్రపంచ వ్యాప్తంగా ఓ కుదుపు కుదిపేసిన పనామా పత్రాల్లో 500 మంది భారతీయులు ఉండడం గమనించదగ్గది. దీనిపై ఆర్‌బిఐ గవర్నర్ రఘురామ్ రాజన్ 'స్వయం కృషితో పైకొచ్చిన పారిశ్రామిక వేత్తల సంపద చట్టబద్ధతను ప్రశ్నించడం ప్రమాదకరమైన ధోరణి అవుతుందనీ, చట్టబద్ధంగా ఆర్జించిన సంపదను కాపాడుకు నేందుకు వీలైనన్ని అవకాశాలు కల్పించాలనీ' ఆయన సెలవిచ్చారు. రాజన్ ప్రకారం మాల్యాలు, టాటాలు, బిర్లాలు – దాల్మియా – అంబానీ ఇత్యాదుల లక్షల కోట్ల ఆస్తులన్నీ 'స్వయం కృషి'తో చట్టబద్ధంగా ఆర్జించినవే అని సర్టిఫై చేయడం అన్నమాట.

నాకు తెలిసి ఓ సన్నకారు రైతు నలభై వేల రూపాయల రుణాన్ని తీర్చలేకపోయినందుకు బ్యాంకు వారు నానా యాగీ చేసి, ఉన్న ఇంటిని జప్తు చేస్తే, ఆ అవమానాన్ని భరించలేక ఆయన ఆత్మహత్య చేసుకున్నాడు. ఆ కుటుంబం వీధిన పడింది. మరీ కింగ్‌ఫిషర్ మాల్యా బ్రిటన్‌కు ఉడాయించేసి 'నేను రానుగాక రాను, ఏం చేసుకుంటారో చేసుకోండని' తెగేసి చెప్తూ, రాజ్యసభ సభ్యత్వానికి రాజీనామాను పంపిస్తాడు.

ఇదీ మనదేశంలో ఓ సామాన్యుడికీ – పాలక పెద్ద మనుషులకీ ఉన్న అంతరాల దొంతర. దానికి అధికారులు – రాజకీయం వత్తాసు పలుకుతున్న తీరు. అందుకనే ఈ మొండి బకాయిల మొత్తం కొన్ని లక్షల కోట్ల రూపాయల స్థాయిని చేరుకుందని వార్తలు వస్తున్నాయి. ఈ ఎగవేతదార్లంతా పెద్ద మనుషులే మరి!

విశ్వ వ్యాప్తంగానే ఆర్థిక అసమానతలు గరిష్ట పరిధిని అధిగమించే శాయి. ప్రపంచ జనాభాలో ఒక శాతంగా ఉన్న సంపన్న వర్గం మిగతా యావన్మందిని నియంత్రిస్తుంది. అధికార అండతో, ఆదాయ నియంత్రణా యంత్రాంగం ఏడు లక్షల అరవై వేల కోట్ల విలువైన సంపదను సంపన్నుల పరం చేసేసింది. మరీ ఆదాయ అంతరాన్ని రూపుమాపనిదే, అనాదిగా ఘోషిస్తున్న 'పేదరిక నిర్మూలన' సుసాధ్యమవుతుందా? కాదు...

రుణ వెసులుబాటును పరిగణనలోకి తీసుకున్నా, ఒక శాతంగా ఉన్న సంపన్న వర్గాల చేతిలో మిగతావారి ఆస్తులన్నింటినీ అధిగమించేయ గలవన్న వాస్తవం వెల్లడైంది. ఓ ఏడాది కిందటే ప్రపంచ ఆర్థిక సంస్థ (వరల్డ్ ఎకనామిక్ ఫోరం) ఈ విషయాన్ని వెల్లడించింది. ఐదేళ్ల కిందట ప్రపంచ జనాభాలో సగం మంది మొత్తం ఆదాయం లక్షకోట్ల డాలర్ల కన్నా తక్కువగానే ఉంది. ఈ శతాబ్ది కాలంలోనే ఇది కఠిన వాస్తవం.

ఆక్స్‌ఫామ్ సంస్థ పరిశీలనలో 2015 నాటికే కేవలం 62 మంది వ్యక్తుల వ్యక్తిగత ఆస్తుల విలువ, అట్టడుగు వర్గాలకు చెందిన మూడు లక్షల అరవై వేల మంది ఉమ్మడి ఆస్తులకు సరిసమానమని నమోదైంది. 2010 నాటికి ఇది 388 మంది వ్యక్తిగత ఆస్తులకు సమానంగా ఉండేది. అంటే కేవలం ఐదేళ్ల కాలంలో 388 నుండి 62కు కేంద్రీకరించ (కుదించ) బడింది. ఈ 62 మంది ఆస్తుల పెరుగుదల 45 శాతంగా ఉంది. 542 వేల కోట్ల నుంచి లక్షా డెబ్బై ఆరు వేల కోట్ల డాలర్లకు పెరిగింది. ఇదే కాలంలో ప్రపంచంలో సగం మంది అట్టడుగు వర్గాల వారి ఆస్తి విలువ లక్ష కోట్ల డాలర్లకు పడిపోయింది. ఈ తగ్గుదల 38 శాతంగా నమోదైంది.

ఈ శతాబ్ద కాలంలో ప్రపంచ ఆదాయ పెరుగుదలలో ఒక్క శాతం మాత్రమే ప్రపంచ జనాభాలో సగం మంది పరం కాగా, ఇందులో సగం ఒక్క శాతంగా ఉన్న సంపన్నుల పరమైందని 'ఆక్స్‌ఫామ్' సంస్థ వెల్లడించింది. అట్టడుగున ఉన్న పది శాతం మంది వార్షికాదాయం కేవలం మూడు డాలర్ల మేరకే పెరిగింది. దినసరి ఆదాయ పెరుగుదల సుమారుగా ఓ సెంటుకన్నా తక్కువగానే ఉంది. ఇది అట్టడుగు ప్రజల దైన్య స్థితిని చెప్పకనే చెపుతుంది. ఈ అంతరాల పెరుగుదల హర్షించదగ్గది కాదు. ఇదే సంస్థ అధ్యయనంలో 1990 – 2010 మధ్య కాలంలో కేవలం 20 కోట్ల మంది మాత్రమే (ప్రపంచ వ్యాప్తంగా) పేదరిక స్థాయిని అధిగమించినట్లు వెల్లడైంది. మరోవైపు పాలక వర్గాల విధి విధానాల ఆసరాతో ఒక్క శాతంగా ఉన్న సంపన్న వర్గాల వ్యక్తిగత ఆస్తులు ఏడు లక్షల అరవై వేల డాలర్ల మేరకు పెరిగినట్లు నమోదైంది. ఇది జర్మనీ – బ్రిటన్ దేశాల ఉమ్మడి స్థూల (జిడిపి) జాతీయాదాయాలను అధిగమించేసిన స్థాయిలో ఉంది. ఈ ఆర్థిక అసమానతలే సామాజిక అసమానతలకు మూలం అవుతున్నాయి. అంతర్జాతీయ ఆర్థిక సంస్థ (ఐఎంఎఫ్) పరిశీలన సైతం ఇదే విషయాన్ని వక్కాణిస్తుంది. ఈ అసమానతలు స్త్రీ పురుషుల వేతన వ్యవస్థల్లోనే కాకుండా, ఆరోగ్యం,

విద్య, చివరకు చట్ట సభల ప్రాతినిధ్యంలోనూ పొడచూపుతున్నాయి. మరో గమనించదగ్గ అంశం ఏంటంటే ప్రపంచ అత్యధిక ధనిక వ్యక్తులుగా గుర్తింపబడ్డ 62 మందిలో 53 మంది పురుషులే.

సకల జనుల సమున్నతి కోసం రూపొందించుకోవాల్సిన ఆర్థిక వ్యవస్థ, కేవలం ఒక్క శాతంగా ఉన్న ధనికుల కోసమే పరిమితం కావడం ఎందుకోసం?

అభివృద్ధి చెందిన, చెందుతున్న దేశాలన్నింటిలోనూ జాతీయాదాయం లో వేతన జీవుల వాటా క్రమంగా పడిపోతుంది. అదే కుదించబడుతుంది. దేశ ఆదాయాల్లో వేతన జీవులు పొందుతుంది స్వల్పాను స్వల్పం. ఇందుకు భిన్నంగా పెట్టుబడిదారుల పెట్టుబడి ఆర్థిక విస్తృతినధిగమించి పెరగడం జరుగుతుంది. ఇందుకు సైదోడుగా ప్రభుత్వాలు పన్నుల చెల్లింపుల్లో విరామాలు, ఇతరత్రా రాయితీలను అందిస్తూ దోహద పడుతున్నాయి. ఇంతటితో ఆగిపోకుండా పరిశ్రమల – పని కేంద్రాల్లో సాధారణ కార్మికుడికి – అధికార స్థాయి ఉద్యోగికి పని భారాల్లోనే కాకుండా వేతన స్థాయిల్లో కూడా తీవ్ర అంతరాలు నెలకొంటున్నాయి. మహిళా కార్మికుల వేతనాలు మరీ అధమ స్థాయిలో ఉన్నాయి. అమెరికాకు చెందిన ప్రముఖ సంస్థలో కార్య నిర్వాహక అధికార్ల (సిఇఒస్) వేతనాలు 2009 నాటి నుంచి సగానికి పైగా ఏటా పెరుగుదలను (53.4 శాతం) ఆక్స్‌ఫామ్ గమనించింది. మనదేశంలో ఐటి రంగంలో అత్యున్నత అధికారి వేతనం, సాధారణ ఉద్యోగి వేతనం కంటే 416 రెట్లు అధికంగా ఉంది. ఇక్కడ సైతం 500 కంపెనీలను పరిశీలిస్తే కేవలం 24 సంస్థల్లోనే మహిళలు అత్యున్నత స్థాయిలో ఉన్నారు. పలు రంగాల్లో కీలక స్థానాల్లో ఉన్న వ్యక్తులు వారి వారి అధికారాన్ని ఆర్థికాభివృద్ధికై వినియోగించు కుంటున్నారు. గత 30 ఏళ్లుగా మారిన విధి విధానాలు ఇందుకై దోహదపడడాన్ని గమనించవచ్చు. అందుకే ఈ విధి విధానాన్ని జార్జ్ సొరొస్ 'మార్కెట్ – ఫండమెంటలిజం' అని నిర్ధారించాడు. నేటి అంతరాల సంక్షోభానికి కారణమైన కీలకాంశం ఇదే!

దశాబ్దాలుగా పారిశ్రామిక వేత్తల పన్నుల ఎగవేతకు అనువుగా ఆర్థిక విధి – విధానాలు నడుచుకోవడం గమనించవచ్చు. ధనిక వర్గానికి స్వల్ప పన్నుల విధింపు సంతోషాన్నిచ్చినా, అధిక వేతన జీవులతో నిర్వహించబడడం మూలంగా, ఆర్థిక పెరుగుదలను గండి కొడుతుంది. సంపన్న వర్గాలు – వారి సంస్థలు పన్నుల మొత్తాలను చెల్లించడం లేదు. ఇందుకు సైదోడుగా ప్రభుత్వాలు ఇస్తున్న రాయితీలు వెరసి ఆర్థిక వికాసాన్ని అదోగతి పాల్జేస్తున్నాయి. ఈ పన్నుల ఎగవేతలు ప్రభుత్వ బడ్జెట్‌లపై తీవ్ర ప్రభావాన్ని చూపెడుతున్నాయి. ఫలితంగా ప్రజా సేవలు – సంక్షేమం మృగ్యమౌతున్నాయి. ఈ లోటును భర్తీ చేసేందుకై ప్రభుత్వాలు పరోక్ష పన్నుల విధింపుకై సాహసిస్తున్నాయి. విలువాధారిత పన్నులు (వ్యాట్) సెస్సులు ప్రజల నెత్తిన పడుతున్నాయి. బడుగుల బతుకులు మరింతగా భారమవుతున్నాయి. ఆక్స్‌ఫామ్ అధ్యయనంలో పదింట తొమ్మిది సంస్థలు ఈ తరహా పన్నుల రాయితీలను పొంది ఉన్నాయని తేలింది. ఇందులో ప్రపంచ ఆర్థిక సంస్థ (వరల్డ్ ఎకనామిక్ ఫోరం) అనుబంధ సంస్థలూ ఉన్నాయి. ఈ పన్ను రాయితీలు 2001 నాటి కంటే 2014 నాటికి నాలుగు రెట్ల మేరకు అధికమయ్యాయి.

విశ్వవ్యాప్తంగా ఈ పన్నుల ఎగవేత ధనిక దేశాల్లో సైతం సంక్షేమ పథకాలపై ప్రభావాన్ని చూపుతుంది. ఇక పేద దేశాల్లో అయితే ప్రాథమిక విద్య, ప్రజారోగ్యం వంటి కీలక విధానాల అమలుపై సైతం ప్రభావాన్ని చూపుతుంది. మరింత 'పేదరిక నిర్మూలన' మంచుకొండ కాక ఏమవుతుంది? ఆఫ్రికన్ దేశాల్లో అయితే పన్నుల మినహాయింపు 30 శాతం మేరకు చేరుకుని, సుమారు ఐదు లక్షల కోట్ల డాలర్ల మేరకు కొట్టుకు పోతుంది. ఈ దేశాల్లో ఏటా 14 వేల కోట్ల డాలర్లు ఎగవేతల పాలవుతున్నాయి. ఈ ఎగవేతల మొత్తంతో సుమారు 40 లక్షల బాలలకు ఉచిత విద్య – ఉచిత ఆరోగ్య సేవలు అందించవచ్చని నిపుణుల అంచనా. అందుకే అంతర్జాతీయ న్యాయవాదుల సంఘం ఈ పన్నుల ఎగవేతను మానవ హక్కుల ఉల్లంఘనగా తీర్మానించింది. ప్రపంచ బ్యాంకు అధ్యక్షులు దీన్ని పేదల బతుకుల్ని బలితీసుకునే అవినీతి రాక్షసిగా వ్యాఖ్యానించారు. ఈ కారణంగానే పన్నుల ఎగవేతను నివారించందే, అసమానతలను రూపుమాపడం సాధ్యం కాదని స్పష్టం అవుతుంది.

గ్యాస్ – చమురు కంపెనీలు తమ ఆధిపత్యాన్ని కాపాడుకునేందుకు పలు అక్రమాలకు పాల్పడుతున్నాయి. ప్రభుత్వ పరంగా పలు రాయితీలను – పన్ను విరామాలను పొందుతున్నప్పటికీ గనుల విస్తృతి పేరిట సంప్రదాయ సేద్యం – అటవీ భూములు బలై పోవడాన్ని ఆచరణలో చూస్తున్నాం. ఇక్కడ కాదు బ్రెజిల్ మెక్సికోల్లోనూ ఇదే జరిగింది.

ఆర్థిక రంగం ఇటీవలి దశాబ్దాల్లో విస్తారంగా విస్తృతి చెందింది. ఇతరత్రా అన్ని రంగాల్లో కంటే ఈ రంగంలోనే వేతనాలకు, ఇతర రాయితీలకు ఉన్న అంతరాల్లో అధికం ఆర్థిక మూలనిధిలో జమచేయడం జరిగింది. ఆర్థిక సంస్థలు ఇమ్మిడి ముబ్బడిగా ఉన్న దేశాల్లో ఆర్థిక సంక్షోభాలు ఎక్కువై, అస్థిరత్వం – అసమానతలు తారస్థాయినంటాయి. ఫలితంగా ప్రభుత్వ ఆర్థికం సంక్షోభంలో పడి, బ్యాంకుల రుణ వ్యవస్థ – సంబంధిత విధి విధానాల పథకాలు నిర్వీర్యమై, పేదలు ఇరకాటంలో పడడాన్ని చూశాం.

వస్త్ర తయారీ రంగం కనీస వేతనాలను అమలు పరుస్తూనే అగ్ర భాగాన నిలువగలిగింది. అధికంగా ఉన్న మహిళా కార్మికులకు అతి తక్కువ వేతనాలు ఇవ్వడం మూలంగానే ఈ వస్త్ర తయారీ రంగం అత్యధిక లాభాలను పొందగలిగింది. మరోవైపు అవసర రక్షణా వసతులు లేని కారణంగా కార్మికులు తమ జీవితాలను కోల్పోతున్నా, కంపెనీలు లాభార్జనే లక్ష్యంగా వ్యవహరిస్తున్నాయి. ఆధిపత్య కంపెనీలు తమ ఏకీకృత మేథో సంపదలతో మార్కెట్‌ను తమకు అనుకూలంగా మార్చుకుంటూ, వినియోగదార్లపై అధిక ధరలను అమలు చేస్తున్నాయి. మధ్యతరగతి బతుకులు మొదలుకుని, జీవన్మరణ సమస్యగా బతుకు భారమవుతుంది. ఆధునిక ఆర్థిక విధాన ప్రభావ ఫలితమిది. తక్షణ ప్రత్యామ్నాయాన్ని వెతకాల్సిన పరిస్థితి.

అసమానతా వ్యవస్థ సహించలేనిది (రానిది). ఇదేదో ప్రమాదవశాత్తు వాటిల్లింది కాదు. పాలకులు వారి తాబేదార్లుగా మసలుతున్న ఆధిపత్య వర్గాల కుట్ర ఈ అరాచకానికి మంగళం పాడాల్సిందే.

మన ప్రపంచంలో సంపదకు కొదవలేదు. అయితే న్యాయ సమ్మత విధి విధానాలు కొరవడి, కొద్దిమంది చేతిలో బంధికావింపబడింది. మానవత్వం పరిమళింపచేస్తే మరింత ఉదాత్తమైన పరిస్థితులను నెలకొనేలా చేయగలం. అందుకు అవసరమైన శక్తి, సామర్థ్యాలు, నైపుణ్యత, సాంకేతికత, వ్యూహం పుష్కలంగానే ఉన్నాయి. మెజార్టీ పరమైన, అట్టడుగు ప్రజావసరాలను తీర్చేందుకనువైన మానవతా వ్యవస్థను రూపొందించగలుగుతాం. యోగ్యతానుగుణంగా అందరికీ చేసేందుకు పని (స్త్రీ – పురుషుల సమానత్వం ప్రాతిపదికన) కల్పించ గలుగుతాం. సామాజిక సేవలకనుగుణంగా, ప్రతీ ఒక్కరి అవసరాలను తీర్చే వీలుగా సమాజాన్ని రూపొందించాల్సి ఉంది. ఇందుకు ఈ పన్ను రాయితీలు కేవలం కథలుగా మిగిలి, సంపన్న వర్గాలు వారి ఆదాయాలకు అనుగుణంగా పన్నులు – రుణాలు చెల్లించాల్సి ఉంది. అప్పుడే విముక్తి!

*(ఆక్స్‌ఫామ్ సంస్థ 'ఒక్క శాతపు వారి ఆర్థిక విధానం' నివేదిక ఆధారంగా)*

*(రచయిత పాత్రికేయులు)*

# మర్రిపాకల ఎన్‌కౌంటర్ బూటకం

*విశాఖ మన్యంలో మర్రిపాకల గ్రామ సమీపంలో ఎన్‌కౌంటర్ పేరు మీద ముగ్గురు విప్లవకారులను హత్యచేసిన ఉదంతాన్ని వివరిస్తున్నారు* **తుంపాల శ్రీరామమూర్తి**

విశాఖ జిల్లా ఏజెన్సీ కొయ్యూరు మండలం మర్రిపాకల - పాలసముద్రం రాచమడుగు ప్రాంతం పులిగొండి వాగు దగ్గరలో 2016 మే నాలుగున సాయంత్రం 4.30 గంటల ప్రాంతంలో జరిగిన బూటకపు ఎన్‌కౌంటర్‌లో వెంకటరవివర్మ గోపాల్ అలియాస్ ఆజాద్ (27), జమ్ములూరి వెంకటేశ్వర్లు అలియాస్ చిన్నయ్య అలియాస్ ఆనంద్ (28), కమల (26) మృతి చెందారు.

2016 మే 4న కొయ్యూరు మండలం మర్రిపాకల, జికె వీధి మండలం పాలసముద్రం రాచమడుగు ప్రాంతంలోని దట్టమైన అటవీ ప్రాంతంలో 15 మంది మావోయిస్టులు సేదతీర్చుకుంటుండగా అందులో 8 మంది పక్కనే ఉన్న పులిగొండు వాగు దగ్గరకు వెళ్లారు. గ్రేహౌండ్స్ పోలీసులు, స్పెషల్ పోలీసులు 50 మంది చుట్టుముట్టి అకస్మాత్తుగా ముందుగా సెంట్రీగా ఉన్న కమలపై కాల్పులు జరపగా, ఆమె వెంటనే చనిపోయింది. ఆ వెంటనే ఆజాద్, ఆనంద్‌లపై కాల్పులు జరపగా వారు కుప్పకూలి పోయారు. మిగిలిన వారు తప్పించుకుని తమ కిట్ బ్యాగులు వదిలి వెళ్లిపోయారు. పోలీసులు ఏకపక్షంగా కాల్పులు జరిపి వాళ్లను హత్య చేశారు. వారు ఎకె 47 లైవ్ రౌండ్స్ 218, ఎస్ఎల్ఆర్ రౌండ్స్ 38, కాలెట్ రౌండ్స్ 27 ఉపయోగించినట్లు వారి రికార్డుల్లో రాసుకున్నారు. కాని ఖాళీ కోకులు లభించలేదని అధికారులకు తెలియ చేశారు. చనిపోయిన ముగ్గురూ గాలికొండ దళానికి చెందినవారు.

ఈ దళంలో పనిచేస్తున్న ఒక సభ్యుడు నాలుగు రోజుల క్రితం దళం నుండి విడిపోయి వెళ్లిపోయాడు. అతని వల్ల అపాయం ఉందని భావించి షెల్టర్ మార్చుకున్నప్పటికీ ముందస్తు సమాచారం ప్రకారం పోలీసులు చుట్టుముట్టి కాల్పులు జరిపారు.

2016 మే 3న విశాఖ నుండి పోలీసులు బయలుదేరి రాత్రి 12 గంటలకు పలకజీడి చేరి అక్కడ బసచేసి, 4వ తేది ఉదయం అక్కడ నుండి బయలుదేరి మర్రిపాకల అటవీ ప్రాంతానికి చేరి కాల్పులు జరిపి, ముగ్గురిని హత్య చేశారు.

ఆజాద్ విశాఖపట్నం పెద్దుర్తి మండలం కరకవానిపాలెం గ్రామానికి చెందినవాడు. ఇతని తండ్రి కూడా కొంతకాలం ఉద్యమంలో పనిచేసి అరెస్టై కేసులు కొట్టి వేసిన తర్వాత సాధారణ జీవితం గడుపుతున్నారు. ఆజాద్ అక్క చైతన్య (36) ప్రస్తుతం ఉద్యమంలో ఉన్నారు. ఆమె గత 15 ఏళ్లుగా ఉద్యమంలో కొనసాగుతున్నారు. ఆజాద్ విశాఖలోని వివిఎస్ కృష్ణా కాలేజీలో డిగ్రీ పూర్తి చేసి ఉద్యమబాట పట్టాడు. అతను 2007లో విజయనగరంలో పోలీసులకు పట్టుబడిన పిమ్మట బెయిల్‌పై బయటకు వచ్చి, పోలీసుల చిత్రహింసలు భరించలేక మరల ఉద్యమబాట పట్టాడు. అతను పట్టుబడినప్పుడే పౌరహక్కుల సంఘం కృషి వలన పోలీసులు తప్పని పరిస్థితుల్లో కోర్టులో హాజరుపరిచారు.

జమ్ములూరి వెంకటేశ్వర్లు అలియాస్ ఆనంద్ తూర్పు గోదావరి జిల్లా అడ్డతీగల మండలం వీరవరం గ్రామానికి చెందినవాడు. ఇతను గిరిజనుడు. 2004లో ఉద్యమబాట పట్టాడు. ఇతని అన్నయ్య కూడా ప్రస్తుతం ఏజెన్సీలో ఉద్యమంలో ఉన్నాడు. కమల ఒరిస్సా రాష్ట్రం మల్కన్‌గిరి జిల్లా కలిమెల బ్లాక్ సోలారబు గ్రామానికి చెందిన గిరిజన యువతి.

ఆజాద్, ఆనంద్‌ల భౌతికకాయాలను వారి కుటుంబ సభ్యులు నర్సీపట్నం ఏరియా అసుపత్రి నుండి పోస్టుమార్టం అనంతరం తీసుకెళ్లి అంత్యక్రియలు జరిపారు. కమల భౌతికకాయాన్ని, కుటుంబ సభ్యులు రాలేనందున పోలీసులే నర్సీపట్నంలో అంత్యక్రియలు నిర్వహించారు.

ఈ సంఘటనలో పోలీసులు ఏకపక్ష కాల్పులు జరిపారు. సుప్రీం కోర్టు మార్గదర్శకాల ప్రకారం హైకోర్టు సిటింగ్ న్యాయమూర్తిచే న్యాయ విచారణ జరిపించాలి. బాధ్యులైన పోలీసులపై ఐపిసి 302 సెక్షన్ కింద కేసు నమోదు చేయాలి.

*(రచయిత పౌరహక్కుల సంఘం)* వీ

**రాబోయే సంచికలలో...**

- తత్వశాస్త్రమే ఆయుధం - డా. కత్తి పద్మారావు
- సర్కారీ స్కూళ్ల మూసివేత - ఎం.కె. కుమార్
- గురజాడ రాత ప్రతుల ప్రస్థానం - పి.పి.సి. జోషి
- హిందూ తీవ్రవాదులు - మాలేగావ్ కేసు

# మార్క్స్ ఆసియాటిక్ కోణాన్ని ఎలా చూడాలి?

***చరిత్ర పట్ల భౌతికవాద దృక్పథంలో భాగంగా సామాజిక పరిణామ దశలను వివరిస్తూ మార్క్స్ ప్రతిపాదించిన ఆసియాటిక్ ఉత్పత్తి విధానం భావనను వివరిస్తున్నారు*** **వెన్నెలకంటి రామారావు**

'భారతీయ సమాజానికి చరిత్ర అనేదేలేదు, కనీసమాత్రంగా తెలిసిన చరిత్రాలేదు. మనం చరిత్ర అని పిలుస్తున్నదంతా నిరోధించలేని, మార్పు లేని సమాజపు నిశ్చేష్టిత పునాదిపై పరంపరాగత చొరబాటుదారులు నిర్మించిన సామ్రాజ్యాల చరిత్ర మాత్రమే. భారత్‌ను ఆక్రమిం చేందుకు ఇంగ్లిష్ వారికి హక్కు ఉన్నదా, అలాకాక భారత్‌ను బ్రిటన్ ఆక్రమించడం కంటే టర్క్, పెర్షియన్, రష్యన్‌వారు భారత్‌ను ఆక్రమించడాన్ని మనం ఎంచుకోవాలా అన్నది ప్రశ్న కాదు. అరబ్‌లు, టర్క్‌లు, మొఘల్‌లు వరుసగా భారత్‌ను పరిపాలించారు. వారందరూ హైందవీకరణకు గురయ్యారు. అనాగరిక విజేతలు జయించిన ఉన్నత దశలో ఉన్న పరాజితుల నాగరికత విజేతల్ని జయిస్తుందనేది అఖండ చారిత్రక నియమం.

భారత్‌ను ఆక్రమించిన వారిలో సామాజికంగా ఉన్నత దశలో ఉన్న మొదటి విజేతలు బ్రిటిష్‌వారే. అందువలన హిందూ నాగరికతకు వారు అభేద్యమయ్యారు. స్థానిక ప్రజా సమూహాలను విడగొట్టడం ద్వారా, స్థానిక పరిశ్రమను నిర్మూలించడం ద్వారా, దానికితోడు స్థానిక సమాజంలోని గొప్పవైన, ఉన్నతమైన విషయాలను తుడిచివేయడం ద్వారా వారు భారతీయ సమాజాన్ని ధ్వంసం చేశారు. భారత్‌లో ఇంగ్లండ్ ద్విముఖ కర్తవ్యాలు నెరవేర్చవలసి వచ్చింది. ఒకటి విధ్వంసకరమైనది, మరొకటి పాత ఆసియాటిక్ సమాజాన్ని నిర్మూలించడం ద్వారా పునరుద్ధరించడం, ఆసియాలో పాశ్చాత్య సమాజ భౌతిక పునాదులు వేయడం'. 'భారత్‌లో బ్రిటిష్ పాలన భవిష్యత్ పరిణామాలు' అని న్యూయార్క్ డైలీ ట్రిబ్యూన్‌కు 1853లో కార్ల్ మార్క్స్ రాసిన లేఖలోని వ్యాఖ్య ఇది. 'ఈ వేదన ఆనందమయమని, ఈ బాధ మనల్ని వేధింపదగునా?' అనే గోథే వాక్యాలను 1853లో పై న్యూయార్క్ డైలీ ట్రిబ్యూన్ దిన పత్రికలో ప్రచురితమైన మరొక వ్యాసంలో భారత ప్రజలపై బ్రిటన్ వలసవాదులు అమలు చేస్తున్న దారుణాలు, దుర్మార్గాలపై మార్క్స్ ఉటంకించారు. శతాబ్దాలుగా మార్పు లేని, జడత్వంతో ఉన్న భారతీయ సమాజంపై బ్రిటన్ చేస్తున్న అకృత్యాలు, అమానుషాలను అనివార్యమైన చారిత్రక విధిగా భావిస్తూ రాసిన వ్యాఖ్యాలుగా మార్క్సిస్టేతర విమర్శకులు దాడి చేస్తున్నారు. ఈ రెండు ఉల్లేఖనలు భారత్‌పై, ప్రత్యేకించి ఆసియా సమాజాలపై స్థూలంగా మార్క్స్‌లోని యూరోసెంట్రిక్ అవగాహనకు, యూరప్ జాత్యహంకారానికి అద్దం పడుతున్నాయని కొందరు భారతీయ మేధావుల నిశ్చిత అభిప్రాయం. భారతీయ సామాజిక వాస్తవికతను మార్క్స్ అర్థం చేసుకోలేదని, భారతీయ సమాజాన్ని బ్రిటిష్ వలసవాదం ప్రతిష్ఠించిన చిత్రణను ఆయన కూడా విశ్వసించడం పెద్ద లోపమని ఆ విమర్శకుల అభిప్రాయం.

ఆసియాటిక్ సమాజాలు ముఖ్యంగా భారతీయ సమాజం శతాబ్దాలుగా స్తబ్దంగా, చలనరహితంగా, నిశ్చలంగా కొనసాగుతున్నదన్న మార్క్స్ అభిప్రాయంలోని మర్మాన్ని (మార్మికత కాదు) మొదటగా చర్చిద్దాం. ప్రపంచం (ప్రకృతి+సమాజం) చలనశీలమైనదని మార్క్స్ ఆవిష్కరించిన భౌతికవాద గతితర్కం చెబుతుంది. ప్రపంచంలోని ప్రతిదీ చలన స్థితిలోనే ఉంటుందని, చలనం పరమరూఢమైనదని, నిశ్చల స్థితి సాపేక్షమని మార్క్సిస్టు తత్వశాస్త్రం చెబుతుంది. అయితే అందుకు భిన్నంగా భారతీయ సమాజాన్ని చలనరహితమైనదిగా మార్క్స్ సూత్రీకరించడమనేది, ఆనాటి వలసవాదుల సిద్ధాంతానికి ఆయన కోరస్ పాడడమేనని మూడేళ్ల క్రితం సంపాదక మిత్రులు ఒకరు నాతో సీరియస్‌గా ప్రస్తావించారు.

మార్క్స్ చేసిన ఆ సూత్రీకరణను భారతీయ చారిత్రకులు సహా వామపక్షాలు (పార్లమెంటరీ/సాయుధ పోరాటం) కూడా తప్పుగా అర్థం చేసుకున్నాయని ఆనాడు ఆయనతో చర్చించాను. మొదటగా మార్క్సిస్టు దార్శనికతలోని చలనం – నిశ్చలత అనే తాత్విక ధాతువు (కేటగిరి)లకు సంబంధించిన చలనశీలతను, సాపేక్షికతను సవ్యంగా అర్థం చేసుకోవాలి. నిశ్చలత అనేది చలనశీల పదార్థపు తాత్కాలిక, సాపేక్ష రూపంగా చెబుతున్న మార్క్సిస్టు తత్వశాస్త్రం పరిగణిస్తుంది. చలనం, నిశ్చలత అనే తాత్విక ధాతువులు వేటికవే భిన్నమైన, విడి విడి పాదార్థిక స్థితులుగా పరిగణించే జడతార్కిక (మెటాఫిజికల్) పద్ధతికి అనుగుణంగా 'భారతీయ సమాజం చలనరహితంగా శతాబ్దాలుగా కొనసాగింది' అనే మార్క్స్ భావనను అర్థం చేసుకోవడం శుద్ధ తప్పు.

మార్క్సిస్టు తత్వశాస్త్రం అయిన భౌతికవాద గతితార్కికంలోని ధాతువులు (కేటగిరిలు) పరిణామ రహిత జడ ధాతువులు (రెజిడ్ కేటగిరిస్) కావు. భౌతికవాద గతితర్క తాత్విక ధాతువులు ఒక నిర్దిష్ట స్థితికి అనుగుణంగా పరస్పరం రూపాంతరం చెందగల, మార్పిడికి లోనుకాగల, ప్రవాహశీలమైన, పరిణామశీలమైన స్వభావం గలవి. పదార్థంలేని చలనం లేదు, చలనంలేని పదార్థం లేదని మార్క్సిజం చెబుతుంది. అంటే పదార్థానికి నిశ్చల స్థితి అనేది లేదని కాదు. అది పదార్థానికి చెందిన విశ్వజనీన చలనంలో అంతర్భాగంగా మాత్రమే ఉంటుంది కానీ, దాని కది విడిగా ఉండదని అర్థం. నిశ్చల స్థితిని ఏదో ఒక నిర్జీవ, జడ స్థితిగా భావించకూడదు.

ఒక వస్తువు మరొక వస్తువుతో సాపేక్షంగా మాత్రమే నిశ్చల స్థితిలో ఉండగలుగుతుందని మార్క్సిస్టు భావన. అంతేగాని పరమరూఢమైన (అబ్సల్యూట్) జడత్వం అంటూ ఏదీ ఉండదు. మార్క్సిస్టు సిద్ధాంతం ప్రకారం ఒక రెఫరెన్స్ ఫ్రేమ్ (ప్రామాణిక తలం)లో నిశ్చల స్థితిలో ఉన్న ఒక వస్తువు మరో ప్రామాణిక తలంలో చలనంలో ఉంటుంది. అందువల్ల చలనం, నిశ్చలత అనేవి భౌతికవాద గతితర్కంలో వేర్వేరు అంశాలు కావు. రెండూ అభిన్నమైనవి. భారతీయ వాస్తవికతలోని నిశ్చలత

అంశాన్ని మార్క్స్ వ్యాఖ్యానించడాన్ని నా సంపాదక మిత్రులు తప్పుగా అర్థం చేసుకున్నారు.

భూగోళం నుంచి ఖగోళంలోని అనంతమైన స్థూల ప్రపంచం, జీవకణాలు, అణువులు, పరమాణువులు, ఎలక్ట్రాన్, ప్రోటాన్ మూలకణాలతో కూడిన అనంతమైన సూక్ష్మ ప్రపంచం దాక నిరంతరాయమైన చలనస్థితిలో ఉంటాయి. అయితే భూమి ఉపరితలంపై నిశ్చలతలో ఉండే వస్తువులు భూమితో సాపేక్షికంగా నిశ్చలతలో ఉన్నట్లు కనిపించినా, భ్రమణం, పరిభ్రమణంలో ఉన్న భూమితో పోల్చితే చలనంలో ఉండడమే కాకుండా, ఆ వస్తువులలోని అణువులు, పరమాణువులతో కూడిన సూక్ష్మ ప్రపంచం కూడా చలనంలోనే ఉంటుంది కదా! ప్రపంచంలో ఒక తలంలో నిశ్చలంగా ఉన్న వస్తువులు అంతకంటే పై తలంలోనూ చలనంలో ఉంటాయి, దానికంటే సూక్ష్మ తలంలోనూ చలనంలో ఉంటాయి. భూతలంపై నిశ్చలతలో ఉన్న వస్తువు, అంతరిక్ష తలంలో భూమి భ్రమణం – పరిభ్రమణాన్ని పరిగణిస్తే భూమితో పాటు చలనంలోనే ఉన్నట్లు లెక్క. ప్రతిదీ చలనం, నిశ్చలత అనే రెండు సాపేక్షిక స్థితులనూ కలిగి ఉంటుందని మార్క్సిస్టు తత్వశాస్త్రం పరిగణిస్తుంది. ఈ నేపథ్యంలో సామాజిక పరిణామ క్రమంలోనూ సంభవించే చలనం, నిశ్చల స్థితులను పరమ రూఢమైనవిగా గుర్తించే దృక్పథాన్ని విడనాడాలి.

యూరప్‌లోని ఫ్యూడలిజం, పెట్టుబడిదారీ పూర్వ సమాజాల్లో, ముఖ్యంగా ఆసియాలోని మొదటగా గుర్తించిన ఆసియాటిక్ ఉత్పత్తి విధానంలో విడివిడి (ఐసోలేటెడ్), ముకుళిత (క్లోజ్డ్) ఆర్థిక వ్యవస్థలు ఉండేవి. పెట్టుబడిదారీ విధానంతో ప్రపంచ ఆర్థిక వ్యవస్థ ఏర్పడింది. గతంలో విడివిడి ఆర్థిక వ్యవస్థల మధ్య నడుస్తున్న మార్కెట్ లావాదేవీల స్థానంలో ప్రపంచ ఆర్థికవ్యవస్థ అనే ఏకత్వం (ఏక వ్యవస్థ) రూపుదిద్దుకుంది. అయితే పెట్టుబడిదారీ విధానం ఏర్పడిన యూరప్ సమాజం ప్రపంచ ఆర్థిక వ్యవస్థ ఏర్పడే క్రమంలో 'చారిత్రక పనిముట్టు'గా ఆసియాటిక్ సమాజాల్లోకి చొచ్చుకు వచ్చింది.

మానవ తొలి నాగరికతలు దక్షిణార్ధ గోళ వ్యవసాయ ప్రధాన దేశాల్లో ముఖ్యంగా నదులు, జీవవైవిధ్యం మెండుగా ఉన్న ప్రాంతాల్లో అంటే జీవనాధారాలు ప్రకృతి సంపదగా ఉన్న ప్రాంతాల్లో ఏర్పడ్డాయి. ఖనిజాలు విస్తారంగా లభ్యమయ్యే శ్రమ సాధనాల రూపంలో ప్రకృతి సంపద ఉన్న ప్రాంతాల్లో రెండవ దశ మానవ నాగరికతలు ఉత్తరార్ధ గోళ పారిశ్రామిక దేశాల్లో ఆవిర్భవించాయి.

రెండవ దశ నాగరికతలు మొదటి నాగరికతల కంటే చారిత్రకంగా ఉన్నత స్థాయి నాగరికత లక్షణాలు కలిగి ఉండడంలోనూ, వాటిల్ని అలా పరిగణించడంలోనూ తప్పేమీ కాదు. అందులో కుట్రలేవీ లేవు. అదొక వస్తుగత చారిత్రక నియంత్రణగా గుర్తించాలి. మానవ అవసరాల కోసం ప్రకృతిని మానవీకరించే సామర్థ్యం, నైపుణ్యం పునాదిగా ఏర్పడిన ఉత్పత్తి సంబంధాల స్వభావాన్ని బట్టి ఆయా సామాజిక దశల్ని, స్థాయిల్ని చారిత్రకంగా నిర్ణయిస్తారు.

ఇది ప్రకృతి – సమాజాల మధ్య సాగే ఆదాన ప్రధాన ప్రక్రియకు అనుమేయంగా (ఊహింపదగినదిగా) ఉంటుంది. తొలి మానవ సమాజాలు, తొలి నాగరికత వ్యవస్థల్లో ప్రకృతి – సమాజాల మధ్య సాగే ఆదాన ప్రధాన క్రమం కదంతాల్ తొక్కుతూ (మార్క్ టైం – ముందుకు సాగకుండా ఉన్న చోటే కదులుతుండడం లేదా కవాతు చేయడం) శతాబ్దాలుగా చారిత్రకంగా గుణాత్మక మార్పులకు నోచుకోని స్థితిలో కొనసాగుతుంది.

ఈ నేపథ్యంలో తొలి నాగరికతలు ఏర్పడిన ఆఫ్రికా, ఆసియా, లాటిన్ అమెరికా ఖండాల్లో అనేక నరవర్గ సమూహాలు చారిత్రకంగా ఇప్పటికీ ఏవో కొన్ని స్వల్ప మార్పులతో అలాగే కొనసాగుతున్నాయి. ప్రకృతి – సమాజాల మధ్య ఆదాన ప్రధానాల క్రమంలో ఏర్పడిన సమతుల్యత, సయోధ్య కారణంగా జీవనాధారాలు ప్రకృతి సంపదగా విలసిల్లిన సమాజాలు రెండవ నాగరికత దశకు ఎదగలేని స్థితిలో కొనసాగాయి.

రెండవ నాగరికత దశలోని సమాజాలు సహజ వనరులు, శ్రమశక్తి, వినిమయ సరుకుల మార్కెట్ అవసరాల పునాదిగా తిరిగి చొరబడేంత వరకు శతాబ్దాల తరబడి గుణాత్మక సామాజిక మార్పులు లేకుండా తొలి నాగరిక సమాజాలు అలానే కొనసాగాయి. ముందుకు వెళ్లకుండా ఉన్నచోటే చలనంలో ఉండే స్థితిలో (చారిత్రక కదంతాల్) కొనసాగాయి. ఇదేమీ అసహజమేమీ కాదు.

ప్రకృతిలోని జీవరాసుల పరిణామ క్రమంలో సరళ జీవరాసుల నుంచి సంక్లిష్ట, చైతన్యపూరిత జీవరాసులు, అంతిమంగా మానవులు ఉద్భవించారు. అయితే ఈ పరిణామ క్రమంలో ప్రకృతి, పరిసరాలతో సయోధ్య, సమతుల్యతకు చేరిన జీవరాసులు ప్రకృతి వరణంలో భాగంగా పరిణామం చెందకుండా ఇప్పటి వరకూ కొనసాగుతుండడం చూస్తున్నాం. అది జీవ వైవిధ్యతకు దారి తీసింది.

అదే తీరులో భూగోళంపై వివిధ పర్యావరణాల వస్తుగత వైవిధ్యల ఆవరణాల్లో చారిత్రకంగా ఏర్పడిన తొలి, మలి నాగరికతల 'సామాజిక వరణం' (సోషల్ సెలెక్షన్) సాగింది. ప్రకృతి వరణం (నేచురల్ సెలెక్షన్)లో పరిణామం చెందక ప్రకృతితో సయోధ్య కలిగిన జీవరాసుల వలె ఆఫ్రికా, ఆసియా, లాటిన్ అమెరికాలలోని తొలి నాగరికతలకు చెందిన సమాజాలు ఆ తర్వాతి సామాజిక దశలకు పరిణామం చెందకుండా కొనసాగుతుండడం మనం చూస్తాం. ఈ ఖండాలలో పెట్టుబడిదారీ పూర్వ సామాజిక వ్యవస్థలుగా కొనసాగుతున్న మానవ సమూహాలు ఇప్పటికీ ఉనికిలో ఉండడం అందుకు సజీవ తార్కాణం.

ఆఫ్రికాలో నరమాంస భక్షకులు, బుష్‌మెన్ గిరిజన తెగల నుంచి, లాటిన్ అమెరికాలోని మయా నాగరికతకు చెందిన గిరిజనులు, ఆసియాలో వివిధ ఆదివాసి తెగలు సామాజిక సహజ పరిణామానికి నోచుకోక శతాబ్దాలుగా గిడసబారాయి. ఈ సామాజిక వ్యవస్థలు రెండవ దశ నాగరికతలు జోక్యం చేసుకోనంత వరకు చారిత్రకంగా అలాగే కదంతాల్ స్థితిలో కొనసాగాయి. దండకారణ్యం, ఈశాన్య భారతం సహా దేశ వ్యాప్తంగా దేశ జనాభాలో 8.6 శాతానికి పైగా (సుమారు 10.4 కోట్లు) ఆదివాసులు ఉన్నట్లు తాజా గణాంకాలు చెబుతున్నాయి.

మన దేశంలో దాదాపు 70 శాతం మంది పట్టణాల్లోనే జీవిస్తున్నారు. అంతర్జాతీయ పెట్టుబడి అవసరాల మేరకు ఇక్కడ ఉత్పత్తి సంబంధాలు రూపాంతరం చెందాయి. పెట్టుబడి చొరబాటు తీవ్రత పెరిగే కొద్దీ దేశంలోని పెట్టుబడిదారీ పూర్వ ఉత్పత్తి సంబంధాలు పరిణామం చెంది పరివర్తనాత్మక స్థితికి చేరుకున్నాయి. భూగోళంపై పెట్టుబడిదారీ సమాజం, అందుకు అవసరమైన ప్రపంచ మార్కెట్ ఏర్పడిన నాటి నుంచి పెట్టుబడిదారీ విధానం భారత్ వంటి పెట్టుబడిదారీ పూర్వ సమాజాల్లోకి చొచ్చుకు పోయింది.

అప్పటికీ శతాబ్దాలుగా వివిధ స్థాయిల్లో కదంతాల్ తొక్కుతున్న ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికా దేశాల్లోని సామాజిక వ్యవస్థలు వలస, అర్ధవలసలుగా మారి సామ్రాజ్యవాద మార్కెట్‌కు అనుబంధ

ఆర్థిక వ్యవస్థలుగా, ప్రపంచ ఆర్థిక వ్యవస్థకు పొలిమేర ప్రాంతాలుగా మారాయి. ఈ దేశాల్లో గతం నుంచి కదంతాల్ స్థితిలో కొనసాగుతున్న ఆదిమ, బానిస, ఫ్యూడల్ రూపాల్లోని సామాజిక సంబంధాలు అంతర్జాతీయ శ్రమశక్తి, ముడి సరుకుల, వినిమయ సరుకుల మార్కెట్ అవసరాలకు అనుగుణంగా పరివర్తన చేందాయే గానీ, పెట్టుబడిదారీ స్వభావాన్ని సంతరించుకోలేదు. పెట్టుబడిదారీ సమాజం జోక్యం చేసుకునేంత వరకు ఆ సమాజాల్లోని ఉత్పత్తి సంబంధాలు సొంతగా గుణాత్మక దశలకు పరిణామం చెందలేక, కదంతాల్ స్థితిలో కొనసాగుతున్నాయని మార్క్స్ సూత్రీకరించారు.

సామాజిక పరిణామానికి కీలకమైనది ఆ సమాజంలోని ఆర్థిక వ్యవస్థ. అయితే ఒక సమాజం సృష్టిస్తున్న అదనపు విలువ దాని ఆర్థిక వ్యవస్థ చలనానికి ఇంధనం లాంటిది. పెట్టుబడిదారీ పూర్వ సమాజాల్లో అంటే సరుకుల ఉత్పత్తి సార్వజనీన స్థితికి చేరుకోని దశల్లో అదనపు విలువ సమీకరణ సామాజిక మిగులు ఉత్పత్తిని సొంతం చేసుకోవడం రూపంలో సాగేది. పెట్టుబడిదారీ సమాజంలో అదనపు విలువ సమీకరణ/దోపిడీ ప్రధానంగా డబ్బు రూపంలో సాగుతుంది. అదనపు విలువ అంటే డబ్బు రూపంలోని సామాజిక మిగులు ఉత్పత్తి తప్ప వేరుకాదు. అదే విధంగా సామాజిక మిగులు ఉత్పత్తి అంటే వస్తు రూపంలోని అదనపు విలువగా పరిగణించాలి. అందువల్ల సామాజిక మిగులు ఉత్పత్తి, అదనపు విలువ అనే భావాభివర్గాలు రెండూ భిన్నమైనవి (ఐడెంటికల్). అందువల్ల అదనపు విలువ అనే భావనను పెట్టుబడిదారీ సమాజానికి మాత్రమే పరిమితమైన అంశంగా మార్క్స్ – ఎంగెల్స్ ఎన్నడూ భావించలేదు. అదనపు విలువను పెట్టుబడి సంచయనంలోని నిర్దిష్ట రూపం నుంచి మొత్తం వర్గ సమాజాలకు సంబంధించిన 'సాధారణ' రూపంలో పరిగణించడంపై వారు ప్రధానంగా కేంద్రీకరించారు.

అదనపు విలువ అంటే శ్రమశక్తి సరుకు సొంతదారులైన 'సరుకుల ప్రత్యక్ష ఉత్పత్తి దారుల'కు చెందకుండా ఉత్పత్తి సాధనాల సొంతదారుల వద్ద పోగుపడు తున్న శ్రమగా, అంటే శ్రామికుల నుంచి పరాయీకరణ చెందిన శ్రమగా అత్యంత సాధారణీకృత రూపంలో వారు పరిగణించారు. అదనపు విలువ సమీకరణ పెట్టుబడిదారీ పూర్వ సమాజాల్లో సామాజిక మిగులు (అదనపు) ఉత్పత్తి రూపంలో పోగుపడితే, పెట్టుబడిదారీ సమాజంలో డబ్బు రూపంలో పోగుపడుతుంది. ఈ నేపథ్యంలో అదనపు విలువ అనేది పెట్టుబడిదారీ సమాజ అంశమని, సామాజిక మిగులు (అదనపు) ఉత్పత్తి మాత్రమే పెట్టుబడిదారీ పూర్వ సమాజాలకు సంబంధించిన ఆర్థిక అంశంగా పరిగణించరాదు. అదనపు విలువలో గరిష్ఠ భాగం ఉత్పత్తి దారుల వద్దనే పోగుపడితే ఆ ఆర్థిక వ్యవస్థ చలనం స్వతసిద్ధంగా సాగుతుంది. అలాగాక, ఒక సమాజం సృష్టిస్తున్న అదనపు విలువలో అత్యధిక భాగం రాజ్యం లేదా వడ్డీ వ్యాపారుల వద్ద పోగుబడితే సదరు ఆర్థిక వ్యవస్థ చలనం కుంటుపడి స్వతసిద్ధ పరిణామం గాడి తప్పి, సహజ పరిణామం లేక గడ్డకట్టుకుపోతుంది.

అదనపు విలువ కేంద్రీకరణ ఉత్పత్తిదారులకు వెలుపల ఏర్పడితే సదరు ఆర్థికవ్యవస్థలో గుణాత్మక పరిణామం కొరవడుతుంది. పర్యవసానంగా అలాంటి ఆర్థిక వ్యవస్థలు గల సమాజాలు గిడసబారి పోతాయి. శతాబ్దాల తరబడి అలాంటి సామాజికార్థిక వ్యవస్థలు గుణాత్మక పరిణామానికి నోచుకోక, చలన రహిత స్థితిలో అంటే ముందుకు పోకుండా ఒకే స్థానంలో కదలాడే రూపంలోని చలనం (పైకి నిశ్చలతలో ఉన్నట్లు కనబడే స్థితి) లో చారిత్రకంగా కొనసాగుతాయి. అలాంటి సమాజాల్లోకి వాటికంటే పై స్థాయి సామాజిక దశల్లో ఉన్న ఆర్థిక క్రమం చొచ్చుకుని వచ్చే దాకా అవి అలానే కొనసాగుతుంటాయి. ఇలా చారిత్రకంగా వేచి చూసే తొలి నాగరిక సమాజాల గురించి, ముఖ్యంగా ఆసియాటిక్ సమాజాల గురించి మార్క్స్ అధ్యయనం నుంచి ఆసియాటిక్ ఉత్పత్తి విధానం భావన ఆవిర్భవించింది.

భౌతిక మార్పులు జరిగేటప్పుడు సమతా స్థితి (ఈక్విలిబ్రియం), నిశ్చల స్థితి (రెస్ట్) ఉంటాయి. అయితే వాటి ప్రభావం మొత్తం పదార్థంపై గాక, కొన్ని ప్రత్యేక వస్తువులపైన, క్రమాలపైన మాత్రమే ఉంటుంది. ఆదిమ, ఆసియాటిక్, బానిస, ఫ్యూడల్, పెట్టుబడిదారీ వ్యవస్థలు వరుసగా పరిణామం చెందుతున్న క్రమంలో కాలం చెల్లిన వ్యవస్థ స్థానంలో మరొక కొత్త వ్యవస్థ విప్లవాత్మక ఆవిష్కరణ జరగబోయేంతవరకు కొన్ని ఏళ్ల పాటు పాత స్వభావంతోనే కొనసాగుతుంది. ఉదాహరణకు గ్రీకు, రోమన్ బానిస వ్యవస్థలు శిథిలమై, క్రీ.శ. 9వ శతాబ్దంలో యూరప్‌లో ఫ్యూడల్ వ్యవస్థ ఆవిర్భవించి 15వ శతాబ్ది వరకు కొనసాగింది. ఈ ఆరు శతాబ్దాల కాలంలో కేవలం పరిణామాత్మక మార్పులతో విలసిల్లిన ఫ్యూడల్ వ్యవస్థ సాపేక్షికంగా ఎలాంటి గుణాత్మక మార్పులు లేకుండా యథాస్థితిలో ఉన్నట్లు కొనసాగుతుండడం చూస్తాం.

ఫ్యూడలిజం పుట్టినప్పటి నుంచి పెట్టుబడిదారీ విప్లవం సంభవించడానికి ముందు కాలం వరకు సామాజిక సమతా స్థితి సామాజిక నిశ్చల స్థితిగా పరిగణించాలి. అదనపు విలువ సమీకరణ స్వభావాన్ని బట్టి ఈ సామాజిక నిశ్చల స్థితి కొనసాగే వ్యవధి ఆధారపడి ఉంటుంది. ప్రపంచాభివృద్ధికి ఈ నిశ్చల స్థితి అవసరం. ఒక వస్తువు చలనంలో ఉత్పన్నమవుతుంది. ఈ చలనం ఫలితాన్ని నిశ్చల స్థితి అలాగే నిలబెడుతుంది. తత్ఫలితంగా ఆ వస్తువు కొంతకాలం పాటు యథాతథంగా అట్టిపెట్టబడి అలాగే ఉండిపోతుంది.

అదనపు విలువ సమీకరణ రాజ్యం లేదా వడ్డీ వ్యాపారుల వద్ద కేంద్రీకృతం కావడం, ఉత్పత్తిదారుల వద్ద సాధారణ కార్యకలాపాలకు సరిపడినంత పరిమాణంలో మాత్రమే సమీకృతమవడంపై ఈ సామాజిక నిశ్చల స్థితి కొనసాగే వ్యవధి లేదా కాల పరిమితి లేదా పరిధి ఆధారపడి ఉంటుంది. శ్రమసాధనాలకు అవసరమయ్యే ప్రకృతి సంపదలైన ఖనిజాలున్న ప్రాంతాలలో విలసిల్లిన రెండవ దశ నాగరిక సమాజాల్లో ఉద్భవించే అదనపు విలువ ప్రధానంగా ఉత్పత్తిదారుల వద్దనే పోగుపడడం వల్ల వాటి ఆర్థికవ్యవస్థల్లో త్వరితగతిన పరిణామాలు చోటు చేసుకున్నాయి. అందుకు భిన్నంగా జీవనాధారాలు ప్రకృతి సంపదలున్న తొలిదశ మానవ నాగరిక సమాజాలు చాలా మందకొడి గమనాన్ని అలవరచుకున్నాయి.

సింధూ, యూఫ్రటీస్ – టైగ్రీస్, యాంగ్జీ తదితర తొలి నాగరిక దశలోని సమాజాలు సుదీర్ఘకాలం పాటు గుణాత్మక సామాజిక మార్పులకు నోచుకోక, కదంతాల్ తొక్కుతూ రెండవ దశ నాగరిక సమాజాలు జోక్యం చేసుకునేంత వరకు చారిత్రకంగా వేచి ఉండే స్థితిలో కొనసాగాయి. అసియాటిక్ స్వభావంతో ఉన్న సమాజాల్లో సామూహిక ప్రాతిపదికన ఉత్పత్తి కార్యకలాపం కొనసాగుతూ, ఆ సమాజం సృష్టిస్తున్న అదనపు విలువంతా పన్నుల రూపంలో రాజ్యం వద్ద పోగుపడుతుండడం వలన ఆర్థిక వ్యవస్థలో గుణాత్మక మార్పులు చోటు చేసుకోలేదు. ఇంధనం లేక క్రియారహితంగా మారిన ఇంజన్లు లాగా అదనపు విలువను పెద్ద ఎత్తున కోల్పోయిన ఆ సామాజిక ఆర్థిక వ్యవస్థలు చారిత్రక నిష్క్రియా పరత్వానికి గురయ్యాయి.

స్థానిక ఉత్పత్తిదారులు తయారు చేసే సరుకుల ఎగుమతి, విదేశీ వాణిజ్యం ద్వారా వచ్చే అపరిమిత సంపదల్ని సొంతం చేసుకోవడం ద్వారా ఆసియాటిక్ రాజ్యాలు సంపన్నమైన, కప్పం వసూలు చేసే నిరంకుశ రాజ్యాలుగా అవతరించాయి. దాంతో పోగుపడిన అదనపు విలువలో మెజారిటీ భాగం పాలకుల విలాసాలకు ఖర్చయ్యేవే గాని, ఉత్పత్తిదారుల చేతికి చేరి ఉత్పత్తి సాధనాల అభివృద్ధికి ఉపకరించలేదు. పర్యవసానంగా ఉత్పత్తి శక్తుల అభివృద్ధి క్రమం కుంటుపడి, గిడసబారి పోయింది.

అసియాటిక్ ఉత్పత్తి విధానంలోని కీలక చలన నియమం ఇదే. అదే సమయంలో రెండవ దశలోని నాగరిక సమాజాల్లో సృష్టిస్తున్న అదనపు విలువలో ప్రధాన భాగం ఉత్పత్తి దారుల వద్ద పోగవడం అత్యంత ప్రధానమైనది. ఉత్పత్తి దారుల వద్ద అదనపు మిగులు (అదనపు విలువ) పోగుపడడం వల్ల ఉత్పత్తి శక్తుల అభివృద్ధి క్రమం నిరాటకంగా సాగి, ఉత్పత్తి విధానంలో గుణాత్మక మార్పులు చోటుచేసుకున్నాయి. ఉత్పత్తి దారుల వద్ద పోగుపడిన అదనపు మిగులు ఆ సమాజాల ఆర్థిక గమనానికి శక్తివంతమైన ఇంధనంలా పనిచేసింది. జర్మనీ మినహా మిగతా యూరోప్‌లో ప్రబలంగా ఇలాంటి పరిణామం చోటుచేసుకుంది. అందువల్ల తొలి నాగరికత సమాజాల్లో కీలకమైన ఆర్థిక సాధనంగా పనిచేసిన రాజ్యం, అదే మలి నాగరికత సమాజాల్లో వర్గ పోరాటాన్ని ఉపశమింప చేసే పరిపాలనా అంగంగా మాత్రమే రాజ్యం వ్యవహరించింది.

ఆసియా ఉత్పత్తి విధానం (ఎఎంపి) అనే సిద్ధాంతాన్ని 1850ల ప్రాంతంలో మార్క్స్ ముందుకు తెచ్చారు. ఆసియా సమాజాల్లో ముఖ్యంగా ఇండియాలో శతాబ్దాల తరబడి గిడసబారిన ఆర్థిక వ్యవస్థకు సంబంధించిన ప్రత్యేక లక్షణంగా ఎఎంపి గురించి ఆయన భావించారు. కేంద్ర నగరాల్లో తిష్టవేసుకున్న నిరంకుశ పాలక కూటమి విశాలమైన ఆటార్కి (స్వయం సంపూర్ణ), సారుప్య గ్రామీణ ప్రాంతాలు సృష్టించే మిగులును స్వాధీనం చేసుకుంటున్న ఆసియా సమాజాలలోని ఆర్థిక విధానాన్ని ఆసియాటిక్ మోడ్ ఆఫ్ ప్రొడక్షన్ లేదా ఆసియా ఉత్పత్తి విధానం అని ఆ తర్వాత సూత్రీకరించారు.

పెట్టుబడిదారీ పూర్వ ఆసియాలోని సామాజికార్థిక నిర్మాణాలు ఫ్యూడల్ యూరప్‌లోని సామాజిక నిర్మాణాలకు భిన్నంగా ఏమీ లేవని కొందరి వాదనతో విభేదించిన మార్క్స్ ఏంగెల్స్ ఎఎంపి సామాజిక ఆర్థిక నిర్మితిపై ప్రత్యేకించి అధ్యయనం చేశారు. అసియాటిక్ సమాజాల్లో రాజ్యం చాలా కీలకమైన ఆధిపత్య పాత్ర పోషిస్తుందని వారు పదే పదే ప్రస్తావించారు. భూమిపై రాజ్యం గుత్తాధిపత్య హక్కు కలిగి ఉండి, కేంద్రీకృత రాజకీయ, ఆర్థిక శక్తిగా ఉండడం లేదా సాగునీటి పారుదల వ్యవస్థలపై నియంత్రణ కలిగి ఉండడంగా వారు ఎఎంపిని పేర్కొన్నారు. భూ కమతాలు సాంఘిక స్వభావం కలిగి ఉండడం, గ్రామాల్లో నివసిస్తున్న ప్రజలు విడివిడిగా బతకడం వల్ల రాజ్య నిరంకుశాధిపత్యం కొనసాగిందని వారు వ్యాఖ్యానించారు. మార్క్సిస్టు సిద్ధాంతాన్ని అత్యంత పరిపక్వ స్థితిలో మనముందుంచిన మార్క్స్ రచించిన పెట్టుబడి గ్రంథంలో ఎఎంపి గురించి విశేషంగా ప్రస్తావించారు. ఎఎంపి అనేది ఆసియా సమాజాలకు ప్రత్యేకించి ఆర్థిక వ్యవస్థ మాత్రమే కాదని, అది సామాజిక పరిణామక్రమంలో వర్గ రహిత ఆదిమ సమాజం నుంచి వర్గ సమాజం మధ్య కాలంలో పరివర్తనాత్మక ఉత్పత్తి సంబంధాల వ్యవస్థగా ఎఎంపి ఏర్పడుతుందని వారు సిద్ధాంతీకరించారు.

సామాజిక పరిణామంలో పురుషాధిపత్యం (మోనోగమీ, పితృస్వామ్యం కాదు), సొంత ఆస్తి, రాజ్యాంగ యంత్రాలు ఏక కాలంలో వర్గ సమాజ ఆవిర్భావంతో ఉనికిలోకి వచ్చాయని భౌతిక గతితర్కం వివరిస్తుంది. ఆదిమ సమాజం నుంచి వర్గ సమాజం ఏర్పడే సంధి దశలో పరివర్తనాత్మక ఉత్పత్తి సంబంధాల వ్యవస్థగా ఉనికిలోకి వచ్చే మధ్యంతర వ్యవస్థ అయిన ఎఎంపి ప్రపంచ వ్యాప్తంగా ఉనికిలోకి వచ్చింది. అయితే ఉత్పత్తి సాధనాలు ప్రకృతి సంపదగా ఏర్పడిన మలి నాగరిక సమాజాల్లో ఏర్పడిన ఎఎంపి వ్యవస్థలు వర్గ సమాజాలుగా పరిణామం చెందగా, తొలి నాగరిక సమాజాల్లో ఏర్పడిన ఎఎంపిలు గిడసబారిపోయి, చారిత్రకంగా కదంతాల్ స్థితిలో, రెండవ దశ నాగరికతలు జోక్యం చేసుకునే దాకా చారిత్రకంగా వేచి ఉన్నాయి.

ఈ నేపథ్యంలో మాత్రమే ఎఎంపి పునాదిగా నడిచే తొలి నాగరిక సమాజాలు శతాబ్దాలుగా చలనరహితంగా, స్థాణువులా కొనసాగాయని మార్క్స్ వ్యాఖ్యానించారు. ప్రతిదీ చలనశీలమైనదిగా భావించే భౌతిక గతితర్కాన్ని చారిత్రక క్రమాల్లో అన్వేషించి వెలికితీసిన మార్క్స్ సూత్రీకరణ సారాంశాన్ని అపార్థం చేసుకోవడం చారత్రక తప్పిదమవుతుంది. స్టాలిన్ కాలంలో ఎఎంపి సైద్ధాంతిక భావనను తిరస్కరించారు. నిరంకుశ రాజ్యాలు, సొంత ఆస్తిలేని ప్రజా సమూహాలు అనే నమూనా సోవియట్ యూనియన్ సోషలిస్టు సమాజానికి వర్తింపజేస్తున్న పాశ్చాత్య బూర్జువా మేధావుల విమర్శలకు స్టాలిన్ కాలంనాటి అధికారిక భావజాల కర్తలు (డయామెట్ అని పిలిచే వారు) సమాధానం చెప్పలేకపోయారు. దాంతో ఎఎంపి నమూనాను మార్క్స్ చేసిన సైద్ధాంతిక తప్పిదంగా తిరస్కరించడం చారిత్రక తప్పిదం. ఎఎంపి నమూనాను పక్కన పెడితే వర్గ సమాజ ఆవిర్భావ క్రమంలో కీలకమైన లింక్‌ను వదిలిపెట్టిన వారమవుతాం.

*(రచయిత పాత్రికేయులు)* వీ

---

*(...4వ పేజీ తరువాయి)*

*చేస్తున్నందున సంవత్సరానికి రు. 55,000 కోట్లు జమ అవుతున్నది. టోల్ బూత్‌ల వలన ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ మేనేజ్‌మెంట్ కలకత్తా వారి సర్వే ప్రకారం ఇప్పటి వరకు టోలు కలెక్షన్ బూత్‌ల వలన దేశంలో 67,000 కోట్ల డీజిల్ వృథా అయినది. దీనివలన విదేశీ మారకద్రవ్య నిల్వలపై తీవ్ర ప్రభావం పడుతుంది. ఇంతో విలువైన సమయం వృథా అవుతుంది. దీని ప్రభావం సరుకు రవాణా, పాసింజరు, రవాణా వాహనాలపై పడుతుంది.*

*అందువలన కేంద్ర ప్రభుత్వానికి టోలు పర్మిట్ల ద్వారా ప్రస్తుతం వసూలయ్యే మొత్తం కన్నా ఎక్కువ మొత్తం ముందస్తుగా చెల్లిస్తామని, దేశంలో టోల్ బ్యారియర్స్ తీసివేయాలని ఆలిండియా మోటార్ ట్రాన్స్‌పోర్ట్ కాంగ్రెస్ ద్వారా కేంద్ర ప్రభుత్వాన్ని డిమాండ్ చేస్తున్నాం. ఇండియాలో 93 లక్షల సరుకు రవాణా వాహనాలు, 50 లక్షల బస్సులు, టూరిస్ట్ క్యాబ్‌లు పాసింజర్ రవాణా వాహనాలు తిరుగుతున్నవి. ఆంధ్రప్రదేశ్‌లో విశాఖపట్నం వద్ద ఉన్న అగనంపూడి (విశాఖపట్నం – అనకాపల్లి) టోల్‌కు రు. 63.54 కోట్లు ఖర్చు చేసి 2015 మార్చ్ 31 వరకు రు. 125.8 కోట్లు వసూలు చేసినారు. సూళ్లూరుపేట వద్ద ఉన్న (తడ – నెల్లూరు) 750 కోట్లు ఖర్చు చేసి రు. 861.71 కోట్లు వసూలు చేసినారు. వేంపాడు వద్ద టోలు (అనకాపల్లి – తుని) 234 కోట్లు ఖర్చు చేసి రు. 426.11 కోట్లు వసూలు చేసినారు. కాజ వద్ద టోలు (విజయవాడ – చిలకలూరిపేట) 675 కోట్లు ఖర్చు చేసి రు. 687.48 కోట్లు వసూలు చేసినారు. (తడ – నెల్లూరు) వెంకటాచలం, భూదనం టోల్ ప్లాజాలలో కూడా పెట్టుబడికి మించిన ఆదాయం వచ్చినది.*

**– ది ఆంధ్రప్రదేశ్ లారీ ఓనర్స్ అసోసియేషన్**

*విజయవాడ*

వీ

# గణిత శాస్త్రవేత్తగా డి డి కోసంబి

*చరిత్రకారుడిగా సుప్రసిద్ధుడైన డిడి కోసంబి మౌలికంగా గణిత శాస్త్రవేత్తగా చేసిన రచనల అన్వేషణను వివరిస్తున్నారు*

**రామకృష్ణ రామస్వామి**

కొన్ని సంవత్సరాల కింద జవహర్‌లాల్ నెహ్రూ విశ్వ విద్యాలయంలోని ఒక స్నేహితుడు అక్కడి గ్రంథాలయం పాత పుస్తకాలు అమ్మేస్తున్నపుడు తనకు డిడి కోసంబి సొంత పుస్తకం ఒకటి దొరికిందని చెప్పాడు. ఆ పుస్తకాన్ని కొన్ని సంవత్సరాల్లో ఎవరూ తీసుకున్నట్టు లేరు. ఏ పుస్తకమైనా అలా ఉన్నట్టయితే, దానికి గ్రంథాలయంలో స్థలం ఆక్రమించే అర్హత లేదని తీసేస్తారు. అంటే అది 'శక్తి ఉన్నవారికే మనుగడ' అనే పరిణామవాద సిద్ధాంతం లాంటిదన్నమాట.

కోసంబి సొంత పుస్తకాల సంగ్రహం కొద్దికాలం కిందట జె ఎన్ యు కు చేరిందని, కోసంబి స్నేహితుడు, సహాయకుడు ఆర్ పి నేనే అన్నారు. ఆయన 1985 జూన్ లో ఇచ్చిన ఒక ఇంటర్వ్యూ ప్రకారం, "కోసంబి మరణం తర్వాత ఆయన కుటుంబం ఆ గ్రంథాలను జె ఎన్ యు కు రు. 75,000 కు అమ్మారని" తెలుస్తున్నది. అయితే ఇది ఎలా జరిగిందన్న వివరాలు లేవు. కోసంబి 1966లో చనిపోయారు. జె ఎన్ యు 1969లో స్థాపించారు. జె ఎన్ యు గ్రంథాలయపు తొలి పుస్తక సంచయం "ఆ తర్వాత కాలంలో జవహర్ లాల్ నెహ్రూ విశ్వవిద్యాలయంలో కలిసిపోయిన ప్రతిష్ఠాత్మక ఇండియన్ స్కూల్ ఆఫ్ ఇంటర్నేషనల్ స్టడీస్" నుంచి వచ్చింది. "జె ఎన్ యు గ్రంథాలయం ప్రభుత్వ ప్రచురణలను, ప్రపంచ ఆరోగ్య సంస్థ, యూరపియన్ యూనియన్, ఐక్య రాజ్య సమితి, దాని అనుబంధ సంస్థలు, వగైరా ముఖ్యమైన అంతర్జాతీయ సంస్థల ప్రచురణలను ప్రోది చేసుకున్న గ్రంథాలయం. అది విభిన్న శాఖలకు చెందిన పుస్తకాలు, పత్రికలు, పరిశోధనా గ్రంథాలు, సిద్ధాంత వ్యాసాలు, నివేదికలు, సర్వేలు వగైరాలను సమగ్రంగా అందుబాటులో ఉంచుతుంది" అని వెబ్ సైట్ చెపుతుంది.

కోసంబి పుస్తకాల కోసం వెచ్చించిన మొత్తం చూస్తే ఆ పుస్తకాలు చాల విలువైనవని అర్థమవుతుంది. 1960ల చివర రు. 75,000 అంటే చాల పెద్ద మొత్తం. అయినా, ఆ సంచయాన్నంతా ఒక్కచోట ఉంచకపోవడం ఆశ్చర్యకరం. ఆ పుస్తకాలను మిగిలిన అన్ని పుస్తకాలలాగే విషయాలవారీగా విడదీసిపెట్టారు. మిగిలిన గ్రంథాలయాలు చేసినట్టే కొత్త పుస్తకాలకు స్థలం సంపాదించడానికి ఒక్కొక్క విషయం మీద పుస్తకాల లోంచి అప్పుడప్పుడూ కొన్నిటిని వదిలించుకుంటూ వస్తున్నారు. (ఒకరకంగా నాకు ఆశ్చర్యకరం కానిదేమంటే, నావరకు నేనే ఆనంద కెంటిష్ కుమారస్వామి సంతకం చేసిన పుస్తకం ఒకదాన్ని ఒకసారి ప్రిన్స్ టన్ లో కొనుక్కున్నాను. మొదటి పేజి మీదనే ఎకెసి అని పెన్సిల్ తో రాసి ఉంది. ఆ సంతకం మినహాయిస్తే అది ఆయన పుస్తకమేనని చెప్పడానికి మరే ఆధారమూ లేదు. దురదృష్టవశాత్తూ ఇప్పుడు ఆ పుస్తకం నాదగ్గర లేదు గాని, నాకేమనిపిస్తుందంటే, ఏ గ్రంథాలయమైనా ప్రముఖుల పుస్తకాలు సంపాదించినప్పుడు, వాటిని యథాతథంగా ఉంచడానికి తగిన ప్రయత్నాలేమైనా చేయాలి. జె ఎన్ యు ఇటీవలి కాలంలో సంపాదించిన పుస్తకాలకు అటువంటి ఏర్పాటు చేయడం సంతోషకరం).

ఏది ఏమైనా, ఆ ఉదంతంతో మన గ్రంథాలయాల తీరుతెన్నులు, ప్రముఖుల పుస్తకాలకు గ్రంథాలయాలలో దొరుకుతున్న స్థానం మీద చర్చకు అవకాశం వచ్చింది. దానితో కోసంబి గురించి, ఆయన గణితశాస్త్ర రచనల గురించి నా అన్వేషణ మొదలయింది. పైకి చూడడానికి ఇది చాల సులభమైన పని అనిపించింది. కోసంబి చరిత్రకూ, నాణాల శాస్త్రానికీ అందించిన కానుకలతో పోలిస్తే, ఆయన గణితశాస్త్రానికి అందించిన కానుకల విస్తృతి ఏమిటి అని లెక్కపెట్టడమే నా లక్ష్యం. జె ఎన్ యు కు రావడానికి ముందు టాటా ఇన్ స్టిట్యూట్ ఆఫ్ ఫండమెంటల్ రిసర్చ్‌లో ఉన్నాను గనుక ఆయన ప్రతిరోజూ పుణె కూ బొంబాయికీ దక్కన్ క్వీన్ రైలులో ఎలా ప్రయాణిస్తుండేవారో, టిఐ ఎఫ్ ఆర్ నుంచి ఆయనను ఎలా తొలగించారో, వగైరా వగైరా కథలెన్నో విన్నాను. కోసంబి ఇతర జీవితం గురించి చరిత్రకారులకు ఎంత తక్కువ తెలుసో కూడ నాకు అర్థమయింది. గణితశాస్త్రం పూర్తిగా భిన్నమైనది, ఇంకా ఎక్కువ కష్టతరమైనదీ అనే మాట నిజమే. అయినా సరే.

మొట్టమొదట ఆయన గణితశాస్త్ర జీవితాన్నంతా, అంటే ఆయన గణితశాస్త్రం మీద, గణాంక శాస్త్రం మీద రాసిన పత్రాలన్నీ ఒక్కచోటికి తేవాలనుకున్నాను. వాటిలో చాల ఇంటర్నెట్ మీద ఉన్నాయి. కాకపోతే అక్కడొకటీ ఇక్కడొకటీగా చెల్లాచెదురుగా అనేకచోట్ల ఉన్నాయి. ఏ ఒక్క గ్రంథసూచి కూడ కచ్చితంగా లేదు. ఎక్కడ చూసినా ఖాళీలున్నాయి. ఆయన వ్యాసాలను, పత్రాలను ప్రచురించిన భారతీయ పత్రికలలో అనేకం అప్పుడూ, ఇప్పటికి కూడ డిజిటైజ్ కాలేదు. ప్రస్తుతం అందుబాటులో ఉన్న గ్రంథ సూచిలలో ఇచ్చిన పేర్లలో కొన్ని అసమగ్రంగానో, తప్పుగానో ఉన్నాయి. ఎన్నో పత్రాలు జాడలేవు. ఉదాహరణకు రోమ్ (ఇటలీ) లోని రాయల్ నేషనల్ లీంజీ అకాడమీ, బెర్లిన్ (జర్మనీ) లోని ప్రష్యన్ అకాడమీ ఆఫ్ సైన్సెస్ పత్రికలు, బెర్లిన్ నుంచి వెలువడుతుండిన ఫిజికలిష్-మాథమెటిష్ క్లాస్ వంటి పత్రికలు అసాధారణమైనవి, ప్రస్తుతం భారతదేశంలో ఎక్కడైనా సంపాదించడం అసాధ్యమైనవి. నేను 2009 చివరిరోజుల్లో చెన్నైలోని రామానుజన్ ఇన్ స్టిట్యూట్ లో జర్నల్ ఆఫ్ ది ఇండియన్ మాథమాటికల్ సొసైటీ గాని, మాథమాటిక్స్ స్టూడెంట్ పత్రిక గాని దొరుకుతాయా అని వెతకడానికి వెళ్లాను. కోసంబి 1930లలో, 40లలో ఈ పత్రికలలో ఎన్నో వ్యాసాలు ప్రచురించారు. కాని నా ప్రయత్నపు వివరాలు చెప్పడమే నిరుత్సాహకరంగా ఉంటుంది. అక్కడ ఏ ఒక్క పత్రికా దొరకలేదు. ఒక రోజంతా వృథా చేసుకుని నేను ఉట్టి చేతులతో తిరిగివచ్చాను.

అయితే, 2010లో నేను ఒక నెలరోజుల పాటు యూనివర్సిటీ ఆఫ్ టోక్యో లో విజిటింగ్ ప్రొఫెసర్ గా ఉన్నప్పుడు నా పంట పండింది. కొమాబా క్యాంపస్ లో నాకు ఆశ్రయం దొరికింది. అక్కడే గణితశాస్త్ర విభాగం ఉంది. అన్నిటికన్న ముఖ్యంగా గ్రంథాలయం అక్కడే ఉంది. అక్కడ కొద్దిరోజులు, కొన్ని గంటలు గడిపితేనే, ఎక్కువ సమయం వెచ్చించకుండానే, కోసంబి రాసిన ఎన్నో పత్రాలు ఫొటోకాపీలు గాని, డిజిటల్ రూపంలో గాని దొరికాయి. అలాగే మాథ్ సైనెట్ (ఓజీబిష్ఠూఇతిఔవబి) అనే ఇంటర్నెట్ వేదిక ద్వారా నాకు కోసంబి ఎస్ డుక్రే అనే కలం పేరుతో కూడ రాశారని తెలిసింది. ఆ పేరుతో ఆయన నాలుగు పత్రాలు ప్రచురించారు. అంతేకాదు, ఆయన రాసిన గణితశాస్త్ర పత్రాలపైన ఇతరులు రాసిన సమీక్షలు, వ్యాఖ్యలు కూడ నాకు దొరికాయి. అ సమీక్షకులలో, వ్యాఖ్యాతలలో ఎందరో సుప్రసిద్ధులు ఉన్నారు. ఇక్కడే మరొక అంశం కూడ చెప్పాలి. జర్నల్ ఆఫ్ ది ఇండియన్ మాథమాటికల్ సొసైటీ, మాథమాటిక్స్ స్టూడెంట్ పత్రికల సంపూర్ణ సంపుటాలు ఉన్న అతి తక్కువ గ్రంథాలయాలలో టోక్యో యూనివర్సిటీ లైబ్రరీ కూడ ఒకటి. అప్పుడు జరుగుతున్న రెండో ప్రపంచ యుద్ధంలో జపాన్, భారతదేశం వైరిపక్షాలుగా ఉన్నప్పటికీ భారతదేశంలో అప్పుడు ప్రచురితమైన ఎన్నో గ్రంథాలు, పత్రికలు అక్కడ ఉన్నాయి.

కోసంబి ఇంగ్లిష్ తో పాటు జర్మన్ లోనూ, ఫ్రెంచి లోనూ కూడ వ్యాసాలు రాశారు. అప్పటికప్పుడే జపనీస్, చైనీస్ భాషల అనువాదాలు ప్రచురితమయ్యాయి. అనువాదాలే మొదటిసారి ప్రచురితమయ్యాయి కూడ. మొత్తం మీద ఆయన గణితశాస్త్రం మీద, గణాంకశాస్త్రం మీద రాసిన పత్రాలు 67 ఉంటాయని గుర్తించి, వాటి శీర్షికల జాబితా తయారు చేశాను. ఇక ఆ పత్రాలన్నీ ఒకటొకటిగా అచ్చుప్రతులు సంపాదించడానికి పూనుకున్నాను. కొన్ని సంపాదించడం చాల సులభం – న్యూఢిల్లీలో పూసా రోడ్ లో ఉన్న ఇండియన్ సొసైటీ ఫర్ అగ్రికల్చరల్ స్టాటిస్టిక్స్, ఇండియన్ అకాడమీ ఆఫ్ సైన్సెస్ వాటి దగ్గర ఉన్న సంచయాన్నంతటినీ డిజిటైజ్ చేసిపెట్టాయి. మరి కొన్నిటి విషయంలో నేను అదృష్టవంతుణ్ననే చెప్పాలి. సప్పోరో లోని హ్కొక్కైడో యూనివర్సిటీ నన్ను ఆహ్వానించింది. అక్కడి నుంచే టెన్సర్ (కొత్త కూర్పు) పత్రిక ప్రచురితమయ్యేది. అక్కడ ఆయన రాసిన రెండు పత్రాలు నాకు దొరికాయి. అలాగే పని మీద నేను తైపే లోని అకాడమియా సినికాకు వెళ్లవలసి వచ్చినప్పుడు, ఆయన మొట్టమొదట చైనీస్ లోనే ప్రచురించిన పత్రం ఒకటి దొరికింది. నా పాత విద్యార్థి ఒకరు పారిస్ నుంచి కాంప్టి రెండ్యు లో అచ్చయిన రెండు ఫ్రెంచి పత్రాలు పంపించారు. జెస్టార్ లో గతంలో పనిచేసిన మిత్రులొకరు ప్రష్యన్ అకాడమీ జర్నల్ లో అచ్చయిన వ్యాసం ఒకటి పంపారు. మరొక పాత విద్యార్థి షికాగో నుంచి న్యూ ఇండియన్ ఆంటిక్వరీ లో అచ్చయిన పత్రమొకటి పంపారు. ఇంత బృహత్తరమైన అంతర్జాతీయ ప్రయత్నం బహుశా అనవసరమైనదేమో. నాకు శాస్త్ర చరిత్ర అధ్యయనంలో సరైన శిక్షణ ఉండి ఉంటే ఇంత కష్టపడకుండానే ఈ దేశంలోనే కొంత సమాచారం దొరికేదేమో. కాని అది జరుగుతున్నప్పుడు నాకు చాల సరదాగా, ఆసక్తిగా ఉండింది. ఐనా ఎట్లాగూ అది నా అసలు పనికి కొసరే గదా....

మొత్తానికి చిట్టచివరికి చూస్తే కోసంబి రాసిన రెండు రచనలు మాత్రమే, అవి కూడ పుస్తకాలు మాత్రమే, నాకు దొరకలేదని తేలింది. ఒకటి ఆయన మరణానికి కొద్ది రోజుల ముందే ప్రచురణకర్తలకు పంపారు. ప్రైమ్ నంబర్స్ (అభేద్య సంఖ్యలు ? మరే అంకెతోనూ విభజించడం సాధ్యం కాని సంఖ్యలు) మీద రాసిన ఆ పుస్తక ప్రతి ఎక్కడా దొరకలేదు. అది ఏమైందో వెతకడానికి అప్పట్లో ఎవరూ ప్రయత్నించలేదు. ఇప్పుడైతే కాలాతీతమైపోయింది. పాథ్ జామెట్రీ (ఒక క్షేత్రంలో వేరువేరు బిందువుల మధ్య ఉండగల వేరువేరు రేఖలను అధ్యయనం చేసే రేఖాగణిత విభాగం) మీద రాసిన మరొక పుస్తకాన్ని ప్రిన్స్ టన్ లోని ఇన్ స్టిట్యూట్ ఫర్ అడ్వాన్స్ డ్ స్టడీలోని మార్స్ టన్ మోర్స్ కు పంపించారు. అది కూడ ప్రచురణ కాలేదు. అనుకోకుండా నాకు 2004–05లో ఒక సంవత్సరం అక్కడ ఉండే అవకాశం వచ్చింది. అక్కడ నేను మోర్స్ సతీమణిని కలిశాను. మోర్స్ 1977లోనే మరణించారు గాని ఆయన వదిలివెళ్లిన కాగితాలలో ఈ పుస్తకం గురించిన సమాచారం ఏమైనా ఉందా అని కనుక్కోవడానికి ఆమెకు రాశాను. అప్పటికే ఆమె తన వందవ సంవత్సరంలో ఉన్నారు. అయినా ఈ పుస్తకం కోసం వెతికారు గాని, అది దొరకలేదు. ఈ రెండు "అదృశ్యమైన రచనలు" మినహాయిస్తే, మిగిలిన పత్రాలన్నీ ఇవాళ అందుబాటులో ఉన్నాయి. డి డి కోసంబి రాసిన పత్రాల జాబితా ఇండియన్ అకాడమీ ఆఫ్ సైన్స్ ఫెలోల రచన సంగ్రహాలయంలో ఉంది. కోసంబి ఆ అకాడమీ ఫెలోగా 1935లో ఎన్నికయ్యారు.

ఇక నేను ఇంకా టోక్యోలో ఉండగానే ఇమెయిల్ ద్వారా మీరా కోసంబికి పరిచయమయ్యాను. ఆమె నన్ను టోక్యో యూనివర్సిటీలో చరిత్ర శాఖ నుంచి పదవీ విరమణ పొందిన ప్రొఫెసర్ టోషియో యమజాకి కి పరిచయం చేశారు. ఆయన దక్కన్ కాలేజిలో 1950ల చివరా, 1960ల మొదట్లో నేరుగా డిడి కోసంబికి, ఎచ్ డి సంకాలియాకు శిష్యుడిగా ఉన్నారు. ఒకరోజు ఉదయం ఆయనను కలుసుకున్నాను. కాఫీ తాగుతూ కోసంబి గురించీ, యమాజాకి భారతదేశపు అనుభవాల గురించీ మాట్లాడుకున్నాం. మీరా కోసంబిని కలవడం (ఆమె ఎప్పుడూ తనను మీరాతాయి – మీరా అక్క – అని పిలవాలనేది) నా ప్రయత్నాన్ని ఒక ముఖ్యమైన మలుపు తిప్పింది. ఒకటేమంటే, తన తండ్రి గణితశాస్త్రానికి అందించిన కానుకల గురించి, గణితశాస్త్రవేత్తలలో ఆయనకు ఉన్న పేరు ప్రఖ్యాతులు ఆమెకు చాలవరకు తెలియవని గుర్తించి, నా కృషి ఎంత ముఖ్యమైనదో నాకు అర్థమైంది. ఆమెతో జరిపిన కొన్ని సంభాషణల్లోనే నాకు ఎన్నో విషయాలు తెలిసివచ్చాయి. ఉదాహరణకు కోసంబి ఎప్పుడూ పి ఎచ్ డి కి ఎందుకు ప్రయత్నించలేదో తెలిసింది. వారి కుటుంబం పెంచుకున్న కుక్క బోంజో గురించి తెలిసింది. అది బాగా బలిసిపోవడం చూసి దాన్ని కోసంబి పంది (మరాఠీలో దుక్కెర్) అని పిలిచేవారని తెలిసింది. ఆయన గురించి నాకు తెలిసినదంతా కలిపి కోసంబి గణితశాస్త్ర వారసత్వం గురించి 2012లో ఎకనమిక్ అండ్ పొలిటికల్ వీక్లీలో రాసిన వ్యాసంలో ఇలా అన్నాను:

"ఇవాళ చరిత్రకారుడిగా డి డి కోసంబి ప్రాధాన్యత కింద గణితశాస్త్రానికి ఆయన అందించిన కానుకల పేరుప్రఖ్యాతులు కనబడకుండా పోతున్నాయి. కోసంబి తన పరిణత జీవితంలో ఎక్కువ భాగం ఈ రెండు రంగాలలోనూ ఏకకాలంలో పనిచేశారు. సామాజిక శాస్త్రాలలోనైనా, గణితశాస్త్రంలోనైనా ఆయన రచనాసర్వస్వాన్ని అర్థం చేసుకోవాలంటే ఆయన ఆసక్తులలోని పరస్పర పూరకత్వాన్ని అర్థం చేసుకోవాలి. చరిత్రకారుడిగా కోసంబిని గురించి అవగాహన, గణితశాస్త్రజ్ఞుడిగా కోసంబి గురించి అవగాహనతోనే సంపన్నమవుతుంది. ఒక మౌలికమైన పద్ధతిలో కోసంబి బహు శాస్త్ర దృక్పథాన్ని

అవలంబించారు. విభిన్న ఆసక్తులను వ్యక్తీకరించారు. నిజం చెప్పాలంటే విభిన్న ఆసక్తులను ఏకం చేసి మరింత ఉన్నతమైన విద్వత్తును సృష్టించారు."

ఈ వ్యాసమే ఆ సంవత్సరం మీరా కోసంబి సంపాదకత్వం వహించిన అన్ సెట్లింగ్ ది పాస్ట్ అనే పుస్తకంలో పునర్ముద్రణ కూడ అయింది. బహుశా తనకు ఎక్కువ సమయం లేదనే ఎరుకతో కావచ్చు, ఆమె తన తండ్రి మేధో వారసత్వ సంపదనంతా ఒక్కచోటికి తేవాలని చాల తొందర పడ్డారు. అమె ఎల్లప్పుడూ తనకు తాను చాల ఉన్నత ప్రమాణాలు పెట్టుకుని, బహుశా అన్యాయంగా, తనను తాను తక్కువగా చూసుకున్నారు. కోసంబి శతజయంతి తర్వాత ఆమె ఎంత త్వరితగతిన పుస్తకాలు ప్రచురించారంటే కోసంబి రచనల అనువాదాలు, ఆయన ఆత్మకథ 'నివేదన్', స్వాతంత్ర్యానికి ముందు మరాఠీ నాటకరంగం, సినిమా రంగాలపై 'జెండర్, కల్చర్ అండ్ పర్ఫార్మెన్స్', సామాజిక చరిత్ర గురించి స్త్రీవాద వ్యాస సంకలనం 'క్రాసింగ్ థ్రెషోల్డ్స్', చరిత్రను, సంబంధాలను అన్వేషించిన 'మహాత్మా గాంధీ అండ్ ప్రేమ కంటక్', మరాఠీ సాహిత్యానికి కాశీబాయి కనిట్కర్ సేవల గురించి 'ఫెమినిస్ట్ విజన్ ఆర్ ట్రెజన్ అగెనెస్ట్ మెన్'... ఇలా నాకు ఆమె పరిచయమైన ఐదు సంవత్సరాల్లోనే పది పుస్తకాలు ప్రచురించారు. ఎప్పుడు చూసినా ఆమె ఒక పుస్తకం రాస్తూనే ఉండేవారు. ఆమెను సన్నిహితంగా చూసినవాళ్ళు చెప్పిన ప్రకారం మృత్యువు సమీపిస్తున్నదని తెలిసిన తర్వాత ఆమె తానప్పటికి రాస్తున్న 'పండిత రమాబాయి: లైఫ్ అండ్ లాండ్ మార్క్ రైటింగ్స్' పుస్తకం పూర్తి చేసిగాని వెళ్లిపోనని అనేవారట.

మీరా కోసంబి తన దగ్గర ఉన్న డిడి కోసంబి కాగితాలనూ రచనలనూ అన్నిటినీ నెహ్రూ మెమోరియల్ మ్యూజియం అండ్ లైబ్రరీకి విరాళంగా ఇచ్చారు. అక్కడయితేనే వాటికి సక్రమమైన రక్షణ దొరుకుతుందని ఆమె అనుకున్నారు. కాని అదృష్టవశాత్తూ ఆ కాగితాలను నేనూ, నా కన్న ముఖ్యంగా పుణె లోని నేషనల్ సెంటర్ ఫర్ రేడియో ఆస్ట్రో ఫిజిక్స్ డైరెక్టర్ రాజారాం నిత్యానంద చూసిన తర్వాతనే పంపుతానన్నారు. ఆ క్రమంలో రాజారాం ఆ పత్రాల్లో చాలభాగం డిజిటైజ్ చేశారు. ఆ పత్రాల్లో కనిపెట్టవలసినవీ, ఆవిష్కరించవలసినవీ అసంపూర్తిగా వదిలేసిన చిత్తుప్రతులు, ప్రచురణ కాని వివరణలు, ఉత్తరాలు వంటివెన్నో ఉన్నాయి.

ప్రత్యేకంగా, ఎన్నో వ్యాసాల, వివరణల టైపు ప్రతులున్నాయి. హార్వర్డ్ విశ్వవిద్యాలయంలో అండర్ గ్రాడ్యుయేట్ విద్యార్థిగా ఆయన పాఠాలు వింటూ రాసుకున్న నోట్స్ నిండిన నోట్ బుక్స్ కూడ ఉన్నాయి. అవి కేవలం గణితశాస్త్రపు నోట్ బుక్స్ మాత్రమే కాదు, మేధో విశ్లేషణకు అవకాశం ఇచ్చే సమాచారం ఎంతో ఉంది. ఉదాహరణకు, సి వి రామన్ మీద ఆయన రాసిన వ్యాసం ఉంది. దానిలో సగభాగం, బహుశా అంగీకరించదగిన భాగం, "ఇండియన్ సైంటిస్ట్" అనే కలం పేరుతో 1945లో పీపుల్స్ వార్ పత్రికలో అచ్చయింది. మిగిలిన సగం బైటికి రాకపోతేనే బాగుండునని అది చదివిన వాళ్లలో చాలమంది అనుకున్నట్టున్నారు. అలాగే ఎన్నో వ్యాసాలలో మార్పులూ చేర్పులూ చేసిన టైపు ప్రతులున్నాయి.

ఇక ఎన్నో ఉత్తరాలున్నాయి. ఇమెయిల్ రాకముందు రోజుల్లో చాల మంది లాగనే డిడి కోసంబి కూడ పెద్దపెద్ద ఉత్తరాలు రాసేవారు. ఆయన తొలి యవ్వనంలోనూ, యవ్వనంలోనూ ఎంతోమందితో స్నేహం చేశారు. సుదీర్ఘకాలం కొనసాగించారు. ఆ స్నేహితులు ఆయనకు జీవితాంతం తోడు నిలిచారు. ఆయన ఆర్ జె కాంక్లిన్స్ కు రాసిన ఉత్తరాల్లో కొన్ని అన్ సెట్లింగ్ ది పాస్ట్ పుస్తకంలో అచ్చయ్యాయి. భారతదేశంలో స్వాతంత్ర్యోద్యమం బలపడుతున్నప్పుడు 1930ల నాటి అసాధారణమైన, కొంతవరకు అమెరికన్ అవగాహనలను ఇవి ప్రతిఫలిస్తాయి. ఆయనకు నార్బర్ట్ వీనర్ సన్నిహిత మిత్రుడిగా ఉన్నారు. వృత్తిపరంగా ఆయన ఆంద్రీ వెయిల్ తో జీవితాంతం సన్నిహితంగా ఉన్నారు. కొద్దికాలం పాటు ఎలీ కార్టన్ తోనూ, టులియో లెవి-సివిటా తోనూ సన్నిహితంగా ఉన్నారు. వారి మధ్య నడిచిన ఉత్తరాల్లో, లభ్యమవుతున్న ఉత్తరాల్లో ఏముందో చూడవలసే ఉంది. అలాగే దివ్యభూషణ్ సింగ్ చావడాకు ఆయన రాసిన ఉత్తరాలు కూడ చూడవలసి ఉంది. ఈ ఉత్తరాల ద్వారా వెలికివచ్చే డిడి కోసంబి చిత్రం మరకలతోనూ, మెరుపులతోనూ కూడ స్వీకరించవలసిందే. తనకు ఉండిన ఎన్నో ప్రతిభలతో పాటు, మేధతో పాటు వ్యక్తిగత రాగద్వేషాల గురించి కూడ ఆయనకు బాగానే తెలుసు. రాజీ పడితే, విద్యాపరంగానైనా ఇతరులతో కలిసి పనిచేయడానికి అంగీకరించి ఉంటే మరెంత సాధించగలిగి ఉండేవారో చూడడానికి ఆయన నిరాకరించారు. అలా ఉన్నందుకు ఆయనేమీ చింతించలేదు, ఆత్మవిమర్శ చేసుకోలేదు. అడ్వెంచర్ ఇంటు ది అన్ నోన్ అనే తన ఆత్మకథాత్మక వ్యాసం చివరలో రీమాన్ పరాజయ ఉదంతం గుంచి రాస్తూ, తనను తాను సమర్థించుకుంటూ, కాస్త ఎక్కువగానే తనమీద తాను జాలిపడుతూ ఆయన ఇలా రాశారు:

"నా మొదటి సమర్పణలోనే చేయగల తప్పులన్నీ చేశానని ఒప్పుకోక తప్పదు. దానికి సమర్థన ఏమీ లేదు. కాకపోతే చాల బలమైన కారణాలున్నాయని చెప్పగలను. చిరకాలంగా నన్ను బాధిస్తుండిన కీళ్లవ్యాధి వేదన వలయాల మధ్య, ప్రతిరోజూ మింగవలసిన భారీ అస్పిరిన్ మాత్రల మధ్య, తల పగిలిపోయే నొప్పితో, జ్వరంతో, ఏ సహాయమూ అందక, ఎప్పటికప్పుడు నిస్పృహలో కూరుకుపోతూ నేను నా ఫలితాల కోసం మూడు సంవత్సరాలు సుదీర్ఘంగా పోరాడవలసి వచ్చింది. మౌలిక గణితశాస్త్ర ఆవిష్కరణ చేసేవారికన్న, మరొకరి నిరూపణలోని ప్రధానాంశాన్ని సరిగ్గా చూడగల మంచి గణితశాస్త్రవేత్తలు దొరకడం కష్టంగా ఉండేది. దీనికి నా పెడసరపు వ్యక్తిత్వం ఎంత కారణమో, కొన్ని "సంపన్న సమాజపు" దేశాల గణితశాస్త్రవేత్తల అజమాయిషీలో మధ్యయుగాల వృత్తిశ్రేణుల కఠినమైన పద్ధతులు కొనసాగడం ఎంత కారణమో ఇక్కడ పరిశీలించనక్కరలేదు. శాస్త్ర విజయాన్ని ఆ సమాజపు ప్రత్యేక రూపమే మౌలికంగా నిర్ణయిస్తుందనే భావన గురించి మాట్లాడుకోవలసింది ఎంతో ఉంది."

డిడి కోసంబి గురించి అటు చరిత్రకారుల, ఇటు గణితశాస్త్రవేత్తల అంతర్గత అభిప్రాయం పెద్దగా తెలియని నేను ఎన్నో విషయాలు కొత్తగా కనిపెట్టవలసి వచ్చింది. ఉదాహరణకు ఆయన వాడిన కలం పేర్ల గురించి. ఆయన రచనల వైవిధ్యాన్ని బట్టి చూస్తే ఈ కలం పేర్ల గురించి నిశితమైన పరిశోధనే జరపాలని అనిపిస్తున్నది. ఆయన ఇలా ఎన్నో కలం పేర్లు ఎందుకు వాడారనేందుకు నావరకు నాకు ఒక బలహీనమైన ప్రతిపాదన ఉంది. మూడు వ్యాసాలను ఆయన అహ్రిమన్, విద్యార్థి, ఇండియన్ సైంటిస్ట్ అనే పేర్లతో ప్రచురించారు. ఆ తర్వాత ఎస్ దుర్క్రే అనే నిజమైన వ్యక్తి అనిపించే పేరును సృష్టించి 1960ల మొదట్లో కనీసం నాలుగు విద్యాసంబంధమైన పత్రాలకు ఆ పేరును వాడారు. ఈ లోగా, తన సొంత పేరుతోనే 1963లో మిథ్ అండ్ రియాలిటీ, 1965లో ది కల్చర్ అండ్ సివిలిజేషన్ ఆఫ్ ఏన్షియెంట్ ఇండియా ఇన్ హిస్టారికల్ ఔట్ లైన్ ప్రచురించారు. ఎంపిక చేసిన శాస్త్ర పత్రికలకు

# చైనా మీద సాంస్కృతిక విప్లవ ప్రభావం

***చైనాలో మహత్తర శ్రామికవర్గ సాంస్కృతిక విప్లవం ప్రారంభమై మే 16కు యాభై సంవత్సరాలు నిండిన సందర్భంగా, సాంస్కృతిక విప్లవ ప్రభావాల గురించి వివరిస్తున్నారు* డాంగ్ పిన్ హాన్**

తన మరణానికి ముందు ఒక చిన్న సందర్శకుల బృందంతో మాట్లాడుతూ మావో తన జీవితకాలంలో తాను రెండు విజయాలు సాధించానని అన్నారట. మొదటిది చైనా ప్రజా రిపబ్లిక్ ను స్థాపించడం. జపాన్ దురాక్రమణకు ముందు పది సంవత్సరాలు జియాంగ్ జియెషి పాలనకు వ్యతిరేకంగా, ఆ తర్వాత ఎనిమిది సంవత్సరాలు జపాన్ దురాక్రమణకు వ్యతిరేకంగా, తర్వాత మరో మూడు సంవత్సరాలు మళ్లీ జియాంగ్ జియెషి పాలనకు వ్యతిరేకంగా పోరాడి మొదటి విజయం సాధించారు.

రెండో విజయం మహత్తర శ్రామికవర్గ సాంస్కృతిక విప్లవాన్ని ప్రారంభించడం. 1949లో అధికారానికి వచ్చిన తర్వాత కమ్యూనిస్టు పార్టీలోని అధికారిక శ్రేణుల్లోనే విలాసవంతమైన జీవితం పట్ల మోజు పెరగడం మావోను ఆందోళన పరచింది. అధికారానికి వచ్చిననాటి నుంచీ కూడ ఆయన పార్టీలోపల పెరుగుతున్న అవినీతి ధోరణులకు వ్యతిరేకంగా ఎన్నో రాజకీయ పోరాటాలు నడిపారు. తన పాత సహచరులకు సంకేతం పంపేందుకు ఆయన ఝూంగ్ జిషాన్, లియూ కింగ్షాన్ వంటి అత్యున్నతాధికారులకు మరణశిక్ష విధించాలనే ఉత్తర్వులు కూడ ఇచ్చారు. కాని ఈ రాజకీయ పోరాటాలు, మరణశిక్షలు కూడ అవినీతి సమస్యను సరిగ్గా ఎదుర్కోలేకపోయాయి. ఆ సందర్భంలో, 1966లో తన 73వ ఏట మావో తన సహచరులతో కలిసి మహత్తర శ్రామికవర్గ సాంస్కృతిక విప్లవానికి పిలుపునిచ్చారు. చైనా ప్రజలకు అధికారం ఇచ్చి, కమ్యూనిస్టు పార్టీలోని అధికారిక అవినీతిని ఓడించే పోరాటంలో ఇదే చివరి అవకాశమని ఆయన అనుకున్నారు.

తాను సాధించిన రెండు కీలక విజయాలలో ఒకటిగా మావో సాంస్కృతిక విప్లవాన్ని ప్రస్తావించడానికి కారణం చైనా చరిత్ర గమనం మీద దానికి ఉన్న ప్రగాఢమైన ప్రభావమే. అది ప్రవేశపెట్టిన విద్యారంగ సంస్కరణలు, అది అమలు చేసిన ప్రజాస్వామిక ప్రయోగమూ ఆ ప్రభావానికి కారణాలు. లేచి నిలవడానికీ, చైనా సమాజాన్ని అంతకు ముందు మానవ చరిత్రలో కనీవినీ ఎరగని రీతిలో ప్రజాస్వామికీకరించడానికి చైనా ప్రజలకు సాంస్కృతిక విప్లవం ప్రేరణనిచ్చింది. సాంస్కృతిక విప్లవం చైనాలో మాత్రమే కాదు, చైనాకు బైట కూడ ఒక తరం యువజనులకు గొప్ప ప్రేరణగా నిలిచింది. యూరప్, అమెరికా, జపాన్, మరెన్నో దేశాల కళాశాలల విద్యార్థులు చైనాలోని యువజనుల లాగనే యథాస్థితి మీద తిరుగుబాటు ప్రకటించారు, సమాజం మీద తమ ప్రభావాన్ని ప్రదర్శించారు. ప్రపంచ చరిత్ర గమనం మీద ప్రభావం

---

గణితశాస్త్ర పత్రాలనూ ఆ పేరుతోనే పంపించారు. స్నేహితులకు రాసిన ఉత్తరాల్లో కూడ కోసంబి దుక్రే అని సంతకం చేశారు. జర్నల్ ఆఫ్ ది యూనివర్సిటీ ఆఫ్ బాంబే లో అచ్చయిన ఒక పత్రంలో, రచయిత పేరు దుక్రే అని ఉండగా, "ప్రొఫెసర్ కోసంబి సహాయం స్పష్టంగా తెలిసినదే" అని వివరణ ఉంది. మరొక పత్రంలో కృతజ్ఞతల స్థానంలో, "ప్రొఫెసర్ డి డి కోసంబి నిరంతర కృషి లేకపోతే ఈ పత్రం రాయడం సాధ్యమయ్యేది కాదు" అని ఉంది.

ఇది చిత్రమే. ఇప్పటికే ఎన్నోసార్లు చెప్పుకున్నట్టు గణితశాస్త్ర సాహిత్యంలో బౌర్బాకి అనే పేరు మొదటిసారి ప్రస్తావనకు రావడానికి కారకుడు కోసంబినే. ఎక్కువమంది ఫ్రెంచి వారితో సహా ఎందరో గణితశాస్త్రవేత్తల ఉమ్మడి కలం పేరు అది. అసలు గణితశాస్త్రమే అమూర్తమైనదంటే, దానికి ఇటువంటి కాల్పనిక పేరు పెట్టడం హాస్యచతురతలో భాగమేననాలి. కాని దుక్రే విషయం అలా కాదు. ఆయన మీద చాల గౌరవప్రపత్తులున్న జీవితచరిత్ర కారుడి కళ్ల నుంచి చూసి అది ఏదో చిన్నపిల్లల ఆట కంటె మరేమీ కాదని కూడ చెప్పలేం.

కోసంబి గురించి ఇంకా చాల పని చేయవలసి ఉందనీ, అది కేవలం ఆయన రచనలన్నిటినీ ఒక్కదగ్గరికి తేవడం కన్న మించినదనీ స్పష్టమే. ఈ బ్లాగ్ స్పాట్ నాగురించి నేను చెప్పుకోవడానికి కాదు, ఆయన రచనలను వెలికితీసి ప్రచురించడానికి. ఆయన కాగితాల్లో దొరికిన రెండు పత్రాలు నేను సంపాదకత్వం వహించిన అడ్వెంచర్స్ ఇంటు ది అన్ నోన్ లో మొదటిసారి అచ్చయ్యాయి. నేను సేకరించిన కోసంబి రచనల ప్రచురణ పని సాగుతున్నది. బహుశా అవి సెలెక్టెడ్ వర్క్స్ ఇన్ మాథమాటిక్స్ అండ్ స్టాటిస్టిక్స్ రూపంలో వెలువడుతాయి.

59 సంవత్సరాలు మాత్రమే జీవించిన స్వల్ప కాలంలో డిడి కోసంబి ఎన్నో మేధో అన్వేషణా రంగాలలో చాల మౌలిక, ప్రాథమిక కానుకలను అందించారు. ప్రొమీథియన్ కానుక అనే మాట కోసంబికి సరిగ్గా సరిపోతుంది. అయితే దేవతలు అటువంటి కానుకలు ఇచ్చినప్పుడు చాలమందికేమీ ఇవ్వరు. ఇచ్చినా చాలమూల్యం చెల్లించవలసి ఉంటుంది.

"కరవాలాలతోనో, శూలాలతోనో ఎదుర్కోవడానికి దేవతలేమీ సాయుధ కవచ శిరస్త్రాణధారులై రారు వారు ధ్వంసించదలచుకున్నవాళ్లను మొదట పిచ్చివాళ్లుగా మార్చి వస్తారు" అని ఏడో శతాబ్ది కవి భర్తృహరి అన్నమాట కోసంబికి తెలిసే ఉంటుంది. ఆయన భర్తృహరి మీద మూడు కీలకమైన రచనలు చేశారుగదా.

*http://ddkosambi.blogspot.in/2016/04/reality-and-myth.html#more*

*(రచయిత శాస్త్రవేత్త, హైదరాబాద్ సెంట్రల్ యూనివర్సిటీ వైస్ చాన్సలర్‌గా కొద్దికాలం పనిచేశారు. ఢిల్లీ జవహర్‌లాల్ నెహ్రూ యూనివర్సిటీలో ప్రొఫెసర్)*

చూపారు. సాంస్కృతిక విప్లవం తర్వాత ప్రపంచం అంతకు ముందు లాగ లేదు.

### విద్యారంగ సంస్కరణలు

మహత్తర శ్రామికవర్గ సాంస్కృతిక విప్లవం ప్రాథమికంగా, ప్రధానంగా ఒక విద్యారంగ సంస్కరణ. అది కళాశాలల ప్రవేశ పరీక్షా పద్ధతిని మార్చేసింది. అంతకుముందు బడికి వెళ్లే వయసున్న పిల్లల్లో అతి కొద్దిమంది మాత్రమే మాధ్యమిక పాఠశాలకూ, ఇంకా తక్కువ మంది ఉన్నత పాఠశాలకూ వెళ్లేవాళ్లు. మరింత తక్కువమంది కళాశాలకు వెళ్లేవాళ్లు. కళాశాలకు వెళ్లగలిగినవాళ్లలో అత్యధికులు అధికారాలూ అవకాశాలూ ఉన్న కుటుంబాల నుంచే ఉండేవారు. అత్యధిక సంఖ్యాక ప్రజానీకానికి కళాశాల విద్య అలా ఉంచి ఉన్నత పాఠశాల విద్యే అందని చందమామగా ఉండేది. కమ్యూనిస్టు పార్టీ అధికారానికి వచ్చిన 17 సంవత్సరాల తర్వాత కూడ విశాల గ్రామీణ ప్రాంతాలలో ప్రజలకు విద్య అందుబాటులోకి రాకుండానే ఉండిపోయింది. అంతకు ముందరి జాతీయ ప్రభుత్వం నుంచి వారసత్వంగా వచ్చిన విద్యావిధానంలో కమ్యూనిస్టు ప్రభుత్వం పెద్ద మార్పులేమీ చేయలేదు. అంటే భవిష్యత్తు పాలకవర్గం, రైతుల, కార్మికుల పిల్లలకు అందుబాటులోలేని కళాశాలల్లో శిక్షణ పొందుతుండేది.

కళాశాలల ప్రవేశ పరీక్షా పద్ధతిని రద్దు చేయమని సాంస్కృతిక విప్లవ సమయంలో బీజింగ్ విద్యార్థులు ప్రకటించిన ఆకాంక్షకు ప్రభుత్వం స్పందించి ప్రవేశ పరీక్షా పద్ధతిని రద్దు చేసింది. విద్యారంగ సంస్కరణలు ప్రారంభించింది. ఈ సంస్కరణల వల్ల కళాశాలల విద్యార్థుల ఎంపిక కేవలం ప్రవేశ పరీక్ష మీద ఆధారపడే పద్ధతి తొలగిపోయింది. దాని బదులు ఉన్నత పాఠశాల పూర్తయ్యాక విద్యార్థులు రెండు సంవత్సరాల పాటు ఏదైనా కార్ఖానాలో గాని, లేదా గ్రామీణ ప్రాంతాల్లో వ్యవసాయక్షేత్రాల్లో గాని, సైన్యంలో గాని పనిచేయాలనే నియమం వచ్చింది. ఆ తర్వాతే వారికి ప్రవేశ పరీక్షకు అర్హత వస్తుంది. పరీక్షల గురించి ఝూంగ్ టైషెంగ్ నిరసన తెలిపినతర్వాత 1973లో మొత్తంగా ఈ ప్రవేశ పరీక్షల పద్ధతినే రద్దు చేశారు. విద్యార్థుల పని తీరును బట్టి వారు కళాశాలకు అర్హులవుతారో లేదో వారు పనిచేసిన ప్రాంతపు కార్మికులు, రైతులు నిర్ణయించేవారు. 1976లో ఈ పద్ధతికి మరొక మార్పు చేశారు. కళాశాల చదువు పూర్తయిన తర్వాత ఆ విద్యార్థులు తాము వచ్చిన ప్రాంతానికే తిరిగివెళ్లి తమను కళాశాలకు పంపిన సమాజానికి సేవచేయడం తప్పనిసరి చేశారు.

ఈ పద్ధతి నిరాటంకంగా కొనసాగి ఉంటే, కళాశాల అంటే భావి పాలకులను తయారుచేసే ఉన్నతవర్గ శిక్షణాలయం అనే పాత పద్ధతి క్రమక్రమంగా రూపుమాసిపోయి ఉండేది. ఒక కొత్త రకమైన కళాశాల విద్యావంతులు ఏర్పడి ఉండేవారు. సొంత కీర్తి కోసమో, డబ్బు కోసమో కాక సమాజ సేవకు అంకితమైన కొత్త పాలకవర్గం తయారై ఉండేది. కార్మిక, కర్షక, సైనిక కళాశాల విద్యార్థులు అనే పద్ధతిలో వచ్చిన విద్యార్థులు చైనాలో ప్రారంభమైన గొప్ప విద్యా సంప్రదాయం అని నా ఉద్దేశం. కాని అన్యాయంగా ఈ కార్మిక, కర్షక, సైనిక విద్యార్థి పద్ధతిని అర్థాంతరంగా 1977లో ఆపివేశారు. మావో అనంతర చైనా ప్రభుత్వ నాయకులు ఈ పద్ధతిలోని సుగుణాలను నిరాకరించారు. తాము ప్రారంభించిన సాధారణ తిరోగమనానికి అనుగుణమైన విద్యావ్యవస్థే ఉండాలనుకున్నారు.

విద్యారంగంలో మరింత గంభీరమైన మార్పు చైనాలోని ప్రాథమిక, మాధ్యమిక, ఉన్నత పాఠశాలల్లో జరిగింది. సాంస్కృతిక విప్లవానికన్న ముందు విద్యావ్యవస్థ విద్యారంగ నిపుణుల బాధ్యతగా మాత్రమే ఉండేది. ఈ విద్యారంగ నిపుణులు విద్యలో కొన్ని రకాల ప్రమాణాలుండాలని మాత్రమే వాదించేవారు గాని, చైనాలో మరింత ఎక్కువమంది ప్రజలకు అందుబాటులోకి వచ్చేలా విద్యావిధానాన్ని విస్తరించాలని ఆశించేవారు కాదు. ప్రమాణాల మీద ఎక్కువ శ్రద్ధపెడుతూ వారు తమకు తెలియకుండానే అసంఖ్యాక ప్రజానీకానికి విద్య అందుబాటులోకి రాకుండా పరిమితం చేశారు. సాంస్కృతిక విప్లవం ఈ నిపుణుల పట్టును బలహీనం చేసింది. తమ పిల్లలకు ఎటువంటి విద్య కావాలో కార్మికులు, కర్షకులు అభిప్రాయం చెప్పేందుకు వీలు కల్పించింది. గ్రామీణ పాఠశాలలను రైతులు నడుపుకోవడానికి అనుమతి లభించింది. ఒక గ్రామం తమ దగ్గర దొరికే వస్తువులతోనే తమ సొంత ప్రాథమిక పాఠశాలను నిర్మించుకుని, సొంతంగా ఉపాధ్యాయులను నియమించుకుని, గ్రామంలోని పిల్లలందరికీ ఉచిత విద్య అందుబాటులోకి తెచ్చేది.

కొన్ని గ్రామాల ప్రజలు తమ వనరులు పోగుచేసి ఒక ఉమ్మడి మాధ్యమిక పాఠశాల నిర్మించేవారు. అది ఆ గ్రామాల రైతుల పిల్లలందరికీ ఉచితంగా అవకాశం ఇచ్చేది. ప్రతి ప్రజా కమ్యూన్ రెండో మూడో ఉన్నత పాఠశాలలు తెరిచి, ఆ ప్రాంతపు రైతుల పిల్లలందరికీ ఉచితంగా విద్యను అందించేది. షాన్ డాంగ్ రాష్ట్రంలోని నా సొంత జిల్లా జిమో కౌంటీ లో 1,050 గ్రామాలుంటాయి. సాంస్కృతిక విప్లవ కాలంలో ఈ గ్రామాలన్నిట్లో ప్రతి గ్రామంలోనూ ఒక ప్రాథమిక పాఠశాల వెలిసింది. గ్రామీణ బాలబాలికలందరికీ ఉచితంగా చదువుకోవడానికి అవకాశం దొరికింది. ఏడున్నర లక్షల జనాభా ఉన్న మా జిల్లాలో సాంస్కృతిక విప్లవం కన్న ముందు కేవలం ఏడు మాధ్యమిక పాఠశాలలు మాత్రమే ఉండేవి. సాంస్కృతిక విప్లవకాలంలోని పది సంవత్సరాలలో మా జిల్లాలో మాధ్యమిక పాఠశాలల సంఖ్య 249కి పెరిగింది. ప్రతి నాలుగు గ్రామాలకూ ఒక మాధ్యమిక పాఠశాల ఏర్పడింది. ప్రాథమిక పాఠశాల విద్య పూర్తిచేసుకున్న పిల్లలందరూ ఏ ప్రవేశ పరీక్షా లేకుండానే, ఉచితంగానే ఈ మాధ్యమిక పాఠశాలలకు వెళ్లగలిగారు.

సాంస్కృతిక విప్లవం కన్న ముందు మా జిమో కౌంటీలో ఒకే ఒక్క ఉన్నత పాఠశాల ఉండేది. సాంస్కృతిక విప్లవం కన్న ముందు పదిహేడు సంవత్సరాలలో ఈ ఉన్నత పాఠశాల నుంచి 1,500 మంది ఉత్తీర్ణులయ్యారు. వారిలో సగం కన్న ఎక్కువమంది కళాశాలకు కూడ వెళ్లారు. కాని మళ్లీ ఎన్నడూ వెనక్కి తిరిగి రాలేదు. పదిహేడు సంవత్సరాల పాటు జిమో ఉన్నత పాఠశాల ప్రతి గ్రామానికీ కనీసం ఒక్క ఉన్నత పాఠశాల విద్యావంతుడిని కూడ తయారు చేయలేదు. ఉన్నత పాఠశాలలో చదువుకున్న విద్యార్థి ఒక్కరు కూడ లేని గ్రామాలు సాంస్కృతిక విప్లవం కన్న ముందు ఎన్నో ఉండేవి. సాంస్కృతిక విప్లవకాలంలో జిమోలో ఉన్నత పాఠశాలల సంఖ్య 89కి పెరిగింది. ప్రతి కమ్యూన్ కూ కనీసం మూడు ఉన్నత పాఠశాలలు ఏర్పడ్డాయి. నేను మాధ్యమిక పాఠశాల నుంచి 1972లో ఉత్తీర్ణుడినయ్యేటప్పటికి, నా సహాధ్యాయులలో 70 శాతం మంది ఉన్నత పాఠశాలలో చేరగలిగారు. 1973లో మా చెల్లి మాధ్యమిక పాఠశాల ముగించేటప్పటికి తన సహాధ్యాయులందరినీ చేర్చుకోగలిగినన్ని ఉన్నత పాఠశాలలు ఏర్పడ్డాయి. సాంస్కృతిక విప్లవ కాలంలోనే, 1976 నాటికి మా ఒక్క గ్రామం నుంచే 100 మంది

ఉన్నత పాఠశాల నుంచి ఉత్తీర్ణులయ్యారు. మా కమ్యూన్ లో 12,000 మంది ఉన్నత పాఠశాల విద్యావంతులయ్యారు. ఇలా సాంస్కృతిక విప్లవకాలంలో విద్యారంగ విస్తరణ మొత్తం చైనా చరిత్రలోనే అసాధారణమైనది. దానివల్ల చైనా ప్రజలూ చైనా సమాజమూ లోలోతుల్నించి పరివర్తన చెందారు. ప్రజలు విద్యావంతులయిన కొద్దీ రాజకీయ, ఆర్థిక కార్యకలాపాలలో మరింతగా వారి సాధికారత పెరిగింది.

**చైనా సమాజ ప్రజాస్వామికీకరణ**

సాంస్కృతిక విప్లవపు అత్యంత ముఖ్యమైన విజయాలలో ఒకటి సాధారణ ప్రజలకు అందిన సాధికారత, చైనా సమాజంలో జరిగిన ప్రజాస్వామికీకరణ.

ప్రజాస్వామ్యం గురించి మాట్లాడే చాలమంది ప్రజాస్వామ్య భావనను చాల గందరగోళం చేస్తారు. ప్రజాస్వామ్యం అనేది చాల సరళమైన, సూటి అయిన భావన. ప్రజాస్వామ్యమంటే, రాజకీయ వ్యవహారాలు నడిపే అధికారాన్ని ఉన్నతవర్గాలకు మాత్రమే ఆమోదించిన పాత వ్యవస్థకు భిన్నంగా నిర్ణయాధికారంలో సాధారణ ప్రజల భాగస్వామ్యాన్ని ఆమోదించడం. ఒక సమాజ పాలనలో సాధారణ ప్రజలు భాగం పంచుకుంటారని దాని అర్థం. ప్రజాస్వామ్యం అమలు కావాలంటే సాధారణ ప్రజలకు సాధికారత దక్కాలి. ప్రభుత్వాధికారులతో, పాతకాలపు ఉన్నతవర్గాలతో ప్రజలను సమానంగా చూడాలి. ఒక ప్రజాస్వామిక సమాజంలో ఎక్కువ అవకాశాలున్న వర్గాలేవీ ఉండగూడదు. ఏ వర్గాన్నీ ఉన్నతవర్గంగా గుర్తించగూడదు. రాజకీయ అర్థంలోనూ, ఆర్థిక అర్థం లోనూ ప్రతి ఒక్కరూ సమానమే. ప్రజాస్వామ్యానికి ఇది మౌలిక షరతు.

తమను తాము ప్రజాస్వామిక దేశాలమని చెప్పుకునే పాశ్చాత్య దేశాలలో దేశ సంపదలో అత్యధిక భాగం జనాభాలో ఒక్కశాతంగా ఉన్నవారి చేతుల్లో ఉంటుంది. సంపదలోని ఈ వ్యత్యాసం వల్ల, అత్యల్ప సంఖ్యాకులైన సంపన్నులు అధికారాన్నీ, ప్రాబల్యాన్నీ, అజమాయిషీనీ కొనుక్కోగలుగుతారు. అధికారం మీద వారి గుత్తాధిపత్యానికి అవకాశం వస్తుంది. అది నిజమైన ప్రజాస్వామ్యం కానే కాదు. అటువంటి ప్రజాస్వామ్యం పేరుకే ప్రజాస్వామ్యం. వాస్తవంగా అది బూటకం. మహత్తర శ్రామికవర్గ సాంస్కృతిక విప్లవం నిజమైన ప్రజాస్వామ్యాన్ని నిర్మించడానికి ప్రయత్నించింది. అది అతి సాధారణ చైనా ప్రజలకు శక్తినీ అధికారాన్నీ ఇచ్చి, వారు తమ నాయకులను విమర్శిస్తూ పెద్ద అక్షరాల పోస్టర్లు రాసి బహిరంగంగా ప్రదర్శించడానికి అవకాశం ఇచ్చింది. చైనా నాయకులు మిగిలిన ప్రతి ఒక్కరి లాగే శారీరక శ్రమలో పాలుపంచుకోవాలని నిర్దేశించింది. చైనా సమాజ పురోగతిలో అది నిస్సందేహంగా ఒక పెద్ద ముందంజ.

సాంస్కృతిక విప్లవ కాలంలో చైనా అధికారులలో చాలమంది సాధారణ ప్రజల జీవనశైలితో సమానమైన జీవనాన్ని గడిపారు. సాధారణ ప్రజలు నివసించే ఇళ్లలాంటి ఇళ్లలోనే ఉన్నారు. వారి పిల్లలు కూడ ఇతర చైనీయ పిల్లలు చదువుకునే పాఠశాలల్లోనే చదువుకున్నారు. మిగిలినవాళ్లందరి లాగనే వాళ్లు కూడ సైకిళ్లమీదనే కార్యాలయాలకు వెళ్లారు. తమ ఉత్పత్తి బృందాల నాయకులను రైతులు ప్రతిరోజూ ఎన్నుకునేవారు. ఆ నాయకులు కూడ ఆ రైతులతో పాటు పొలాల్లో పనిచేసేవారు. గ్రామ నాయకులు సంవత్సరానికి 300 రోజులు మిగిలిన రైతులతో కలిసి పొలంలో పనిచేసేవారు. వాళ్లు సమావేశాలకు హాజరు కావాలి గనుక, మొత్తం సమూహానికి సంబంధించిన ప్రణాళికలు రచించాలి గనుక మిగిలిన సమయం మినహాయింపు దొరికేది. ఇలాగే కమ్యూన్ నాయకులు ఏడాదికి 250 రోజులు రైతులతో కలిసి పొలాల్లో పనిచేయవలసి ఉండేది. జిల్లా ప్రభుత్వ నాయకుల విషయంలో ఇది ఏడాదికి 200 రోజులుగా ఉండేది.

షాంక్సి రాష్ట్రం, క్సియాంగ్ జిల్లా, దారుూయి గ్రామంలో చెన్ యాంగ్గుయి జీవితమంతా రైతుగా బతికాడు. కమ్యూనిస్టు పార్టీ అధికారానికి వచ్చాక ఆయన గ్రామ పార్టీ కార్యదర్శి అయ్యాడు. గ్రామ ప్రజలకు మెరుగైన భవిష్యత్తు కల్పించడంలో ఆయన అవిరామంగా పనిచేశాడు. సాంస్కృతిక విప్లవ కాలంలో ఆయనకు చైనా ప్రజా రిపబ్లిక్ ఉప ప్రధానిగా, చైనా కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కమిటీ పొలిటికల్ బ్యూరో సభ్యుడిగా, వ్యవసాయ రంగ బాధ్యుడిగా పదోన్నతి దొరికింది. అయినా ఆయన తన సమయంలో మూడో వంతు పొలాల్లో రైతులతోపాటు కలిసి పనిచేస్తూ ఉండడానికే వినియోగించాడు. విదేశీ ప్రతినిధులను కలుసుకున్నప్పుడు కూడ రైతులాగ బట్టలు వేసుకుని ఉండేవాడు. సాంస్కృతిక విప్లవకాలంలో ఎదిగిన కార్మిక, కర్షక, సైనిక అధికారులకు ఆయన ఉదాహరణ. అటువంటి వారెందరో ప్రభుత్వాధికారులుగా పనిచేస్తూనే కార్మికులుగా, కర్షకులుగా, సైనికులుగా జీవిస్తూ ఉండే వారు. అది నిజమైన ప్రజాస్వామ్యం. అది సాంస్కృతిక విప్లవం ద్వారా మావో నిర్మించడానికి ప్రయత్నించిన శ్రామికవర్గ ప్రజాస్వామ్యం. ఒక శాతం లొంగిపోయి, 99 శాతానికి సాధికారతను ఇచ్చిన ప్రజాస్వామ్యం.

చెన్ యాంగ్గుయి లాంటి జాతీయ నాయకులు ఎందరో ఉన్నారు. పెట్రోలియం పరిశ్రమలో ఒక సాధారణ కార్మికుడైన వాంగ్ జింక్సి, లోహానికి రంధ్రాలు చేసే అత్యంత సమర్థమైన ఉలి కనిపెట్టిన యంత్ర నిపుణుడు నీ ఝిఫు, షాండాంగ్ రాష్ట్రపు క్వింగ్దావోకు చెందిన సమర్థుడైన వస్త్ర నిపుణుడు హావో జియాంక్సి జాతీయ నాయకులు అయిన తర్వాత కూడ తమ తమ కార్యక్షేత్రాలలో పనిచేశారు. ఎందరో కార్మికులు, రైతులు కార్మికవర్గంలో, రైతాంగంలో తమ పని కొనసాగిస్తూనే ప్రభుత్వ బాధ్యతలు కూడ స్వీకరించారు.

ఇది చైనాలో ఒక బలమైన సమానత్వ సామాజిక వాతావరణాన్ని ఏర్పరచింది. దానితో బలమైన శ్రామిక సంస్కృతి కూడ ఏర్పడి ప్రపంచ చరిత్రలోనే అసాధారణమైన ఆర్థిక పురోగతి సాధ్యమయింది. సాంస్కృతిక విప్లవ సంవత్సరాలలో చైనాలోని యాజమాన్య ఉద్యోగులు, పర్యవేక్షక ఉద్యోగులు కూడ శారీరక శ్రమలో పాల్గొనవలసి ఉండేది. కార్మికులు కూడ యాజమాన్య నిర్ణయాధికార క్రమంలో పాల్గొనవలసి ఉండేది. కార్మికులు, ఇంజనీర్లు, యాజమాన్య సిబ్బంది సాంకేతిక, యాజమాన్య సమస్యలను సహకార పద్ధతిలో పరిష్కరించేవారు. అర్థంలేని నిబంధనలను, పద్ధతులను కార్మికుల సూచనల మేరకు సంస్కరించారు. ఈ విప్లవ యాజమాన్య తాత్విక దృక్పథం వల్ల, శైలి వల్ల కార్మికులకు, ఇంజనీర్లకు, యాజమాన్య సిబ్బందికి సమష్టిగా పనిచేసే సాధికారత దక్కింది. (ఇదే రకమైన సమష్టి తత్వాన్ని ఒక పెట్టుబడిదారీ యాజమాన్య సూత్రంగా మార్చి పాశ్చాత్యదేశాల్లో పోస్ట్ ఫోర్డిజం అనీ, జపాన్ లో బృంద స్ఫూర్తి అనీ పిలుస్తున్నారు). ఈ పద్ధతి వల్ల మావో కాలంలో ఉత్పాదకతలో మహత్తరమైన విస్తరణ జరిగింది.

**పరిశ్రమ మీద, వ్యవసాయం మీద ప్రభావం**

చైనా ప్రజా రిపబ్లిక్ ఏర్పడినప్పుడు, అక్కడ పారిశ్రామిక పునాది, చాల చిన్న దేశమైన బెల్జియంలోని పారిశ్రామిక పునాది కన్న తక్కువగా

ఉండేది. చైనాలో తలసరి పారిశ్రామికోత్పత్తి బెల్జియం తలసరి పారిశ్రామికోత్పత్తిలో పదిహేనో వంతు కన్న తక్కువ ఉండేది. కాని మావో కాలంలో చైనా పారిశ్రామిక ఉత్పత్తి 38 రెట్లు పెరిగింది. మొత్తం పారిశ్రామిక వ్యవస్థలో భారీ పరిశ్రమల వాటా 90 రెట్లు పెరిగింది. 1950 నుంచి 1977 వరకు చైనా పారిశ్రామికోత్పత్తి వార్షిక పెరుగుదల రేటు సగటున 13.5 శాతంగా ఉండింది. పోల్చగలిగిన సమయంలో మరే దేశపు పారిశ్రామికీకరణ వేగంతో పోల్చి చూసినా చైనా అగ్రభాగాన ఉండింది. అదే కాలపు అభివృద్ధి సూచికలతో పోలిస్తే జర్మనీ, జపాన్, సోవియట్ యూనియన్ లకన్న చైనా ప్రగతి అధికంగా ఉండింది. జర్మనీ పారిశ్రామికోత్పత్తి 1880 నుంచి 1914 మధ్య ప్రతి పది సంవత్సరాలకు 33 శాతం చొప్పున పెరిగింది. దాని తలసరి ఉత్పత్తి పెరుగుదల 17 శాతంగా ఉండింది. జపాన్ లో 1874 నుంచి 1929 మధ్య ప్రతి పది సంవత్సరాలకు పారిశ్రామికోత్పత్తి 43 శాతం పెరిగింది. తలసరి ఉత్పత్తి 28 శాతం పెరిగింది. సోవియట్ యూనియన్ లో ప్రతి పది సంవత్సరాలకూ ఉత్పత్తి 54 శాతం పెరగగా, తలసరి పెరుగుదల 44 శాతంగా ఉండింది. ఈ అంకెలతో పోల్చాలంటే, 1952 నుంచి 1977 వరకు ప్రతి పది సంవత్సరాలకు చైనా పారిశ్రామికోత్పత్తి 64.5 శాతం పెరగగా, తలసరి పెరుగుదల 34 శాతంగా ఉండింది.

మూడో, నాలుగో పంచవర్ష ప్రణాళికల కాలంలో చైనా మౌలిక సాధన సంపత్తి అభివృద్ధి చేయడం మీద 316,642 బిలియన్ల యువాన్లు ఖర్చుపెట్టింది. దానితో మొత్తం పారిశ్రామిక ఆస్తుల విలువ 215,740 బిలియన్ యువాన్లు పెరిగింది. 1979 నాటికి దేశంలో 3,55,000 పారిశ్రామిక సంస్థలు ఏర్పడ్డాయి. 1965లో ఉన్నవాటికి అవి 2.25 రెట్లు ఎక్కువ. ఈ ప్రభుత్వ రంగ పారిశ్రామిక సంస్థలు అన్నీ విస్తృతమైనవే గాని వాటిలో భారీ, మధ్యతరహా అని చెప్పగలిగినవి 4,500 ఉన్నాయి.

ఇంధన రంగంలో 1967 నుంచి 1976 వరకు చైనా పెట్రోలియం ఉత్పత్తి సాలీనా 18.6 శాతం సగటు పెరుగుదలను నమోదు చేసింది. 1978 నాటికి చైనా వార్షిక పెట్రోలియం ఉత్పత్తి 100 మిలియన్ టన్నులకు చేరింది. అది 1965తో పోలిస్తే ఐదురెట్లు ఎక్కువ. సాంస్కృతిక విప్లవకాలంలోని పది సంవత్సరాలలో బొగ్గు, రసాయనాలు, విద్యుచ్ఛక్తి ఉత్పత్తిలో చైనా వార్షిక పెరుగుదల రేటు సాలీనా 9.2 శాతంగా ఉండింది.

మూడో స్థాయి ప్రాంతాల పారిశ్రామిక పథకాలలో చైనా 1965 నుంచి 1970ల మధ్యవరకూ 205 బిలియన్ యువాన్లు పెట్టుబడి పెట్టింది. చైనా మధ్య, పశ్చిమ ప్రాంతాలలో ఎన్నో ఉక్కు కర్మాగారాలు, యంత్ర పరికరాల కర్మాగారాలు, విమాన నిర్మాణ కార్ఖానాలు, రోదసి పథకాలు, ఎలక్ట్రానిక్ పరిశ్రమలు ఏర్పాటయ్యాయి. ఈ మూడో స్థాయి ప్రాంతాలలో 1970ల చివరినాటికి పారిశ్రామిక సంస్థల ఆస్తులు దేశం మొత్తపు పారిశ్రామిక ఆస్తులలో మూడో వంతుగా ఎదిగాయి. దేశపు మొత్తం పారిశ్రామిక ఉత్పత్తి 3.92 రెట్లు పెరిగింది. మధ్య, పశ్చిమ ప్రాంతాల పారిశ్రామికాభివృద్ధి మొత్తం దేశపు పారిశ్రామికాభివృద్ధి చిత్రాన్ని మార్చివేసింది. ఈ పరిణామం దేశపు జాతీయ భద్రతకూ, అభివృద్ధికీ లోతైన వ్యూహాత్మకమైన ప్రాధాన్యత కలిగినది.

స్వయం సమృద్ధినీ, స్వావలంబననూ నొక్కి చెపుతూనే మావో అవసరమైనప్పుడు సాంకేతిక పరిజ్ఞానాన్ని దిగుమతి చేసుకోవడాన్ని అనుమతించారు. మావో, చౌ ఎన్ లై లు 1972 లో 5 బిలియన్ డాలర్ల మొత్తం పెట్టుబడితో 26 విదేశీ పారిశ్రామిక సంస్థల ఏర్పాటుకు ఆమోదం తెలిపారు. ఎన్నో పెట్రోలియం, రసాయనిక కర్మాగారాలు ఏర్పాటయ్యాయి. తద్వారా చైనాలో ఎరువుల, రసాయనిక ఉత్పత్తుల, కృత్రిమ వస్త్రాల ఉత్పత్తి విపరీతంగా పెరిగింది. ఈ కాలంలో ఏర్పాటయిన పదమూడు భారీ ఎరువుల కర్మాగారాలు చైనా మొత్తం రసాయనిక ఎరువుల ఉత్పత్తిలో ఐదో వంతు తయారుచేశాయి. 1970లలోనే చైనా చిన్నతరహా రసాయనిక ఎరువుల కర్మాగారాలను స్థాపించడం మొదలు పెట్టింది. 1978 నాటికల్లా దేశం మొత్తంలో 1,534 చిన్న రసాయనిక ఎరువుల కర్మాగారాలు ఏర్పడ్డాయి. చైనాలో ఈ చిన్నఎరువుల కర్మాగారాల పెరుగుదల దేశపు వ్యవసాయాభివృద్ధిలో కీలకపాత్ర వహించింది.

1960లు, 70లలోనే అమెరికా, ఇతర పాశ్చాత్య దేశాలు హరిత విప్లవ సాంకేతిక పరిజ్ఞానాన్ని ప్రచారం చేసి భారతదేశం, మెక్సికో, బ్రెజిల్, ఫిలిప్పైన్స్ వగైరా మూడో ప్రపంచ దేశాలకు అందించాయి. కాని మూడో ప్రపంచ దేశాల్లో హరిత విప్లవ సాంకేతిక పరిజ్ఞానం విస్తరణ వ్యవసాయం మీద దారుణమైన ప్రతికూల ప్రభావాలకు దారితీసింది. రసాయనిక ఎరువులు, క్రిమిసంహారకాల వినియోగం, భారీ యంత్ర పరికరాల వినియోగం వ్యవసాయంలో ఉత్పత్తికారకాల అవసరాన్ని పెంచాయి. దిగుబడి పెరగడంతో ధాన్యం ధరలు పడిపోయాయి. కాలక్రమంలో ఉత్పత్తి కారకాల ధరలు కూడ పెరిగాయి. మార్కెట్ ఊగిసలాటలతో వచ్చిన సవాళ్లను చిన్న రైతులు ఎదుర్కోలేకపోయారు. ఎందరెందరో చిన్న రైతులు దివాళా తీసి తమ భూముల్ని పోగొట్టుకున్నారు. బతుకుదెరువు కోసం వెతుకులాటలో వారు పట్టణాలకు వలస బాట పట్టవలసి వచ్చింది. మూడో ప్రపంచ దేశాల నగరాలన్నిటిలోనూ పెద్దపెద్ద మురికివాడలు పుట్టుకురావడం, ఇళ్లులేని నిరుపేదల సంఖ్య విపరీతంగా పెరిగిపోవడం పాశ్చాత్య హరిత విప్లవ సాంకేతిక పరిజ్ఞానానికి ప్రత్యక్ష ఫలితాలే. అది వ్యవసాయంలో, గ్రామీణ ప్రాంతాలలో, రైతులలో ముప్పేట సంక్షోభానికి దారితీసింది. ఈ సంక్షోభపు దీర్ఘకాలిక ప్రభావం ఎలా ఉండబోతుందో ఇప్పుడే వివరించడం చాల కష్టం.

ఈ ముప్పేట సంక్షోభపు బారిన పడని ఏకైక దేశం చైనా. అక్కడ అనుసరించిన సమష్టి వ్యవసాయ పద్ధతుల వల్ల వ్యవసాయ, గ్రామీణ, రైతాంగ రంగాలలో సంక్షోభం నుంచి చైనా విజయవంతంగా తప్పించుకోగలిగింది. అప్పటికే సంఘటితమైన చైనా రైతాంగం తమ సొంత హరిత విప్లవాన్ని అభివృద్ధి చేసుకున్నారు. చైనా రైతులకు భూమి మీద సమష్టి యాజమాన్యం ఉండింది గనుక, హరిత విప్లవ సాంకేతిక పరిజ్ఞాన ఫలితాలను సమానంగా పంచుకోగలిగారు. దాని ప్రమాదకర దుష్ఫలితాలను తోసివేసి, ప్రయోజనాలను మాత్రం స్వీకరించగలిగారు. సొంతంగా తయారు చేసుకున్న హరిత విప్లవ సాంకేతిక పరిజ్ఞానం వ్యవసాయ శ్రామికుల ఒత్తిడిని తగ్గించింది. అదే సమయంలో ఎన్నో గ్రామీణ పారిశ్రామిక సంస్థలకు జన్మనిచ్చింది. గ్రామీణ పారిశ్రామిక సంస్థలు పెరిగాయి గనుక రైతులు తమ పొలాలను వదిలే అవకాశం వచ్చింది. అదే సమయంలో వారు గ్రామాన్ని వదిలి వలస వెళ్లనక్కర లేకపోయింది. వ్యవసాయాన్ని వదిలి పరిశ్రమల్లో చేరారు. స్థానిక హరిత విప్లవ సాంకేతిక పరిజ్ఞానం అభివృద్ధి చెందడంతో, స్థానికంగా తయారైన వ్యవసాయ పరికరాల వినియోగంతో, గ్రామీణ పారిశ్రామిక సంస్థల ఏర్పాటుతో, చైనా రైతాంగపు జీవన ప్రమాణాలు సాంస్కృతిక విప్లవ కాలంలో గణనీయంగా మెరుగయ్యాయి.

**మహిళా విముక్తి**

చైనా కమ్యూనిస్టు పార్టీ అధికారానికి రాకముందు, చైనా సమాజంలో మహిళలకు అతి తక్కువ రాజకీయాధికారం ఉండేది. తాము ఎవరిని వివాహమాడాలో నిర్ణయించుకునే హక్కు స్త్రీలకు ఉండేది కాదు. తండ్రులు (తండ్రి మరణిస్తే సోదరులు) వారికి కాబోయే భర్తలను నిర్ణయించేవారు. పెళ్లి అయ్యాక వారి జీవితాలను భర్తలు, భర్త మరణిస్తే కొడుకులు నిర్ణయించేవారు. స్త్రీలకు ఆస్తి హక్కు ఉండేది కాదు. ఆస్తి అంతా తండ్రి పేరు మీద గాని, భర్త పేరు మీద గాని ఉండేది. పురుషులకు డబ్బు ఉంటే ఎంతమంది ఉంపుడుగత్తెలనయినా కొనుక్కునే అధికారం ఉండేది. పాత చైనాలో, సంపన్నులైన పురుషులు ముసలితనంలో కూడ చిన్నారి బాలికలను ఉంపుడుగత్తెలుగా కొనుక్కోవడం సాధారణం. ఎనభై సంవత్సరాల వృద్ధుడు తన స్నేహితుడి పనిమనిషిగా ఉన్న పదహారేళ్ల యువతిని ఉంపుడుగత్తెగా కొనుక్కున్న ఉదంతాన్ని చైనా రచయిత బా జిన్ తన నవలలో చిత్రించారు.

కమ్యూనిస్టు పార్టీ అధికారంలోకి రాగానే, ప్రభుత్వం వెలువరించిన మొట్టమొదటి చట్టం వివాహ చట్టం. 1950 ఏప్రిల్ 13న ప్రవేశపెట్టిన ఈ చట్ట ప్రకారం స్త్రీలనూ, పిల్లలనూ రక్షించే బాధ్యతను రాజ్యం తీసుకుంది. వివాహంలో స్త్రీ పురుషులిద్దరికీ సమాన హక్కులుంటాయని ఈ చట్టం ప్రకటించింది. ఒక పురుషుడికీ ఒక స్త్రీకీ మాత్రమే వైవాహిక సంబంధం ఏర్పడాలనీ, పురుషులు ఉంపుడుగత్తెలను ఉంచుకోవడం నిషేధమనీ ఈ చట్టం ప్రకటించింది. యువతీయువకులకు స్వేచ్ఛగా తమ భాగస్వాములను ఎంచుకునే హక్కు ఉందని రాజ్యం హామీ ఇచ్చింది. విడాకుల సందర్భంలో స్త్రీల, పిల్లల మెరుగైన ప్రయోజనాలు నెరవేరేలా చూడడమే న్యాయస్థానపు బాధ్యత అని చెప్పింది.

చైనా ప్రభుత్వం ఈ చట్టాన్ని ప్రవేశపెట్టి ఊరుకోలేదు. ఈ చట్టం గురించి దేశవ్యాప్తంగా ప్రజలను చైతన్యవంతులను చేయడానికి ఒక అసాధారణమైన సామాజిక ఉద్యమాన్ని ప్రారంభించింది. చట్టం గురంచి ప్రతి ఒక్కరికీ తెలిసేలా వార్తాపత్రికలలో, సమాచార సాధనాలలో, నాటకాలు, సినిమాలు వంటి దృశ్య రూపకాలలో ప్రచారం చేసింది. కొత్త వివాహ చట్టం ద్వారా చైనా సమాజంలో స్త్రీల సామాజిక, రాజకీయ ప్రతిపత్తి గణనీయంగా పెరిగింది. అలాగే ప్రభుత్వ రంగంలో సమాన పనికి సమాన వేతనం అనే సూత్రాన్ని ప్రభుత్వం పెద్ద ఎత్తున ప్రోత్సహించింది.

ప్రభుత్వ సంస్థల్లో పనిచేసే స్త్రీలందరికీ వెంటనే సమాన వేతనం దొరకడం ప్రారంభమయింది. ప్రభుత్వ సంస్థలు స్త్రీలకు మూడు నెలల ప్రసూతి సెలవు ఇవ్వడం, అవసరమైతే దాన్ని ఆరు నెలల వరకు కూడ పొడిగించడం మొదలు పెట్టాయి. కర్మాగారాలలో, ప్రభుత్వ కార్యాలయాలలో మహిళా ఉద్యోగుల కోసం, తల్లుల కోసం ఉచిత శిశు సంరక్షణా కేంద్రాలు, పాలుతాగే పిల్లల తల్లుల కోసం పని మధ్యలో విరామాలు ఏర్పాటయ్యాయి.

మహిళల హక్కుల పరిరక్షణ కోసం ప్రభుత్వం దేశవ్యాప్తంగా మహిళా సమాఖ్య కమిటీలను ఏర్పాటు చేసింది. సాంస్కృతిక విప్లవ కాలంలోనైతే ప్రతి గ్రామంలో, కార్ఖానాలో, పాఠశాలలో, ప్రభుత్వ కార్యాలయంలో మహిళా సమాఖ్య కమిటీ ఉండేది. ఎవరైనా భర్త తన భార్య పట్ల సరిగా ప్రవర్తించకపోతే గ్రామంలోని మహిళా సమాఖ్య వెంటనే ఒక మహిళా బృందాన్ని ఆ భర్తను ప్రశ్నించడానికి పంపేది. భార్యకు ఆ భర్త చేత క్షమాపణ చెప్పించేది. ఆ భర్త మరొకసారి అదే తప్పు చేస్తే, మహిళా సమాఖ్య మళ్లీ వచ్చేది. పట్టణ ప్రాంతాల్లోనైతే బాధిత స్త్రీలు మహిళా సమాఖ్య కమిటీకి ఫిర్యాదు చేస్తే ఆ స్త్రీ తరఫున కమిటీ చర్య తీసుకునేది.

మహిళా సమాఖ్య కమిటీలతో పాటుగా, ప్రభుత్వంలోని ప్రతి స్థాయిలోనూ ఉండే కమిటీలలో తప్పనిసరిగా మహిళా ప్రతినిధులు ఉండాలని ప్రభుత్వం నియమం విధించింది. జీవితంలో మహిళల ప్రత్యేక అవసరాలను ప్రభుత్వ చట్టాలు, నిబంధనలు తప్పనిసరిగా పట్టించుకోవాలని ఆదేశాలుండేవి. అన్ని పనిస్థలాలలోనూ తల్లుల కోసం శిశు సంరక్షణ కేంద్రాలు, బిడ్డలకు పాలు ఇవ్వడానికి విరామాలు ఉండేవి. స్త్రీలకు రుతుసమయంలో పని మార్చుకునే హక్కు ఉండేది.

కమ్యూనిస్టు ప్రభుత్వం స్త్రీల హక్కుల అంశాన్ని చాల తీవ్రంగా పట్టించుకుంది. అది కేవలం స్త్రీల సమస్య మాత్రమే కాదనీ, దాని పర్యవసానాలు పిల్లల పురోగతి పైనా, కుటుంబం పైనా, మొత్తంగా దేశం పైనా ఉంటాయని ప్రభుత్వం గుర్తించింది. స్త్రీల హక్కులకు రక్షణ లేకపోతే నష్టపోయేది స్త్రీలు మాత్రమే కాదు. పిల్లలు దెబ్బతింటారు, కుటుంబాలు కూడ దెబ్బతింటాయి. పిల్లలూ కుటుంబాలూ దెబ్బతింటే యావత్తు దేశమే దెబ్బతింటుంది. చైనా స్త్రీలకు చైనా సమాజంలో ఉత్పాదక సభ్యులుగా సాధికారత ఇచ్చినందువల్ల, చైనా రాజకీయ, సామాజిక, ఆర్థిక జీవనంలో సమానంగా భాగస్వామ్యం వహించడానికి అవకాశం ఇచ్చినందువల్ల, చైనా ప్రభుత్వం చాల తక్కువ సమయంలోనే మాదకద్రవ్యాల వాడకం, వ్యభిచారం, స్త్రీలనూ పిల్లలనూ అమ్మడం, సంఘటిత నేరాలు, బందిపోటు వంటి సామాజిక దురలవాట్లను రద్దు చేయగలిగింది. చైనా ప్రజల ఆయుప్రమాణం 1952లో 35 సంవత్సరాలుగా ఉన్నదల్లా ముప్పై సంవత్సరాలలో రెట్టింపు అయి, 1976 నాటికి 69 సంవత్సరాలుగా మారింది. అదే సమయంలో భారత ప్రజల ఆయుప్రమాణం 1976 నాటికి 50గా ఉండిందంటే, చైనా భారత్ కన్న ఇరవై సంవత్సరాలు ముందు నడిచిందన్నమాట. స్త్రీల సాధికారత, స్త్రీల హక్కులకు రక్షణ వల్లనే ఈ విజయం సాధ్యమయింది.

సోషలిజం వల్ల, మావో నాయకత్వంలో చైనా మూడు దశాబ్దాల లోపలే ప్రపంచం మొత్తంలోనే అద్భుతమైన సమసమాజాన్ని సృష్టించగలిగింది. చైనా అత్యున్నత నాయకులైన మావో, చౌ ఎన్ లై లు ప్రజల కోసం అత్యంత కష్టభరితమైన పనులు చేశారు. కాని వారి వేతనం ఒక ప్రొఫెసర్ వేతనంతో సమానంగా ఉండేది. వారి జీవితకాలంలో వారికి ఏ సొంత ఆస్తీ లేదు. అటువంటి నాయకుల ఆదర్శ నమూనాలతో చైనా ప్రజలు కూడ కష్టపడి పనిచేసి తమ మాతృభూమిని పారిశ్రామికీకరణ జరిగిన, అత్యంత అభివృద్ధి చెందిన రాజకీయ, సామాజిక వ్యవస్థ ఉన్న, ప్రతి ఒక్కరికీ ఉచిత వైద్య సహాయం, ఉచిత విద్య అందే ఆధునిక దేశంగా తీర్చిదిద్దారు. అంతకన్న ముఖ్యంగా నిజమైన కార్మికులు, కర్షకులు, సైనికులు ప్రభుత్వంలో ఉన్నారు, ప్రభుత్వాన్ని నడిపారు. ఈ కార్మిక, కర్షక, సైనిక ప్రభుత్వ నాయకులు ప్రభుత్వాన్ని నడుపుతూనే రైతాంగంలో, కార్మికవర్గంలో పనిచేశారు. ప్రజలకు సేవ చేయండి అనేదే ప్రభుత్వాధికారుల మార్గదర్శక సూత్రంగా ఉండింది. ప్రజల చేత, ప్రజల కొరకు, ప్రజల వల్ల నడిచే ప్రభుత్వం ఉన్న నిజమైన ప్రజాస్వామ్యం అది.

*(2008లో వెలువడిన డాంగ్ పిన్ హాన్ పుస్తకంThe Unknown Cultural Revolution – Life and Change in a Chinese Village నుంచి కొన్ని భాగాలు – రచయిత అమెరికాలోని నార్త్ కరోలినాలో చరిత్ర, రాజనీతి శాస్త్రాల అధ్యాపకుడిగా పనిచేస్తున్నారు)* వీ

# తెలంగాణలో భూసంబంధాలు - ఒక పరిశీలన - 3

***ఉమ్మడి రాష్ట్రాల్లో జరిగిన భూసంస్కరణలు భూస్వాములకు, పెట్టుబడిదారులకు మాత్రమే మేలు చేశాయనీ, భూమిలేని పేదలకు కంటి తుడుపు చర్యగానే మిగిలాయనీ అంటున్నారు* నలమాస క్రిష్ణ**

*(...గత నెల తరువాయి)*

**భూ**మి సాగుచేయకుండా హక్కు దారునిగా ఉండేవారికి భూమిపై హక్కు ఉండకూడదు. ఇతర ఆదాయ మార్గాలుండి భూములుకొని రియల్ ఎస్టేట్ వ్యాపారులకు, ఇతర పారిశ్రామిక అవసరాలకు, పెద్దసైజు వ్యవసాయ క్షేత్రాలకు ఇతర రూపాలలో భూమి కేంద్రీకరణ కావడాన్ని నిరోధించగలిగితే భూసంస్కరణల స్ఫూర్తికి న్యాయం చేకూరుతుంది. అన్ని కులాలు, వర్గాలు సమాన స్థాయికి చేరుకోవడానికి భూసంబంధాలు ఉపయోగపడాలనే స్ఫూర్తి ఎక్కడ కనిపిస్తుంది?.

పదెకరాల భూమి కంటే ఎక్కువ ఉన్న భూ కమతాలు 1970–71 నుంచి 1986 – 87 వరకు 17.0 శాతం నుండి 9.8 శాతానికి తగ్గి పోయింది. వీరి ఆధ్వర్యంలో ఉండే భూమి కూడా ఇదే సంవత్సరాల మధ్య 61.5 శాతం నుంచి 44.2 శాతానికి తగ్గింది. 1976 – 77లలో 4 హెక్టార్ల కంటే అధికంగా ఉన్న కమతాల సంఖ్య 4.79.277 కింద 41,63,835 హెక్టార్ల భూమి ఉంది. 1991 మార్చ్ నాటికి డిక్లరేషన్లు దాఖలు సంఖ్య 2,08,079 కాగా కేవలం 1,51,285.8 హెక్టార్లు మాత్రమే మిగులు భూమిగా ప్రకటించబడింది.

2016 నాటికి వివిధ భూసంస్కరణల కింద ప్రభుత్వం ఉమ్మడి రాష్ట్రంలో 75 లక్షల ఎకరాలు పంపిణీ చేసినట్లు గణాంకాలు చెపుతున్నాయి.

**ఉమ్మడి రాష్ట్రంలో భూసంస్కరణలు పంపిణీ వివరాలు (లక్షల్లో)**

| | కుటుంబాలు | ఎకరాలు |
|---|---|---|
| కౌలుదార్లకు యజమాన్యం హక్కులు | 1.01 | 6.00 |
| ఇనాం భూముల సాగుదార్లకు పట్టా హక్కులు | 4.98 | 10.56 |
| సీలింగ్ భూముల పంపిణీ | 5.30 | 5.93 |
| భూదాన భూముల పంపిణీ | 0.42 | 1.12 |
| ప్రభుత్వ భూముల అసైన్‌మెంట్ – 1969 నుంచి | 30.25 | 51.42 |
| **మొత్తం** | **42.00** | **75.03** |

ఉమ్మడి రాష్ట్రంలో నలభై రెండు లక్షల రెండు వేల కుటుంబాలకు 75 లక్షల మూడు వేల ఎకరాల భూమి పంపకం అయిందని ప్రభుత్వ గణాంకాలు (2011) చెపుతున్నాయి. ఈ మొత్తంలో ఎస్‌సి, ఎస్‌టిలకే అధికభాగం ఇచ్చినట్లు చెపుతున్నాయి. తెలంగాణలోని దళితుల పరిస్థితి చూస్తే.... మాల, మాదిగలోని ఉపకులాలు కలుపుకొని 9,38,207 కుటుంబాలున్నాయి. 429 మండలాల్లో 9,352 గ్రామాల్లో వీరు నివసిస్తున్నారు. వీరిలో 2,90,971 కుటుంబాలకు సెంట్ భూమి కూడా లేదు. మరో మూడు లక్షల పై చిలుకు కుటుంబాలు ఒక ఎకరా లేదా రెండెకరాల భూమితో ఉన్నాయి. 5,52,034 ఎస్‌టి కుటుంబాలకు, 10,03,779 కుటుంబాలకు అసలే భూమిలేదు. అంటే దాదాపు 4 లక్షల కుటుంబాలకు ఎస్‌సి, ఎస్‌టిలకు అసలే భూమి లేదని 2010 సెర్ప్ సర్వే తెలుపుతున్నది.

దళిత, గిరిజనుల భూమి సమస్య గురించి మాట్లాడాలంటే భూ పరాయీకరణ గురించి కొంచెం లోతుగా మాట్లాడుకోవాల్సి ఉంటుంది. కోనేరు రంగారావు కమిటీ నివేదికలోని ముందుమాటలో ఇలా ఉంది."1960 నుండి నేటి వరకు సుమారు 42 లక్షల ఎకరాల భూమిని ప్రభుత్వం పంచింది. అయితే పంచిన భూమిలో గణనీయమైన భాగం పేదల స్వాధీనంలో లేదన్న విషయం, చట్టాలను అమలు పరిచి భూమి పేదల నుంచి చేజారకుండ చూడవలసిన యంత్రాంగపు వైఫల్యాన్ని సూచిస్తుంది".

10 లక్షల ఎకరాల అసైన్డ్ భూమి ఆక్రమణకు గురైంది. అసైన్డ్ (మంజూరు చేయబడ్డ) భూముల యజమానులను ప్రభుత్వం నిజ అర్థంలో గుర్తించడం లేదని చెప్పవచ్చు. అందుకే అసైన్డ్ భూములను ప్రజా ప్రయోజనాల పేరా ఆక్రమించుకుంటున్నప్పుడు రైతు అనుమతి, నష్టపరిహారం తదితర విషయాల్లో ఏ చట్టాన్ని కూడా పాటించడం లేదు. భూస్వాములు, రియల్ ఎస్టేట్ మాఫియా, పారిశ్రామిక వేత్తలు, వ్యాపారులు ఇతరులు ఎవరైనా సరే అసైన్డ్ భూమి ధర తక్కువగా వస్తుందని పేదల అవసరాలు సొమ్ము చేసుకొని భూ ఆక్రమణకు పాల్పడుతున్నారు. అసైన్డ్ భూ వివాదాలు ఉమ్మడి రాష్ట్రంలో 1,47,384 ఎకరాలలో వివాదం ఉంది. చట్టాలు అమలు పరచడానికి సిద్ధంగా లేని పాలకులు, ప్రభుత్వ యంత్రాంగం ఆక్రమణదారులకు కొమ్ము కాస్తుంది. అసైన్డ్ భూముల (బదలాయింపు నిషేధ) చట్టం 1977 ఎంత దారుణంగా ఎన్ని వేలసార్లు ఉల్లంఘనకు గురైతున్నదో లెక్కేలేదు.

సామాజికంగా, ఆర్థికంగా దిగువ స్థాయి వర్గాలు తమకు చట్ట ప్రకారమున్న హక్కును కూడా అనుభవించడానికి ఎంత కష్టమైతుందో దీని అమలు తీరును బట్టి అర్థం చేసుకోవచ్చు.

**ఆదివాసులు – భూ పరాయీకరణ**

36 తెగలుగా ఉన్న ఆదివాసి జనాభా 3 లక్షలుగా ఉంది. (పోలవరం ముంపు ప్రాంతాన్ని కుట్రపూరితంగా ఆంధ్రలో కలుపగా మిగిలిన జనాభా ప్రకారం) దేశంలో సంతాల్, ముండా, బిల్లులు తదితర తెగలవలె తెలంగాణలోని గోండులు, కోయ మొదలగు తెగలు వందల సంవత్సరాలుగా వారి హక్కుల కోసం తిరుగుబాట్లు సాగిస్తునే ఉన్నారు."ఆదివాసుల వీరోచిత పోరాటాల ఫలితంగా 1867 భారత చట్టం, 1874 షెడ్యూల్డ్ జిల్లాల చట్టం, 1917 ఏజన్సీ భూ బదిలీ

నిషేధ చట్టం వచ్చాయి. అయితే ఇవి బ్రిటీష్ సామ్రాజ్యం పరిధిలోనివి. 1940లో కొమురం భీం నాయకత్వంలో బాబే ఝరి తిరుగుబాటు తర్వాత 1949లో ట్రైబల్ ఏరియా రెగ్యులేషన్ 1356 ఫస్లీ (1946) అనే చట్టాన్ని నిజాం ప్రభుత్వం చేసింది. దీని ప్రకారం గిరిజన గ్రామంను నోటిఫైడ్ ఏరియాగా గుర్తించారు. 1963లో దీని స్థానంలో ఆంధ్రప్రదేశ్ షెడ్యూల్డ్ ఏరియాల ల్యాండ్ ట్రాన్స్‌ఫర్ రెగ్యులేషన్ –1959 చట్టాన్ని తెలంగాణకు సైతం విస్తరింపజేశారు. ఈ చట్టాలు గిరిజనుల భూములను, హక్కులను కాపాడలేక పోయినాయి. 1970 వరకు సాగిన శ్రీకాకుళ గిరిజన రైతాంగ పోరాటాల ఫలితంగా 1/70 చట్టం వచ్చింది. (భూపోరాటాల్లో వక్రీకరణలు – వాస్తవాలు పరమేశ్వర్ 2001, విరసం ప్రచురణలు)

1996 పిసా చట్టం (పంచాయితీ రాజ్ ఎక్స్‌టెన్షన్ టు ది షెడ్యూల్డ్ ఏరియాస్ యాక్ట్) 2006 అటవీ హక్కుల గుర్తింపు చట్టాలు చేయబడ్డాయి. అయినప్పటికీ పాలకులకు చిత్తశుద్ధి లేకపోవడం వల్ల ఆదివాసులు రోజు రోజుకు భూమికి దూరం అవుతున్నారు. మరో వైపున సామ్రాజ్యవాద అభివృద్ధి నమూనా అమలుకు, వనరులు కొల్లగొట్టడానికి షెడ్యూల్డ్ ఏరియాలు కేంద్రాలుగా మారడం వల్ల రాజ్యాంగం (5వ షెడ్యూల్డ్) రక్షణ కూడా ఎగతాళి అయింది.

భూమి 50 నుంచి 70 శాతం ఆదివాసేతరుల అధీనంలో ఉంది. ఉట్నూర్, భద్రాచలం ప్రాంతాల్లోకి 111 శాతం వలసలు పెరిగాయి. ఏటూర్ నాగారం, ములుగు, ఇల్లందు, నర్సంపేట ఆదిలాబాద్, అచ్చంపేట మొదలగు డివిజన్లలో 'స్వతంత్ర జీవితం గడిపిన ఆదివాసులు పరాధీనులుగా మార్చివేయబడ్డారు. 1976లో ఇందిరాగాంధీ రాజకీయ ప్రయోజనార్థం లంబాడీలను ఎస్‌టి జాబితాలో చేర్చడం వల్ల లంబాడీలకన్న వెనుకబడ్డ తెగలు ఏ రంగంలోనూ వీరితో సమానంగా నిలదొక్కుకోలేకపోవడానికి దారితీసింది. మహారాష్ట్ర నుండి వలసొచ్చిన లంబాడీలలోని సంపన్న వర్గం అతికొద్ది మంది గిరిజనేతర ఆధిపత్య శక్తులతో కలిసి ఆదివాసులు పోరాడి సాధించుకున్న హక్కులు హరించడంలో దళారీలుగా మారినారు. స్థూలంగా ఆదివాసీ ప్రాంతాలలో భూ పరాయీకరణకు మూల కారణం ఆధిపత్య వర్గాల చొరబాటుకు పాలకుల ప్రోత్సాహమే. కోనేరు రంగారావు కమిటీ నివేదిక ఇలా పేర్కొంది.

"ఆదివాసీ భూముల పరిరక్షణకు శక్తివంతమైన సాధనంగా ఉండవలసిన ఎల్‌టిఆర్ చట్టం నిరుపయోగంగా మారింది. వాస్తవం ఏమిటంటే ఎల్‌టిఆర్ చట్టం కింద నమోదైన 70,183 కేసులకు (3,15,132 ఎకరాలు) గానూ 33,073 (1,33,636 ఎకరాలు) కేసులు మాత్రమే గిరిజనులకు అనుకూలంగానూ, 33,319 (1,62,989 ఎకరాలు) కేసులు గిరిజనేతరు లకు అనుకూలంగానూ పరిష్కారమైనాయి. చట్టంలో నిర్దిష్టమైన ప్రొవిజన్స్ ఉన్నప్పటికీ గిరిజనేతరులే ఏ విధంగా లబ్ధి పొందుతున్నారో ఇది తెలియ జేస్తుంది. 1990 నాటికి ఒక్క ఆదిలాబాద్ జిల్లాలో ఆదివాసుల భూములను ఆక్రమించుకున్న వందల, వేల ఎకరాల భూస్వాములు 60 మంది కంటే పైగానే ఉన్నారని అంచనా. వంద సంవత్సరాల క్రితం వెలమలు, కాపు, మరాఠీలు, బ్రాహ్మణులు, కోమట్లు, ముస్లింలు, వాణిజ్య పరమైన విషయాలతో ప్రవేశించి గ్రామాలనే స్వాధీనంలోకి తెచ్చుకున్న ఉదాహరణ ఆదిలాబాద్ జిల్లాలో చూడొచ్చు. తిరిగి ఆ కులాల్లోని సంపన్న వర్గాలే ఇప్పుడు అన్ని రంగాలను శాసిస్తున్నాయి. స్థూలంగా లక్షల ఎకరాల భూమి గిరిజనేతర భూస్వాముల చేతుల్లో చట్ట విరుద్ధంగా వున్నది. 2006 అటవీ హక్కుల గుర్తింపు చట్టం ప్రకారం ఆదివాసులకు భూయాజమాన్యం కల్పించాల్సి వుండగా వారిపై కేసులు పెట్టి భూములు గుంజుకునే స్థితి భూపరాయీకరణ పరాకాష్టకు చేరిన స్థితిని సూచిస్తున్నది.

**ముగింపు**

సకల జనుల సర్వే చేసిన తెలంగాణ ప్రభుత్వం సమగ్ర భూ సర్వే చేయడానికి సిద్ధంగా లేదు.. (ప్రభుత్వాలు ఉద్దేశ్యపూర్వకంగా లెక్కలు చెప్పక పోవడం లేదా తప్పుడు లెక్కలు చెప్పడం, రికార్డుల నిర్వహణ సరిగ్గా చేయకపోవడం జరిగింది. వీటిపై జరిగిన స్వతంత్ర అధ్యయనాలు కూడా చాలా తక్కువనే చెప్పవచ్చు.) తెలంగాణలో మిగులు భూములు వివిధ రూపాలలో దాదాపు 70 లక్షల ఎకరాల వరకు ఉంటుంది. భూమిలేని పేద కుటుంబాలు 25 లక్షలున్నాయి. తెలంగాణ గ్రామీణ సమాజంలో 1,14,39,327 మంది శ్రామికులలో 30,36,593 (27 శాతం) సాగు దారులుండగా 56,89,971 (50 శాతం) మరో వైపున పాలక వర్గాల భూ సేకరణ చట్టాలను పదును పెట్టి బ్రిటిష్ తరహా భూ దోపిడీకి సిద్ధమైతున్నారు. పెట్టుబడి దారులు రాజకీయ నాయకులు. భూ స్వాములు, రియల్ మాఫియా కార్పోరేట్ శైలిలో కొత్త రూపాలలో భూ కేంద్రీకరణ చేస్తున్నారు. ఫలితంగా రైతాంగం చేతిలోని భూమి వారికి ఇంక దూరమవు తుంది. 'ప్రభుత్వాలు చేపట్టే భూ సేకరణలో ప్రధానంగా వచ్చే విషయం 'ఎమినెంట్ డొమైన్; అంటే అంతిమంగా ఒక రాజ్య పరిధిలో ఉండే భూమి. ఆ రాజ్యానిదని, కనుక ప్రజలు వ్యక్తిగత ఆస్తి పాస్తులు, హక్కులు అందుకు లోబడే ఉంటాయనేది సారాంశం. ఎవరి భూమినైనా ఏ కారణం చేతనైనా స్వాధీనం చేసుకోవచ్చు. కానీ పాలకులు దీనిని వాడుతున్న తీరు రాజ్యాంగం యిచ్చిన ప్రాథమిక హక్కులను కాలరాసేదిగా ఉన్నది. కేంద్రం ఓ వైపున భూములపై దాడులు కొనసాగిస్తూ ఆదివాసీ, దళిత, ఇతర వెనుకబడిన వర్గాలను భూముల నుండి వెళ్లగొడుతున్నది. మరోవైపు ఎన్నికలలో ప్రగల్భాలు పలికిన తెలంగాణ రాష్ట్ర సమితి ప్రజలను అణిచివేస్తూ మరీ భూముల వేటలో పోటీ పడుతున్నది. హరిత హారం, ఓపెన్ కాస్టు, ప్రాజెక్టులు, ఫార్మా కంపెనీలు, ఫిలిం సిటీ, గనుల తవ్వకాలు, టైగర్ జోన్స్, రోడ్ల విస్తరణ మొదలైన రూపాలలో దాదాపు రెండు లక్షల ఎకరాల పై చిలుకే ఉంటుంది.

భూ గరిష్ట పరిమితి చట్టాలు, వినోభాబావే భూదానోద్యమాలు, ఇందిరమ్మ పథకాలు, అటవీ హక్కుల చట్టాలు, సమస్త హక్కుల ప్రకటనలు ఏవైనా అడుగునున్న కులాలకు, శ్రామిక వర్గాలకు అనుకూలంగా ఎన్నడూ అమలు జరగలేదు. కంటి తుడుపు సంస్కరణల నమూనాగా, పాలక వర్గాలు చెప్పుకునే చరిత్రగానే మిగిలాయి. 70 ఏండ్ల స్వాతంత్ర్యం ఏమిచ్చిందని పేద రైతులు, దళితులు, ఆదివాసులు, వృత్తి కులాల ప్రజలు వెనక్కి తిరిగి చూస్తే ఉండడానికి ఇంటి జాగా, కాసింత భూమి కల్పించలేక పోయిందని ప్రభుత్వ నివేదికలే తేల్చి చెప్పుతున్నాయి. కాగితాల వరకే పరిమితమైన ఈ చట్టాలైనా పాలక వర్గాలు చేయడానికి వీరోచిత పోరాటాలే ప్రధాన కారణం. ఉన్న చట్టాలు అమలు జరగాలన్నా, భూమిలేని వారందరికి భూమి దక్కాలన్నా పోరాటమే మార్గమని తెలంగాణ మళ్లీ మళ్లీ గుర్తు చేస్తున్నది.

*(అయిపోయింది)*

*(రచయిత టిపిఎఫ్ ప్రధాన కార్యదర్శి)*

వీ

# నా భావం ఇది....

- వెన్నెలకంటి రామారావు

వీక్షణం మే సంచికలో 'కుల రక్కసి చావదు, చంపాల్సిందే' నా వ్యాసాన్ని ప్రచురించినందుకు ధన్యవాదాలు. అయితే 'కుల నిర్మూలన చేయాల్సిన శక్తులు ఆత్మగౌరవం, సాధికారతల పేరుతో సంఘాలుగా ఏర్పడి కుల వ్యవస్థను పెంచి పోషిస్తున్నాయనీ, కుల వ్యవస్థను రూపుమాపేందుకు ఉద్యమించాలనీ అంటున్నారు... వెన్నెలకంటి రామారావు' అని వ్యాసం ప్రారంభంలో హైలెట్‌గా (బ్లర్బ్‌గా) ప్రచురించిన వాక్యం వ్యాసంలో నేను వ్యక్తం చేసిన అభిప్రాయానికి భిన్నంగా ఉన్నది. నా వ్యాసంలోని వాక్యం ఇది... 'ఆ (కుల) రక్కసి వివిధ ప్రజాస్వామిక రూపాల్లో, ప్రాబల్య – ప్రాబల్యేతర, ఆధిపత్య – ధిక్కార కుల అస్తిత్వ సంఘటిత సంస్థల రూపాల్లో మరింతగా వ్యవస్థీకృతం అయింది. దాన్ని హతమార్చే చారిత్రక కర్తవ్యాన్ని నెరవేర్చవలసిన సామాజిక శక్తులు ఆత్మగౌరం, సాధికారతల పేరుతో దాని విశ్వజనీనతకు ప్రాణం పోస్తున్నాయి. కుల రక్కసిని చంపి ఈ దేశ పీడితులకు ఉపకరించే రాజకీయ, ఆర్థిక సంస్కరణలు అమలులోకి రావాలన్న అంబేద్కర్ ఆకాంక్ష ఇన్నేళ్లుకూ నెరవేరకపోగా, ఆ రక్కసి మరింత విస్తృతంగా, మరింత మర్యాదకరంగా, మరింత సౌమ్యంగా, మరింత ప్రజాస్వామిక రూపాల్లో వివృతమైంది.' కుల రక్కసిని హతమార్చాల్సిన సామాజిక శక్తులు కుల అస్తిత్వాల సామాజిక మూలాలైన సామాజిక శ్రమ విభజనలో మౌలిక మార్పు తీసుకురావాల్సిన అనివార్యతను తిరస్కరించడంతో, ఉనికిలో ఉన్న వర్గ సమాజం (దోపిడీ వ్యవస్థ) లోనే ఆత్మగౌరవం, సాధికారితల సాధనకు వారి అస్తిత్వ ఉద్యమం పరిమితం కావడంపై చేసిన విమర్శ అది.

కుల నిర్మూలన జరగనంత వరకు బడుగు కుల అస్తిత్వాలకు ఆత్మగౌరవం ఏర్పడడం సంభవం కాదు. శ్రమ విభజనతో జమిలిగా శ్రామికుల విభజన అంతరించకపోతే కుల నిర్మూలన సాధ్యం కాదు. ఈ ఎరుక ఉన్నా, లేకపోయినా ఆత్మగౌరవం, సాధికారతలకు మాత్రమే పరిమితమైన కుల అస్తిత్వ ఉద్యమాల పర్యవసానంగా కులాలు వివిధ కుల సంఘాల రూపంలో (బడుగు/పెత్తందారీ కులాలు రెండూ) ముకుళిత, ఘనీభవించిన సమూహాలుగా రూపొందడం వాస్తవం కాదా? అయితే అందులో పాల్గొనే సామాజిక శక్తులు పథకం ప్రకారంగా పాల్గొన్నా, చిత్తశుద్ధితో పాల్గొన్నా పర్యవసానం కుల వ్యవస్థ స్వచ్ఛందంగా ముకుళిత రూపంలో (భూస్వామ్య శక్తుల అణచివేత రూపంలో కాకుండా) గడ్డకడుతుంది. అంటే కుల వ్యవస్థను పెంచి పోషించాలనే ఉద్దేశం లేకపోయినా అలాంటి పరిమితమైన అవగాహన, కార్యాచరణలతో కూడిన ఆచరణ ఆ సామాజిక శక్తుల ఇష్టా ఇష్టాలూ, సంకల్పాలతో సంబంధం లేకుండా కుల వ్యవస్థ విశ్వజనీనతకు ప్రాణం పోసినట్లు అవుతుంది. అంతేగాని ఆ సామాజిక శక్తులు కావాలని, పనిగట్టుకుని, కుట్రపూరితంగా కుల వ్యవస్థను పెంచి పోషించే ఉద్దేశంతో ఆత్మగౌరవం, సాధికారతల పేరుతో సంఘాలుగా ఏర్పడుతున్నాయని అర్థం కాదు. అలాంటి ఆచరణ పాలక వర్గాలకు ఉపయోగపడుతుందని, కుల వ్యవస్థ నిర్మూలన కార్యక్రమం పక్కదాని పట్టేందుకు దారితీస్తోందనే నా అవగాహన, భావనను మీరు తప్పుగా అర్థం చేసుకున్నారు. ఉద్దేశ పూర్వకంగా కుల వ్యవస్థను పెంపొందించేందుకు అలాంటి సంఘాలు పెడుతున్నారనే అర్థం వచ్చేట్లు బ్లర్బ్ రాయడంతో నా భావం పూర్తిగా అభావం అయింది. స్వార్థంతో చేసినా, చిత్తశుద్ధితో చేసినా అలాంటి పరిమిత దృక్పథంతో కూడిన కుల సంఘాల కార్యాచరణ పర్యవసానంగా కుల వ్యవస్థ వివిధ ముకుళిత సంఘాల రూపంలో ఘనీభవించడం చూస్తున్నాం. ముఖ్యంగా పట్టణాలు, నగరాలలోని అవశేష అస్తిత్వాలలో ప్రధానంగా ఈ ప్రక్రియ చోటు చేసుకుంది. అంతేగాని ఆ సామాజిక శక్తులు కుట్రపూరితంగానో, ఉద్దేశపూరితంగానే కుల వ్యవస్థను పెంచి పోషించేందుకు ఆత్మగౌరవ, సాధికార పేరుతో సంఘాలు పెడుతున్నాయని అనేది నా అభిప్రాయంగా వీక్షణం వారు రాయడం సరికాదు. ఆ సున్నితమైన అవగాహన తేడాను వీక్షణం పత్రిక వారు గుర్తించకపోవడం దురదృష్టకరం. ఇలాంటి వ్యాఖ్యానాల వల్ల రచయితల మూల భావాన్ని పాఠకులు తప్పుగా అర్థం చేసుకుంటారు. ఆ వ్యాఖ్యానాలు సంచనాలను మాత్రమే సృష్టిస్తాయి.

శ్రమ విభజనతో నిమిత్తంలేని శ్రామికుల విభజన నిర్మూలన గాని, శ్రామికుల విభజనతో నిమిత్తం లేకుండా శ్రమ విభజన నిర్మూలన గాని సంభవం కాదు. అలా కాక ఆత్మగౌరవం, సాధికారితలకే పరిమితమైన కుల అస్తిత్వ ఉద్యమాలు కుల నిర్మూలనకు ఆటంకంగా తయారవుతాయి. ఏవో కొన్ని రాయితీలు పొందడం ద్వారా ఆయా కుల అస్తిత్వాలల్లో ఆత్మగౌరవం, సాధికారతల పేరుతో క్రీమీలేయర్ విభాగం ఏర్పడుతుందే తప్ప, సదరు నిజ అస్తిత్వాల మౌలిక సమస్యలకు పరిష్కారం దొరకదు. పైపెచ్చు కుల నిర్మూలన ఎజెండా లేని కుల సంఘాలను పాలకవర్గ రాజకీయ పార్టీలు తమ స్వార్థానికి వాడుకోవడం మన రెండు తెలుగు రాష్ట్రాలలోనే కాకుండా, దేశ వ్యాప్తంగా జరుగుతుండడం వాస్తవం కాదా? సాధికారత అనే పదం పైకి గంభీరంగా కనిపించినా ప్రపంచ స్థాయిలో బడుగు బలహీన వర్గాలు, పీడిత జాతులు, దేశాల్లో తమ ప్రయోజనాలను నెరవేర్చేందుకు తమలాగే ఆలోచిస్తూ, తమ అస్తిత్వంలోని సామాన్యుల సమస్యల మౌలిక పరిష్కారంతో సంబంధం లేకుండా పరాయీకరణకు గురైన ప్రత్యేక భావజాలంతో క్రీమీలేయర్ ఏర్పడడం లేదా ఆ అస్తిత్వంలో అంతర్గతంగా వర్గ సంబంధాలు (పేద, మధ్యతరగతి, ధనిక) ఏర్పడేందుకు దోహదం చేసే ప్రక్రియను స్వచ్ఛంద సంస్థలు పిలుస్తున్న మరో అందమైన పేరే 'సాధికారత.' ఈ అర్థంలో చూస్తే సాధికారత సాధించడమంటే... ఉనికిలో ఉన్న అసమాన సామాజిక వ్యవస్థ మౌలిక స్వభావం మారకుండా ఆయా సామాజిక అస్తిత్వాలలోని కొందరికి రాజకీయ, ఆర్థిక హోదాతో పాటు కొద్దిగా సామాజిక హోదా కూడా పెరగడమే. ఇలాంటి స్వభావం గల సాధికారత ఆయా అస్తిత్వాల్లోని అణగారిన ప్రజలకు అంతిమంగా నష్టదాయకమే. మాలో కొందరు ఐఎఎస్‌లు అయ్యారు, కొందరు ఉన్నతాధికారులయ్యారు, కొందరు సంపన్నులయ్యారు అని ఆత్మ సంతృప్తినిస్తుందే గాని, ఆ ప్రక్రియ సదరు అస్తిత్వాలలోని బడుగు, బలహీన వర్గాల మౌలిక సమస్యల పరిష్కారానికి ఎంతమాత్రమూ పనికిరాదు. అందువల్ల శ్రమ సంబంధాలు మారకుండా ఆత్మగౌరవం సంభవం కానట్లే, వర్గ సంబంధాలను సృష్టించే సాధికారత వల్ల అణగారిన అస్తిత్వాల సమస్యలకు మౌలిక పరిష్కారం లభించదు. బడుగు అస్తిత్వాలలోని క్రీమీలేయర్ తామున్న ప్రత్యేక రంగంలోని కుల వివక్ష, అణచివేతలకు వ్యతిరేకంగా పోరాడడమే కాకుండా, తమ అస్తిత్వ మూలాలకు చెందిన అణగారిన ప్రజల మౌలిక సమస్యల పరిష్కారం కోసమూ తమ తమ అస్తిత్వ సంఘాల ద్వారా కృషి చేయవలసి ఉంటుంది. దయచేసి నా అభిప్రాయాన్ని ప్రచురించండి.... వీ

### పౌరహక్కుల అణచివేతపై సభ

పౌరహక్కుల సంఘం (సిఎల్‌సి – తెలంగాణ) ఆధ్వర్యంలో ఏప్రిల్ 30న హైదరాబాద్‌లోని సుందరయ్య విజ్ఞాన కేంద్రంలో 'పౌర ప్రజాస్వామిక హక్కులు – ప్రభుత్వ అణచివేత అంశం'పై బహిరంగ సభ జరిగింది. వక్తలు దేశవ్యాప్తంగా ప్రజాస్వామిక ఉద్యమాలు నిర్మించి చత్తీస్‌గడ్‌లోని ఆదివాసుల రక్షణకు కృషి చేయాలన్నారు. చత్తీస్‌గడ్‌కు చెందిన హక్కుల కార్యకర్త, ఉపాధ్యాయురాలు సోనిసోరి తనపై రాజ్యం నక్సలైట్ ముద్రవేసి దంతెవాడలోని పునరావాస కేంద్రంలో తీవ్ర హింసకు గురిచేసిందన్నారు. తను బతికినంత కాలం రాజ్యహింసకు వ్యతిరేకంగా పోరాడుతానని స్పష్టం చేశారు. సహజ సంపదను దోచుకునే ప్రయత్నం చేస్తుందన్నారు. ఈ సమావేశంలో ఢిల్లీ పియుడిఆర్ ప్రతినిధి గౌతం నవలాఖ, సిఎల్‌సి రాష్ట్ర అధ్యక్షుడు లక్ష్మణ్, హైదరాబాద్ సెంట్రల్ యూనివర్సిటీ ప్రొ. కె.వై. రత్నంలు సభలో మాట్లాడారు.

### ఎన్‌కౌంటర్‌లో ముగ్గురు మావోయిస్టుల మృతి

విశాఖపట్నం జిల్లా కొయ్యూరు మండలం మర్రిపాకల గ్రామానికి సమీపంలో మే 4న జరిగిన ఎన్‌కౌంటర్‌లో ముగ్గురు మావోయిస్టులు మరణించారు. వెంకటరవివర్మ గోపాల్ (ఆజాద్) (27), జమ్ములూరి వెంకటేశ్వర్లు (చిన్నయ్య) (ఆనంద్) (28), కమల (26) మృతిచెందారు. కొయ్యూరు మండలం మంప పోలీస్ స్టేషన్ పరిధిలో గాలింపులు జరుపుతున్న పోలీసులకు మర్రిపాకల గ్రామానికి సమీపంలో మావోయిస్టులు ఎదురు పడడంతో ఈ ఘటన జరిగింది. ఆజాద్ విశాఖపట్నం పెందుర్తి మండలం కరకవానిపాలెం గ్రామానికి చెందినవాడు. జమ్ములూరి వెంకటేశ్వర్లు తూర్పు గోదావరి జిల్లా అడ్డతీగల మండలం వీరవరం గ్రామానికి చెందినవాడు. కమల ఒడిషా రాష్ట్రం మల్కన్‌గిరి జిల్లా బ్లాక్ సోలారబు గ్రామానికి చెందిన గిరిజన యువతి.

### బోయ జంగయ్య కన్నుమూత

ప్రముఖ కవి బోయ జంగయ్య (75) మే 8న హైదరాబాద్‌లోని ఓ ప్రైవేట్ ఆస్పత్రిలో చికిత్స పొందుతూ మృతిచెందారు. ఆయన నల్గొండ జిల్లాలోని పంతంగి గ్రామంలో 1942, అక్టోబర్ 1న జన్మించారు. ఆయన నల్గొండలోని ఎన్‌జి కళాశాలలో డిగ్రీ పూర్తిచేశారు. నాటక రచయితగా ప్రారంభమైన ఆయన కథలు, కవితలు, బాల సాహిత్యం, జీవిత చరిత్రలు, నవలలు వంటి రచనలు చేశారు. కొత్త బాటలు, ఆలోచన బండి వంటి నాటికలు, లోకం, ఎచ్చరిక, తెలంగాణ వ్యథలు, బోయ కథలు, ఉప్పునీరు, ఆమె జోగులవంటి కథలతో పాటు నడుస్తున్న చరిత్ర, వెలుతురు వంటి కవితలు రాశారు. 1969 తెలంగాణ ఉద్యమానికి సంబంధించి ఆయన రాసిన కథలను వ్యతిరేకిస్తూ అప్పటి ప్రభుత్వం ఆయన్ను జైలులో పెట్టింది. ఎచ్చరిక కథకు 1994లో శ్రీశ్రీ మెమోరియల్ ట్రస్ట్ బంగారు పతకంతో సత్కరించింది. 'జాతర' ఉత్తమ నవలగా ఎంపికైన సందర్భంగా తెలుగు విశ్వవిద్యాలయం ఆయనను గౌరవ డాక్టరేట్‌తో సత్కరించింది. 1999లో మలయశ్రీ అవార్డు, 2001 లో హర్యానాలో పద్మశ్రీ అవార్డుపొందారు.

### రాజధాని నిర్మాణంలో అమానుషం

ఆంధ్రప్రదేశ్ రాజధాని అమరావతిలో తాత్కాలిక సచివాలయం నిర్మాణంలో ప్రమాదవశాత్తు ఒక కూలి మరణించడం తీవ్ర ఉద్రిక్తతకు దారితీసింది. మే 10న ఎల్అండ్‌టికి చెందిన మిల్లర్ హెల్పర్ దేవేందర్ (22) విధులు ముగించుకొని తరువాత షిఫ్టు వారికి అప్పగించాల్సి ఉండడంతో నిబంధనల ప్రకారం శుభ్రం చేస్తున్న క్రమంలో ప్రమాదవశాత్తు మిల్లర్‌కు, కాంక్రీట్‌కు లోపలకెళ్లే ఇనుప తొట్టెల మధ్యలో ఇరుక్కుపోయి మరణించాడు. ఈ విషయాన్ని ఎల్అండ్‌టి యాజమాన్యం గోప్యంగా ఉంచడానికి ప్రయత్నిస్తూ అంబులెన్స్‌లో మృతదేహాన్ని తరలించే ప్రయత్నం చేసింది. విషయం తెలుసుకున్న తోటి కార్మికులు ఆందోళనకు దిగారు. ఎల్అండ్‌టి కార్యాలయంపై దాడి చేశారు. ఈ సందర్భంగా పోలీసులు యాజమాన్యానికి అనుకూలంగా కార్మికులను భయపెట్టడానికి ప్రయత్నించారు. ఆందోళన చేస్తే అరెస్టు చేస్తామని బెదిరించారు. దీంతో కార్మికులు పోలీసులపై దాడి చేశారు. పోలీసు వాహనాన్ని తగులబెట్టారు. చనిపోయిన కార్మికుడికి 25 లక్షల రూపాయల నష్టపరిహారం ఇవ్వాలని, కార్మికులకు కనీస వేతనాలు అమలు చేయాలని, కార్మికులకు భద్రత కల్పించాలని డిమాండ్ చేశారు.

### ప్రజాభిప్రాయ సేకరణలో ప్రజల పై లాఠీ చార్జీ

మెదక్ జిల్లా తొగుట మండలం ఏటిగడ్డ కిష్టాపూర్‌లో మే 14న మల్లన్నసాగర్ ప్రాజెక్టు కోసం భూమి సేకరించేందుకు ప్రజాభిప్రాయ సేకరణ సభ ఏర్పాటు చేశారు. దీన్ని రైతులు వ్యతిరేకించి ప్రాజెక్టుల కోసం మా భూమి ఇవ్వం భూమి కోసమే అయితే గ్రామ సభ పెట్టనివ్వమని ఆగ్రహం వ్యక్తం చేశారు. దీంతో బందోబస్తులో ఉన్న పోలీసులు గ్రామస్తులపై లాఠీచార్జీ చేశారు. దీంతో కొందరు రైతులు సొమ్మసిల్లి పడిపోయారు. కొందరికి గాయాలయ్యాయి. ఆగ్రహానికి గురైన గ్రామస్తులు 'మా ఊరు మునిగి మేము ఏడుస్తుంటే మమ్మల్నే కొడతారా?' అని పోలీసు జులుం నశించాలంటూ ధర్నాకు దిగారు. దీంతో గ్రామస్తులకు ఎస్ఐ క్షమాపణ చెప్పారు.

### తెలంగాణ ప్రజా ఫ్రంట్ మహాసభలు

తెలంగాణ ప్రజా ఫ్రంట్ (టిపిఎఫ్) రెండవ రాష్ట్ర మహాసభలు మహబూబ్‌నగర్ జిల్లా గద్వాలలో మే 15, 16లలో సిఎన్‌జి ఫంక్షన్ హాల్‌లో జరిగాయి. కార్యక్రమంలో భాగంగా టిపిఎఫ్ మాజీ అధ్యక్షుడు మద్దిలేటి స్మారక స్థూపాన్ని ఆవిష్కరించారు. రాష్ట్ర నలుమూలల నుంచి టిపిఎఫ్ సభ్యులు సానుభూతి పరులు హాజరయ్యారు. తెలంగాణ ప్రభుత్వం అనుసరిస్తున్న ప్రజావ్యతిరేక విధనానాలను వక్తలు విమర్శించారు. టిపిఎఫ్ రాష్ట్ర నూతన అధ్యక్షుడుగా నలమాస కృష్ణ, ప్రధాన కార్యదర్శిగా మెంచు రమేష్, ఉపాధ్యక్షులుగా ఏడుగురిని, సహాయ కార్యదర్శులుగా ఎనిమిది మందిని ఎన్నుకున్నారు. వివిధ సంఘాలకు చెందిన 25 మందిని కార్యవర్గ సభ్యులుగా ఎన్నుకున్నారు.

### జగన్ జల దీక్ష

వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ అధ్యక్షుడు వై.ఎస్. జగన్‌మోహన్ రెడ్డి తెలంగాణలో నిర్మిస్తున్న ప్రాజెక్టులపై మే 16 నుంచి 18 వరకు కర్నూలులో జల దీక్ష చేపట్టారు. తెలంగాణలోని కృష్ణా, గోదావరి నదుల పై నిర్మిస్తున్న ప్రాజెక్టులను ఆపివేయాలని దానికి రెండు నెలల సమయం ఇస్తున్నాం.., అప్పటికి మార్చుకోకపోతే గోదావరిపై దీక్షల ద్వారా మరింత ఉధృతంగా పోరాటం చేస్తామని జగన్ ప్రకటించారు.

### తెలంగాణ ప్రజాస్వామిక వేదిక సభ

ఆదివాసి, దళిత మహిళలు, మైనారిటీలపై పోలీసు, పారామిలటరీ బలగాల హత్యాకాండకు వ్యతిరేకంగా తెలంగాణ ప్రజాస్వామిక వేదిక (టిడిఎఫ్) ఆధ్వర్యంలో వరంగల్ జిల్లా హన్మకొండలోని విష్ణుప్రియ గార్డెన్‌లో మే 24న సభ నిర్వహించారు. సభకు మొదట పోలీసులు అనుమతించారు. తరువాత ఇచ్చిన అనుమతిని నిరాకరించారు. తరువాత హైకోర్టు ఆదేశాలతో పోలీసుల నిఘా మధ్య సాయంత్రం 4:30 నుండి 6:30 వరకు సభ జరిగింది. ఇందులో ఐదుగురు వక్తలు మాత్రమే మాట్లాడడానికి అనుమతించారు. వక్తలు ప్రజాస్వామ్యంలో సభ నిర్వాహణకు అవకాశం కల్పించకపోవడం, గిరిజనుల సంపదను విదేశాలకు ఎందుకు తరలిస్తున్నారని ప్రశ్నించారు. ఆపరేషన్ గ్రీన్‌హంట్ పేరుతో గిరిజనులను అడవుల నుంచి తరిమేసే కుట్ర జరుగుతుందని అన్నారు.

### బ్రాండిక్స్ మహిళా కార్మికుల పై లాఠీ చార్జ్

విశాఖపట్నంలోని బ్రాండిక్స్ కంపెనీ కార్మికులు ఏప్రిల్ 30న తమ న్యాయమైన సమస్యలను పరిష్కరించమని యాజమాన్యాన్ని కోరడానికి వెళుతున్న క్రమంలో పోలీసుల వారిని అరెస్ట్ చేశారు. భారీ పోలీసు బందోబస్తు మధ్య కార్మికులను బలవంతంగా బ్రాండిక్స్ కంపెనీలోకి పంపించారు. విధులకు రానివారిని తొలగిస్తామని బెదిరించారు. వేరు వేరు చోట్ల దాదాపు 300 మంది మహిళా కార్మికులను అరెస్ట్ చేసి పలు పోలీసుస్టేషన్లకు తరలించారు. 144 సెక్షన్ విధించారు. అరెస్టులను అడ్డుకున్న మహిళలను చీరలూడిపోతుండగా వాహనాలకెక్కించారు. కంపెనీలోపల ప్రతి యూనిట్ వద్ద 20 పోలీసులు పహారా ఉన్నారు. బ్రాండిక్స్ మహిళల అరెస్టును సిపిఐ(ఎం) జిల్లా కార్యదర్శి కె. లోకనాథం, సిఐటియు జిల్లా ప్రధాన కార్యదర్శి ఎస్. రమేష్, ఐద్వా రాష్ట్ర అధ్యక్ష, కార్యదర్శులు బి. ప్రభావతి, డి.రమాదేవి తీవ్రంగా ఖండించారు. వీ

## సత్నాం మృతి

విప్లవ రచయిత సత్నాం (గురుమిత్‌సింగ్) (65) ఏప్రిల్ 27న పంజాబ్‌లోని పాటియాలలో ఆత్మహత్య చేసుకుని చనిపోయారు. ఆయన నాలుగు దశాబ్దాలుగా ప్రజా ఉద్యమాలతో ఉన్నారు. ఆయన 'జంగల్‌నామా' పుస్తకం సహా అనేక విలువైన రచనలు, అనువాదాలు చేశారు. హిందీ, పంజాబీ, ఇంగ్లిష్ భాషలలో చిన్న చిన్న కథలు కూడా రాశారు. జంగల్‌నామాకు రెండో భాగం కూడా పూర్తి చేసే పనిలో ఉన్నాడని ఆయన సన్నిహిత మిత్రులు తెలిపారు. అమృత్‌సర్‌లోని చిన్న గ్రామంలో పుట్టిన ఆయన, జెఎన్‌యులో చదువుకున్నారు. 'స్పార్టకస్' నవలను అనువదించారు.

## ఉత్తరాఖండ్‌లో మళ్లీ రావత్

ఉత్తరాఖండ్‌లో ప్రభుత్వ ఏర్పాటుకు బలపరీక్ష ప్రక్రియ మే 10న జరిగింది. 70 మంది ఎంఎల్‌ఎలు ఉన్న శాసనసభలో 9 మంది ఎంఎల్‌ఎలపై అనర్హత వేటు పడడంతో 61 మంది ఎమ్మెల్యేలు మాత్రమే ఈ ప్రక్రియలో పాల్గొన్నారు. బలపరీక్షలో హరీశ్‌రావత్‌కు అనుకూలంగా 33 (కాంగ్రెస్ 25, పిడిఎఫ్ 6, బిజెపి రెబల్ 1, నామినేటెడ్ 1) ఓట్లు వచ్చాయి. బిజెపికి 27 ఓట్లు వచ్చాయి. దీంతో రావత్ మళ్లీ ప్రభుత్వం ఏర్పాటు చేయడానికి మార్గం సుగమమైంది.

## బిహార్, జార్ఖండ్‌లలో జర్నలిస్టుల హత్య

బిహార్, జార్ఖండ్‌లలో ఇద్దరు జర్నలిస్టులను 24 గంటల వ్యవధిలో దుండగులు కాల్చిచంపారు. బిహార్‌లో హిందీ పత్రిక 'హిందుస్థాన్' సివాన్ జిల్లా ప్రతినిధి రాజ్‌దేవ్ రంజన్ మే 13న జిల్లా కేంద్రంలోని స్టేషన్ రోడ్డులో వెలుతుండగా ఈ ఘటన జరిగింది. రంజన్‌ను హాస్పిటల్‌కు తరలిస్తుండగా ప్రాణాలు కోల్పోయాడు. కొద్ది కాలంగా ఆయన స్థానిక సంఘ వ్యతిరేక శక్తులపై వార్తలు రాస్తున్నారు. హత్యకు నిరసనగా బిహార్‌లో పాత్రికేయులు పలుచోట్ల నిరసనలు చేపట్టారు. జార్ఖండ్‌లోని చత్రా జిల్లా దేవరియాలో అఖిలేశ్ ప్రతాప్‌సింగ్ అనే టివి విలేకరిని మే13న రాత్రి పంచాయతి కార్యాలయం సమీపంలో గుర్తుతెలియని దుండగులు కాల్చిచంపారు. ఈ హత్యకు నిరసనగా చత్రా పట్టణంలో బంద్ జరిగింది.

## జెఎన్‌యు విద్యార్థుల శిక్షలపై కోర్టు స్టే

జెఎన్‌యు విద్యార్థి సంఘం అధ్యక్షుడు కన్నయ్య కుమార్, ఉమర్ ఖలిద్, అనిర్బాన్ భట్టాచార్య సహా విద్యార్థులపై యూనివర్సిటీ పాలకవర్గం విధించిన శిక్షలన్నింటిపై ఢిల్లీ హైకోర్టు మే 13న స్టే విధించింది. ఫిబ్రవరి 9న జరిగిన సభలో 'దేశ వ్యతిరేక' నినాదాలు చేశారన్న ఆరోపణలపై వేర్వేరు క్రమశిక్షణ చర్యలు తీసుకున్నారు. కన్నయ్యకుమార్‌కు 10 వేల జరిమానా విధించగా, ఉమర్, అనిర్బాన్‌లను రస్టికేట్ చేశారు. కొందరిని హాస్టల్ నుంచి వెలేయడంతో పాటు జరిమానా విధించారు. అనిర్బాన్‌ను ఏడేళ్లపాటు యూనివర్సిటీలో మరే కోర్సులో చేరకుండా చేశారు.

## మాలేగావ్ కేసు

**2008**, సెప్టెంబర్ 29న మాలేగావ్‌లో రంజాన్ రోజున జరిగిన జంట బాంబు పేలుళ్ల కేసులో నిందితులైన సాధ్వి ప్రజ్ఞా ఠాకూర్, మరో ఐదుగురిపై మోపిన అభియోగాలను జాతీయ దర్యాప్తు సంస్థ (ఎన్ఐఎ) మే 13న ఉపసంహరించుకుంది. వీరికి వ్యతిరేకంగా తగిన ఆధారాలు లేవని వెల్లడించింది. అంతే కాకుండా లెఫ్టినెంట్ కల్నల్ ప్రసాద్ శ్రీకాంత్ పురోహిత్‌తో సహా పది మందిపై మహారాష్ట్ర వ్యవస్థీకృత నేర నియంత్రణ చట్టం (మోకా) కింద మోపిన అభియోగాలను కూడా ఎత్తివేసింది. నిందితుల నుంచి నేర అంగీకార వాంగ్మూలం రాబట్టడానికి ఎటిఎస్ సిబ్బంది వేధింపులకు పాల్పడ్డారని ఎన్ఐఎ ప్రకటించింది. ఉగ్రవాద కేసులను నీరుగార్చి, సాధ్వి ప్రజ్ఞా ఠాకూర్, ఇతర నిందితులను బిజెపి, ఆర్ఎస్ఎస్ రక్షించే ప్రయత్నం చేస్తోందని ప్రతిపక్షాలు నిరసన తెలిపాయి.

## జాదవ్‌పూర్ యూనివర్సిటీ విద్యార్థులపై ఎబివిపి దాడి

మే 6న జాదవ్‌పూర్ యూనివర్సిటీ విద్యార్థులపై ఎబివిపి చేసిన దాడిని వ్యతిరేకిస్తూ మే 14న నిరసనలో పాల్గొన్న విద్యార్థినులపై బెంగాల్ బిజెపి నాయకుడు దిలిప్ ఘోష్ తీవ్ర వ్యాఖ్యలు చేశారు. నిరసనలో పాల్గొన్న విద్యార్థినులు సిగ్గులేని వారు, పవిత్రత గురించి ఆలోచించేవారు అక్కడకు ఎందుకెళ్లారని ప్రశ్నించారు. మే 6న 'బుద్ధ ఇన్ ఏ ట్రాఫిక్‌జామ్' చిత్రప్రదర్శన సందర్భంగా ఎబివిపి, సంఘ్‌పరివార్ నాయకులు జాదవ్ పూర్ యూనివర్సిటీలో విద్యార్థులపై చేసిన దాడికి నిరసనగా ధర్నా చేశారు. విద్యార్థినులతో ఎబివిపి కార్యకర్తలు అసభ్యంగా ప్రవర్తించారంటూ యూనివర్సిటీ అధికారులు పోలీసులకు ఫిర్యాదు చేశారు.

## ఐదు రాష్ట్రాల ఎన్నికల ఫలితాలు

ఐదు రాష్ట్రాల్లో ఆరు దశల్లో జరిగిన ఎన్నికల ఫలితాలను ఎన్నికల కమిషన్ మే19న విడుదల చేసింది. తమిళనాడులో 234 స్థానాలకు గాను 232 స్థానాలకు ఎన్నికలు జరిగాయి. అన్నాడిఎంకె 134, డిఎంకె కూటమి 98 స్థానాలు గెలుపొందాయి. ప్రభుత్వాన్ని ఏర్పాటు చేయడానికి సరిపోయే మేజారిటీని అన్నాడిఎంకె సాధించింది. పశ్చిమ్‌బంగాలో 294 అసెంబ్లీ స్థానాలకు గాను తృణమూల్ కాంగ్రెస్ 211 గెలిచి ప్రభుత్వ ఏర్పాటుకు మెజారిటీని సాధించింది. కాంగ్రెస్‌కు 44, వామపక్షాలకు 32, బిజెపికి 3, ఇతరులు 4 స్థానాల్లో గెలుపొందారు. అస్సాంలోని 126 అసెంబ్లీ స్థానాల్లో బిజెపి 86 గెలిచి ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసింది. కాంగ్రెస్ 26, ఏయుడిఎఫ్ 13, ఇతరులు 1 గెలుపొందారు. కేరళలోని 140 స్థానాల్లో ఎల్‌డిఎఫ్ 91 స్థానాలు గెలిచి ప్రభుత్వాన్ని ఏర్పాటు చేయనుంది. యుడిఎఫ్ 47, బిజెపి 1, ఇతరులు 1 గెలుపొందారు. పుదుచ్చేరిలోని 30 స్థానాలకు గాను కాంగ్రెస్ 15, ఎఐడిఎంకె 2, ఎన్ఆర్‌సి 8, డిఎంకె 4, ఇతరులు 1 గెలుపొందాయి. కాంగ్రెస్ మూడింట రెండోవంతు మెజారిటీ సాధించి ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసింది.

## మణిపూర్‌లో మిలిటెంట్ల దాడి

భారత-మయన్మార్ సరిహద్దుల సమీపంలోని చందేల్ జిల్లాలో భద్రతా బలగాల కాన్వాయ్‌పై మణిపూర్ మిలిటెంట్లు మే 22న దాడి చేశారు. ఈ దాడిలో '29 అస్సాం రైఫిల్స్'కు చెందిన జూనియర్ కమిషన్డ్ ఆఫీసర్‌తో పాటు ఐదుగురు జవాన్లు మృతిచెందారు. మిగతా సిబ్బందికి గాయాలయ్యాయి. పోలీసులు, రక్షణ వర్గాల సమాచారం మేరకు హోలెన్‌గంజ్ గ్రామంలో కొండచరియలు విరిగిపడిన ప్రాంతాన్ని అస్సాం రైఫిల్ సిబ్బంది పరిశీలించారు. అనంతరం తమ శిబిరాలకు తిరిగి వస్తుండగా జొయిపి హెంగ్‌షి ప్రాంతంలో వారి వాహన శ్రేణిపై దాడిచేశారు. వీ

### బాగ్దాద్‌లో ఎమర్జెన్సీ

బాగ్దాద్‌లో ఏప్రిల్ 30న షియా మతగురువు మొఖ్తదా – అల్ – సద్ర్ మద్దతుదారులు వందలాదిగా గ్రీన్‌జోన్ గోడలను బద్దలుకొట్టి పార్లమెంట్ భవనాన్ని ముట్టడించారు. నూతన మంత్రివర్గ ఏర్పాటు ప్రతిపాదనపై పార్లమెంట్‌లో ఓటింగ్ చేపట్టాలని సద్ర్ మద్దతుదారులు కోరినప్పటికీ ఎంపిల నుంచి మద్దతు లభించలేదు. ఎంపిలకు గుణపాఠం తెలపడానికి పార్లమెంట్ భవనాన్ని ముట్టడించారు. ఈ నేపథ్యంలో ఇరాక్ అధికారులు బాగ్దాద్‌లో ఎమర్జెన్సీ ప్రకటించారు. మంత్రుల పదవులను సాంకేతిక నిపుణుల సాయంతో భర్తీ చేస్తామని ఇటీవల ఇరాక్ ప్రధాని హైదర్ – అల్ – అబాదీ ప్రకటించారు. దీంతో బాగ్దాద్ రాజకీయాల్లో గందరగోళ పరిస్థితులు నెలకొన్నాయి. గ్రీన్‌జోన్ భవనంలో ప్రభుత్వ, విదేశీ రాయబార కార్యాలయాలుంటాయి.

### సియోల్‌లో నిరసనలు

దక్షిణ కొరియా రాజధాని సియోల్‌లో మే డే సందర్భంగా వేలాది మంది కార్మికులు వీధులలోకి వచ్చి నిరసన ప్రదర్శనలు చేపట్టారు. కంపెనీల్లో పనిచేసే వారికి మెరుగైన పరిస్థితులు కల్పించాలనీ, కనీస వేతనాలను సక్రమంగా చెల్లించాలనీ, తాత్కాలిక ఉద్యోగులను తీసుకోవడం తగ్గించాలనీ డిమాండ్ చేస్తూ ఆందోళన చేపట్టారు. ఆందోళనకారులను అదుపు చేసేందుకు పదివేల మంది భద్రతా సిబ్బందిని ప్రభుత్వం ఏర్పాటు చేసింది.

### టర్కీ ప్రధాని రాజీనామా

టర్కీ ప్రధాని, ఎకె పార్టీ (జస్టిస్ అండ్ డెవలప్‌మెనిట్ పార్టీ) చీఫ్ దవుతోగ్లూ తన పదవికి రాజీనామా చేస్తున్నట్లు ప్రకటించారు. దేశ అధ్యక్షుడు ఎర్డోగాన్‌తో అభిప్రాయ భేదాలు తలెత్తిన కారణంగా ఈ నిర్ణయం తీసుకున్నారు. టర్కీ – యూరపియన్ యూనియన్ (ఇయు) దేశాల మధ్య కుదిరిన శరణార్థుల ఒప్పందం, ఇయులో సభ్యత్వం తీసుకునేందుకు సిద్ధంగా ఉన్నట్లు ప్రధాని ప్రకటించగా, దానికి ఇయు కూడ అంగీకరించింది. ఇయు – టర్కీ దేశాల పౌరులు వీసా అవసరం లేకుండా ఆ దేశాల్లో స్వేచ్ఛా ప్రయాణాలు చేయవచ్చునని కూడా ప్రకటించింది. ఎర్డోగాన్ విధానాలను అనుసరించడంలో దవుతోగ్లూ విఫలమయ్యారనే నేపథ్యంలో ఆయనను తప్పించాలని అధ్యక్షుడు నిర్ణయించారు.

### లండన్ మేయర్‌గా సాదిఖ్ ఖాన్

లండన్ మేయర్‌గా లేబర్ పార్టీ అభ్యర్థి, పాకిస్తాన్ సంతతికి చెందిన సాదిఖ్ ఖాన్ ఎంపికయ్యారు. ఆయన ప్రత్యర్థి కన్జర్వేటివ్ పార్టీ అభ్యర్థి గోల్డ్‌స్మిత్‌ను ఓడించి మేయర్ పదవిని చేపట్టారు. సాదిఖ్ ఖాన్‌కు 13 లక్షల (57 శాతం) ఓట్లు రాగా, గోల్డ్‌స్మిత్‌కు 9.8 లక్షల (43 శాతం) ఓట్లు వచ్చాయి. దీంతో మొట్టమొదటి సారిగా ఒక ముస్లిం మతస్థుడు లండన్‌కు మేయర్‌గా ఎంపికయ్యాడు. లండన్ నగరంలో వివిధ మతాలు, సంస్కృతులు, జాతులకు చెందిన వారున్నారు. నగర పరిధిలో సుమారుగా 86 లక్షల మంది ఓటర్లు ఉన్నారు. ఇందులో పది లక్షల మంది ముస్లింలు.

### టిటిఐపికి వ్యతిరేకంగా నిరసనలు

ఇయు, అమెరికా దేశాలు స్వేచ్ఛాయుత వాణిజ్యాన్ని పెంపొందించు కోవాలనే లక్ష్యంతో ట్రాన్స్ అట్లాంటిక్ ట్రేడ్ అండ్ ఇన్వెస్ట్‌మెంట్ పార్టనర్‌షిప్ (టిటిఐపి) ఒప్పందాన్ని కుదుర్చుకునేందుకు ప్రయత్నిస్తున్న నేపథ్యంలో జరిగిన రహస్య చర్చలు తీవ్ర వ్యతిరేకతకు దారి తీస్తున్నాయి. ఈ రహస్య చర్చల వివరాలు బయట పెట్టాలంటూ మే 8న జర్మనీ, బెర్లిన్, స్పెయిన్ వీధులలో వేలాదిగా తరలివచ్చి నిరసన ర్యాలీలు చేపట్టారు. టిటిఐపి ఒప్పందం ద్వారా ఐరోపా సభ్య దేశాల్లో వ్యవసాయం తగ్గిపోతుందనీ, దాని ప్రభావం వస్తూత్పత్తిపై పడుతుందని ధ్వజమెత్తారు. ఈ ఒప్పందం ద్వారా ప్రైవేటీకరణ పెరిగిపోవడమే కాకుండా, సంస్థలు కార్పొరేట్ శక్తుల చేతుల్లోకి వెళ్లిపోతాయి. ఈ ఒప్పందాన్ని 70 శాతానికి పైగా జర్మనీ పౌరులు వ్యతిరేకిస్తున్నారని ఒక సర్వేలో వెల్లడైంది. మరోవైపు టిటిఐపి ఒప్పందాన్ని పలువురు ఐరోపా పౌరులు సమర్థిస్తున్నారు. ఇది స్వేచ్ఛాయుత వ్యాపారానికి అవకాశం కలిగిస్తుందని అభిప్రాయపడ్డారు.

### ఫ్రాన్స్‌లో లేబర్ బిల్లు రగడ

కార్మిక చట్ట సవరణ బిల్లుపై ఫ్రాన్స్‌లో తీవ్ర వ్యతిరేకత వ్యక్తమవుతోంది. పార్లమెంట్ ఆమోదం లేకుండానే బిల్లును అమలు చేయాలని ఫ్రాన్స్ ప్రభుత్వం ప్రయత్నిస్తోంది. దీంతో నిరుద్యోగ సమస్యను పరిష్కరించేందుకు వీలవుతుందని భావిస్తోంది. పార్లమెంట్ ఆమోద ముద్ర లేకుండానే కార్మిక చట్టంలో మార్పులు తీసుకురావచ్చని మార్చ్ 10న జరిగిన క్యాబినెట్ సమావేశంలో ప్రధాని మాన్యుల్ వాల్స్ ప్రతిపాదించగా, దానికి క్యాబినెట్ సభ్యులు మద్దతు తెలిపారు. ఈ నేపథ్యంలో మే 10న పార్లమెంట్ ఎగువ సభలో బిల్లుపై జరిగిన ఓటింగ్‌లో మితవాద పార్టీలకు చెందిన ఎంపిలు పాల్గొన్నారు. కార్మిక చట్ట సవరణ బిల్లును తీవ్రంగా వ్యతిరేకిస్తున్నట్లు తెలిపారు. బిల్లును వెంటనే ఉపసంహరించు కోవాలంటూ మే 11న ఫ్రాన్స్ వీధులలో వేలాదిగా నిరసనకారులు ఆందోళనలు చేశారు. ఈ బిల్లు కార్మికుల హక్కులను కాలరాస్తుందని, లాభాల కంటే నష్టాలే ఎక్కువ అని కార్మిక సంఘాల నేతలు ఆరోపిస్తున్నారు.

### బాగ్దాద్‌లో దాడులు

ఇరాక్ రాజధాని బాగ్దాద్‌లో మే 11న జరిగిన కారుబాంబు పేలుడులో యాభై మందికి పైగా మరణించారు. ఎనభై మంది తీవ్రంగా గాయపడ్డారు. సదర్ నగరంలో జనసమర్థమైన మార్కెట్‌లో ఈ పేలుడు సంభవించడంతో భారీ సంఖ్యలో క్షతగాత్రులయ్యారు. మే 15న బాగ్దాద్ శివారు ప్రాంతంలోని తాజీ గ్యాస్ ప్లాంట్‌పై జరిగిన ఆత్మాహుతి దాడిలో పద్నాలుగు మంది చనిపోయారు. ఇరవై మందికి పైగా గాయపడ్డారు. ప్రభుత్వ అధీనంలో నడుస్తున్న తాజీ సహజ వాయువు నిలువ కేంద్రం గేటు ముందు మూడు కారు బాంబులు పేల్చి, ఆరుగురు సాయుధులు గ్యాస్ ప్లాంట్‌లోకి ప్రవేశించి మూడు గ్యాస్ ట్యాంకులను పేల్చి వేశారు. ఈ దాడులకు పాల్పడింది తామేనని ఇస్లామిక్ స్టేట్ దళాలు తెలిపాయి.

### దిల్మా రౌసెఫ్‌పై అభిశంసన

బ్రెజిల్ అధ్యక్షురాలు దిల్మా రౌసెఫ్‌పై అభిశంసన విచారణకు ఆ దేశ సెనెట్ అంగీకరించింది. బడ్జెట్ నిబంధన చట్టాలను ఉల్లంఘించారనే కారణంతో ఆమెను అభిశంసిస్తున్నారు. మే 12న జరిగిన ఓటింగ్‌లో అభిశంసన తీర్మానానికి అనుకూలంగా 55 ఓట్లు, వ్యతిరేకంగా 22 ఓట్లు రావడంతో ఈ తీర్మానం ఆమోదం పొందింది. తాత్కాలిక అధ్యక్షుడిగా మైఖేల్ టెమర్ బాధ్యతలు చేపట్టారు.

### ఈజిప్టు విమాన దుర్ఘటన

మే 19న మధ్యధరా సముద్రంలో ఈజిప్ట్ ఎయిర్‌లైన్స్‌కు చెందిన విమానం కుప్పకూలిపోయింది. ఈ దుర్ఘటనలో 56 మంది ప్రయాణికులతో సహా మొత్తం 66 మంది చనిపోయారు. మే 19న ఉదయం పారిస్‌లోని చార్ల్ డిగాల్ విమానాశ్రయం నుంచి కైరో బయలుదేరిన విమానానికి ఎయిర్ ట్రాఫిక్ కంట్రోల్‌తో ఉన్న సంబంధాలు తెగిపోయినట్లు ఈజిప్ట్ ఎయిర్‌లైన్స్ తెలిపింది. ప్రత్యేక బృందాలతో గాలింపు చర్యలు చేపట్టగా మధ్యధరా సముద్రంలో విమాన శకలాలు లభించాయి. ప్రమాదానికి గల కారణాలు తెలియలేదు.

### తైవాన్‌కు తొలి మహిళా అధ్యక్షురాలు

తైవాన్‌కు తొలి మహిళా అధ్యక్షురాలిగా సాయ్ ఇంగ్ వెన్ ఎంపికయ్యారు. మే 20న తైపీలోని అధ్యక్ష భవనంలో ప్రమాణ స్వీకారం చేసి ఆమె మాజీ అధ్యక్షుడు మా ఇంగ్ జియో నుంచి బాధ్యతలు స్వీకరించారు. ఈ సందర్భంగా మాట్లాడుతూ తైవాన్ అభివృద్ధికి చైనా సహకారం అవసరమన్నారు. చైనాతో సత్సంబంధాలు కొనసాగించేందుకు తాము ఎల్లప్పుడూ సిద్ధంగా ఉంటామన్నారు. తైవాన్ ప్రజాస్వామ్యాన్ని కూడా చైనా గౌరవించాలని అన్నారు. వీ

# అసహజ మరణాల సూచి

సంకలనం: ఎస్. వెంకటేష్

మరణం ఎప్పుడయినా విషాద సూచకమే. మృతుల బంధువులకూ, మిత్రులకూ విచారకరమే కాని అందులోనూ మరణించిన మనిషి నిండు జీవితం గడిపి వయోభారంతోనే మరణిస్తే దాన్ని సహజ మరణంగా అంగీకరించి ఊరట పడవచ్చు. సగటు ఆయు ప్రమాణంలో సగం కూడా అనుభవించక ముందే మరణిస్తున్నారు. ఈ అసహజ మరణాలకు లెక్కలేనన్ని ఆర్థిక, సామాజిక, రాజకీయ కారణాలున్నాయి. మన పక్కనే మనతోనే ఉండే మనుషులు అర్ధాంతరంగా అసహజంగా అకాలంగా అదృశ్యమైపోతున్నారు. ఇటువంటి అసహజ మరణాలు ఇటీవలి కాలంలో విపరీతంగా పెరిగిపోతున్నాయి. ఇవి సామాజిక సంక్షోభానికి, సమాజం దిగజారుడుకు ఒక చిహ్నం. మన రాష్ట్రంలో సాలీనా ఈ రకంగా చనిపోతున్న వారి సంఖ్య వేలల్లోనే ఉంటుందని అంచనా. నిజానికి అసహజ మరణాలన్నీ అసహజ మరణాలుగా నమోదు కావడం లేదు గనుక ఈ సంఖ్య వాస్తవంలో ఒక భాగం మాత్రమే కావచ్చు. పత్రికలలో అచ్చయిన ఇటువంటి ఘటనలన్నిటినీ ఒక్కచోట నమోదు చేయాలని భావిస్తున్నాం. ఈ శీర్షిక ప్రతి నెల ఉంటుంది. అయితే రాష్ట్రంలో ప్రతి గ్రామంలో జరుగుతున్న సంఘటనలన్నీ ఇక్కడ రిపోర్ట్ కాకపోవచ్చు. కొన్నయినా మనల్ని ఆలోచింపజేస్తే, మనం మనచుట్టూ ఉన్న మనుషుల కోసం ఇంకాస్త బాధ్యతగాను, జాగ్రత్తగాను వ్యవహరిస్తూ మొత్తంగా పరిష్కారాలవైపు వెళ్లడానికి ఏమయినా తోడ్పడితే ఈ శీర్షిక విజయవంతమైనట్లే.

**(ఏప్రిల్ 1 నుండి ఏప్రిల్ 30, 2016 వరకు తెలంగాణలోని 10 జిల్లాలు (1527), ఆంధ్రప్రదేశ్‌లోని 12 జిల్లాలలో (1207) అసహజ మరణాల పాలైన వారి సంఖ్య 2734)**

| జిల్లా | ఆకలి | ఆత్మహత్యలు | | | | చికిత్స అందక, అనారోగ్యం | | | గుర్తు తెలియని | | హత్యలు | | ప్రమాదాలు | | | | పోలీసు కాల్పుల్లో | | పోలీసులు, సైన్యం | మిస్సింగ్/ లాకప్ మరణాలు | ప్రకృతి వైపరీత్యాలు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | వ్యవసాయ రంగం | చేనేత రంగం | ఇతరాలు | | | | | | | | | పనిచేసే స్థలంలో | కరెంట్ | రహదారి | ఇతరాలు | ఉద్యమ కారులు | ఇతరులు | | | |
| | | | | స్త్రీ | పు. | స్త్రీ | పు. | పి. | స్త్రీ | పు. | స్త్రీ | పు. | | | | | | | | | |
| (1) | (2) | (3) | (4) | (5) | (6) | (7) | (8) | (9) | (10) | (11) | (12) | (13) | (14) | (15) | (16) | (17) | (18) | (19) | (20) | (21) | (22) |
| ఆదిలాబాద్ | 1 | 3 | – | 14 | 13 | 3 | 6 | 3 | 3 | 3 | 2 | 1 | 1 | 2 | 26 | 29 | – | – | – | 3 | 13 |
| హైదరాబాద్ | – | – | – | 8 | 7 | 2 | 3 | – | – | – | 4 | 6 | 1 | – | 21 | 11 | – | – | – | – | 4 |
| కరీంనగర్ | – | 5 | 3 | 6 | 12 | 4 | 4 | 3 | – | 2 | 2 | 4 | – | 5 | 27 | 12 | – | – | – | – | 73 |
| ఖమ్మం | – | – | – | 4 | 13 | – | 6 | 1 | 1 | 1 | 1 | 1 | – | 3 | 31 | 16 | – | – | – | – | 93 |
| మహబూబ్‌నగర్ | – | 5 | – | 14 | 13 | – | – | 3 | – | – | 5 | 8 | 15 | 10 | 63 | 2 | – | – | – | – | 84 |
| మెదక్ | 3 | 16 | 6 | 9 | 14 | 22 | 9 | 6 | 9 | 4 | 6 | 9 | 32 | 9 | 42 | 16 | – | – | – | 5 | 2 |
| నల్గొండ | – | 5 | – | 4 | 6 | 2 | 3 | 1 | 1 | 3 | 2 | 4 | – | 10 | 57 | 22 | – | – | – | – | 112 |
| నిజామాబాద్ | – | 1 | – | 6 | 12 | – | 3 | – | – | 4 | 1 | 3 | – | 5 | 9 | 15 | – | – | – | – | 9 |
| వరంగల్ | – | 2 | – | 6 | 10 | 2 | 4 | 1 | – | – | 1 | 1 | – | 3 | 41 | 17 | – | – | – | – | 76 |
| రంగారెడ్డి | – | 5 | – | 8 | 7 | 2 | 3 | 1 | – | – | 5 | 6 | 1 | 2 | 31 | 9 | – | – | – | – | 16 |
| **తెలంగాణ** | **4** | **42** | **9** | **79** | **107** | **37** | **41** | **19** | **14** | **17** | **29** | **43** | **50** | **49** | **348** | **149** | **-** | **-** | **-** | **8** | **482** |
| అనంతపురం | – | 4 | 1 | 23 | 18 | – | 2 | – | 5 | 6 | 3 | 3 | 22 | 8 | 37 | – | – | – | – | – | 107 |
| చిత్తూరు | – | 1 | – | 2 | 4 | 2 | 5 | – | – | – | 1 | 3 | 3 | 3 | 22 | – | – | – | – | – | 28 |
| కడప | – | – | – | 1 | 10 | – | – | – | – | 5 | 1 | 1 | – | 1 | 11 | 3 | – | – | – | – | 20 |
| గుంటూరు | – | – | – | 3 | 9 | 1 | 4 | – | – | 2 | 2 | 6 | – | 5 | 29 | 13 | – | – | – | – | 15 |
| కృష్ణా | – | – | – | 3 | 5 | – | 4 | – | – | 1 | 3 | 1 | – | 4 | 22 | 17 | – | – | – | – | 11 |
| కర్నూలు | – | 5 | 1 | 3 | 4 | 3 | 4 | 13 | 6 | 5 | 3 | 4 | 8 | 4 | 28 | 21 | – | – | – | – | 25 |
| తూర్పు గోదావరి | – | 1 | – | 9 | 7 | 11 | 12 | 1 | – | 3 | 1 | – | 3 | 18 | 3 | 4 | – | – | – | – | 39 |
| ప్రకాశం | – | 1 | – | 2 | 7 | – | 2 | – | – | 1 | 2 | 3 | 1 | 3 | 39 | 13 | – | – | – | – | 20 |
| శ్రీకాకుళం | – | – | – | 2 | 4 | 2 | 3 | 2 | 3 | 2 | 4 | – | 3 | 8 | 28 | 8 | – | – | – | – | 8 |
| పశ్చిమ గోదావరి | – | – | – | 4 | 6 | 3 | 4 | – | 1 | 2 | 1 | 6 | 1 | 8 | 19 | 14 | – | – | – | – | 11 |
| నెల్లూరు | – | – | – | 4 | 6 | 4 | 5 | – | – | 2 | 2 | 3 | – | 3 | 15 | 17 | – | – | – | – | 15 |
| విజయనగరం | | వివరాలు అందలేదు | | | | | | | | | | | | | | | | | | | |
| విశాఖపట్నం | – | – | – | 6 | 11 | 3 | 1 | – | – | 1 | – | 2 | 3 | 2 | 31 | 12 | – | – | – | 6 | 27 |
| **ఆంధ్రప్రదేశ్** | **-** | **12** | **2** | **62** | **91** | **29** | **46** | **16** | **15** | **30** | **23** | **32** | **44** | **67** | **284** | **122** | **-** | **-** | **-** | **6** | **326** |

# వీక్షణం దగ్గర అమ్మకానికి ఉన్న పుస్తకాలు

### ఆర్థిక వ్యవస్థ - సామ్రాజ్యవాదం

| | | |
|---|---|---|
| ఒక దళారీ పశ్చాత్తాపం | జాన్ పెర్కిన్స్ | రు. 75 |
| కుట్రాజకీయం | స్టీఫెన్ కింజర్ | 40 |
| అభివృద్ధిని ఇలా చూద్దాం | ముదునూరి భారతి | 80 |
| కొత్తచూపు | ఆర్.ఎస్. రావు | 120 |
| ఊరి దారి | ఎన్. వేణుగోపాల్ | 60 |
| రాబందు వాలిన నేల | ఎన్. వేణుగోపాల్ | 180 |
| వ్యవసాయం - ప్రపంచీకరణ | కె.ఆర్. చౌదరి | 100 |
| నిత్యజీవితంలో సోషలిజం | భూసారం శివన్న | 100 |
| విధ్వంసక అభివృద్ధి | డిఎస్‌యు | 180 |
| భారతదేశంలో ఉత్పత్తి విధానం-<br>ఉత్పత్తి సంబంధాలు | విరసం | 20 |

### తెలంగాణ

| | | |
|---|---|---|
| లేచినిలిచిన తెలంగాణ | ఎన్. వేణుగోపాల్ | 120 |
| తిరగబడ్డ తెలంగాణ | ఇనుకొండ తిరుమలి | 100 |
| తెలంగాణ రాజకీయాలు | దాగ్మార్ బెర్న్‌స్టార్ఫ్, హ్యూగ్ గ్రే | 80 |
| కొత్త వంతెన | కె. శ్రీనివాస్ | 120 |
| తెలంగాణ జైత్రయాత్ర | ఘంటా చక్రపాణి | 200 |
| సమగ్ర తెలంగాణ | వీక్షణం ప్రచురణ | 295 |

### శాస్త్రవిజ్ఞానం

| | | |
|---|---|---|
| విశ్వాంతరాళం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| మానవ పరిణామం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| జీవకణాలూ నాడీకణాలూ | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 80 |
| ప్రకృతీ - పర్యావరణం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| జీవశాస్త్ర విజ్ఞానం - సమాజం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| విజ్ఞాన శాస్త్రం మనిషి విస్తరణ | జెడి బెర్నాల్ | 80 |

### కులం-మతం

| | | |
|---|---|---|
| భారతదేశంలో కుల సమస్య | అనురాధ గాంధీ | 120 |
| శూద్రవర్ణం ఎలా పుట్టింది | ఆర్.ఎస్. శర్మ | 80 |
| కులం వర్గం | బొజ్జా తారకం | 30 |
| ఎస్సి, ఎస్‌టి నిధులు, విధిలింపు - మళ్లింపు | బొజ్జా తారకం | 40 |
| ఎస్‌సి, ఎస్‌టిలపై అత్యాచారాలు | బొజ్జా తారకం | 50 |
| ఖైర్లాంజి | ఆనంద్ తేల్‌తుంబ్డే | 100 |
| గులాంగిరి | జోతిబా పూలే | 40 |
| కుల నిర్మూలన | అంబేద్కర్ | 30 |
| రాముని కృష్ణుని రహస్యాలు | అంబేద్కర్ | 20 |
| దళితులు - రాజ్యం | అంబేద్కర్ | 25 |
| శూద్రులు - ఆర్యులు | అంబేద్కర్ | 8 |
| ఆధునిక భారతదేశంలో అంటరానితనం | అంబేద్కర్ | 25 |
| దాస్య విముక్తి కోసం | అంబేద్కర్ | 15 |
| భారతదేశం ప్రజాస్వామ్యం | అంబేద్కర్ | 12 |
| ఆంగ్లేయపాలకులు - అంటరానివాళ్లు | అంబేద్కర్ | 20 |
| రాష్ట్రాలు - మైనారిటీలు | అంబేద్కర్ | 40 |
| రాముని కృష్ణుని రహస్యాలు | అంబేద్కర్ | 20 |
| మతతత్వంపై బాలగోపాల్ | కె. బాలగోపాల్ | 150 |
| దేవుని రాజకీయతత్వం | కంచె ఐలయ్య | 70 |
| నేను హిందువునెట్లయిత? | కంచె ఐలయ్య | 80 |

### సాహిత్య విమర్శ - వ్యాసాలు

| | | |
|---|---|---|
| గురజాడ దేశభక్తి | ఎన్. వేణుగోపాల్ | 20 |
| స్వేచ్ఛారావం | జి. హరగోపాల్ | 250 |
| సాహిత్యంపై బాలగోపాల్ | కె. బాలగోపాల్ | 150 |
| సాహిత్య వ్యాసాలు | చలసాని ప్రసాద్ | 100 |
| చలసాని ప్రసాద్ రచనలు | చలసాని ప్రసాద్ | 100 |
| విరసం సాహిత్య విమర్శ | విరసం ప్రచురణ | 150 |
| మహోదయం | కె.వి.ఆర్. | 200 |
| కెవిఆర్ సాహిత్య వ్యాసాలు-2 | కె.వి.ఆర్. | 250 |
| కెవిఆర్ సాహిత్య వ్యాసాలు-3 | కె.వి.ఆర్. | 250 |
| కెవిఆర్ సామాజిక వ్యాసాలు | కె.వి.ఆర్. | 300 |
| కెవిఆర్ డిటెన్యూ డైరీ | కె.వి.ఆర్. శారదాంబ కమిటీ | 170 |
| సాహిత్య సమాలోచన | కృష్ణాబాయి | 300 |
| సందిగ్ధ సందర్భం | సి.వి. సుబ్బారావు | 40 |
| సామాజికం | వి. చెంచయ్య | 30 |
| మన ప్రపంచం | దుప్పల రవికుమార్ | 75 |
| దారులేసిన అక్షరాలు | భారతీయ మహిళల రచనలు | 400 |
| కవిత్వంతో ములాఖాత్ | ఎన్. వేణుగోపాల్ | 120 |

### చరిత్ర-జీవిత చరిత్ర

| | | |
|---|---|---|
| భారత చరిత్ర అధ్యయానికి ఒక పరిచయం | డి.డి. కోసంబి | రు. 250 |
| భారత చరిత్ర పరిచయ వ్యాసాలు | డి.డి. కొశాంబి | 40 |
| భగవద్గీత చారిత్రక పరిణామం | డి.డి. కొశాంబి | 10 |
| ప్రాచీన భారత దేశ చరిత్ర | కె. బాలగోపాల్ | 50 |
| చరిత్రలో ఏం జరిగింది? | గార్డన్ చైల్డ్ | 80 |
| తరతరాల భారతదేశ చరిత్ర | రొమిల్లా థాపర్ | 80 |
| ఆధునిక భారతదేశ చరిత్ర | బిపిన్ చంద్ర | 100 |
| ఇండియాలో దాగిన హిందుస్థాన్ | పెరి ఆండర్‌సన్ | 150 |
| 24 గంటలు | కె.జి. కన్నబిరాన్ | 200 |
| బాబాసాహెబ్ అంబేద్కర్ | బి. విజయభారతి | 70 |
| చేగువేరా | కాత్యాయని | 80 |
| నిర్జన వారధి | కొండపల్లి కోటేశ్వరమ్మ | 100 |
| ఇంట్లో ప్రేమ్‌చంద్ | శివరాణీ దేవి | 120 |
| ఛత్రపతి సాహూ మహరాజ్ | కాత్యాయని | 40 |
| నూరేళ్ల కాళోజీ | వరవరరావు | 60 |
| అలిశెట్టి ప్రభాకర్ కవిత | అలిశెట్టి ప్రభాకర్ | 150 |

### తత్వశాస్త్రం

| | | |
|---|---|---|
| మార్క్సిస్ట్ సాహిత్య విమర్శ | డా. శ్రీనివాస్ | 100 |
| మార్క్సిస్ట్ తత్వశాస్త్రం | న్యూవిస్టా పబ్లికేషన్స్ | 80 |
| మార్క్సిజం-లెనినిజం-మావోయిజం | విరసం | 125 |
| లెఫ్టిస్ట్ స్టడీ సర్కిల్ ప్రచురణలు అన్ని | | |

### విప్లవోద్యమం

| | | |
|---|---|---|
| పోలీసులు అరెస్ట్ చేస్తే | బొజ్జా తారకం | 30 |
| భారత్‌పై అరుణతార | యాన్ మిర్డాల్ | 100 |
| జంగల్‌నామా | సత్నామ్ | 100 |
| ఏది నేరం?! | బి. అనూరాధ | 75 |
| మంద్రస్థాయి యుద్ధం | విరసం ప్రచురణ | 100 |
| జగిత్యాల జంగల్‌మహల్-1 | విరసం ప్రచురణ | 75 |
| జగిత్యాల జంగల్‌మహల్-2 | విరసం ప్రచురణ | 100 |
| నేటి రాయలసీమ | విరసం ప్రచురణ | 100 |
| దండకారణ్యంలో గ్రీన్‌హంట్ | విరసం ప్రచురణ | 60 |
| రివిజనిజం | విరసం ప్రచురణ | 75 |
| అంతర్యుద్ధంలో ఆదివాసులు | విరసం ప్రచురణ | 20 |
| ఆదర్శ జీవులు ఆమరులు | విరసం ప్రచురణ | 30 |
| మావో రచనలు - 1 | విరసం ప్రచురణ | 170 |
| మావో రచనలు - 2 | విరసం ప్రచురణ | 220 |
| సంకెళ్ల సవ్వడి | అరుణ్ ఫరేరా | 150 |
| వామపక్ష కమ్యూనిజం - ఒక బాలరిష్టం | లెనిన్ ప్రసిద్ధ రచన | 30 |

### కథ - నవల

| | | |
|---|---|---|
| దండకారణ్య కథలు(2005-2012) | విరసం ప్రచురణ | 100 |
| వసంతగీతం | అల్లం రాజయ్య | 250 |
| రేపు కథ | వెర్నన్ గొంజాల్విస్ | 20 |
| మిగిలేటోళ్లు | బాసిత్ | 50 |
| కాంత పున్నం వెన్నెల | పద్మకుమారి | 20 |
| ఏడుతరాలు | అలెక్స్ హేలీ | 80 |
| కథలగూడు | దేవులపల్లి కృష్ణమూర్తి | 60 |
| పథేర్ పాంచాలి | బిభూతిభూషన్ బంధోపాధ్యాయ | 100 |
| అపరాజితుడు | బిభూతిభూషన్ బంధోపాధ్యాయ | 100 |
| వనవాసి | బిభూతిభూషన్ బంధోపాధ్యాయ | 120 |
| నేల నాగలి - మూడెద్దులు | బొజ్జా తారకం | 25 |
| పంచతంత్రం | బొజ్జాతారకం | 100 |
| ఇస్మత్ చుగ్తాయి కథలు | ఇస్మత్ చుగ్తాయి | 100 |
| స్పార్టకస్ | హోవార్డ్ ఫాస్ట్ | 80 |
| రేపటి కల | రిచర్డ్ రైట్ | 50 |
| పంచమం | చిలుకూరి దేవపుత్ర | 100 |
| బీజభూమి | వరవరరావు | 100 |
| మరల సేద్యానికి | శివరామ కారంత్ | 150 |
| హింసపాదు | బమ్మిడి జగదీశ్వరరావు | 180 |

### డివిడి

| | |
|---|---|
| వీక్షణం (2003 - 2012) | 200 |
| సృజన (1966-1992) | 240 |
| అరుణతార (1970-2013) | 125 |
| 'ఓయు'ద్ధకాండ | 100 |

**వీక్షణం,** మైత్రి రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3,
హిమాయత్‌నగర్, హైదరాబాద్ - 500 029.
ఫోన్ : 040-66843495
Email : veekshanam2003@gmail.com, www.veekshanam.wordpress.com

# ‘వీక్షణం’ను ఆదుకుందాం
# ‘వీక్షణం’ నాలుగు కాలాల పాటు నిలిచేందుకు చేయూతనిద్దాం

తెలుగులో ఎకనమిక్ అండ్ పొలిటికల్ వీక్లీ వంటి పత్రిక ఉండాలనే ఆలోచనతో, సీనియర్ పాత్రికేయులు వి. హనుమంతరావు సంపాదకులుగా 2003లో ప్రారంభమై, 2005 నుంచి ఎన్. వేణుగోపాల్ సంపాదకత్వంలో నడుస్తున్న రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక ‘వీక్షణం’ తెలుగు సమాజానికి అవసరమైన చర్చావేదికగా పనిచేస్తున్నదని, మనందరితో పాటు ఎందరో పాఠకుల ఆదరాభిమానాలు చూరగొన్నదని మనకు తెలుసు. పదమూడు సంవత్సరాలుగా నిరంతరాయంగా నడుస్తున్న ఈ పత్రిక ఆర్థిక పరిస్థితి ఇప్పటికీ దినదిన గండంగానే ఉంటున్నది. ఎప్పుడు ఆగిపోతుందో తెలియదని దాదాపు ప్రతినెలా పత్రికలో అచ్చవుతున్న ఆందోళనాకరమైన ప్రకటన, ఈ పత్రికను నిలబెట్టడానికి తోడ్పడమనే అభ్యర్థనలు మా ఈ బహిరంగ ప్రకటనకు కారణం. ఇంతకాలంగా నిర్వాహకులు కష్టనష్టాలు భరిస్తూ సాగించిన కృషికి ఇప్పుడు మన సహకారం అవసరమని చెప్పడానికే ఈ ప్రకటన.

‘వీక్షణం’ ఈ పదమూడు సంవత్సరాలలో మూడువేలకు పైగా వ్యాసాలను ప్రచురించి ప్రాంతీయ, దేశీయ, అంతర్జాతీయ అంశాలెన్నిటి పైననో తెలుగు సమాజానికి అత్యవసరమైన సమాచారాన్నీ, వివరణలనూ, విశ్లేషణలనూ అందించింది. సంపాదకుడి అభిప్రాయాలే వైనప్పటికీ, తెలుగు సమాజంలో ఉన్న ప్రగతిశీల భావాలకూ, ధోరణులకూ అన్నిటికీ ప్రజాస్వామిక స్ఫూర్తితో వేదిక కల్పించింది. ప్రతిష్ఠాత్మకమైన ఐఎస్ఎస్ఎన్ గుర్తింపు సంపాదించి పరిశోధక విద్యార్థులకు, విశ్వవిద్యాలయ అధ్యాపకులకు అవకాశాలు కల్పించింది. ప్రతి సంవత్సరం రచయితల సమావేశాలు, సంభాషణలు ఏర్పాటు చేసి తెలుగు సమాజంలో సామాజిక శాస్త్ర రచనను ప్రోత్సహించింది. వ్యాసరచనా అధ్యయన తరగతులు నిర్వహించి వ్యాసప్రక్రియ ప్రమాణాలు పెంచడానికి తన వంతు కృషి చేసింది. పత్రికలో లబ్ధప్రతిష్ఠుల రచనలు ప్రచురించడంతో పాటు, విషయమే ప్రధానంగా ఐదారు వందలమంది కొత్త వ్యాసకర్తలకు అవకాశం కల్పించింది. ‘ఒక దళారీ పశ్చాత్తాపం’ వంటి విస్తృత ప్రచారం పొందిన పుస్తకంతో సహా దాదాపు డజను పుస్తకాలు ప్రచురించింది.

తెలుగు సమాజానికీ, మేధో ప్రపంచానికీ, రాజకీయార్థిక, సామాజిక విశ్లేషణకూ ఇంత దోహదం చేసిన ‘వీక్షణం’ ఆర్థిక ఇబ్బందుల్లో ఉన్నప్పుడు, ఆ దీపం కొడిగట్టిపోకుండా కాపాడడం సమాజం బాధ్యత. ఇతోధిక పాఠకులను తయారు చేయడం, విరివిగా చందాలు చేర్పించడం, వ్యాపార ప్రకటనలు సేకరించిపెట్టడం, విరాళాలు అందించడం మన కనీస కర్తవ్యం. ‘వీక్షణం’ శ్రేయోభిలాషి, చరిత్రకారులు వకుళాభరణం రామకృష్ణ ‘వీక్షణం’ రచయితల సమావేశాల్లో సూచించినట్టుగా ఆర్థిక ఇబ్బందుల నుంచి సుస్థిరమైన పద్ధతిలో గట్టెక్కాలంటే ‘వీక్షణం’కు ఒక మూలనిధి కూడ ఏర్పాటు చేయవలసి ఉంది. మనంతట మనం మన శక్తి మేరకు గాని, విరాళాలు ఇవ్వగలిగిన మిత్రుల ద్వారా గాని ఈ మూలనిధి విరాళాలు సేకరించి మనందరికీ, మొత్తంగా సమాజానికీ అవసరమైన ‘వీక్షణం’ రాజకీయార్థిక, సామాజిక మాసపత్రికను కాపాడుకుందాం. ఈ చైతన్యజ్వాల ఆరిపోకుండా మన రెండు చేతులూ అడ్డుపెట్టి వెలుగు నిరంతరం ప్రసరించనిద్దాం.

| | | |
|---|---|---|
| చుక్కా రామయ్య | బొజ్జా తారకం | యం. కోదండరామ్ |
| రంగనాయకమ్మ | కాత్యాయనీ విద్మహే | సుజాత సూరేపల్లి |
| కె. హరగోపాల్ | వకుళాభరణం రామకృష్ణ | కె. ఆర్. చౌదరి |
| చలసాని ప్రసాద్ | వరవరరావు | R. నారాయణ మూర్తి |
| [illegible] | [illegible] | [illegible] |
| దేవిప్రియ | బి. నర్సింహారెడ్డి | ఎం. గంగాధర్ |

ఒక సంవత్సరం కింద వెలువడిన ఈ విజ్ఞప్తికి విస్తృతమైన ప్రతిస్పందన వచ్చింది. ఆర్థిక, హార్దిక సహాయం అందించిన మిత్రులందరికీ కృతజ్ఞతలు. అయినా వీక్షణం ఆర్థిక పరిస్థితి ఇంకా సుస్థిరంగా మారలేదు. అందువల్ల ఈ విజ్ఞప్తికి ఇంకా అవసరం ఉంది. ఈ విజ్ఞప్తిపై సంతకం చేసి, జూలై 2015లో మరణించిన చలసాని ప్రసాద్ గారిని సగౌరవంగా స్మరించుకుంటున్నాం.